త్రిపుర సుందరీ దేవి



త్రిపురా రహస్యం

ఓం శ్రీరస్తు శుభమస్తు

త్రిపురారహస్య జ్ఞానఖండసారమున

# విషయ సూచిక

## పరశురాముని పూర్వచరిత్రము

హైహయవంశీయుఁడు కార్తవీర్యార్జునుఁడు దత్తాత్రేయు నారాధించి అణిమాద్యష్టసిద్ధులను పొందెను. యోగశక్తిచే నతఁడు కావలసినపుడు వేయిబాహువులను పొందఁగలిగియుండెను. పరాక్రమమున అతనిని మించినవారు క్షత్రియులు గాని రాక్షసులు గాని అప్పుడు ఎవరును లేకుండిరి.

ఆతఁ డొకనాఁడు వేటకై వనములందు విహరించుచు జమదగ్నిమహర్షి యాశ్రమము చెంతకు వచ్చెను. మహర్షిని సందర్శించుటకై యాతఁడు ఆశ్రమమున ప్రవేశించెను. జమదగ్నియు మహారాజునకు స్వాగతము నొసంగి హోమధేనువుయొక్క మహిమచేత మంత్రిసేనాసమేతముగా ఆశ్చర్యకరమైన యాతిథ్యము నొసంగెను. ఆగోవుయొక్క మహిమకు అందఱును ఆశ్చర్యపరవశులై ఇట్టి దొకటి యీలోకమున కలదా అని ప్రశంసింపఁజొచ్చిరి. సాటిలేని యైశ్వర్యముతో విరాజిల్లుచున్న యామహారాజున కాప్రశంసలు భరింపరాని వయ్యెను. తనసంపదను మించిన సంపదకు సాధనమైన గోరత్నము ఒక సామాన్య బ్రాహ్మణుని యొద్ద నుండుట తనప్రాభవమునకు కొఱత కలిగినట్లుగా భావించి ఆతఁడు వెంటనే ఆగోవును దూడతో కూడ రాజధానికి తీసికొని రండని భటుల కాజ్ఞాపించి వెడలిపోయెను.

అప్పుడు పరశురాముఁడు ఆశ్రమములో లేఁడు. రాజభటులు హోమధేనువును దూడను బలవంతముగా తీసికొనిపోయిన తరువాత కొంతసేపటికిపరశురాముఁడు తిరిగివచ్చెను. ఆతనిని జూడఁగనే ఆశ్రమవాసు లందఱును ఎదురేగి కన్నీళ్ళతో కార్తవీర్యుని దౌర్జన్యమునుగూర్చి చెప్పిరి. అతఁడు రోషావిష్టుఁడై వెంటనే కవచమును అక్షయతూణీరములను ధరించి విష్ణుధనువును పరశువును గైకొని మాహిష్మతీనగరమువైపు పరువిడెను. అప్పటి కింకను రాజు నగరమున ప్రవేశింపలేదు. భార్గవరాముని సింహగర్జనము విని సైన్యము సంభ్రమముతో వెనుదిరిగి ఆతనిని చుట్టుముట్టెను. భార్గవుడు ఒక్క పిడికిలియందు వందలబాణములను సంధించి ప్రయోగించుచు సమీపించినవారిని పరశువునకు బలిగావించుచు సైన్యమును నిర్మూలించెను. గోరత్నముచేతనేకాక పరాక్రమముచేత కూడ అతిశయించుచున్న యా బ్రాహ్మణుని జూచి కార్త వీర్యుఁడు అసూయావిష్టుఁడై విజృంభించి అయిదువందలచేతులలో అయిదువందల ధనువులను ధరించి మిగిలిన యయిదువందల చేతులతో బాణములను సంధించుచు రథమును రాముని పైకి తోలించెను. భార్గవుడుఁడుగ్రుఁడై ఒక్కవింటియందే అయిదువందల బాణములను సంధించి వానిధనువులను ఖండించి కనుఱప్పపాటు మాత్రమున రథముపైకి లంఘించి కార్త వీర్యుని

వేయిబాహువులను శీర్షమును ఖండించి సింహగర్జనము గావించెను. అది చూచి కార్తవీర్యుని పుత్రులు పదివేలమంది భయభ్రాంతులై పారిపోయిరి. రాముఁడు దూడతో కూడ హోమధేనువును గైకొని ఆశ్రమమునకు తిరిగివచ్చెను.

ఆశ్రమవాసు లందఱు ఆశ్చర్యముతో ఆనందముతో చుట్టును చేరి "జయజయ" ఘోషలు సలుపుచుండగా రాముఁడు తండ్రియొద్దకు వోయి నమస్కరించి యుద్ధవృత్తాంతమును వర్ణించి చెప్పెను. ఆ మహర్షియు అంతయును శాంతముగ విని యిట్లనెను. "వత్సా! రామా! సర్వదేవమయుఁడైన మానవేంద్రుని వధించి మహాపాప మొనర్చితివి. తండ్రీ! మనము బ్రాహ్మణులము గదా! బ్రాహ్మణులు క్షమాగుణముచేత పూజింపఁబడుచున్నారు. లోకగురుఁడైన విధాతయు క్షమచేతనే పరమేష్ఠిపదమును పొందియున్నాఁడు. సూర్యుని యందు కాంతివలె మనయందు బ్రాహ్మియైన లక్ష్మి క్షమచేతనే వెలుఁగొందును. విష్ణుదేవుఁడును క్షమావంతుల విషయముననే సంతోషము నొందును. మూర్ధాభిషిక్తుఁడైన రాజును చంపుట బ్రహ్మహత్య కన్నను మించినపాతకము. కావున విష్ణుదేవుని ధ్యానించుచు తీర్థములను సేవించుచు ఈపాపమును వోఁగొట్టుకొనుము". తండ్రియాదేశమున రాముఁడు అట్లే యొక్కసంవత్సరము తీర్థయాత్రలు గావించి పాపరహితుఁడై తిరిగివచ్చెను.

పలుదిక్కులకు పారియోయిన కార్తవీర్యుని కుమారులు మెల్లగా రాజధానికి చేరి తండ్రివధను తలంచుకొని రోషావిష్టులై ఎట్లయియననను పగఁదీర్చుకో వలయునని నిశ్చయించుకొని అవకాశము కొఱకై వేచియుండిరి. ఒకనాఁడు రాముఁడు అనుచరులతో కూడ ఆశ్రమము నుండి వెడలిపోవుటను గమనించి ఆరాజపుత్రులు వెంటనే ఆశ్రమము నంజొచ్చి అగ్నిహోత్రగృహమునందు పరమాత్మధ్యాననిష్ఠుఁడైయున్న జమదగ్ని శీర్షమును ఖండించి పారిపోయిరి. ఆయన భార్య రేణుక గుండెలపై కొట్టుకొనుచు "ఓరామా! రామా! రమ్ము" అని ఎలుగెత్తి ఏడ్చుచుండెను. తల్లి యొక్క ఆర్తనాదమును విని రాముఁడు పరువెత్తుకొని వచ్చి తండ్రిని జూచి విలపించి క్రోధవేగవిమోహితుఁడై క్షత్రియుల నంతమొందింపక తప్పదని తలంచి యాకళేబరమును కాపాడుచుండుఁడని సోదరుల కప్పగించి యుద్ధసన్నద్ధుఁడై పరశువును గైకొని మాహిష్మతివైపు పరుగిడెను.

కోటలో గుమికూడిన రాజకుమారులు అనంతరకృత్యమును గూర్చి ఆలోచించుచుండిరి. బ్రహ్మర్షిహత్యనుగూర్చి విని ప్రజలు భాధనొందుచుండిరి. నగరము విగతప్రభమై యుండెను. రాముఁడు ప్రళయకాలరుద్రునివలె నగరమున ప్రవేశించి రాజకుమారుల తలలను ఖండించి కుప్పవేయఁగా నగరమధ్యమున అది యొకకొండవలెనయ్యెను. రక్తము కొండవాగువలె భయంకరమై ప్రవహించెను. అంతటితో శమింపక ఆభార్గవుఁడు అనుచరులను అన్ని దిక్కులకుపంపి వీరులైన క్షత్రియులందఱును శమంతపంచకమునకు రావలసినదిగా ఘోషణము గావించెను. క్షత్రియులును ఆఘోషణమును సహింపఁజాలక భార్గవుని ఎట్లయినను నిర్మూలింపవలయు ననుతలంపుతో సన్నద్ధులై గుమికూడి దండెత్తిపోయిరి. రాముఁడు వారి నందఱును నిశ్శేషముగా వధించెను. అట్లు రాముఁడు వీరాహ్వానము గావించు చుండఁగా ఇరువదియొక్క పర్యాయములు క్షత్రియవీరులు సబాలవృద్ధముగా సన్నద్ధులై వచ్చి ఆతని వైష్ణవధనువునకు పరశువునకు బలియైపోయిరి. అతఁడుఇంక ఎచ్చటను క్షత్రియవీరులు లేరని తెలిసికొని శాంతించి తండ్రియొక్క తలను శరీరముతో కూర్చి పితృమేధమును గావించెను. జమదగ్ని తపోమహత్త్వమున సప్తర్షిమండలమునఁ జేరి విరాజిల్లెను.

భూమి యంతయు అరాజక మగుటచే రాముఁడు ప్రజాపాలనము కొఱకై సకలధారుణికి తానే మహారాజుగా పట్టాభిషిక్తుఁడై అకృత వ్రణుఁడు మంత్రిగా పరిపాలించుచు నూతనస్మృతిని సైతము రచించెను. పిదప తాను కావించిన రాజసంహారమువలని పాపము శమించుటకై రాముఁడు పెక్కు యజ్ఞములను గావించి తూర్పుదేశమును హోతకు దక్షిణమును బ్రహ్మకు, పడమటిదిశను అధ్వర్యువునకు; ఉద్గాతకు ఉత్తరభాగమును, మధ్యలోనున్న యార్యావర్తమును ఉపద్రష్టయైన కశ్యపునకును దక్షిణగా నిచ్చి సరస్వతీనదియందు అవభృథస్నానముగావించి మేఘములయావరణము తొలంగిన సూర్యునివలె ప్రకాశించెను. భూమిని గైకొన్న కశ్యపుఁడు భార్గవుని జూచి, "ఇంక ఈభూమి యంతయు మాది. నీ విచ్చట నుండదారు. ఎక్కడికైనఁ బొమ్ము" అని శాసింపఁగా రాముఁడు, "సరే కాని తీర్థయాత్రలకై నాకు కొంచెము అవకాశ మొసంగుఁడు" అని ప్రార్థించెను. అందులకు కశ్యపుఁడు, "అట్లయినచో పగలు తీర్థయాత్రలు గావించుచు ఇచ్చట పర్యటించినను రాత్రికి నీ విచ్చట నుండరాదు"అని చెప్పెను. పరశురాముఁడు వెంటనే ఆర్యావర్తమును వీడి

దక్షిణమునకువచ్చి పశ్చిమ సముద్రతీరమున సముద్రములోనికి చొచ్చుకొనియున్న మహేంద్రగిరిపై నివాస మేర్పఱచుకొని తపస్సు చేయమొదలిడెను.

యజ్ఞములచేత పాపరాహిత్యమును పొందిన భార్గవుఁడు చిరకాలము తప మొనర్చి ఉత్తమలోకములను సంపాదించెను. తరువాత కొంతకాలమున కాయన తీర్థయాత్రలకై ఆర్యావర్తమున సంచరించుచుండఁగా, "దశరథునిపుత్రుఁడైన శ్రీరామచంద్రుఁడు శివునివిల్లును భగ్న మొనర్చి జనకుని పుత్రికను పరిగ్రహించెను" అన్న వార్తను వినెను. ఆయన శివుని శిష్యుఁడు. ఒకానొక క్షత్రియార్భకుఁడు పరమేశ్వరుని ధనువును భగ్న మొనరించె నన్నంతనే మరల భార్గవునకు క్షత్రియులపై రోష ముదయించెను, "పరమేశ్వరుని ధనుస్సునే భగ్న మొనర్చుటకు తెగించిన క్షత్రియుఁడు ఇంక ఏయకృత్యమునకు సాహసింపకుండును? క్షత్రియుల యీపొగరుఁబోతుతనమును సహింపరాదు. దీని నిప్పుడే అణఁచివేయవలె" అను తలంపుతో ఆయన సన్నద్ధుఁడై, మిథిలనుండి అయోధ్యకు సైన్యసమేతముగా మరలిపోవుచున్న దశరథునకు ఎదురుగా నేగెను. వసిష్ఠాదిమహర్షులు భార్గవునకు స్వాగతము పలికి అర్ఘ్యపాద్యాదులతో సత్కరించిరి. దశరథుఁడు దీనుఁడై తన కుమారులను రక్షింపుమని ఆయనను ప్రార్థించెను. కాని ఆయన దశరథుని మాటలు లెక్కపెట్టక శ్రీరాముని జూచి యిట్లనెను. "హైహయులు మాతండ్రిని హత్యగావించిరి. ఆపగతీఱుటకై క్షత్రియుల నందఱును ఇరువదియొక్కపర్యాయములు సంహరించి శాంతించి మహేంద్రగిరియందు వసించుచు తపశ్శక్తిని సమార్జించుచుంటిని. ఇప్పుడు నీవు పరమేశ్వరుని ధనుస్సును భగ్నమొనర్చితి వని విని నీశక్తిని పరీక్షించుటయై వచ్చితిని. పూర్వము శివకేశవుల సంగ్రామమున కేశవునియొక్క హుంకారముచే శివుని విల్లు బెండయ్యెను. అదియే నీచేత భగ్నమయ్యెను. విష్ణుదేవుఁడు తన విల్లును ఋచీకున కొసంగెను. ఆయనవలన అది మాతండ్రియైన జమదగ్నికి సంక్రమించెను. ఆయన నా కొసంగెను. క్షత్రియ ధర్మమును స్మరించి నీవు ఈవింటిని ఎక్కుపెట్టఁగలిగినచో నిన్ను వీరునిగా లెక్క పెట్టి నీవు నాతో యుద్ధమొనర్చుటకు అంగీకరింతును" అని పలికెను. తండ్రి వసిష్ఠాదిగురుజనులును సమీపముననే యుండుటచే శ్రీరాముఁడు కోపించియు ఔద్ధత్యమును చూపక కంఠ స్వరమును పెంచక మెల్లగా "మీతండ్రిగారియొక్క పగను తీర్చుటకై నీవు కావించిన శత్రుసంహారమునుగూర్చి విన్నాను. అందులకు నేనును అంగీకరించుచున్నాను. కాని నన్ను అశక్తునిగా భావించి నీవు మాటాడుటను మాత్రము సహింపను. ఇదిగో చూడుము" అని భార్గవుని చేతినుండి ధనువును శరమును గైకొని ఎక్కుపెట్టి బాణమును సంధించి ఇట్లనెను. "నీవు బ్రాహ్మణుఁడవు. అందును విశ్వామిత్రునకు బాంధవుడవు. కావున నీపై ప్రాణాంతముగా బాణమును ప్రయోగింపఁజాలను. కాని వైష్ణవమైన యీబాణము అమమోఘము. దీనిచేత నీపాదగతిని ఖండింపు ముందువా లేక తపస్సుచే నీవు ఆర్జించిన లోకముల ఛేదింపు ముందువా? చెప్పుము".

మాటమాత్రముననే శ్రీరాముఁడు శరచాపములను గైకొని శరసంధానము గావించినంతనే భార్గవుఁడు తనశక్తి యంతయు ఉడిగిపోయినట్లు నిశ్చేష్టుఁ డయ్యెను. విష్ణుధనువును గైకొని విరాజిల్లుచున్న శ్రీరామచంద్రుని జూచుటకు ఇంద్రాదిదేవతలును వచ్చియుండిరి. ఆసన్నివేశమును చూచినంతనే భార్గవునకు విష్ణుదేవుఁడే ఆబాలుఁడుగా అవతరించెనని స్ఫురించి మెల్లగా నిటన్లనెను. "నీవు విష్ణుదేవుఁడవు. లోకేశ్వరుఁడవైన నీవలన నేను పరాజయము నొందుట నాకు అవమానకరము కాదు. కశ్యపున కిచ్చినమాట చొప్పున నేను రాత్రియగునప్పటికి మహేంద్రగిరికి చేరవలె. కావున నాగమనమును నిరోధింపకుము. నేను ఆర్జించిన పుణ్యలోకములు పెక్కు కలవు. వానిని ఆబాణమునకు లక్ష్య మొనరింపుము. ఇంక విలంబము వలదు. ఇదిగో నీవిక్రమమును వీక్షించుటకు దేవతలును వచ్చియున్నారు. బాణమును వదులుము. ఆపుణ్యలోకములు దగ్ధములగుటఁ జూచి నేనును సెలవు తీసికొందును".

రామునిబాణమున భార్గవుని పుణ్యలోకములు భస్మమయ్యెను. వెంటనె భార్గవుఁడు శ్రీరామునకు విష్ణుదేవుఁడే అనుభావముతో ప్రదక్షిణ మాచరించి బయలుదేరెను. శ్రీరాముఁడు ఆయనకు ప్రణమిల్లి సాగనంపెను. అటనుండి తిరిగివచ్చుచు భార్గవుఁడు తనపూర్వచరిత్రమునంతయు తలపోయుచు చాలనిర్వేదము నొందెను. ఆసమయమున దైవికముగా అవధూతయైన సంవర్తుఁడు ఎదురుపడెను. ఆమహాత్ముని యాదేశము ననుసరించి భార్గవుఁడు దత్తాత్రేయు నాశ్రయించి త్రిపురాదేవి నుపాసించెను. తత్ఫలముగా ఆయనకు దేవీస్వరూపమునుగూర్చి జగత్తునుగూర్చి తన్నుగూర్చి పెక్కు సంశయములు కలిగెను. వెంటనే ఆయన మరల గురువు నాశ్రయించి సంశయములను అడిగి తత్త్వమును తెలిసికొని జీవన్ముక్తుఁ డయ్యెను.

ఇందు గమనింపవలసిన యంశములు అనేకములు కలవు. గురువరేణ్యుఁడైన దత్తాత్రేయు నాశ్రయించి సంవర్తుఁడు అవధూతయయ్యెను; భార్గవరాముఁడు జీవన్ముక్తుఁడయ్యెను. మఱి ఆయననే సేవించిన కార్త వీర్యుడు అసూయాపరుఁడై బ్రాహ్మణుని ధేనువు నేల హరించెను? గురువు ఒక్కఁడే యైనను శిష్యుల యధికారములలోని భేదములనుబట్టి విద్యలయందును భేదమేర్పడును. కార్త వీర్యుఁడు విరక్తుఁడు కాదు; జిజ్ఞాసువు కూడ కాదు. అతఁడు శక్తి సంపదను పెంపొందించుకొనటకై దత్తాత్రేయు నాశ్రయించి యోగవిద్య నభ్యసించి అణిమాద్యష్టసిద్ధులను సంపాదించెను. అంతే కాని అతఁడు తత్త్వమునుగూర్చి అడుగలేదు. గురువు బోధింప లేదు. కావున అతఁడు తత్త్వజ్ఞుఁడు కాలేదు. అతఁడు ఐహికమైన యైశ్వర్యమునే అనుభవించుచు సంతోషించుచుండెను. అందువలన ఒకబ్రాహ్మణుఁడు హోమధేనువువలన తనకన్న అధికమైన యైశ్వర్యము కలవాఁడై ప్రకాశించుచుండట ఆమహారాజునకు సహిపరాని దయ్యెను. కావున ఆధేనువును హరించుటకు పూనుకొని వినాశ మొందెను.

కార్త వీర్యనిపుత్రలు జమగద్నిని సంహరింపఁగా భార్గవుఁడు వారిని వధించుటతో ఆగక క్షత్రియులను ఇరువది యొక్క పర్యాయములు వధించినప్పుడు శమంతపంచకములోఅయిదు రక్తపుమడుగు లేర్పడినవి. భార్గవుఁడు కార్తవీర్యుని పుత్రులను మాహిష్మతిలో సంహరించెను. అది నర్మదానదీతీరమున నున్నది. శమంతపంచకము కురుక్షేత్రములో నున్నది. అనఁగా క్షత్రియులను సంహరింపఁబూనుకొనినప్పుడు ఆయన పుణ్యక్షేత్రముననే రణరంగమును ఏర్పఱచెనన్నమాట సంహరింపఁబడినవారికి ఉత్తమ మగతులు కలుగవలయునని ఆయన ఇట్లు ఏర్పఱచియుండును. రక్తము గడ్డకట్టకుండ మడుగులుగా ఏర్పడునా? ఆభూమిలోని ధాతువుల గుణమువలనచుట్టునున్న వృక్షమూలికల ప్రభావమువలన అట్లు సంభవించి యుండవచ్చును.

తనతండ్రినొక్కరిని కొందఱు రాజపుత్రులు సంహరించి రని భార్గవుఁడు లక్షలకొలఁది క్షత్రియులను వధించుట తగునా? శ్రీరాముఁడు సైతము దానిని ఆక్షేపింపక పోఁగా అంగీకరించుచున్నా నని చెప్పుట గమనింపఁదగియున్నది. అనఁగా అది ధర్మమే యన్నమాట. తక్షకుఁడు పరీక్షిత్తును ఒక్కనిని వధించినప్పుడు కూడ జనమేజయుఁడు సర్పయాగమునుజేసి అసంఖ్యాకములైన పాములను అగ్నికి ఆహుతిఁగావించెను. ఆసందర్భమున ఉదంకుఁడు "ప్రల్లదుఁడైన యొక్క కులపాంసను చేసినదానఁ దత్కులంబెల్లను దూషితంబగుట యేటియపూర్వము..." అని జనమేజయునకు బోధించెను. ఇట్లే సీతవిషయమునందును తప్పుచేసినవాఁడు రావణుఁ డొక్కఁడే. అయినను శ్రీరాముఁడు రాక్షసకులము నంతను సంహరింపక తప్పలేదు. ఒకఁడు తప్పుచేయుచున్నప్పుడు వానిని అదుపులో పెట్టవలసినబాధ్యత కులములో ఎల్లరకును ఉండును. అపరాధి బలవంతుఁడైనచో ధర్మజ్ఞులైనవారు వానిదోషమును నిరసించి తొలఁగిపోవలెను. విభీషణుఁడు అట్లు తొలఁగివచ్చి రక్షింపఁబడెను. మఱి కార్తవీర్యుఁడు ఆతని పుత్రులు కావించినయకృత్యములను ఆకాలమున శ్రీరామునివలె ఒక్క క్షత్రియుఁడైనను ఖండింపలేదు. వారందఱును "ఒకబ్రాహ్మణుఁడు మహారాజులైన క్షత్రియులపై తిరుగఁబడుటయా! ఇది సిహింపరాదు" అను భావముతో క్షత్రియప్రతిష్ఠను కాపాడవలయు నను నుద్రేకముతో శమంతపంచకమునకు సన్నద్ధులై చనిరి. ఆపరాధిని ఎవరు సమర్థింతురో వారును అపరాధులే అగుదురు. కావుననే భార్గవుఁడు కావించిన క్షత్రియ సంహారమును శ్రీరాముఁ డామోదించెను.

భార్గవుఁడు నైష్ఠికబ్రహ్మచారి. అయినను ఆయన పట్టాభిషిక్తుఁడై ప్రజాపాలనము గావించి షోడశమహారాజులలో ఒకఁడుగా ప్రసిద్ధుఁడయ్యెను. అంతేకాదు. ఆయన పెక్కుయజ్ఞములను గావించి భూమి యంతయు కశ్యపాదిమహర్షులకు యజ్ఞదక్షిణగా నొసంగెను. మఱి బ్రహ్మచారికి పట్టాభిషేకమునకుఁ గాని యజ్ఞములు చేయుటకుఁ గాని అధికార మున్నదా? ధర్మపత్నీసమేతునకే పట్టాభిషేకము చేయుదురు. వానికే యజ్ఞము చేయుటకును అధికారముండును. అట్లయినచో భార్గవునిచే యజ్ఞమును చేయించిన కశ్యపాదిమహర్షులకు ధర్మము తెలియదా? శ్రౌతస్మార్తకర్మలయందు యజమానుఁడు పత్నీసమేతుఁడైయుండవలయు ననుటకు కర్మసమృద్ధిని చెప్పుటయందే తాత్పర్యము కాని పత్నీరహితునకు బ్రహ్మచారికి యజ్ఞాధికారము లేదని చెప్పుట యందు తాత్పర్యము కాదు. ఆపస్తంబశ్రౌత సూత్రమున సూ|| యోవా కశ్చి దవిద్యమానాయామ్||

(ప్రథమప్రశ్నే-వింశఖండే-త్రయోదశసూత్రమ్) అనుసూత్రమును వ్యాఖ్యానించుచు భట్టరుద్రదత్తుఁడు ఇట్లు నిష్కర్ష గావించెను. "భార్య లేకున్నను ఒకానొకఁడు అగ్నులను సంపాదించుకొనవచ్చును; అనఁగా యజ్ఞ మొనరింపవచ్చును. వయస్సు ఆజ్యము మొదలగు వానివలె యజమానునకు యజ్ఞకర్మయందు భార్యయు ఒకయంగము మాత్రమే

అగును. ఏవేని కొన్ని యంగములు లోపించినప్పుడు ప్రతినిధిద్రవ్యములతో యజ్ఞమును కొనసాగింపవలసియే యుండును. అట్లే భార్య లోపించినప్పుడును యజ్ఞాధికారము లోపింపదు. ధర్మవిగ్రహుఁడైన శ్రీరామచంద్రుఁడు సీత లోకాంతరమునకు చేరినతరువాత కూడ పెక్కు అశ్వమేధములను గావించెను. అంతే కాదు శిష్టులలో శ్రేష్ఠులైన భీష్ముఁడు, కణ్వుఁడు మొదలగువారు యజ్ఞములు చేసినట్లు ప్రసిద్ధముగా నున్నది. కావున అపత్నీకునకు యజ్ఞాధికారము లోపింపదు".

కావున పరశురాముఁడు పట్టాభిషిక్తుఁడగుటలో యజ్ఞములు చేయుటలో ధర్మాతిక్రమణము ఏమియును లేదు.

యజ్ఞములు చేసి భూమియంతయు దాన మొనర్చి ప్రశాంతుఁడై తపస్సు చేసికొనుచున్న భార్గవుఁడు మరల శ్రీరామునిపై ఏల విజృంభించెను? మహారాజయ్యును బ్రహ్మచారి యగుటచే ఆయనకు రాజభోగానుభవము కలుగ లేదు. అందువలన ఆయన ఈలోకసుఖములను రాజ్యమును వదలుకొన్న తరువాత తపస్సు చేసి ఊర్ధ్వలోకములను సంపాదించెను. అట్లే ఆయనయందు క్షత్రియులపై కోపము కూడ కట్టె లయిపోవుటచే నివురుగప్పిన నిప్పువలె, సంహరింపఁదగిన శత్రువీరులు కన్పింపకుండుటచే, నిగూఢముగ నుండనే యున్నది. అది నీటిచే నిప్పువలె పూర్తిగా నశింపలేదు. కావుననే శివధనుర్భంగ వార్త వలన అది వెంటనే ప్రజ్వలించెను.

జీవితములో అప్పటివఱకును ఎఱుఁగని పరాజయమును ఆయన శ్రీరామునితో సంఘర్షణమున చవిచూడవలసివచ్చెను. అందువలననే ఆయనకు మొదటిసారిగా నిర్వేదము కలిగినది. కశ్యపుడు ఆర్యావర్తమున ఉండవల దని శాసించినప్పుడు కూడ ఆయన నిర్వేదము నొందలేదు. తపస్సుచే ఇంతకన్నను మిగులదివ్యములైన లోకములను పెక్కింటిని సంపాదింపఁగల ననునాత్మవిశ్వాసము అప్పుడు పుష్కలముగ నుండెను. కాని ఇప్పటి పరిస్థితి వేఱు. ఎప్పుడునులేని నిర్వేద మిప్పుడు ఆయనను పూర్తిగా ఆక్రమించినది. ఇది రెండు విధములు, ఏవి మనకు సుఖసాధనము లగునని ఎంతోతాపత్రయపడి సంపాదించుచున్నామో అవి వ్యర్థము లని తోఁచుట మొదటిది. సుఖసాధనముకు ప్రతిబంధకమై విజృంభించుచున్నదానిని జయింపఁజాల కుంటిని గదా అనుదైన్యము రెండవది, దానముచేసిన మఱుక్షణములో ఆయనకు ఈలోకసామ్రాజ్యము కలవలె చెదరిపోయెను. తపస్సుచే ఆర్జించిన లోకములు చూచుచుండఁగనే దగ్ధము లయ్యెను. ఇట్టి లోకములను మరల సంపాదించినను ఎప్పటికైనను అవి నశింపక తప్పదు; వీనివలన శాశ్వతమైన సుఖము లేదు అనువిషయము ఆయనకు అనుభవసిద్ధ మయ్యెను. "కర్మచేత సంపాదింపఁబడులోకములు అశాశ్వతములు. అశాశ్వతములైన వానివలన శాశ్వతమైన సుఖము కలుగదు. ఇట్లు పరీక్షించి తెలిసికొని బ్రాహ్మణుఁడు నిర్వేదమును పొందవలెను. కర్మచేత మోక్షము కలుగదు" అని శ్రుతి చెప్పినట్లుగా భార్గవుఁడు ఏలోకములయైశ్వర్యమును ఎంతగా సంపాదించినను దాని వలన శాశ్వతమైన సుఖములేదని దృఢముగా గ్రహించెను.

అంతే కాదు. పరాక్రమముచే ఈలోకమును, తపస్సుచే దేవలోకములను జయింపఁగలిగినతాను తనయందే విజృంభించుచున్న కోపమును జయింపలేక పోయితినని ఆయన మొదటిసారి గ్రహించెను. దానికి లోఁబడుటవలననే ఎంతో అనరన్థము సంభవించిన దని ఆయన గడచిన జీవితము నంతను విమర్శించుకొని గ్రహించి పరితపింపఁజొచ్చెను. కార్తవీర్యుని సంహరించినప్పుడే బ్రాహ్మణునకు కోపము తగదని. క్షమయే ప్రశస్త మని తండ్రి తనకు బోధించి యుండెను. కాని ఆయనయే హతుఁడై నప్పుడు ఆయన కావించినబోధ క్రోధవేగమున కొట్టుకొనిపోయెను. "పాపము సంభవించినచో యజ్ఞ ములచే పోఁగొట్టుకొనవచ్చును. ఎట్లయినను ఈక్షత్రియులను నిర్మూలింపవలసినదే" అను తలంపుతో అప్పుడు ఆయన క్రోధమునకు తనపై నిరంకుశమైన యధికారము నొసంగెను. అందువలన బ్రాహ్మణునకు అయోగ్యమైన ప్రాణిహింసను ఎంతో ఆయన కావించెను. యజ్ఞములు ఆపాపమును పోఁగొట్ట: గలిగినను క్రోధమును కదలింపలేక పోయినవి. ఆక్రోధమువలననే, దేవతులు మానవులు ఎందఱో చూచుచుండఁగా, శ్రీరామునివలన ఆయనకు పరాజయము సంభవించినది. అప్పు డాయనకు తనకు నిజమైనశత్రువు తనకోపమే అని, దానిని జయించుట సులభము కాదని స్పష్టముగా గోచరించెను.

# భార్గవరాముని నిర్వేదము

శ్రీరామునివలన పరాభవమునొందిన భార్గవరాముఁడు అత్యంతము నిర్వేదము నొంది మార్గమున ఇట్లు చింతించుచు పోవఁజొచ్చెను. "అహో నాచిత్తసమ్మోహ మేమని చెప్పుదును? ప్రబలశత్రువైన క్రోధముచేత మోహమను పెద్దగోతిలో కూలి ఇట్లయితిని. తపస్సునకు మృత్యువు క్రోధమే. క్రుద్ధుఁడైన వానినుండి ఆలోచన యన్నది దూరముగా తొలఁగిపోవును. క్రుద్ధుండైనవాఁడు పిశాచమువలె ఏనీచకార్యమును జేయఁడు? వారి కీరువురకును భేదము కొంచెముకూడ లేదు. మాత్రండి నెవరో సంహరింపఁగా నేను ఎందఱనో సంహరించితిని. శత్రువులు పెరుగుచుండఁగా ప్రభువునకు రాజ్యసౌఖ్య మెట్లుండదో అట్లే నాకును ఈకోప మున్నంతవఱకు సుఖముండదు. మనుష్యభక్షకునివలె నేను చాల నీచకృత్యమును గావించితిని. అభిమానము క్రోధమునకు మూలము. ఆయభిమానము వలననే నేను పెద్దయజగరమువంటి క్రోధసర్పముచేత మ్రింగఁ బడితిని".

ఇట్లు చింతించుచు పోవుచున్న పరశురాముఁడు దారిలో జ్వలించుచున్న యగ్నిపర్వతమువలె తేజోరాశిమయుఁడైన యొకపురుషుని గాంచెను. అతఁడు పుల్లపంకజలోచనుఁడై పుష్టసుందరసర్వాంగుఁడై యుండెను. అతఁడు మలినాంగుఁడై జుట్టు విరఁబోసికొని పిచ్చివాని వలె నున్నను మహాపురుషునివలె మహర్షివలె భాసించుచుండెను. వర్ణాశ్రమాదిచిహ్నములు ఏమియు లేక దిగంబరుడై మదపుటేనుఁగు వలె నిలిచియున్న యావిప్రుని జూచి పరశురాముఁడు చాల సంశయము నొందెను. "ఎవ రీతఁడు? మంచి లక్షణములు చెడులక్షణములు కలిగి విలక్షణమైన వర్తనము కలవాఁడుగా నున్నాఁడు. ఇతఁడు మహాపురుషుఁడా లేక ప్రమత్తుఁడా? వేషాంతరము నొందియున్న నటునివలె వీనిని నిశ్చయించి గుర్తింపలేకున్నాను. మదించినవాఁడైనచో ఇతఁడు తేజోముయుఁడుగా ఎట్లుండును? ఇతఁడు సత్పురుషులను ధర్మమునుండి తప్పించి చెఱచువాఁడా లేక స్వరూపమును కప్పిపుచ్చుకొనియున్న మహాపురుషుఁడా? వీని నెట్లయినను ప్రయత్నించి పరీక్షింపవలె".

ఇట్లు తలంచి పరశురాముఁడు నవ్వుచు వానినిజూచి "పురుషవరేణ్యా, ఎవరు నీవు? మహాపురుషునివలె కన్పించుచున్నావు. నీయీ స్థితి ఎట్టిదో చెప్పుము " అని పలికెను. అమాట విని ఆతఁడు పెద్దగా మాటిమాటికి నవ్వుచు రాళ్లు రువ్వుచు పిచ్చివానివలె వర్తించుచు ఏదో మాటాడుచు పారిపోఁజొచ్చెను. భార్గవుఁడు ఆతనివెంట పరువెత్తి పట్టుకొని "ఈతఁడెవరో తెలియుట లేదు. ఇంకను వీనిని పరీక్షించి నాకోరికను తీర్చుకొందును" అని తలంచి ఆతనిని అనేక విధముల ఆక్షేపింప మొదలుపెట్టెను. ఎంతగా ఆక్షేపించినను ఎంతగా పరిభవించినను ఆతని స్థితియందుఁగాని ముఖవర్ణమునందుఁ గాని కొంచెమైనను మార్పు రాలేదు. అప్పుడు పరశురాముఁడు అతఁడు మహాపురుషుఁడే అని నిశ్చయించుకొని ఆయన పాదములయందు వ్రాలి ప్రార్థించెను.

ఆయన ప్రసన్నుఁడై భార్గవుని కరుణించి నవ్వుచు ఇట్లనెను."ఎవరు నీవు అని ప్రశ్నించితివి గదా? వినుము. "నీవు" అనుపదము యొక్క అర్థము నీకు తెలిసినచో నీప్రశ్న, పిండియైనదానిని మరల పిండిచేయుటవలె (పిష్టపేషణము) వ్యర్థము. ఆపదముయొక్క అర్థము నీకు తెలియనిచో నీమాట అర్థము లేనిదగును. ఈశరీరమును ఉద్దేశించి "నీవు" అనుపదమును ప్రయోగించితి నందు వేని. ఇందులోనున్నచైతన్యము నీకు గోచరించ లేదన్నమాట మఱి అన్నమయమైన యీశరీరము నీకు ప్రత్యక్షముగా కన్పించుచున్నది గదా! ప్రశ్నింపవలసినసంశయ మేమున్నది? కాఁబట్టి నీప్రశ్న పేరునకు మాత్రమే సంబంధించుచున్నది. కాని పేరు శరీరముతోపాటు సహజముగ సిద్ధించుట లేదు. అది అనేక విధముల కల్పింపఁబడుచున్నది. జనుల సముదాయములో ఒకపేరు ఒకశరీరమునందే నియమితమై యుండదు. కావున నీవు నన్ను చక్కఁగా ప్రశ్నించినచో సమాధానము చెప్పుదును"

ఆమాటలకు సమాధానము దొఱకక పరశురామునకు వాక్కుతో పాటు బుద్ధియొక్క పౌరుషము కూడ స్తంభించెను. అతఁడు సిగ్గువడి ఆయోగీశ్వరునకు ప్రణమిల్లి ఇట్లు ప్రార్థించెను. "మహాపురుష! నీవు చెప్పినదానినిబట్టి ఎట్లు ప్రశ్నింపవలయునో నాకు తెలియుట లేదు. నేను అకల్మషుఁడనై నీకు శిష్యుఁడనై యున్నాను. ఆప్రశ్న యేదో నీవే తెలిసికొని నాకు బోధింపుము". అప్పు డాయన మధురములైన మాటలతో తన వృత్తాంతమును చెప్పస నారంభించెను. "భార్గవా, నేను ఆంగిరసుఁడను; బృహస్పతికి తమ్ముఁడను; మూఁడులోకములయందును సంవర్తుఁడని ప్రఖ్యాతుఁడనై

యుంటిని నాస్థితిని చెప్పెదను శ్రద్ధతో వినుము. పూర్వము అన్నతో నాకు విద్వేషము కలిగెను. దానిచేత నాకు నిర్వేదము పుట్టి గురుపైన దత్తాత్రేయునిచే చక్కఁగా బోధింపఁబడి ఈస్థితిని పొందితిని. "ఆత్మయే అఖిలము; ఇది యంతయు దానివిలాసము" అని తలంచి శంకారహితుఁడనై అభయమైన మార్గము నాశ్రయించి, దారముచేత కదలింపఁబడు బొమ్మవలె సంచరించుచున్నాను".

అదివిని రాముఁడు అంజలించి, "మహాత్మా! సంసారభయపీడితుఁడను దీనుఁడను అయిన నన్ను అనుగ్రహించి నిర్భయము శుభమునైన మార్గమునందు ప్రవేశపెట్టుము". అని ప్రార్థించెను. దయార్ద్రహృదయుడైన యాముని మరల నిట్లనెను. "వత్సా! సర్వార్థ సంగ్రహమైన సారమును చెప్పెదను వినుము. దొంగలు ప్రబలముగా నున్న మార్గమును ఒకానొకఁడు దైవమోహితుఁడై నిర్భయమైన దారి అనుకొని ముందుకు పోవుచున్నట్లు నీవు నడచుచున్న మార్గము కూడ మిగుల అనర్థదాయకము, భయంకరము. అజ్ఞానమువలన దొంగలున్న మార్గమున ప్రవేశించినవాఁడు అడుగడుగున భయపుడుచు కష్టపడుచు క్షేమము కలుగు ననునాశతో ముందుకు పోవుట యెట్టిదో సంసార మార్గమున వర్తించుచుండుటయు అట్టిదే. మార్గము నెఱింగిన యొకానొక మహనీయునిచే బోధింపఁబడి దొంగలున్న మార్గమున వదలి మంచి మార్గమున పయనించువాఁడు దుష్టమార్గమున పోవుచున్న వారిని జూచి నవ్వుకొనుచుండును. అట్లే గురువు బోధించిన మంచిమార్గము నుందున్న నేను కుత్సితములైన యితరమార్గములలో పోవుచున్నవారిని చూచి నవ్వుకొనుచు ఆనందముతో ఎల్లయెడల చరించుచున్నాను. సంసారమార్గము మనము చేరవలసిన గమ్యమునకు విరుద్ధము, విపత్కరము. దానియందు నిరంతరము క్లేశములను పొందుచున్నను, జనులు మోహవశులై తెలిసికొనలేకున్నారు. పరంపరగా కష్టములు వచ్చిపడుచున్నను ఎప్పటికైనను సుఖము కలుగు ననుబుద్ధితో దానినే నమ్మియుండువారికి మావంటివారు సేవించుచున్న యీ మార్గము దుర్లభము. కావున సంసారము సరియైన మార్గము కాదని తెలిసికొని అందు విరక్తుఁడవై గురువు నాశ్రయించి ఆయన చెప్పినపద్ధతిలో స్వాత్మశక్తియైన త్రిపురామహేశ్వరిని ఆరాధించి ఆమె యొక్క కృపను పొందుము. ఆమెయనుగ్రహమువలన 'నాయందున్న యాత్మయే సకలపదార్థములయందును సమముగా నున్నది; దానిశక్తి యందే ఇతరమైన జగత్తు అంతయును ఆభాసమాత్రముగా నున్నది' అని గ్రహింపుము. అప్పుడు సంశయరహితుఁడవై నిర్భయుఁడవై నిశ్చలుఁడవై నావలెనే జగద్గురుత్వమును పొంది యథేచ్ఛగా విహరింపుము. తనచే గుర్తింపఁబడుచున్న తనశరీరము. గుర్తించుచున్న తాను కానని, తానే సకలపదార్థములయందు ఉన్నానని, అఖిలపదార్థములు తనయందే ఉన్నవని తెలిసికొని ఎల్లప్పుడు జ్ఞానసింహాసనస్థుఁడై ఎల్లయెడల చరించువానికి ఈసంసారమునందు కర్తవ్యమే గోచరింపదు. సంసారమునందు మాటిమాటికి దోషమును గుర్తించుచుండుటయే ఇందులకు మొదటిమెట్టు. దానివలన సంసారమునందు వైరాగ్యము కలుగును. దానివలన సన్మార్గమున ప్రవేశించుట సంభవించును. నాచేత సంక్షేపముగా చెప్పఁబడిన యీసారమును ఎల్లప్పుడును అభ్యసించు మానవుఁడు అచిరకాలముననే పరమపదమును చేర్చునట్టి శుభమార్గమున ప్రవేశింపఁగలఁడు."

ఈప్రసంగములోని విషయము అతీంద్రియమై ఆలోచించుటకు కూడ అలవిగాకుండుటచే పరశురాముఁడు కలఁత నొందిన మనస్సుతో మరల ఇట్లు పలికెను. "మహాత్మా! మీరు చెప్పినది సారవంతముగనే తోఁచుచున్నది. కాని అది చాల గంభీరమగుటవలన, మీరు చాల సంక్షేపముగ చెప్పుటవలన నాకు చక్కఁగా తెలియలేదు. కావున సందేహములు కలుగుచున్నవి. నన్ను కరుణించి ఆవిషయము నాకు ఎట్లు చక్కఁగా తెలియునో అట్లు వివరించి బోధింపుము. నీవు సర్వజ్ఞుఁడవు. శరణాగతుఁడనైన నన్ను రక్షింపుము".

అంత సంవర్తుఁడు కొంతసేపు అంతర్ముఖుఁడై యుండి భార్గవుని యొక్క భవిష్యత్తు నంతను తెలిసికొని మధురముగా నిట్లనెను. "రామా! వినుము. ఈమార్గము ఎవరికైనను సులభముగా గోచరించునది కాదు. ఇది చాల సూక్ష్మమైన విషయము. అందువలన కొండపైకి ఎక్కుటవలె, సంసారమునుండి పైకిపోవు నీమార్గమును గ్రహించుట మలినచిత్తులకు దుర్ఘటము. ఇది తెలిసికొనుటకు సులభముకాని దగుటవలననే చెప్పుటకును సులభము కాదు. ఇది ఎట్టి లోకపరిజ్ఞానమునకు అందనిది యగుటచే దుర్లభ మని చెప్పఁబడుచున్నది. ఇది త్రిపురాదేవియొక్క సేవవలన తప్ప వేఱొకవిధమున లభింపదు. ఆదేవియొక్క సేవాభాగ్యము కూడ గురువర్యుని కృపవలన తప్ప మఱియొక విధమున లభింపదు. సత్సంగమే అందులకు హేతువు. సకలశుభములకుని సత్సంగమే మూలము. కావున గరునాథుఁడైన దత్తాత్రేయుని యొద్దకు పొమ్ము. ఆయనను ఆరాధించి సంతోషపెట్టి త్వరలోనే వాంఛితమును

పొందఁగలవు. రాత్రి యందు చీకటిలో త్రోవతప్పినవాఁడు సూర్యునివలన తప్ప ఎట్లు మరల సరియైనత్రోవకు రాలేఁడో, అట్లే ఎవ్వఁడైనను గురుసేవవలన తప్పసుఖమును పొందఁజాలడు. నేత్రరోగికి అంజనమునొసంగు వైద్యునివలె సంసారరోగికి గురువుతప్ప వేఱొకగతి లేదు. సాక్షాత్తుగా సదాశివుఁడే శిష్యులను అనుగ్రహించుటకై గురువుగా మనుష్యరూపమును పొంది ఎల్లప్పుడును పర్యటించుచుండును. ధనము కీర్తి మొదలగువానిని సమృద్ధిగా పొందియున్నను మూఁడులోకములలో ఎవ్వఁడైనను గురుదేవుని పాదాబ్జములను ఆశ్రయింపక శ్రేయస్సును ఎట్లు పొందఁగలఁడు? కావున నీవు ఇచ్చటినుండియే వెంటనే గురువు నొద్దకు పొమ్ము. ఆయనను కైతవములేని చిత్తముతో దృఢమైన భక్తితో ఆరాధింపుము. గురువు ప్రసన్నుఁడైనచో మూఁడులోకము లందును దుర్లభ మేముండును? ఆయన ఇప్పుడు గంధమాదన శైలమున సిద్ధయోగులచే సేవింపఁబడుచు ఆశ్రమమునందున్నాఁడు. నీకు శుభ మగును గాక! నేను పోవుచున్నాను."

అంతట పరశురాముఁడు చూచుచుండఁగనే ఆయన ఈశాన్యముగ బయలుదేరి ఆకాశమార్గమునందు పోవుచు, గాలిచే తఱుమఁబడుచున్న మేఘపటలమువలె నిమేషమాత్రమున అగోచరుఁడయ్యెను. వెంటనే భార్గవుఁడును సంవర్తునిమాటలవలన కలిగిన కుతూహలముతో త్వరాన్వితుఁడై దత్తగురునియొద్దకు బయలుదేరెను.

బాలప్రియ

"అభిమానము క్రోధమునకు మూల"మని (అభిమానః క్రోధమూలః) పరశురాముఁడు తలంచుట గమనింపఁదగియున్నది. నే నింతవాఁడ నని తన శక్తి సామర్థ్యములను గూర్చి భావించుకొనుట అభిమానము. పరశురాముఁడు మహావీరుఁడు. మహాకార్యములను సాధించుటకు కావలసిన యుత్సాహశక్తియే మహావీరత్వము. మహావీరుఁడ నైన నాతండ్రియొక్క హోమధేనువును ఒకరాజు హరించుటేమి? అనునభిమానమువలననే ఆయనయందు క్రోధము ప్రజ్వలించినది. జమదగ్ని సంహరింపఁబడినప్పుడు కూడ ఆ యభిమానము మూలముననే క్రోధము దావాగ్ని వలె విజృంభించి క్షత్రియాటవులను దహించినది. తండ్రి క్షమాగుణమునుగూర్చి బోధించియున్నను ఆయన క్షత్రియ సంహారమునకు పూనుకొనుటకు కూడ మహావీరత్వాభిమానమే కారణము. ఏ వీరత్వముతో ఆయన శత్రుసంహారము కావించెనో ఈవీరత్వముతోనే యజ్ఞములు చేసి పాపమును పోఁగొట్టుకొనెను. అట్లే ఆర్జించిన భూమి యంతయు దాన మొనర్చి అందులోకూడ ఆయన సాటిలేని వీరత్వమును ప్రకటించెను. పిమ్మట ఆయన తపస్సునకు పూనుకొని దివ్యలోకములను పెక్కింటిని ఆర్జించి తపోవీరుఁడయ్యెను. ఈవీరత్వాభిమానమువలననే ఆయనయందు మాటిమాటికి క్రోధము విజృంభించుచుండెను.

ఈయభిమానము మొదటిసారిగా శ్రీరాముని తోడిసంఘర్షణమున దెబ్బతినెను. శ్రీరామునియందు వైష్ణవతేజమును చూచినప్పుడు ఆయనకు నిర్వేదముతోఁబాటు ఆత్మవిమర్శ ఆరంభమైనది. జమదగ్నియు ధనుర్విద్యావిశారదుఁడే. కాని ఆయన కార్తవీర్యునిపై పరాక్రమింపలేదు; తపశ్శక్తి సంపన్నుఁడయ్యును శపింపలేదు. అంతే కాదు. తన కుమారుఁడు మహారాజును సంహరించి విజేతయై తిరిగివచ్చినప్పుడు సంతోషింపక పోఁగా అది మహాపాప మని ప్రాయశ్చిత్తము చేసుకొమ్మని ఆదేశించినాఁడు. "సమ్మానమును విషమునుగా అవమానమును అమృతముగా బ్రాహ్మణుఁడు భావింపవలె" అని మనువు చెప్పిన ధర్మమును ఆయన దృఢముగ అవలంబించెను. తన కుమారుఁడును అట్లే యుండవలయు నని ఆయన బోధించెను. కాని వీరత్వాభిమానమువలన ఆబోధ పరశురామునకు పట్టలేదు. తనవంటి మహావీరుఁడు పూనుకొని దుష్టశిక్షణము కావింపకున్నచో లోకమున ధర్మ మెట్లు నిలుచు నను నావేశముతో ఆయన పరాక్రమించెను. తన తేజము కన్నను చాలరెట్లు అధికమైన విష్ణుతేజమును శ్రీరాముని యందు చూచినపుడు, లోకరక్షణభారము తన భుజస్కంధములపైననే లేదని, తానును తనతండ్రివలె బ్రాహ్మణధర్మము నవలంబించి అవమానమును సహించియున్నచో, విష్ణుదేవుఁడు అవతరించి దుష్టులను శిక్షించియుండెడివాఁడని, తాను దురభిమానమువలననే బ్రాహ్మణునకు అనుచితమైన హింసాకృత్యమునకు పాల్పడె నని ఆయన గ్రహించెను.

సరిగా ఆసమయమునకు సంవర్తుఁడు ఆయనకు కన్పించెను. అది యాదృచ్ఛిక మని అనుకొనవచ్చును. కాని కర్మసిద్ధాంతము ననుసరించి యేదియును నిష్కారణముగా సంభవింపదు. కొన్ని సంఘటనములకు మనకు కారణములు తెలియకపోవచ్చును. అంత మాత్రమున అవి లేవని తలంపరాదు. సంవర్తుఁడు పోఁదలఁచు కొన్నప్పుడు

అప్పపాటులో ఆకాశమార్గమున అదృశ్యుఁడయ్యెను. గదా! పరశురాముఁడు తన్ను పట్టుకొనుటకై పరువెత్తి వచ్చినపుడు ఏల అదృశ్యుఁడు కాలేదు? అనఁగా ఆయన పరశురాముని అనుగ్రహించుటకే వచ్చి ఆతని శ్రద్ధను, అట్లు పరీక్షించెనన్నమాట. ఆయనను భార్గవుఁడు ఇంతకు ముందు ఎన్నఁడును చూడలేదు. మఱి ఆయనకు ఆతనియందు అనుగ్రహము కలుగుటకు కారణమేమి? విష్ణుదేవుని ధ్యానించుచుండు మని తండ్రి పరశురామునకు తీర్థయాత్రలు చేయుమని చెప్పిన సందర్భమున బోధించెను. అట్లే ఆతఁడు తీర్థయాత్రలు యజ్ఞములు తపస్సులు చేసెను. అవి పాపపరిహారమును కలిగించి కీర్తిని ప్రాభవమును కలిగించినవి. కాని అవి అభిమానమును క్రోధమును కొంచెము కూడ కదలింపలేక పోయినవి. తన్ను ధ్యానించుచున్నందులకు ఫలముగా విష్ణుదేవుఁడు అనుగ్రహించి ఆతనిని సన్మార్గమునకు మరలింప నారంభించెను. ఆదేవుని యనుగ్రహము వలననే శ్రీరాముని తోడి సంఘర్షణమున పరశురామునకు అభిమానము భంగపడి తీవ్రమైన నిర్వేదము కలిగినది. ఆయనుగ్రహమువలననే సంవర్తుఁడు కూడ సాక్షాత్కరించెను. అప్పటికి పరశురామునియందు వీరత్వాభిమానము భగ్నమైనను "నేను బుద్ధిశాలిని, వాక్పటుత్వము కలవాఁడను" అన్న అభిమాన మింకను మిగిలియున్నది. సామాన్యులైన పండితులకు మేధావులకు ఇట్టి యభిమాన ముండును. మఱి మహారాజై పరిపాలించి నూతన స్మృతిగ్రంథమును సైతము నిర్మించిన భార్గవునకు ఇది యెంతగాఢముగ నైన నుండవచ్చును. ఈయభిమానము మున్నంతవఱకు ఎవఁడును ఇతరునకు హృదయపూర్వకముగా శిష్యుఁడు కాఁజాలడు. సంవర్తుఁడు భార్గవునియందు ఈయభిమానమును భగ్న మొనర్చి వినయమును కలిగించెను. ఆతఁడు వేసిన "ఏవరు నీవు" అను ప్రశ్ననే విమర్శించి సంర్తుఁడు "నీకు ప్రశ్న వేయుట కూడ తెలియలేదు" అని నిరూపించెను. ఆవిమర్శకు భార్గవుఁడు విభ్రాంతుఁడయ్యెను. అప్పుడు భార్గవుఁడు "స్తబ్ధవాగ్బుద్ధి పౌరుషుఁ" డయ్యె నట. అఁనగా ఆయనయందు వాక్కు యొక్క బుద్ధియొక్క పౌరుషము స్తంభించె నని యర్థము. పురుషుని యొక్క ఉత్సహము, పౌరుషము, నేను చక్కఁగా మాటాడఁగల ననుకొనుట వాక్పౌరుషము. నేను బుద్ధిశాలి ననుకొనుట బుద్ధి పౌరుషము. ఈరెండును స్తంభితము లయ్యె ననఁగా వానికి సంబంధించిన యభిమానము భంగపడె నన్నమాట. ఇది యాయనకు రెండవ పరాజయము. అందువలననే ఆయన సిగ్గుపడి ప్రణమిల్లి. "అకల్మషుఁడనై శిష్యుఁడనై యున్న నాకు దయయుంచి బోధింపుము" (బోధనీయో పై శిష్యభూత మకల్మషమ్) అని సంవర్తుని ప్రార్థించెను. నేను శిష్యుఁడ నైతి నని చెప్పిన చాలదా? అకల్మషుఁడనై శిష్యుఁడ నైతినని ఏల చెప్పవలె? ఆక్షణమువఱకు పరశురాముఁడు వాక్కు యొక్క బుద్ధియొక్క పౌరుషము నవలంబించి సంవర్తుని పరీక్షింపఁబూనుకొని యుండెను. ఆయభిమానమే కల్మషము. అది యిప్పుడు నశించినది. అభిమానరాహిత్యమువలన ఆయన అకల్మషుఁ డయ్యెను. అనఁగా ఆయన, "అయ్యా! నీవు మహాత్ముఁడవు. నేను అల్పుఁడనే. నిన్ను పరీక్షింపఁబూని నందులకు మన్నింపుము. శిష్యునిగా స్వీకరింపుము" అని సంవర్తుని ప్రార్థించె నన్నమాట. ఇట్టి శిష్యత్వము ఏర్పడిననే తప్ప పెద్దలు తత్త్వమును బోధింపరు. అర్జునుని విషయమున కూడ "నేను నీకు శిష్యుఁడను. నిన్నుశరణము పొందియున్న నన్ను శాసింపుము" అని (శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రసన్నమ్) అతఁడు శరణాగతుఁడైనప్పుడే శ్రీకృష్ణుఁడు బోధింపఁబూనుకొనుట గమనింపఁదగియున్నది.

ఇంతే కాదు. దత్తాత్రేయుని ఆశ్రమింపుమని చెప్పుచు సంవర్తుడు, "కైతవములేని బుద్ధితో దృఢమైన భక్తితో ఆయనను ఆరాధింపుము" అని భార్గవునకు బోధించుట గమనింపఁ దగియున్నది. కితవుఁ డనఁగా జూదరి. జూదరిచేయు వంచనము కైతవము. వంచనములేని బుద్ధితో గురువునారాధింపు మని చెప్పవలయునా? దత్తాత్రేయుఁడు కార్తవీర్యునకు గురువు. ఆయన ఆశిష్యునియందు వాత్సల్యము కలిగియుండుట సహజము. అట్టియెడల ఆతనినే గాక, ఆతని కుమారులనే గాక సకలక్షత్రియ సంహారము గావించిన తన్ను ఆయన చిత్తశుద్ధితో శిష్యునిగా స్వీకరించునా అను సందేహము పరశురామునకు కలుగవచ్చును. అట్టిసందేహముతో ఆయనను సమీపించి మాటిమాటికి ఆయన తనయందు ప్రసన్నుఁడై యున్నాఁడా లేడా అని గమనించుచుండుట అనుచితము. అది యించుమించుగా కైతవమేయగును. కావున అట్టిసందేహములు ఏమియు లేకుండ నిస్సంకోచముగా ఆయనను శరణుపొంది ఆరాధింపు మని సంవర్తుఁడు బోధించెను. అనఁగా సంవర్తుఁడు భార్గవుని సరియైన శిష్యునిగా రూపొందించి తగిన గురువునొద్దకు పంపించినాఁడన్నమాట.

ఈసందర్భమున సంవర్తుండు తన్ను పరీక్షించినందులకు పరుశురాముని మందలింపకుండుట గమనింపఁ దగియున్నది. మఱి శిష్యుడు గురువును పరీక్షింప వచ్చునా? తండ్రి మొదలగు పెద్దలు మనలను గురువలయొద్ద అప్పగించునప్పుడు వారిని పరీక్షింపఁబూనుట తప్పు. అట్లు కాక మనమే స్వతంత్రించి యొకనూతన వ్యక్తిని

మహాత్ముఁడనుకొని గురువునుగా ఆరాధింపఁ బూనుకొనునప్పుడు మాత్రము జాగరూకతతో వ్యవహరింపవలసినదే. లోకమున మహాత్ములుగా గోచరించువారందఱు యథార్థముగా మహనీయులు కాకపోవచ్చును. అవధూతలవిషయమున పరీక్ష ఆవశ్యకము. వారు బాలురవలె, ఉన్మత్తులవలె పిశాచములవె నుందురు. వారు బాలురు ఉన్మత్తులు పిశాచములు కారు. కాని వారి యందు బాలురయొక్కదిగంబరత్వము, ఉన్నమత్తులయొక్క వ్యవహారధర్మశూన్యత్వము. పిశాచములయొక్క భయంకరత్వము గోచరించుచుండును. ఈలక్షణములను చూచి ఎవనినైనను అవధూత యని భ్రమించి వాని నాశ్రయించినచో పతనము సంభవింప వచ్చును. కావుననే శ్రుతి కూడ, "తత్త్వ విజ్ఞానముకొఱకు శ్రోత్రియుఁడైన బ్రహ్మనిష్ఠుఁడైన గురువునొద్దకే పోవలయును" అని విధించుచున్నది. కావున నూతనవ్యక్తులను గురువులనుగా ఆశ్రయింపఁదలఁచుకొన్నప్పుడు వారు తత్త్వజ్ఞులగుదురో కాదో తెలిసికొనవలసిన యావశ్యకత ఎంతయేని కలదు. కొల్లాయిగట్టినవా రందఱు కోవిదులు కారు. కాషాయమును వేసినవారందఱు జ్ఞానులు కారు. అందువలన పరీక్ష యావశ్యకమే. కావుననే దత్తా త్రేయుఁడు పరశురామునకు క్రొత్తవాఁడైనప్పటికి ఆయనను పరీక్షింప నక్కఱలేదని సంవర్తుఁడు హెచ్చరిక గావించి పంపినాఁడు.

## దత్తాత్రేయ సందర్శనము

పరశురాముఁడు దత్తాత్రేయుని సందర్శించుటకై బయలుదేరి మార్గమధ్యమున లోకవ్యవహారమునుగూర్చి ఆలోచించుచు ఇట్లనుకొనెను. "అయ్యో! నేను ఇంతవఱకును దేనినిగూర్చి ఆలోచింపవలయునో ఆముఖ్యవిషయమునుగూర్చి ఆలోచింపకుంటిని. ప్రవాహమునఁబడి కొట్టుకొనిపోవుచున్న వానివలె ఎటుపోవుచున్నానో ఎందులకు పోవుచున్నానో తెలియకయే అందఱితోపాటు నేనును వ్యవహారము చేయుచున్నాను. గ్రుడ్డివాని వెంటఁబోవు గ్రుడ్డివారివలె జనులందఱును ఒకరిని జూచి మఱియొకరుగా వ్యవహారములలో మునిఁగి పోవుచున్నారు. తాముచేయుచున్నపనికి పర్యవసానము ఎట్లుండునో తెలిసి కొనకయే జనులు వ్యవహరించుచున్నారు. ఎవనికైన ఒకనికి ఏదో కొంచెము ఫలము దైవికముగా సంభవించుట చూచి తమకును అట్టిఫలమే అంతకన్నను అధికముగాలభించునను పేరాసతో శక్తికి మించిన పనులకుపూనుకొని ఆపదలను కూడ పొందుచున్నారు. ఇది యంతయు ఎరను చూచి దాని కొఱకు గాలమున చిక్కుకొనుచున్న చేపయొక్క వర్తనమువలెనే యున్నది. అట్లుకాక యీదిక్కు మాలిన సంసారమునందు సుఖ మేమున్నది?

దేవతలనుండి క్రిమికీటకములవఱకు అందఱును సుఖము పొందవలయు ననియే మిగుల పూనికతో వ్యవహరించుచున్నారు. నాలుక వలన కలుగురుచి మైధునము వలన సుఖము క్రిమికీటకములతో సమానముగానే త్రిలోకాధిపతికిని కలుగుచున్నది. భౌతికమైన యీదేహము కొఱకే సర్వము కోరఁబడుచున్నది. ఇది మలమూత్రమాంసాది పూర్ణమై కుత్సితమై దుఃఖమూలమై యున్నది. దీనిమూలముననే పుత్రమిత్రకళత్రరూపమైన సంసార మేర్పడుచున్నది. ఇట్టిదేహమునే తన్నుగా భావించుచు దీనికొఱకై పామరుఁడు పండితుఁడు కూడ నింద్యకృత్యమునకు పాల్పడుచున్నాఁడు. దేహము రోగగ్రస్తమై ముసలితనమునందు కృశించి హేయ మగుచుండుట ఇతరులయందు చూచుచుండియు ప్రతివ్యక్తి "నాశరీరము మాత్రము అట్టిబాధలకు లోను గాదు" అన్నట్లు వ్యవహరించుచున్నాఁడు. ఈకుత్సితమైన దేహమునందే స్త్రీలు పురుషులు సౌందర్యమును భావించుచు భోగలంపటు లగుచున్నారు. నాలుకయొక్క రుచికి మైధునసుఖమునకు లోఁబడి మానవులు ఎల్లప్పుడు దాపుననే యుండు మృత్యువును గమనింపకున్నారు.

తమజీవితము ఎంత అల్పమైనచో గుర్తింపక ఈమానవులు దీర్ఘకాలమున ఎప్పటికో లభించునట్టి ఫలములను కోరి నిరంతరము పాటుపడుచున్నారు. స్వార్థముకొఱకై వీరు ఇతరులను చంపుటకు కూడ వెనుదీయరు. ఇట్లు కామక్రోధపరాయణులై వీరు పొందు సుఖమేమి? అల్పసుఖమునకై వీరు అధికదుఃఖమునే పొందుచున్నారు. వీరి యాశలకు అంత మెక్కడ? ఆశ యున్నంతవఱకు సుఖ మెక్కడ? మనస్సు కామహత మగుటయే మహాదుఃఖము. సర్వసంపదలతో సామ్రాజ్యము లభించినవానికైనను సుఖ మెక్కడిది? వానిని ఇంకను పెంపొందించుకోవలె

నసునాశవలన, శత్రువులు హరింతు రేమో అనుభయమువలన సమ్రాట్టులకు కూడ ఎల్లప్పుడు దుఃఖమే కలుగుచున్నది. ఎంతో కష్టపడి మనుష్యులు సంపదలను పొందుచున్నారు. వానికొఱకే మిత్రులు శత్రువు లగుచున్నారు; పుత్రులు తండ్రులపై తిరుగఁబడుచున్నారు; ప్రియురాలు ప్రియునకు ద్రోహ మొనర్చుచున్నది. భార్యాపుత్రులు కూడ ధనవంతునకు మృత్యువును కోరుచున్నారు. అట్లు మృత్యువులో సమానమైన ధనమును కోరుచు మానవులు కుటుంబమును తమచుట్టు గూడువలె అల్లు కొని అందులో చిక్కువడి వెలుపలికి రాలేక తన్ను కొనుచున్నారు.

ఎవఁడు ఏకుటుంబముతో ఎట్టి సంబంధమును ఎంతకాలము కలిగియున్నను ఒకప్పటికి వియోగము పొందక తప్పదు. కాని దారాపుత్రులతో సంబంధము అత్యంతస్థిర మైనట్లుగా స్నేహమును పెంపొందించుకొని మనుష్యులు తుదకు మహాదుఃఖమును పొందుచున్నారు. ధనములు జనములు మొదలుగా సర్వము అత్యంతబలిష్ఠమైన మృత్యువుచేత ఆక్రమింపఁబడి యున్నది కావున మనశ్శాంతిని కోరునట్టి బుద్ధిమంతుఁడెవఁడును వానియందు ఆసక్తి నొందరాదు. ఏది ప్రాప్తించినచో భయమే యుండదో అట్టిపదమునే మతిమంతుఁడు కోరుకొనవలె. కావున అభయము నొసంగు విజ్ఞానముకొఱకు నేను మహనీయుఁడైన దత్తాత్రేయునే ఆశ్రయించెదను."

ఇట్లు ఆలోచించుకొనుచు పరశురాముఁడు గంధమాదనమునకు పోయి అచ్చట ఒక పర్ణశాలను చూచి యదియే దత్తాత్రేయూని నివాసస్థానమై యుండు నని దానిసమీపమునకు పోయెను. అక్కడ ద్వారమునందు ఒకబ్రాహ్మణుఁడు ధ్యాననిమగ్నుఁడై యుండెను. ఆయనకు భంగము కలుగకుండ భార్గవుఁడు కొంతసేపు దూరమున నిలిచి, ఆయన కనులు తెఱచినతరువాత సమీపించి నమస్కరించి, "దత్తాత్రేయగురువర్యునియాశ్రమ మెక్కడ నున్నదో దయతో చెప్పుము" అని అడిగెను.ఆయన "శ్రీదత్త గురువులయనుగ్రహముచేత-నీవు వచ్చినపని నాకు తెలియును. వారు లోపలనే యున్నారు. పొమ్ము" అని పలికెను.

అంతట పరశురాముఁడు లోనికిపోయి మహాయోగులచే పరివృతుఁడై యున్నదత్తాత్రేయుని చూచి సాష్టాంగముగ ప్రణమిల్లి లేచి కృతాంజలియై కొంచెము దూరమున నిలచి ఆయనను పరికింపఁజొచ్చెను. ఆయన పరమసుందరమైన రూపముతో సర్వలోకమనో హరుఁడై యుండెను. లక్ష్మీసమానురాలైన యొకసుందరి ఆయనను కౌఁగిలించుకొని యుండెను. ఆయన యెదుట మద్యపూర్ణమైనకుంభ ముండెను. ఆదృశ్యమును చూచి పరశురాముఁడు విస్మయము నొంది, "ఇది చిత్రముగా నున్నది. వీరందఱు పరమసాత్త్వికులుగా నున్నారు. ఈయన ఏమో యిట్లున్నాఁడు. ఇది తనస్వరూపమును మఱుఁగు పఱచుటకై ఈమహాయోగి కల్పించిన దృశ్యమైన యుండును. మాహానుభావుఁడైన సంవర్తుఁడు యోగీశ్వరుఁడు కానివానిని గురువునుగా నిర్దేశింపఁడు. ఏమయినను ఈయనయే నాకు గురువు" అని నిశ్చయించుకొని నిలిచియుండెను.

అప్పుడు దత్తాత్రేయుఁడు పరసురాముని చూచి ఇట్లనెను "ధార్గవా! నీకు స్వాగతము. కుశలముగా నున్నావా? స్వాధ్యాయము తపస్సు నిర్విఘ్నముగా సాగుచున్నావా? నీవు తపస్సుచేత పుణ్యలోకములను జయించితివి. భార్గవవంశమునకు ప్రతిష్ఠ కలిగించితివి. నీవు బ్రహ్మచర్యవ్రతనిష్ఠుఁడవు. ధన్యుఁడవు. నిజముగా ఇంద్రియములను జయించుటయే పురుషార్థము. వానిని జయింపలేనివారు బ్రతికి యుండియు చచ్చినవారితో సమానమే. పూర్వము నేను వైరాగ్యము వలన కర్మానుష్ఠానమును వదలితిని. కాని జిహ్వాచాపల్యమును స్త్రీ భోగమును వదలఁజాలనైతిని. అయ్యా! ఆత్మశత్రువులలో ఈరెండే బలిష్ఠములైనవి. వీనిచేతనే ఎంతోమంది పతనమును పొందినారు ఎవఁడు వీనిని జయించునో వాఁడు సర్వమును జయించినట్లే. బుద్ధి భ్రంశమును కలిగించు కల్లును వారయువతిని నేను వదలకుండుటను చూచి చాలమంది సజ్జనులు నాసహవాసమును వీడి తొలగిపోయినారు ఇట్టి నాయొద్దకు నీవేల వచ్చితివి? నిజము చెప్పుము."

అప్పుడు పరశురాముఁడు సంవర్తుఁడు చెప్పిన విషయమును స్మరించి, "ఈయన నన్ను పరీక్షించుటకై ఇట్లు మాటాడుచున్నాఁడు" అని గ్రహించి వినయముతో ఇట్లనెను. "భగవానుండా! నేను శరణా గతుఁడును. నన్ను నీవుశంకింప వలదు. నేను నీమహిమ నెఱుంగుదును. ఆత్మాజ్ఞానము నొసంగుగురువే సాక్షాత్తుగా శివుఁడు. ఇతర

గురువులతో నాకు పనిలేదు. సంసారదావాలనముచేత దహింపఁబడుచున్న నాకు దయతో చిత్త శాంతిని అనుగ్రహింపుము."

దత్తాత్రేయుఁడు ప్రసన్నుఁడై ఇట్లనెను. "వత్సా! భార్గవా! ఆత్మపదమును తెలిసికోవలయు ననునీతలంపు చాల మెచ్చఁదగినది. లోకములో జనులందఱు సుఖభోగమునుగూర్చియే ఆలోచింతురు. ఆత్మసంగతి ఎవరికి కావలసియున్నది? సరే! ఇంతకును నీకు ఏమి కావలయును?" పరశురాముఁడు, "అయ్యా! ఈలోకమున మానవుల నుండి దేవతలవఱకు ఎల్లరును ఆశాజ్వాలలతో తపించుచున్నారు. నేను తమయొక్క అనుగ్రహముచేత ఆతాపమునుండి విముక్తుఁడనై గంగాప్రవాహమున చల్లగా హాయిగా ఓలలాడు మదగజమువలె సుఖమును పొందఁగోరుచున్నాను. అట్టి శాంతి సుఖము దేనివలన కలుగునో ఆవిజ్ఞానమును నాకు బోధింపుఁడు" అని పలికెను.

ఆమాటలకు సంతోషించి దత్తాత్రేయుఁడిట్లు చెప్పను. "భార్గవా! నీవు శ్రేయస్సునకు మూలమైనదానినే కోరుచున్నావు. పరమేశ్వరియొక్క కృప నీయందు ప్రసరించినది. లేకున్నచో నీకిట్టి తలంపు కలుగదు. ఇంక వినుము. పరమశివుఁడే సకల ప్రాణులకు ఆత్మ. ఆపరమాత్మను గుర్తించినచో సంసారమోహము నశించి తాపము పోయి శాంతిసుఖము కలుగును. ఆజ్ఞానము పరమేశ్వరి యొక్క కృపవలన తప్ప మఱియొక విధముగా కలుగదు. ఆమెను భక్తితో సేవించినచో ఆమెకృప కలుగును. ఆమెయందు గాఢమైన భక్తి కలుగవలయు నన్నచో ఆమె మాహాత్మ్యమునువినుచు కీర్తించు చుండవలయును. ఆశ్రద్ధవలననే నీయభీష్టము సిద్ధించును"

పరశురాముఁడిట్లనెను. "అయ్యా! తమరు చెప్పుచున్నయాత్రి పురాదేవి ఎవరు? ఆమె ఎట్లుండున? ఆమె స్వభావమెట్టిది? ఆమె దేనిని ఆశ్రయించి యుండును? ఇది యంతయు నాకు వివరముగా చెప్పుము"

అప్పుడు దత్తాత్రేయుఁడు ఆపరమేశ్వరిని స్మరించి నమస్కరించి ఇట్లు చెప్పెను. "రామా! ఆమె యిట్టిదని చెప్పుటకు ఎవరికిని శక్యము కాదు. శాస్త్రములు మొదలగు ప్రమాణములచేత సర్వమును తెలిసికొనుచున్న చిచ్ఛక్తియే ఆమె. జీవులయందు స్ఫురించుచున్న "నేను" అను స్ఫురణచేతనే ఆమె గుర్తింపఁదగియున్నది. ఒకప్పుడు బ్రహ్మదేవుఁడు మహావిష్ణువును సేవించుచుండగా ఇంద్రాదిదేవతలు కలహించుకొనుచు వచ్చి, "మాలో అధికుఁడెవరో నిశ్చయింపు" మని విష్ణువు నడిగిరి. వారు తనమాటను విశ్వసింప రని ఆయన శివుని స్మరించెను. శివుఁడు సాక్షాత్కరించి ఆవివాదమును పరిష్కరించుటకై పరమేశ్వరిని ప్రార్థించెను. ఆమె భయంకరమైన శబ్దముతో కోటిసూర్యసమానకాంతితో సాక్షాత్కరించెను. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ఆమెకు ప్రణమిల్లి బహువిధముల స్తుతించిరి. దేవత లందఱుమూర్ఛిల్లిరి. ఆమె వారి ననుగ్రహించుటకై లోకోత్తరమైన సౌందర్యముతో త్రిపురసుందరీరూపమును పొంది ఆ దేవతలపై కరుణావలోకనమును ప్రసరింపఁజేసెను. అప్పుడు వారందఱు నిద్రనుండి మేల్కొన్నట్లుగా లేచిరి.

ఇంద్రుఁడు "ఆమె ఎవరో కనుఁగొని రండు" అని అగ్ని మొదలగువారిని ఒక్కొక్కరిని పంపెను. అగ్ని ఆమెయొద్దకు పోయి "ఓకుమారి! ఎవరు నీవు? ఏమి నీశక్తి?" అని గద్దించెను. ఆమె ఒకగడ్డిపఱకును చూపి, "చేతనైనచో దీనిని కాల్చుము" అని పలికెను. అగ్ని దానిని కొంచెము కూడ కాల్చలేక సిగ్గుపడి తిరిగివచ్చెను. వాయువు కూడ దానిని కదలింపలేక మరలివచ్చెను. ఇట్లు అనేకులు భంగపడిరి. తుదకు ఇంద్రుడు వజ్రాయుధమును గైకొని బయలుదేరెను. ఆమె వానివంక చిఱునవ్వుతో చూచెను. తక్షణమే ఇంద్రుడు స్తంభించి పోయెను. దేవత లందఱు భయపడి పెద్దగా ఆక్రోశించిరి. అప్పుడు ఇంద్రుఁడు భయపడి బృహస్పతినిస్మరించెను బృహస్పతి వచ్చి ఆమెను స్తవమొనరించెను. ఆమె ప్రసన్నురాలై ఇంద్రునకు స్వస్థతను కలిగించి దేవతలస్తోత్రములకు సంతోషించి ఇట్లు చెప్పెను. "మీరు గర్వమును వీడుఁడు. మీరు ఎవ్వరును అధికులు కారు. ఈజగత్తు అంతయు నాశక్తివలననే జన్మస్థితిలయములను పొందుచున్నది. నేనే బ్రహ్మవిష్ణుమహేశ్వరులను సృష్టించి జగత్కార్యమునందు నియోగించితిని. కావున మీరందఱు ఆత్రిమూర్తులకు లోఁబడి నాశాసనము ననుసరించి భక్తితో జగత్తుయొక్క కార్యమును నిర్వహింపుఁడు."

ఇట్లు పలికి ఆపరమేశ్వరి అంతర్ధానము నొందెను. ఇంద్రాదులు త్రిమూర్తులకు ప్రణమిల్లి ఆమెను స్తుతించుచు తమస్థానములకు పోయిరి. భార్గవా! ఆమె ఈవిధముగా దేవతలకు కలిగినమోహమును నశింపఁజేసెను."

ఇచ్చటికి వచ్చునప్పుడు పరశురాముఁడు మార్గమున లోకమును గూర్చి విమర్శించుకొనుచు జిహ్వాచాపల్యము స్త్రీసుఖము అనునవియే పతనకారణము లని తలంచుచుండెను. ఆదోషములకే తాను లోఁబడి యున్నట్లుగా దత్తాత్రేయుఁడు పరశురామునకు గోచిరంచుటయే కాక పరుశురామునియొక్క ఇంద్రియజయమును పొగడి తాను ఇంద్రియములను జయింపలేదని చెప్పెను. అయినను పరసురామునియందు "నేను ఇంద్రియములను జయించితిని" అనునభిమానము పైకి రాలేదు. అనఁగా అప్పటికి ఆయనయందు వీరత్వాభిమానముతోపాటు "నేను బ్రహ్మచర్యవ్రతధుర్యుఁడను; చాల పవిత్రుఁడను" అనునభిమానము కూడ తొలఁగిపోయిన దన్నమాట. అందువలననే దత్తాత్రేయుని మరల పరీక్షింపబూనుకొనక సంవర్తునిమాటపై పూర్ణవిశ్వాస ముంచి దత్తాత్రేయునకు శరణాగతి గావించెను. అట్లు శరణాగతుఁడై శిష్యుఁడైన తరువాతనే పరశురామునకు దత్తగురువు బోధింప నారంభించెను.

దత్తాత్రేయుఁడు కుశలప్రశ్నలు వేయునప్పుడు "స్వాధ్యాయము తపస్సు నిర్విఘ్నముగా సాగుచున్నవా?" అని ప్రశ్నించుగ గమనింపఁదగియున్నది. యథార్థముగా తత్త్వము నెఱింగినవారు సంధ్యావందనాది నిత్యకర్మలను ఆచారముల నిరసింపరు. అవి చిత్త శుద్ధికి సాధనములు, అందువలన తమయొద్దకు ఎవరైనను తత్త్వము తెలిసికొనుటకే వచ్చినను, మహాత్ములు, "అనుష్ఠానములు, ఆచారములు ముఖ్యము కాదు. విచారమే ముఖ్యము" అని తత్క్షణమే వారికి జ్ఞానబోధ చేయుటకు పూనుకొనరు. అంతేకాదు. ఉపనిషత్తులలో జిజ్ఞానువులు, మహర్షులను తత్త్వమును తెలుపుఁడని ప్రార్థించినపుడు ఆమహర్షులు "ఇచట బ్రహ్మచర్యవ్రతము నాచరించుచు కొంతకాలముండుఁడు. తరువాత మీప్రశ్నలకు సమాధానములు చెప్పఁబడును" అని నియమములను విధించినసందర్భములును అనేకములు కలవు, కావున శిష్యులను వారి వర్ణములకు ఆశ్రమములకు తగినయాచారము లందు ప్రవర్తింపఁజేయుట సరియైనయాచార్యునకు ముఖ్యలక్షణము.

బ్రహ్మము మహాభూతముగా గోచరించి అగ్నికి వాయువునకు గర్వభంగ మొనర్చుట కేనోపనిషత్తునందు కలదు. ఇంద్రుడు సమీపించినపుడు ఆభూతము అదృశ్యమైన కన్యరూపమున హైమవతిగా గోచరించి 'అభూతము బ్రహ్మ' అని చెప్పెను. ఆకథయే యిందువిశే షముగా వర్ణింపఁబడనది.

# సృష్టిక్రమమునుగూర్చి భార్గవుని సందేహములు

పరశురాముఁడు అద్భుతమైన కుమారీ దేవీచరిత్రమును వినివిస్మయము నొంది ప్రాంజలియై దత్తాత్రేయునితో నిట్లనెను. "భగవానుఁడా! మీరుచెప్పిన యీకథ చాల ఆశ్చర్యకరముగా నున్నది, మహోన్నతమైన త్రిపురాదేవియొక్క మహిమను నేనింతకుపూర్వము వినలేదు. బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు జననియై వారిచే పూజింపఁబడి స్తుతింపఁబడిన దన్నచో ఆమె అందఱకన్నను మిన్న యని స్పష్టమగుచున్నది. మీచేత అనుగ్రహింపఁబడి నేను ధన్యుఁడ నైతిని. ఈకథామృతమును ఎంత త్రావుచున్నను నాకు దప్పి తీఱుట లేదు. కావున శ్రీత్రిపురాంబాదేవియొక్క లీలలను వైభవమును ఇంకను వినఁగోరుచున్నాను. కృపతో చెప్పుడు."

దత్తాత్రేయుఁడు ఇట్లు చెప్పెను. "రామా! వినుము. త్రిపుర అని చెప్పఁబడుచున్న యాదేవికి పరమాకాశమే రూపము. ఆమె యందే ఈవిశ్వ మంతయు వివిధపదార్థతములుగా విభజింపఁబడి యున్నది. చిదానందము అద్వయమును అయినయాత్మయే ఆమెకు రూపము. ఆమె వాక్కులకు ఇంద్రియములకు మనస్సునకు అందక వానికి సాక్షిణియై సకలమునకు ఆధారమై యున్నది. భక్తులయందలి దయచేత ఆమె ఎన్నో రూపములను దాల్చును పెక్కు లీలలను ప్రకటించుచున్నది. వాని నన్నింటిని లెక్కించి చెప్పుటకు ఆదిశేషునకు కూడ అసాధ్యము. కావున ఆమెయొక్క ప్రధానరూపములను కొన్నింటిని చెప్పెదను. కుమారి త్రిరూప లక్ష్మి సరస్వతి గౌరి కాళి చండిక దుర్గ కాత్యాయని లలిత

అనురూపములు పేర్కొనఁబడుచున్నవి. వీనిలో లలిత శ్రీమహారాజ్ఞి; ఆరూపము పూర్ణతమము. ఇందు కుమారీచరిత్రమును చెప్పితిని. ఇంక తక్కిన చరిత్రములను క్రమముగా చెప్పెదను.

కుమారిదేవియే మూఁడు రూపములతో మూర్తీ భవించి త్రిరూపగా ఆవిర్భవించినది. పూర్వముసృష్టియొక్క అరంభమునందు త్రిపురాదేవి చైతన్యమే రూపముగా ప్రకాశించుచుండెను. అప్పుడు ఆమె ఒక్కతయే యుండెను. ఇతర మేదియు లేదు. అట్లున్న యాశక్తి తన స్వాతంత్ర్యముచేత సృష్టిచేయుటకు ఉన్ముఖురాలు కాఁగానే ఇచ్ఛ కలిగెను. దానిచేతజ్ఞానము, దానివలన క్రియ సంభవించెను. ఆమె వానివైపు చూచినంతనే వానినుండి ఇచ్ఛామయుఁడై ఈశ్వరుఁడు, జ్ఞానమయుఁడై విష్ణువు, క్రియాత్మకుఁడై బ్రహ్మ జనించిరి. పుట్టుకచేతనే మహావీర్యులు సత్యసంకల్పులు అయినవారు చిత్తమును ఇంద్రియములను క్రియలను నియమించుకొని గొప్ప తపస్సు చేసిరి. అప్పుడు రాత్రి పగలు సూర్యుఁడు నక్షత్రములు భూమి జలము తేజస్సు వాయువు దిక్కులు నిమేషము యుగము మొదలుగా ఏదియు లేదు. అంతయు అకాశమయముగా నుండెను. స్వయముగా ప్రకాశించుచున్న యాముగ్గురును ఆకాశమే ఆశ్రయముగా మహాతపస్సుచేత సమాధియందు నిశ్చలముగానుండిరి. అనేకయుగముల కాలముగడచిన తరువాత ఆదేవి బ్రహ్మతో ఇట్లనెను "వత్సా! లెమ్ము, నీవు తపస్సు చేత ఏమి చేయఁగోరుచున్నావు? భువనములతో కూడ లోకములను సృష్టింపుము. అందులకే నిన్ను పుట్టించితిని."

ఇట్లు పరాశక్తిచే ఆదేశింపఁబడిన బ్రహ్మ జగత్తును సృష్టింపఁదలఁచి, "ఎక్కడ సృజింతును?" అని చింతించుచు చుట్టును చూచెను. అప్పుడాయనకు సర్వశూన్యము అమలము అయిన మహాకాశము కన్పించెను. దానికి ఆదియు అంతము గోచరింపలేదు "నాకు సృష్టికి అవకాశ మున్నది"అని తలంచి ఆయన శరీరమును కొంచెము కదలించి స్పర్శను పొందెను. ఆయనయొక్క అంగచలనమువలన కలిగిన స్పర్శవలననే వాయువు విజృంభించెను. వాయువుయొక్క వేగమువలన వేడిమి పుట్టెను. ఆయన చూచుచుండఁగా ఆవేడిమి అగ్నిగా రూపొందెను. పిమ్మట అగ్నినుండి చల్లనిస్పర్శనతో రసవంతమైన జలము ఆవిర్భవించెను. దానియందు గంధముతో (వాసనతో) పృథివి కన్పించెను, అది కఠనమై దేనినైనను ధరించుటకు సమర్థమై యుండుట చూచి బ్రహ్మ 'దీనియందు నానావిధములైన శరీరములతో విచిత్రమాన భువనమును సృష్టింతును. ఇది నాసృష్టిని ధరింపఁగలదు' అని తలంచి దానియందు సృష్టిని గావించెను.

ఇది విని పరశురాముఁడు సంశయము నొంది దత్తాత్రేయునితో ఇట్లనెను "భగవానుఁడా! నీవు చెప్పునది చాల విచిత్రముగ నున్నది. అందువలన నాకు ఏదియు నిశ్చితముగా తెలియుట లేదు. బ్రహ్మ యొక్క చూపువలన సిద్ధములై యున్నట్లుగా ఆకాశాదిభూతములు పైకి వచ్చినవి. అచ్చట మఱియొక కర్త ఎవఁడును లేఁడు. మఱి ఆ భూతములు కర్త లేకయే ఉద్భవించె నని తోఁచుచున్నది. అవి అంతకు పూర్వమే సిద్ధములై యున్నచో, అవి యున్నట్లు ఆసృష్టికర్తకు ఏల తెలియలేదు? దేవి బ్రహ్మతో మాటాడినది! పంచ భూతములు పుట్టకపూర్వమే శబ్ద మెట్లు వచ్చినది? అట్లే భూతములు పుట్టకముందే బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు శరీరము లెట్లు కటిగినవి? ఈసంశయములను తీర్చుట మీకు తప్ప ఇతరునకు ఎవనికి సాధ్యము కాదు. దయాళువులైన తమవంటి గురువులు శిష్యుఁడు అడుగకున్నను చెప్పుదురు."

దత్తాత్రేయుఁడు ప్రశ్నకు సంతోషించి మధురముగా నిట్లనెను. "రామా! నీవు బుద్ధిమంతులలో శ్రేష్ఠుడవు. నీప్రశ్న చాల నిపుణమైనది. అది మూఁడు విధములుగ నున్నది. దానికి సమాధానము తగిన సమయమున చెప్పెదను. ఇప్పుడే దానిని తెలిసికొనుట శక్యముకాదు. అప్పటివఱకు స్థిరముగా వేచియుండుము. తగని సమయమున శిష్యనకు చెప్పుట లోకజ్ఞానములేని గురువయొక్క లక్షణము. అట్లు చెప్పుటవలన విరుద్ధమైన ఫలము ఏర్పుడును. సరిగా గ్రహింపఁజాలనిదశయందు విన్నశిష్యుఁడు చాపలు తయారుచేయువానివలె నశించును. "భార్గవుఁడు ఆమాట విని. "అయ్యా! ఆచాపలవాఁడు ఎట్టివాఁడు? వానికేమి జరిగినది? ఏకారణముచేత వాఁడు నశించెనో చెప్పుఁడు" అని ప్రార్థించెను.

ఆయన ఇట్లు చెప్పెను. "కళింగదేశమున కువలుండు అను చాపలల్లువాఁడుండెను. వాఁడు ఆవృత్తి యందు చాల నిపుణుఁడు. వాఁడొకప్పుడు చిత్రవిచిత్రములైన చాపలను అల్లి రాజునకు సమర్పించెను. ఆయన వానియొక్క నైపుణ్యమును మెచ్చి చాలధనము నొసంగెను. సంపన్నుఁడైన యాకటకారుఁడు పురాణములయందు బ్రహ్మణప్రశంసను

విని బ్రహ్మణులను ఆరాధింప మొదలిడెను. ఒకప్పుడు డితండు పుణ్యకథలు వినుచుండగా సందర్భవశమున అధ్యాత్మప్రసంగము వచ్చెను. ఆ ప్రసంగము నాతఁడు మరల మరల వినెను. అది మిగుల సూక్ష్మమగుటచే అతనికి ఏమియు తెలియలేదు. తరువాత ఒకచోట ఏకాంతమునందు ఆప్తుఁడైన యాపౌరాణికుఁడు కన్పింపఁగా కువలుడు "స్వామీ! తమరు చెప్పిన యధ్యాత్మవిషయము చాల గంభీరముగ నున్నది. మరల విన్నను నా కది బుద్ధియందు నిలుచుట లేదు. కావున కరుణించి దానియొక్క సారమును సంగ్రహించి నేను సులభముగా గ్రహించుటకు వీలగునట్లుగా చెప్పుఁడు." అని ప్రార్థించెను ఆబ్రాహ్మణుఁడు ఇట్లు చెప్పెను. "కువల! అధ్యాత్మవిద్యయొక్క సారమును సంగ్రహముగా చెప్పుచున్నాను వినుము. మానవుఁడు ఇంద్రియవిషయములనుండి విముఖుఁడై శాంతుఁడై దృశ్యము నంతను దృక్కుగా గ్రహించుచు సర్వము సమ మని తెలిసికొనవలెను. పిదప వచ్చినదానినిత్యజింపక రానిదానిని కోరక ఎల్లప్పుడు సంతుష్టుఁడై సంగరహితుఁడై నిర్భయుఁడై సంచరింపవలయును."

ఆ మాటలు వినికువలుఁడు అజ్ఞానముచేత మోహితుఁడై వానియర్థమును సరిగా గ్రహింపలేకపోయెను. సర్వము సమ మనఁగా మనుష్యులందఱు సమానులే అని తలంచి కువలుఁడు బ్రాహ్మణులయందు భక్తిని వీడి దేవపూజలను పాపభయమును త్యజించి భోగముల ననుభవించుచు నాస్తికప్రాయుఁడై అధమగతి నొందెను. కావున భార్గవా! తగని సమయమున చేయుబోధ దోషమునకు త్రోవ తీయును."

బాలప్రియ

పరశురామునకు కలిగిన సందేహములు సమంజసములే. కావుననే దత్తాత్రేయుఁడు ప్రీతి నొందెను. శిష్యునకు సందేహములు కలిగిన వన్నచో అతఁడు గురువు చెప్పిన విషయమును శ్రద్ధతో వినుచు అర్థము చేసికొనుటకు ప్రయత్నించుచున్నాఁడన్నమాట పరశురాముని ప్రశ్న మూఁడువిధములుగా నున్నది. బ్రహ్మకు పూర్వము మఱియొక సృష్టికర్త లేఁడు. ఆయన సృష్టి చేయఁదలఁచుచున్నాఁడే కాని ఇంకను దేనిని సృష్టింపలేదు. అట్టియెడల ఆయనయొక్క వీక్షణమాత్రముననే భూతములు పైకి వచ్చె నన్నచో అవి యంతకు పూర్వమే సిద్ధములై యుండవలె. అవి కర్త లేకుండ ఎట్లు సిద్ధమైనవి? ఇది మొదటి సందేహము. ఆయన మొదట చుట్టును చూచినప్పుడు ఆకాశము సర్వశూన్యముగా గోచరించినది. సిద్ధములైన యీపంచభూతములు అప్పుడు ఆయనకు ఏల గోచరింప లేదు? ఇది రెండవ సందేహము. పంచభూతములు పుట్టుటకు పూర్వమే బ్రహ్మవిష్ణుమహేశ్వరులు పుట్టిరి. వారు చిత్తమును ఇంద్రియములను క్రియలను నియమించి తపస్సుచేసిరి. త్రిపురాదేవి సృష్టి చేయుమని బ్రహ్మతో చెప్పెను. బ్రహ్మతన శరీరమున కదలింపఁగా వాయువు విజృంభించెను. అప్పుడు వారికి భౌతికశరీరములు ఉండియుండవలె. లేకున్నచో వారు తపస్సు చేయుట, దావి చెప్పుట బ్రహ్మ వినుట, ఆయన తనదేహమున కదలించుట సంభవింపవు. శబ్దము ఆకాశ భూతమునకు గుణము. శరీరములు పంటచభూతములవలన ఏర్పడును. మఱి భూతములే పుట్టక పూర్వము భౌతికములైన శబ్దములు శరీరములు ఎట్లు పుట్టినవి? ఇది మూఁడవ సందేహము.

e పరశురాముఁడు మఱియొక ప్రశ్న కూడ అడిగియుండవచ్చును ఎందువలననో ఆయన అడుగలేదు. మొదట త్రిపురాదేవి ఒక్కతయే యున్నది. ఆమె రూపము చైతన్యము. అనఁగా చైతన్యము మాత్రమే యున్నది. చైతన్యములోనుండి ఇచ్ఛ ఎట్లు పుట్టినది? రెండవదియే లేనప్పుడు ఒక్కవస్తువులోనుండి ఇంకొకవస్తువు ఎట్లు పుట్టును? ఆమెయొక్క స్వాతంత్ర్యమువలన ఆమె నుండి ఇచ్ఛకలిగిన దని చెప్పఁబడినది. ఇద్దఱు ఉన్నప్పుడే ఒకఁడు స్వతంత్రుఁడు, మఱియొకఁడు పరతంత్రుఁడు కావచ్చును. రెండవదియే లేక చైతన్యము ఒక్కటియే యున్నప్పుడు దానికి స్వాతంత్ర్యము ఉండెననుటకు అర్థ మేమి?

ఈ ప్రశ్న లన్నియు సమంజసములే. వీని కన్నింటికిని దత్తాత్రేయుఁడు చెప్పినట్లుగా తగిన సమయమున అనఁగా ఆయన బోధింపఁబోవుచున్న తత్త్వజ్ఞానము కలిగినప్పుడు సమాధానములు సహజము గనే లభించును.

ఆకాలమున కువలునకు పౌరాణికుఁడు అధ్యాత్మవిషయమును బోధించుటవలన అతఁడు దానినిసరిగా గ్రహింపక పతన మొందెనని, కావున ఆకాలమున శిష్యునకు ఆధ్యాత్మతత్త్వము బోధింపరాదని దత్తాత్రేయుఁడు నిరూపించెను. కాని సంవర్తుఁడు ఈతత్త్వమునే ముందు భార్గవునకు చెప్పెను గదా. అది అప్పుడు పరశురామునకు బోధపడలేదు. అట్లు

ఆయన చెప్పవచ్చునా? ఈరెండు బోధలలో భేద మేమి? భేదము చాల కలదు. రెండింటికి సంబంధమే లేదు. సంవర్తుఁడు ఆరంభముననే "సంసారమునందు విరక్తుఁడవై గురువు నాశ్రయించి ఆయన చెప్పిన పద్ధతిలో త్రిపురాదేవి నాశ్రయించి ఆమె కృపావేశమువలన ఆత్మభావమును పొందుము" అని చెప్పెను. అట్లే చివరను కూడ "సంసారమునందు దోషమును భావించి వైరాగ్యమును పొందును. తరువాత సన్మార్గలక్షణము సంభవించును. నేను చెప్పిన యీసారమును ఎల్లప్పుడు అభ్యసించువాఁడు అచిరకాలముననే శుభ మార్గమును పొందును." అని చెప్పెను. నామాటలు విన్నంతనే నీకు జ్ఞానము సిద్ధించు నని ఆయన చెప్పలేదు. అంతే కాదు. గురువు నాశ్రయించి ఆయన ఉపదేశించు పద్ధతిలో త్రిపురాదేవిని ఆరాధించినచో జ్ఞానమును పొందఁగల వని ఆయన పరశురాముని గురువునొద్దకు పంపించెను. అంతేకాదు. తాను చెప్పిన యధ్యాత్మవిద్యాసారమును పరశురాముఁడు కువలునివలె అపార్థముగ గ్రహించుటకు అవకాశు లేకుండ, "మలినబుద్ధులకు ఇది గోచరము కాదు. గురుసేవ వలన తప్ప ఇది బోధపడదు. కావున వెంటనే గురువునొద్దకు పొమ్ము" అని దృఢముగ చెప్పెను. పరశురాముఁడు సొంతముగ తాను చెప్పిన ఆధ్యాత్మసారమును గ్రహించుటకు ఆయన అవకాశమే ఈయలేదు.

మఱి పౌరాణికుఁడు చేసినబోధ యిట్లున్నదా? కేవలము విరుద్ధమాగా నున్నది. కువలుఁడు, "నేను సులభముగా గ్రహించుటకు వీలగునట్లుగా అధ్యాత్మవిద్యాసారమును చెప్పుఁడు" అని ప్రార్థింపఁగా అపౌరాణికుఁడు అట్లే యని దానిని సంక్షేపముగాచెప్పి పంపించెను. అంతే కాని, "ఇది సంసారమార్గమందున్న మలినబుద్ధులకు గోచరింపదు. గురువు నాశ్రయించి ఆయన చెప్పిన పద్ధతిలో దేవతను ఉపాసించననే తప్ప చిత్త శుద్ధి కలుగదు. నేను సంక్షేపముగా చెప్పి నంతమాత్రమున నీకు బోధపడదు. గురువును ఆశ్రయించి దీనిని అభ్యసింపుము" అని ఆపౌరాణికుఁడు చెప్పలేదు. అందువలన కువలుఁడు ఆయన చెప్పినదానితో తనకు తోఁచినదే పరమార్థముగా గ్రహించి, అజ్ఞానము లేశ మైనను తొలఁగకుండుటచే దానిప్రభావము వలన సంసారమునందే మునిఁగిపోయెను.

శిష్యులవిషయమున ప్రాజ్ఞులై నగురువులు ఎంత శ్రద్ధవహింతురో సంవర్త దత్తాత్రేయులవలన మనము గ్రహింపవలసి యున్నది. ఇరువురును పరశురామునియందు వాత్సల్యమునే చూపిరి. ఆయన ప్రశ్నించి నప్పుడు మాత్రమే "ఇది నీకు ఇప్పుడు తెలియదు" అని నిష్కర్షగానే చెప్పిరి. ఆయనను దేవియొక్క ఉపాసనామార్గమున ప్రవేశపెట్టి ఆయన చిత్తనైర్మల్యమును సంపాదించునట్లుగా ప్రోత్సహించిరి. పరశురాముని సందేహములకు వెంటనే సమాధానము చెప్పకుండ దత్తాత్రేయుఁడు, "తరువాత చెప్పుదురు. అంతవఱకు స్థిరముగా నుండుము (స్థిరోభవ)" అని హెచ్చరించుట గమనింపఁదగియున్నది. అడిగిన వెంటనే సంవర్తుఁడు చెప్పలేదు. దత్తాత్రేయుఁడు కూడ చెప్పలేదు. అది తనకు అవమానముగా పరశురాముఁడు తలంపవచ్చును. అంతే కాదు ఆసందేహములను గూర్చియే ఆలోచించుచు ఆతఁడు గురువు చెప్పుచున్నదానియందు మనస్సును నిలుపక పోవచ్చును. కావున అట్లు మనస్సునకు చాంచల్యము కలుగకుండ మనస్సును స్థిరముగ నిలుపుకొను మని దత్తాత్రేయుఁడు హెచ్చరిక గావించెను. సంసారము రోగమువంటిది. గురువుయొక్క బోధ మందువంటిది, మందు ఇచ్చినంతమాత్రముననే వైద్యునకు రోగివిషయమున బాధ్యత తీఱదు. అది ఒక్కొక్క రోగియందు ఒక్కొక్క విధమున పని చేయుచుండును. కావున వైద్యుఁడు రోగియొక్క పరిస్థితిని ఎప్పటికప్పుడు గమనించుచు, అవశ్యకమగుచో, మందును మార్చుచు పథ్యము చక్కఁగా జరుగునట్లు చూడవలెను. రోగికి సంపూర్ణమైన యారోగ్యము కలుగువఱకు వైద్యుని బాధ్యత తీరదు. అట్లే గురువు కూడ ఒక్కొక్క శిష్యుని పరీక్షించి తగిన విధముగ బోధించుచు వానియందు కలుగుచున్న మార్పులను గమనించు చుండవలయును. రోగికి పథ్య మెట్టిదో సాధకునకు కర్మానుష్ఠానము ఉపాసన మొదలగునవి యట్టివి. శిష్యుని స్థితి ననుసరించి కర్మనో, ఉపాసననో వాని చేత చేయించి వానికి చిత్తశుద్ధి కలుగునట్లుచేయవలె. చిత్తశుద్ధి కలిగినప్పుడే జ్ఞానము కలుగును. కావున, కువలుని విషయమున పౌరాణికుఁడు చేసినట్లు తత్త్వసారమును నాలుగు మాటలలో చెప్పి అది వానికి అర్థమైనదా లేదా అని గమనింపక వదలిపేయుట అక్రమము.

# త్రిపురా మాహాత్మ్యము

దత్తాత్రేయుఁడు పరశురామునకు త్రిపురాదేవియొక్క మహాత్మ్యమును ఇట్లు వర్ణించి చెప్పెను. "త్రిపురాదేవియొక్క ఆజ్ఞ ననుసరించి బ్రహ్మ పృధివియందు క్షణములో మనుష్య యక్షగంధర్వాది జాతులతో సర్వమును సృష్టించెను. పిమ్మట ఆమహాదేవియొక్క ఆజ్ఞవలన విష్ణువు సృష్టిని పాలించుచుండగా కల్పాంతమునందు ఈశ్వరుఁడు లయ మొనర్చుచుండెను. పనిచేయుచుండఁగా వారికి శ్రమ కలుగఁజొచ్చెను. వారిస్థితిని గమనించి ఆదేవి ద్వాదశ భుజములతో దశ శీర్షములతో ఆముప్పురి రూపములుగలయాకృతితో వారికి సాక్షాత్కరించెను. వారు ఆమెను స్తుతించి తమశ్రమనుగూర్చి చెప్పుకొనిరి. అప్పుడామె తనయందున్న బ్రహ్మయొక్క అంశము నుండి సరస్వతిని, విష్ణువుయొక్క అంశమునుండి లక్ష్మిని, ఈశ్వరుని యంశమునుండి గౌరిని సృష్టించి వారి కొసంగెను. వారు తమశక్తి మూర్తులైన యాసత్యలను తీసికొనిపోయి శుభముహూర్తమునందు పెండ్లాడిరి. ఇట్లు వారు త్రిపురాదేవియొక్క తేజస్సునందలికళలను పొందుటవలన శ్రమలేక తమ కృత్యములయందు ఉత్సాహముతో వర్తింపఁజొచ్చిరి. ఇది త్రిరూపాఖ్యానము.

భార్గవా! ఇంక లక్ష్మీ మహాత్మ్యమును వినుము. మొదట మనుష్యులు స్వార్థరహితులై స్వర్గము మొదలగువానిని కోరక యజ్ఞయాగాదులను చేయకుండిరి. మనుష్యులు తమ్ము సేవించుట లేదని దేవతలకు చింతకలిగెను. అప్పుడు ఇంద్రాదులు బృహస్పతితో సమాలోచనము గావించి బ్రహ్మదేవుని చూడఁబోయిరి. సత్యలోకము నందు వెలుపల శతయోజనవిస్తీర్ణమైన మహాసభయందు కొలువుఁ దీర్చియున్న పరమేష్ఠిని సందర్శించిరి.

సత్యలోకమునకు లోపల ఇట్టి మహాసభ##యే మఱియొకటికలదు. దానియందు పరమేష్ఠి మఱియొక రూపమున కొలువుఁదీర్చియుండును. దానియందు కామక్రోధాదిరహితులైనవారికి తప్ప ఇతరులకు ప్రవేశము ఉండదు. అందువలన దేవేంద్రాదులు కూడ అచ్చటికి పోలేరు.

అందువలన ఇంద్రాదులు వెలికొలువునందే బ్రహ్మదేవునిసందర్శించి తమచింతను ఆయనకు ఎఱింగించిరి. అది విని ఆయన మీరు లక్ష్మిని ప్రార్థింపుఁడు" అని చెప్పిపంపెను. అప్పుడువారు ఆమెనుగూర్చి తపస్సు చేయఁగా ఆదేవి ప్రత్యక్షమై కాముఁడను కుమారుని సంకల్ప మాత్రముననే సృష్టించి యిచ్చి, "వీఁడు మీకార్యమును తీర్చగలఁడు" అని పలికి అంతర్ధానము నొందెను.

ఇంద్రాదులు తన్ను ప్రార్థించుచుండఁగా కాముఁడు అతి గర్వితుఁడై, "మీ కింక చింతవలదు.నేను ఈ మనుష్యులను మీకు సేవకులను గావింతును" అని ప్రతిజ్ఞ చేసి భూలోకమునకు వచ్చి, "మనుష్యులారా! మీ రందఱు దేవతలను పూజింపుఁడు" అని ప్రబోధింపఁజొచ్చెను. "అయ్యా! స్వర్గమునందు దేవత లెట్లున్నారో ఈ లోకమున మేమును అట్లే యున్నాము. మేము వారిని ఏల పూజింపవలె?" అని వారు కాముని తిరస్కరించిరి. కాముఁడుగ్రుఁడై వారిని సంహరింపఁబూనెను. అప్పుడు వీరవ్రతుఁడనువాఁడు భూమిని పాలించుచుండెను. ఆయన బ్రహ్మవర్తమునం దుండెను. రాష్ట్ర పాలకులకును కామునకు సంకులసమరము జరుగఁజొచ్చెను. చారులు పోయి ఈవృత్తాంతమును రాజునకు చెప్పిరి. ఆయన వర్ధనుడను మంత్రితో ఆలోచించి కాముని జయించుటకై ఎనిమిది దినములు శంకరుని గూర్చి ఘోరముగ తపస్సుచేసెను. శంకరుఁడు ప్రత్యక్షమై "నీకు విజయము లభించు" నని వర మొసంగెను.

ఈలోపల కాముఁడు రాష్ట్రపాలకులను జయించుచు బ్రహ్మవర్తమునకు చేరెను. అప్పుడు ఇంద్రాదులు దేవసైన్యములతో కామునకు సాయముగా వచ్చిరి. సుధృతి రణధీరుఁడు మొదలుగా వీరవ్రతునియొక్క సేనాపతులు ఘోరయుద్ధ మొనర్చి ఇంద్రాదులను బంధించిరి. అప్పుడు కాముఁడు విజృంభించి రాజసైన్యములను ధ్వంస మొందింపఁజొచ్చెను. అప్పుడ రణధీరుఁడు కాముని మార్కొని గదాప్రహారమున మూర్ఛ నొందించెను. కాముఁడు మూర్ఛనుండి తేరుకొనునప్పటికీ వీరవ్రతుఁడు యుద్ధరంగమున ప్రవేశించెను. కామునకు వీరవ్రతునకు మూఁడహోరాత్రములు ఘోరయుద్ధము జరిగెను. నాల్గవదినమున వీరవ్రతుఁడు శంకరుని స్మరించి ఆయన ప్రసాదించిన శూలాత్మకమైన యస్త్రమును ప్రయోగించెను. కాముఁడు విగతప్రాణుఁడై పడిపోయెను. లక్ష్మీదేవియొక్క దూతలు వచ్చి ఆతని శరీరమును ఆమె యొద్దకుఁ గొనిపోయిరి.

వీరవ్రతుఁడు విజయోత్సవములను జరుపుచుండఁగా, అతని గురువు విద్యాపతి దేవతలను బంధించుట యుక్తము కాదని చెప్పెను. వెంటనే సుధృతి అను మంత్రి దేవతలను బంధముక్తులను గావించి తీసికొనివచ్చెను. వీరవ్రతుఁడు వారి నందఱను పూజించి క్షమింపుఁడని ప్రార్థించెను.

లక్ష్మీదేవి త్రిపురాదేవి ప్రసాదమున అమృతమును పొంది కాముని బ్రతికించెను. ఓటమినిగూర్చి కాముఁడు వ్యథనొందుచుండఁగా లక్ష్మీదేవి "నీవు కేవలము మనుష్యుని శక్తిచేత ఓడింపఁబడలేదు. శంకరుని శక్తియే యిందులకు హేతువు" అని యోదార్చెను. దానితో అతడుశాంతింపక, "అట్లయినచో శంకరుఁడు కూడ నాకు శత్రువే. వానిని జయించునుపాయమును చెప్పుము" అని పట్టుఁబట్టెను. అప్పుడచ్చటికి వచ్చిన గౌరి వాని మొండితన మునకు కోపించి "నీవు శంకరునిచే దగ్ధుఁడ వగుదువు" అని శపించెను. లక్ష్మి అందులకు కోపించి "నీవును ఇట్లే భర్తృనిందను విని తపించి దగ్ధురాల వగుదువు" అని గౌరిని శపించెను. "అట్లయినచో నీవు పతివియోగమును సవతులవలన క్లేశమును పొందుము" అని గౌరి మరల లక్ష్మిని శపించెను. అంతటవారి కిరువురకు ఘోరసంగ్రామము జరిగెను. లక్ష్మీయొక్క శరముచేత గౌరి మూర్ఛిల్లెను. బ్రహ్మవచ్చి లక్ష్మిని ప్రార్థించి శాంతింపఁజేసెను గౌరియు మూర్ఛ నుండి తేఱుకొని శాంతించెను. ఆశాపఫలముగానే గౌరిదేవి దక్షుని పుత్రికగా జన్మించి అతఁడు గావించిన యజ్ఞమున భర్తృనిందను సహింపలేక యోగాగ్నిచే దగ్ధురాలయ్యెను.

వీరవ్రతుఁడు పాలించుచున్నంతకాలము దేవతలు ఆతనితో సఖ్యమును పాటించుచుండిరి. అతని యనంతరము మరల ఇంద్రాదులు బ్రహ్మయొద్దకు పోయి తమ కోరికలను విన్నవించిరి. అప్పుడాయన వర్షముయొక్క ఆధిపత్యమును ఇంద్రునకొసంగి "మానవులు ఎచ్చట యజ్ఞములు చేయుదురో అచ్చట వర్షమున కురిపింపుము. వర్షముకొఱకు మానవులు నిన్ను యజ్ఞములయందు పూజింతురు" అని పలికెను. అప్పటినుండి మానవులు యజ్ఞములు చేసి దేవతలను పూజింపఁదొడఁగిరి.

కాముఁడు తల్లియొక్క ఉపదేశము ననుసరించి త్రిపురాదేవి నుపాసించి అమోఘములైన ధనుర్బాణములను పొంది శంకరుని జయించుటకై తగిన సమయము కొఱకు వేచియుండెను. దక్షయజ్ఞమున భస్మమైన గౌరి హిమవంతునకు పుత్రికయై శంకరుని పెండ్లాడెను. శంకరుఁడు గాఢమైన తపస్సమాధియందు నిమగ్నుఁడైయుండెను. ఆసమయమున తారకుఁడు శూరపద్ముఁడు అను రాక్షసులు గొప్ప తపస్సుచేసి దానియొక్క ప్రభావముచేత ఇంద్రపదమును ఆక్రమించిరి. ఇంద్రుఁడు బ్రహ్మను శరణుఁజొచ్చెను. ఆయన శంకరుని కుమారునివలన ఆరాక్షసులు హతులగుదురని చెప్పెను. అప్పుడు శంకరుని తపస్సునుండి మరలించుటకై యింద్రుఁడు కాముని అభ్యర్థించెను. కాముఁడు పూర్వవైరమును స్మరించి శంకరుని సమీపించి ఆయనపై పుష్పభాణమును ప్రయోగించెను. దానివలన కలిగిన చిత్త క్షోభమువలన ఈశ్వరుని కంటినుండి అగ్ని వెలువడి కాముని దహించెను పిమ్మట దేవతల ప్రార్థనమున ఈశ్వరుఁడు పుత్రుని పొందుటకు అంగీకరించెను. అప్పుడు సనత్కుమారుఁడు ఆయనకు పుత్రుఁడై కుమారస్వామిగా అవతరించెను."

"ఆమహర్షి ఏల ఇట్లు జన్మించెను?" అని పరశురాముఁడు ప్రశ్నింపఁగా దత్తాత్రేయుఁడు ఇట్లు చెప్పెను. "ఋషభపర్వతము నందు తపస్సుచేయుచున్న సనత్కుమారుఁడు అచ్చటికి వ్చచిన బ్రహ్మదేవునితో ఇట్లనెను."తండ్రీ! నాకు ఒక స్వప్నము వచ్చినది. అందు నేను దానవులను సంహరించినట్లుగా చూచితిని. దీని కేమి కారణము?" బ్రహ్మ ఇట్లుచెప్పెను. "వత్సా! నీవు పూర్వజన్మమున బ్రాహ్మణుఁడవు. అప్పడు దేవదానవుల యుద్ధమును గూర్చి వినుచు స్వయముగా నీవే దానవులను సంహరింపవలయు నని భావించుచు అగ్నిని ఆరాధించుచు దేహమును త్యజించితివి. ఆయుపాసనయొక్క పుణ్యమువలన ఇప్పుడు నాకు పుత్రుఁడ వైతివి. ఆభావనయొక్క బలమున ఇప్పుడు నీకు స్వప్నము వ్చచినది. నీవు స్వేచ్ఛగా మఱియొక జన్మమును పొంది ఆభావనయొక్క సిద్ధి నొందఁగలవు." ఇట్లు చెప్పి ఆయన వెడలిపోయెను. తరువాత ఒకప్పుడు పార్వతీపరమేశ్వరులు సనత్కుమారుని యొద్దకు వచ్చిరి. ఆమహర్షి సమాధియందు ఆనందమగ్నుఁడై యుండి వారిని గమనింపలేదు. పరమేశ్వరుఁడు ఆమునిని ఆక్షేపించెను. ఆయాన సమాధిని వీడి ఆక్షేపములను వినియు శాంతముతో ఇట్లనెను. "మీరు నాయందు ఇష్టమ వచ్చినట్లుగా శాపములను కురిపించినను మంచిదే, వరములను కురిపించినను మంచిదే." ఆయనయొక్క స్థైర్యమునకు మెచ్చి ఈశ్వరుఁడు వరమును కోరుకొమ్మనెను. "మీరే నావలన వరమును కోరుకొనుఁడు" అని మహర్షి యనెను." అట్లయినచో నీవు నాకు

పుత్రుఁడవుగా జన్మింపుము" అని ఈశ్వరుఁడు కోరెను. "అయ్యా! నీవు మాత్రమే కోరితివి. పార్వతి కోరలేదు. కావున నీకు మాత్రమే పుత్రుఁడు నయ్యెదను" అని మహర్షి అనెను. అప్పుడు పార్వతి "అయ్యా! నాకును పుత్రుఁడవు కమ్ము" అని ప్రార్థించెను. అమ్మా! గర్భమునుండి జన్మించుట నాకు ఇష్టము లేదు. పూర్వము వృతాసురునకు వెఱచి ఆయన అదృశ్యుఁడైనప్పుడు నీవు భర్తృవియోగ దుఃఖమున గంగాతీరమునందు శరీరమును త్యజించితివి. ఆదేహావయవములనుండి అక్కడ రెల్లుపొదలు (శరవణము) ప్రబలెను. కావున నేను అచ్చట జన్మించి నీదేహమునుండి పుట్టినట్లుగానే నీకు కుమారుఁడ నయ్యెదను" అని ఆమహర్షి ఆమె నోదార్చెను. అట్లే ఆయన తరువాత ఈశ్వరుని వీర్యమువలన శరవణమునందు కుమారస్వామిగా జన్మించి తారకాసురుఁడు మొదలగు రాక్షసులను సంహరించెను.

భార్గవా! ఇంక భరాతీదేవియొక్క మహత్త్వమును వినుము. ఒకప్పుఁడు బ్రహ్మసభయందు మహర్షులు భారతిని స్తుతించు చుండిరి. బ్రహ్మ దానిని మెచ్చక ఆమెను పరిహసించెను. ఆమెయు ఆయనను ఆక్షేపించెను. ఆయన కోపించి, "నీవు నాకు భార్యగా నుండఁదగవు" అని శపించెను. ఆమెయును క్రుద్ధురాలై "అట్లయినచో నీకు గొల్ల పిల్లయే భార్యయగును" అని శపించెను. దేవతలు వారిని శాంతింపఁజేసిరి. తరువాత కొంతకాలమునకు బ్రహ్మయజ్ఞము చేయఁబూనుకొని భారతిని ఆహ్వానించెను. ఆమె అలుక వహించెను. బ్రహ్మ విసిగి విష్ణువును చూచి "ఈక్షణమే కన్యను వెదకి తెమ్ము. పత్నినిగా స్వీకరించి యజ్ఞము చేయుదును" అని పలికెను. ఆయన వెంటనే ఒక గోపకన్యను తీసికొని వచ్చెను. ఆమెను పత్నినిగాకైకొని బ్రహ్మ యజ్ఞమును ముగించెను.

తనకన్న అధికసౌందర్యవతిగా నున్న గొల్లపిల్లను చూచి భారతి సిగ్గుపడి కోపముతో ప్రజ్జ్వలించెను. ఆమె కోపము అగ్నియై లోకమున ప్రసరింపఁజొచ్చెను. ఆమెను శాంతింపఁజేయుటకు ఇంద్రాదులు ఆమెయొద్దకు పోయి ఆమెచే బంధింపఁబడిరి. లక్ష్మీ పార్వతులు ఆమెను శాంతింపఁజేయలేక త్రిపురాదేవిని ప్రార్థించిరి. త్రిపురాదేవి సాక్షాత్కరించి భారతిని ఓదార్చుచు గోపకన్యవృత్తాంతము నిట్లు చెప్పెను.

"పూర్వము హర్యక్షుఁడను బ్రాహ్మణుఁడు ఒక గొల్లపిల్లను కామించి బలాత్కరించెను. ఆమె రోదన మొనర్చెను. నారదుఁడు అచ్చటికి వ్చచి ఆబ్రహ్మణుని చూచి కోపించి, "నీవు గొల్లవాఁడవే యగుదువు" అని శపించెను. హర్యక్షుఁడు నారదుని ప్రార్థింపఁగా ఆయన భారతీదేవిని ప్రార్థింపు మని చెప్పి వెడలిపోయెను హర్యక్షుఁడు నిన్ను ప్రార్థింపగా నీవు సాక్షాత్కరించి, "నీవు గొల్ల వాఁడవుగా జన్మించినను నీకు నేను పుత్రికగా జన్మింతును. పిమ్మట నీకు పరమపదము కలుగును" అని వరమొసంగితివి. నీయంశము ననే వేదమాతయైన గాయత్రి ఈగొల్లపిల్లగా ఆవిర్బవించినది."

ఇట్లు చెప్పి త్రిపురాదేవి గాయత్రియందు ప్రవేశించెను. అప్పడు గాయత్రి చతుర్బుజములతో మూడు కన్నులతో త్రిపరాస్వరూపమును పొందెను, దేవతలు స్తుతించుచుండఁగా హర్యక్షుఁడచ్చటికి వచ్చెను. అప్పడు గాయత్రి ఆతనితో నిట్లనెను. "నీవు కాలాంతరమున ద్వాపరయుగమున నందగోపుఁడవుగా జన్మింతువు. అప్పుడు నేను విష్ణువుదేవుని యంశమున జన్మించు శ్రీకృష్ణునకు చెల్లెలుగా నీకు పుత్రికగా జన్మించి గోపికలచే పూజింపఁబడి వింధ్యవాసినీ దేవినిగా ప్రసిద్ధురాలనై జనులను ఉద్ధరింతును" అని బ్రహ్మదేవునితోఁగూడి వెడలిపోయెను.

కావున గాయత్రీదేవియే ద్వాపరాంతమును నందుని భార్యయగు యశోదకు పుత్రికగా జన్మించెను. వసుదేవుఁడు దేవకికి జన్మించిన శ్రీకృష్ణుని యశోదయొద్ద నుంచి ఆమెకు జన్మించిన పుత్రికను మధురకు తీసికొనివచ్చును. కంసుఁడాబాలికను చంపఁబోఁగా వానిశక్తిని హరించుచు ఆమె పైకిఎగసి వింధ్యవాసినీరూపమును ప్రకటించి వానిని శపించి అంతర్ధాన మొందును. గోపకన్యలు శ్రీకృష్ణుని పతినిగా గోరి కాత్యాయనుఁడను మునిని సేవింతురు. ఆయన అంబికను ప్రార్థించును. ఆమె సాక్షాత్కరించి, "నీపేరట నేను కాత్యాయనీదేవి నిగా వెలయుచున్నాను. కావున గోపకన్యలు కాత్యాయనీవ్రతమున గావించినచో వారికోరిక నెరవేరును" అని చెప్పెను వారు అట్లే కాత్యాయనీవ్రతమును గావించి శ్రీకృష్ణ సమాగమమును పొందుదురు. శ్రీకృష్ణుఁడు ద్వారకయందున్నప్పుడు రాక్షసులు నందుని గోపకన్యలను బంధింప యత్నించుచుండఁగా యశోద మొదలగువారు కాత్యాయనుని యాదేశమున కాత్యాయనిని ప్రార్థింపఁగా ఆమె ఆవిర్భవించి రాక్షసులను సంహరించి వారిని రక్షించును.

ఇంక చండికావృత్తాంతమువినుము. పూర్వము శుంభనిశుంభులను రాక్షసప్రభువులు తపస్సుచేసి ఏపురుషులవలనను ఓటమి లేకుండునట్లు వరమును పొంది దేవతలను జయించి స్వర్గము నాక్రమించిరి. ఇంద్రాదులు బ్రహ్మను శరణుఁజొచ్చిరి. బ్రహ్మ దేవతలతో గంగాతీరమున త్రిపురాదేవిని ప్రార్థించెను. అప్పుడు పార్వతి అచ్చటికి వచ్చి దేవతల ప్రార్థనమును విని "నేను రాక్షసులను సంహరింతు" నని పలుకుచు క్రోధముచేత నల్లఁబడిన కాళి యయ్యెను. అప్పుడామెశరీరమునుండి త్రిలోకమోహినియైన చండిక ఆవిర్భవించెను. దేవతలు జయనినాదము గావించిరి. ఆప్రాంతమునకు వేటకై వచ్చి యున్న శుంభనిశుంభులమంత్రులు చండుఁడు ముండుఁడు ఆశబ్దమును విని అచ్చటికి వచ్చిరి. వారిని చూడఁగనే దేవతలు పారిపోయిరి. చండముండులు చండికా సౌందర్యముచేత మోహితులై ఆమెను కోరఁజొచ్చిరి. కాళి వారి నిరువురను పట్టుకొని ఒకరితలతో మఱియొకరితలపై మోది పడఁగొట్టెను. వారు మూర్ఛిల్లి లేచి పారిపోయి శుంభనిశుంభులకు చండికనుగూర్చి చెప్పిరి. శుంభుఁడు ఆమెను కోరుచు దూతను పంపెను. "నేను రాక్షస సంహారమునకు పూని యున్నాను. మీ రాజు నన్ను జయించినచో నేను వానికి భార్య నగుదును" అని చండిక చెప్పిపంపెను. అంతట రాక్షసులు దండెత్తి వచ్చిరి. అప్పుడు విష్ణువు చండికకు సింహరూపమున వాహన మయ్యెను. ఆమె సింహవాహనయై శుంభనిశుంభలను నిర్మూలింపఁగా కాళి చండముండులను సంహరించెను. సింహము రాక్షససైన్యమును భక్షించెను.

పిమ్మట కాలంధాజులను రాక్షసులు తపస్సుచేసి, పురుషులచేతఁ గాని స్త్రీ స్వభావముగల స్త్రీలచేతఁగాని ఓటమి లేకుండునట్లుగా వరమును సంపాదించి స్వర్గమును ఆక్రమించిరి. దేవతలు త్రిపురాదేవిని ప్రార్థించుచుంఁడఁగా అప్పుడే రాక్షసులు వారిపైకి వచ్చిరి. తక్షణమే త్రిపురాదేవి సాక్షాత్కరించి హుంకరించెను. ఆశబ్దమునకు రాక్షసులు మూర్ఛిల్లిరి. దేవతలు ఆమెను స్తుతించిరి. అప్పుడామెనుండి క్రోధరూపిణియై కాళికాదేవి వెలువడెను. ఆమె స్త్రీకి స్వభావమైన లజ్జనువీడి దిగంబరయై వ్రేలడుచున్న నాలుకతో చతుర్భుజములతో రాక్షసులను భక్షించుచు మద్యమునుత్రావుచు వారిశీర్షములతో ముండమాలను, ఖండితములైన వారిహస్తములతో మొలత్రాడును ఏర్పఱచు కొని రాక్షససంహారమును గావించెను. బ్రహ్మాదిదేవతలు ప్రార్థింపఁగా ఆమె ప్రసన్నురాలై "నావిగ్రహమును పూజించువారికి సర్వకార్యసిద్ధి" అగును అని పలికి అంతర్ధానము నొందెను.

రామా! ఇంక దుర్గాదేవి చరిత్రమును వినుము. దుర్గనుండితి రక్షించునది కావున ఆమెకు దుర్గయనునామము ప్రసిద్ధ మయ్యెను. ఒకప్పుడు మహిషుఁడు అను రాక్షసుఁడు తపశ్శక్తిచే దేవతలను జయించి త్రిలోకాధిపతి యయ్యెను. ఇంద్రాదులు బ్రహ్మవిష్ణు మహేశ్వరులు త్రిపురాదేవిని ప్రార్థించుచు ఒకచోట సమావేశమైరి. అది తెలిసికొని రాక్షసులు వారిపైకి వ్చచిరి. అప్పుడు ఆలోకపాలకులు తమ తేజస్సులయొక్క అంశములను ఒకచోట సమకూర్చిరి. ఆతేజస్సులయొక్క సముదాయమునుండి త్రిపురాదేవి దుర్గారూపమున వెలువడి సకలాయుధములను గైకొని సింహముపై బయలుదేరి పుత్రపౌత్రులతో కూడా మహిషాసురుని సంహరించెను.

త్రిపురాదేవియొక్క మూర్తులతో లలితారూపము శ్రేష్ఠము. ఆమె చరిత్రమును చెప్పు మని అగస్త్యుఁడు విష్ణుదేవుని ప్రార్థింపఁగా ఆయన అందులకు హయగ్రీవుని నియోగించెను. హయగ్రీవుఁడిట్లు చెప్పెను. పూర్వ మొకప్పుడు లక్ష్మీదేవియొక్క దూతయగు మాణిక్య శేఖరుఁడు మందాకినియందు కొట్టుకొనిపోవుచున్న యొక కిన్నరస్త్రీని చూచి దయతో ఒడ్డునకు తెచ్చి రక్షించెను. కాని ఆమెసౌందర్యమునకు శరీరస్పర్శకు అతఁడు కామప్రకోపము నొంది ఆమెతో భోగింపగోరెను. "ఆపదనుండి రక్షించినవాఁడు తండ్రి యగును. నీవు నన్ను కోరరాదు" అని ఆమె వారించుచున్నను వాఁడామెను బలాత్కరింపఁజొచ్చెను. ఆమె "రక్షింపుఁడు! రక్షఁపుఁడు!" అని యరువఁజొచ్చెను. లక్ష్మి అచ్చటికి వచ్చి వానిని చూచి "రాక్షసుఁడవు కమ్ము" అని శపించెను. వాఁఁడు ప్రార్థింపఁగా ఆదేవి "రాక్షసుఁడ వైనను నీకు సకలలోకాధిపత్యము సర్వభోగసిద్ధి కలుగును. తుదకు త్రిపురా దేవివలన మరణమును శాపముక్తిని పొందుదువు" అని చెప్పెను.

శివుఁడు కాముని నేత్రాగ్నిచే దహించిన తరువాత గణశ్వరుఁడు క్రీడకొఱకు ఆభస్మము నంతను ముద్దగాఁజేసి బొమ్మను తయారు చేసెను. పార్వతి ప్రార్థింపఁగా శివుఁడు ఆబొమ్మకు ప్రాణమును ప్రసాదించెను. మాణిక్యశేఖరుఁడు ఆబొమ్మనుండి శిశువుగా ఆవిర్భవించెను. శివుని కోపముచేత ఏర్పడిన భస్మమగుటచే దానినుండి శరీరమును పొందిన మాణిక్యశేఖరుఁడు తపస్సుచేత రాక్షసుఁడయ్యెను. వాఁడు దేవతలయైశ్వర్యమును చూచి అసూయనొంది గంగాతీరమున

శివునిగూర్చి తపస్సుచేసి తనకు సర్వవిజయిత్వమును సృష్టించుసామర్థ్యము అమరత్వము కలుగవలయునని శివుని ప్రార్థించెను. ఆయన నిరాకరించెను. వాఁడు మరల తపస్సు చేసెను. ఆయన మరల నిరాకరించెను. వాఁడు ఇంకను భయంకరముగా తపస్సుచేసెను. శివుఁడు సాక్షాత్కరించి, "మాతృగర్భము నుండి జన్మించువారివలనఁగాని ప్రసిద్ధములైన యస్త్రశస్త్రములవలనఁగాని నీకు మరణము లేదు." అని వర మిచ్చి వెడలిపోయెను.

వాఁడు పాతాలమునకు అధిపతి అయి అచ్చటి రాక్షసులు ప్రోత్సహింపఁగా స్వర్గమును జియింపఁబూనెను. బ్రహ్మదేవుఁడు వచ్చి, "భూలోకమును గైకొని స్వర్గమును దేవతలకు ఉండనిమ్ము. వారితో సఖ్యమును పాటింపుము" అని నచ్చఁజెప్పెను. "అట్లయినచో దేవతలు శచీదేవిని నందనవనమును నాకు కప్పముగా ఈయవలె" అని వాఁడనెను. బ్రహ్మ కోపించి, "నీవు భండుఁడవు" అని ఛీత్కారమొనర్చి అంతర్ధానము నొందెను. పిమ్మట వాఁడు మూఁడు లోకములకు అధిపతియై దేవతలను బరువులు మోయుకూలీలనుగా నియోగించెను. ఉగ్రకర్ముఁడు మొదలగువారిని దిక్పాలకులనుగా నియమించెను. అప్పుడు తారకుఁడను రాక్షసుఁడు మిగుల సంతోషించి తన తమ్ములను నలువురను వానికి సోదరులనుగా నొసంగెను. భండా సురఁడు కూడ ప్రీతుఁడై విశుక్రుఁడను సోదరుని భూలోకాధిపతిగ, విషంగుఁడనువానిని పాతాళాధిపతినిగా చేసెను. భండునకు భయపడి శచీదేవి గౌరినాశ్రయించెను. వాఁడు ఆమె కొఱకు కైలాసమునకు పోయి శచి నిమ్మని యడిగెను. గణేశ్వరుఁడు వాని సైన్యమునంత మొందింపఁగా గౌరి హుంకారముచేత వానిని బంధించి సంహరింపఁబూనఁగా బ్రహ్మవాని వరమునుగూర్చి చెప్పి వారించెను. అప్పుడామె, "నీవు మరల ఇక్కడికి వచ్చినచో నశింతువు" అని శపించి వానిని వదలెను.

పిమ్మట దేవత లందఱు హిమాలయము నొద్దకు చేరి మహాయాగ మొనర్చిరి. అగ్నికుండమునందు త్రిపుర ఆవిర్భవించి వారి కభయమొసంగెను. ఆమెయే లలిత. ఇది ఎఱింగి శుక్రుఁడు దేవతలతో సఖ్య మొనర్చు మని భండునకు బోధించెను. కాని వాఁడు గురువు నాక్షేపించి దేవతలపై దాడి చేసెను. అప్పుడు త్రిపుర జ్వాలా మాలిని అనుశక్తిని పంపెను. ఆశక్తి దేవతలకు చుట్టును ప్రాకారముగా అగ్నిజ్వాలారూపమున నిలిచెను. ఆజ్వాలలను చూచి దేవతలు ఆయగ్నిలోపడి భస్మమైనారని తలంచుచు భండాసురుఁడు మరలి పోయెను. తరువాత నారదుఁడొకసారి తనయొద్దకు రాఁగా భండుఁడు ఆజ్వాలావళినిగూర్చి ప్రశ్నించెను. నారదుఁడు లలితాదేవియొక్క ఉత్పత్తిని చెప్పి దేవతలు జ్వాలామాలినిచే సురక్షితులై యున్నారని చెప్పెను.

పిమ్మట లలితాదేవి కామేశ్వరుని భర్తనుగా పొంది మంత్రిణి దండిని మొదలుగా శక్తులను సృజించి పరివారమును ఏర్పఱచుకొని యుద్ధసన్నద్ధురాలై బయలుదేరెను. భండాసురుఁడు కూడ మహాసైన్యముతో బయలుదేరివచ్చెను. ఆదైత్యసైన్యమును చూచి ఎనిమి దేండ్ల వయస్సుగల బాలాంబ అనుమహాశక్తి విజృంభించి దైత్యసేనాపతులను జయించి విశుక్రుని విషంగుని మూర్ఛితులను గావించెను. వారు మూర్ఛనుండి తేరుకొని ఘోరయుద్ధమును గావింపఁజొచ్చిరి. కామేశ్వరిఅనుశక్తి విమాయఅనునస్త్రముచేత విషంగాసురునిబంధించి లలితయొద్దకు తెచ్చెను. ఆమె వానిని విడిపించెను. వాఁడు బంధముక్తుఁడై దుఃఖించుచు విశుక్రునియొద్దకు పోయెను. విశుక్రుఁడు వానిని ఓదార్చి దేవతలను జయించుటకు భార్గవుఁడొసంగిన యంత్రమును ప్రయోగింప నిశ్చయించెను. భండుఁడు కూడా అందులకు ఆమోదించెను. విశుక్రుఁడు సుచియై శిలాపట్టమునందు ఆసురీ మూర్తినిచిత్రించి మాంసాదులతో పూజించి తాను నగ్నుఁడై తన చుట్టును యువతులు దిగంబరలై పరివేష్టించి యుండఁగా మంత్రాదులతోదానిని శక్తిమంత మొనర్చి విషంగున కొసంగెను. విషంగుఁడు ఆయంత్రమును గైకొని శక్తిసైన్యముయొద్దకు పోయి చుట్టును ఉన్న జ్వాలలను చూచి ఆకాశమునకు ఎగసి లోనికి విసరెను. ఆయంత్రముయొక్క ప్రభావమువలన శక్తులకు అలసత్వము నిద్ర మొదలగునవి ఆవహించెను. అందువలన వారు యుద్ధమును చేయ నిరాకరింపఁజొచ్చిరి. దండిని మంత్రిణి లలితయొద్దకు పోయి పరిస్థితిని విన్నవించిరి. ఆమె హేతువును గమనించి కామేశ్వరునిముఖము నవలోకించి నవ్వుచు త్రినేత్రుఁడైన గణశుని సృష్టించి రాక్షసులు ప్రయోగించిన విఘ్నయంత్రమును ధ్వంస మొనర్ప ఆజ్ఞాపించెను. గజాననుఁడు పోయి యంత్రమునుం దంతములతో ధ్వంసమొనరించెను. అప్పుడు శక్తి సైన్యమునందు యథాపూర్వముగా ఉత్సాహము ప్రబలెను. ఆఘోరయుద్ధమునందు విఘ్నేశ్వరుఁడు గజాసురుని సంహరించెను. బాలంబ భండపుత్రులను ఖండించెను. మంత్రిణి విశుక్రుని మర్దించెను. దండిని విషంగుని విధ్వంస మొందించెను. పుత్రులు సోదరులు మరణించుటను చూచి భండాసురుఁడు దుఃఖము నొందియు క్రోధముతో విజృంభించి మిగిలియున్న సైన్యమునుకూర్చుకొని లలితాదేవితో యుద్ధమునకు సన్నద్ధుఁడయ్యెను. భండాసురుఁడు మధుకైట భాదులైన విష్ణుశత్రువులను, అంధకాదులైన

శివశత్రువులను సృష్టింపఁజొచ్చెను. అది గమనించి ఆమె విష్ణువుయొక్క దశావతారమూర్తులను శంకరునిమూర్తులను సృష్టించి ఆరాక్షసులను అంతమొందింపఁజేసెను. దైత్యభటులు ఎందఱు మరణించుచున్నను భండాసురుఁడు మరల మరల అసంఖ్యాకముగ సైన్యమును సృష్టింపఁజొచ్చెను. అప్పుడా దేవి పాశుపతాస్త్రమున ఆసైన్యము నంతను సంహరించి, కామేశాస్త్రమును ప్రయోగించి భండాసురుని సపరివారముగా భస్మ మొనరించెను.

అప్పుడు బ్రహ్మాదిదేవతలు ఆమహాదేవికి ప్రణమిల్లి స్తుతించిరి. మేరు పర్వతముయొక్క శిఖరమునందు విశ్వకర్మ శ్రీపురమును నిర్మించి యుండెను. అచ్చటికి రావలసినదని దేవతలు ఆమెను ప్రార్థించిరి. అందఱును జయజయధ్వానములు సలుపుచుండఁగా ఆమె బయలుదేరి మేరుపర్వతశిఖరమునకు చేరి అచ్చట శ్రీచక్రాకారముతో నిర్మింపఁబడియున్న దివ్యమైన నగరమును చూచి సంతోషించి అందు ప్రవేశించెను. బ్రహ్మదేవుఁడు వసిష్ఠాదిమహర్షులతోకూడి దేవిని రత్నసింహాసనమున కూర్చుండఁజేసి బృహస్పతి తెచ్చిన యభిషేక సామగ్రితో సకలలోకములకు సమ్రాజ్ఞినిగా అభిషేకించెను. ఆమె లోకపాలనమును నిర్వహించుచు అచ్చట విరాజిల్లుచుండెను. ఆశ్రీపురము త్రిపురోపాసకునకు తప్ప ఇతరులకు గోచరము కాదు. కావున నీవు నీభార్యయైన లోపాముద్రవలన దీక్షను పొంది త్రిపురాదేవిని ఉపాసింపుము."

హయగ్రీవుని యాదేశము ననుసరించి అగస్త్యమహర్షి త్రిపురను ఉపాసించి శ్రీపురమున స్థానమును సంపాదించుకొనెను. భార్గవా! ద్విజులకు ఉపనయనమువలె త్రిపురోపాసనమునకు దీక్షాగ్రహణము ఆవశ్యకము. దీక్షావంతులైనవారు విద్వాంసులు కాకున్నను సద్గతిని పొందుదురు. వేదమునకు ముఖ్యమైనయర్థము త్రిపురయే. కావున త్రిపురను సాక్షాత్కరింపఁ జేయుసాధనమే వేదము. పరమేశ్వరుఁడు లోకుల నుద్ధరించుటకై వేదములనుండి పురాణములను ఆగమములను ప్రవర్తింపఁజేసెను. మహర్షులు ఆగమములను మధించి తంత్రశాస్త్రమును వెలయించిరి. వేదములలో ఆగమములలో సిద్ధమైయున్న మంత్రయంత్రపూజావిధానాత్మకమైన భాగమే తంత్రశాస్త్రముగ ప్రసిద్ధమైయున్నది. ఆశాస్త్రముచేత ఉపాసింపఁదగినది త్రిపురయే. ఆమెయే హ్రీమ్.

బాల ప్రియ

దేవతల వృత్తాంతములను పరిశీలించినచో మానవులవలె దేవతలుకూడ జీవులే అని స్పష్టమగుచున్నది. మానవులకువలెనే వారికిని కామక్రోధములు ఈర్ష్యాద్వేషములు కలవు. కావుననే ఇంద్రాదులకు సత్యలోకమున లోపలి కొలువునందు ప్రవేశించుటకు అర్హత లేకపోయినది. అంతేకాదు వీరవ్రతుని చరిత్రనుబట్టి మానవులు కూడ కాముని నిగ్రహించినచో దేవతలనుకూడ మించిపోఁగల రని వ్యక్త మగుచున్నది. ఇంద్రుని జయించి త్రిలోకాధిపత్యమును సంపాదించినను కామక్రోధములను జయింపనంతవఱకు పరమసుఖము కలుగదని రాక్షసుల వృత్తాంతములవలన గ్రహింపదగియున్నది.

పార్వతీపరమేశ్వరులు తన్ను చూడవచ్చినను సనత్కుమారుఁడు గమనింపక వారిచ్చు వరములను శాపములను లెక్కపెట్టలేదన్నచో తత్త్వజ్ఞుఁ డెట్లుండునో సనత్కుమారుని స్థితివలన గ్రహింపవలసియున్నది. అట్టి తత్త్వజ్ఞుని విషయమున కూడ కర్మానుష్ఠానము, భావనాబలము ప్రారబ్ధములై ఫలము నీయక మానలేదు. ఆయన కావించిన యగ్నియొక్క ఆరాధనమునకు ఫలముగా బ్రహ్మపుత్రత్వము సంభవించినది. రాక్షసులను జయింపవలయునని భావించినందులకు ఫలముగా తారకాసుర సంహారము కొఱకు ఆయన కుమారస్వామిగా అవతరింపవలసివచ్చెను. అయినను ఆయన ఈజన్మలను ఈశరీరములను రాక్షస సంహారము మొదలైన కృత్యములను అన్నింటిని, అద్దములోని ప్రతిబింబములు వలె, స్వప్నములోని సన్ని వేశములవలె, తనయందే తోఁచుచున్న చిత్రములనుగా చూచుచు ఆనందించుచున్నాఁడు. అందువలననే ఆయన శాపములను వరములను కూడ లెక్క పెట్టలేదు.

త్రిపురాదేవి తనలోనుండియే త్రిమూర్తులను వారిభార్యలను ఇతరశక్తులను సృష్టించెను. ఆమెనియోగముననే బ్రహ్మ దేవతలు మానవులు రాక్షసులు మొదలుగా సకలజీవులను లోకములను సృష్టించెను. ఈసృష్టి, ఇందులో రాజులు, దేవతలు రాక్షసులు పాలించుట యుద్ధములు చేసి నశించిట, కొందఱు ముక్తిని పొందుట, మొదలుగా సర్వము ఆమెయందే, అద్దములో ప్రతిబింబించు చిత్రములపరంపరవలె తోఁచుచున్నదనుట స్పష్టము. ఆమెయే తన వినోదము

కొఱకు కేళీవిలాసముగా మహానాటకమునువలె ఇది యంతయు గోచరింపఁజేయుచున్నది. ఆమెనే తన స్వరూపముగా గుర్తించువారికి కూడ ఇది యంతయు ఆమెకువలెనే వినోదమాత్రముగా తోఁచు ననుట స్పష్టము.

పరశురాముఁడు దత్తాత్రేయునివలన మమాత్మ్యమును విన్న తరువాత, ఆత్మజ్ఞానమును, చర్యావిశేషములను వినెను. సుమేధుఁడను శిష్యుఁడు భార్గవునివలన దీని నంతను విని మాహాత్మ్యఖండము జ్ఞానఖండము, చర్యాఖండమును అని మూఁడు భాగములుగా గ్రంథమును రచించెను. బ్రహ్మదేవుని యాదేశమున నారదమహర్షి సుమేధునియొద్దకు వచ్చి ఆగ్రంథమును వినిపింపు మనెను. సుమేధునకు హారితాయనుఁడను పేరు కలదు. హారితాయనుఁడు నారదునకు గ్రంథమును వినిపించెను.

# త్రిపురారహస్యసారమున - జ్ఞానఖండము

# ప్రథమాధ్యాయము - విచారోదయము

శ్రీ గణేశునకు నమస్కారము

హారితాయనుఁడు నారదునితో నిట్లు చెప్పుచున్నాడు. ఓమ్. సర్వమునకు కారణమైనయానందమే రూపముగా గలిగి జగత్తు అను చిత్రముయొక్క ప్రతిబింబమునకు అద్భుతమైన దర్పణమువలె నున్న చిన్మయియైన పరదేవతకు నమస్కారము.

నారదా! పరమార్థసాధనమైన త్రిపురాదేవియొక్క మాహాత్మ్యమును శ్రద్ధతో వింటివి కదా! ఇంక నీకు మహాద్భుతమైన జ్ఞానఖండమును చెప్పెదను. దానిని విన్నచో మనుష్యుఁడు శోకమును పొందఁడు. వైదికము వైష్ణవము శైవము శాక్తము పాశుపతము అని యనేకవిధములుగా నున్న విజ్ఞానము నంతను చక్కఁగా పరిశీలించినతరువాత, ఈజ్ఞానమువలె మనస్సునకు ఎక్కునట్టిది మఱియొకటి లేదని నిశ్చయింపబఁడినది. దానిని భగవంతుఁడైన దత్తాత్రేయుఁడు భార్గవునకు హేతువులతో అనుభవముతో నిరూపించెను. ఇది విన్న తరువాత కూడ ఎవని కైనను జ్ఞానము కలుగకున్నచో వానికి శివుఁడే సాక్షాత్కరించి బోధించినను కలుగదు.

సత్పురుషుల చరిత్రము అద్భుతము. నావలనకూడ దేవర్షియైన నారదుఁడు ఏదో కొంచెము వినఁగోరుచున్నాఁ డన్నచో, ఇది నన్ను అనుగ్రహించుటయే. కస్తూరికి సువాసననలె సజ్జనులకు అనుగ్రహము సహజము.

దత్తాత్రేయునివలన భార్గవరాముఁడు త్రిపురామహాత్మ్యమును విని భక్తిచేత కొంతసేపు తన్మయుఁడై యుండి కనులు తెఱచి ఆనందాశ్రువులతో గగుర్పాటుతో గురువునకు సాష్టాంగముగ ప్రణమిల్లి లేచి గద్గదస్వరముతో ఇట్లనెను. "కరుణాసింధువులైన శ్రీగురుదేవుల యనుగ్రహముచే నేను ధన్యుఁడనైతిని. కృతకృత్యుఁడ నైతిని. తమ దయవలన త్రిపురామహాత్మ్యము నంతయు వింటిని. ఆపరమేశ్వరిని ఉపాసింపఁగోరు చున్నాను. ఆపద్ధతిని నాకు బోధింపుఁడు."

భార్గవునియొక్క భక్తిని శ్రద్ధను అర్హతను చూచి దత్తాత్రేయుఁడు త్రిపురాదేవియుపాసనకై అతనికి దీక్ష నొసంగెను. శ్రేష్ఠమైన యాదీక్షను మంత్రయంత్రాదులతో సక్రమముగా సమగ్రముముగా పొంది ఆనందమయుఁడై ఆపరమేశ్వరిని ఉపాసించుటకు గురువుయొక్క ఆజ్ఞను పొంది భార్గవుఁడు ఆయనకు ప్రదక్షిణ మాచరించి ప్రణమిల్లి మహేంద్రగిరికి పోయెను. అచ్చట నిత్యనై మిత్తకములైన కర్మలను నిర్వహించుకొనుచు పండ్రెండు సంవత్సరములు దీక్షతో త్రిపురాదేవిని ఉపాసించెను. అంతకాలము అప్పపాటులో గడచినట్లుండెను.

ఒకనాఁ డాయన సుఖముగా కూర్చుండి ఇట్లనుకొనెను. "పూర్వము మార్గమున నేను ప్రార్థింపఁగా సంవర్తుఁడు ఏదోచెప్పెను. అప్పు డది నాకు కొంచెము కూడ తెలియలేదు. నేను దేనిని కోరి మొదట గురువును ప్రార్థించితినో అది కూడ మఱచితిని. ఆయన వలన త్రిపురామహాత్మ్యమును వింటిని కాని సంవర్తుఁడు చెప్పినదేదో తెలిసికొనలేదు. అది కాక సృష్టిప్రసంగమునందు నేనే దత్తగురువును కొన్ని సందేహములు అడిగితిని. ఆయన కువలుని కథను చెప్పి అవి ఇప్పుడు ఆవశ్యకము కాదని సమాధానము చెప్పలేదు.

ఈలోకముయొక్క పద్ధతి నాకు కొంచెము కూడ తెలియుట లేదు. ఇంత యాడంబరముతో ఈజగత్తు దేనినుండి పుట్టినది? ఎక్కడికి పోవుచున్నది? ఎచ్చట నిలుకడను పొందుచున్నది? అన్నియెడల అంతయును అస్థిరముగనే కన్పించుచున్నది. అస్థిరములైన విషయములతో వ్యవహారములు స్థిరము లైనట్లే జనులు వర్తించుచున్నారు. విమర్శనము లేని యీ లోకుల వ్యవహారము చిత్రముగా నున్నది. ఒక గ్రుడ్డివాని వెనుక మఱియొక గ్రుడ్డివాఁడు పోవుచున్నట్లుగా జనులు వర్తించుచున్నారు. నావర్తనము కూడ ఇందులకు అన్నివిధముల నిదర్శనముగా నున్నది. నా శైశవమునందు ఏమి జరిగినదో గుర్తులేదు. కౌమారమునందు ఒకవిధముగా ౖవనమునందు వేఱొక విధముగా ఇప్పుడు మఱియొకవిధముగా వ్యవహారము జరుగుచున్నది. ఈవ్యవహారములకు ఏమి ఫలమో తెలియుట లేదు. ఫలమును కోరి ఎప్పుడు ఏపని చేయుచున్నను, అది చక్కగా నున్న దనియే ఆపని చేయుచున్నారు. అచ్చట ఏమి ఫలము కలుగుచున్నది? దేనిచేత ఆత్మకు సుఖము కలుగుచున్నది? దేనిని లోకులు ఫలమనుకొనుచున్నారో, విమర్శించినచో, అది నిజముగా ఫలము కాదు. ఒకఁడు ఒకఫలమును పొంది మరల దాని కొరకు యత్నించుచున్నచో అది ఫలమని నేను తలంపను. ఫలమును నిజముగా పొందియున్నచో వానికి దానియందు మరల ఎట్లు కోరిక కలుగును? మఱి జను లందఱును పొందిన ఫలమునే మరల పొందుటకై యత్నించుచున్నారు. కావున దుఃఖము పోవుటయో లేక సుఖము కలుగుటయో ఫల మని చెప్పవలె. చేయవలసినపని మిగిలియుండఁగా దుఃఖనాశము గాని సుఖము గాని కలుగదు. కాఁబట్టి కర్తవ్యమును కలిగియుండుటయే దుఃఖము లన్నింటిలో పరమ దుఃఖము.

శరీర మంతయు దగ్ధమగుచుండఁగా పాదములయందు మాత్రము గంధము పూయుటవలన గుండెలో బాణము గ్రుచ్చుకొని యుండ అప్సరసలు కౌఁగిలించుకొనుటవలన, క్షయరోగికి సంగీతము వినిపించుటవలన కలుగు సుఖము ఎట్టిదో కర్తవ్యము మిగిలియున్న వానికి కలుగు సుఖము కూడ అట్టిదియే. కర్తవ్యము ఎవరికి లేదో వారే ఈలోకములో సుఖము కలవారు. కర్తవ్యము మిగిలియున్న వానికి కూడ సుఖము కలుగు నన్నచో కొఱతవేయఁబడివానికి కూడ గంధము పూసి పుష్పమాలికలు వేసినచో సుఖము కలుగునని చెప్పవలసియుండును. ఆహా! ఇది ఎంత విచిత్రము! వందలకొలఁది కర్తవ్యములు వచ్చి పైఁబడుచున్నను ఇచ్చట నేదో సుఖము కల దని దానికొఱకు జనులు ఎల్లప్పుడు యత్నించుచునే యున్నారు. మనుష్యులయొక్క ఈయవిచారమహాత్మ్యమును ఏమని చెప్పుదును! కర్తవ్యములు అనంతములుగా కొండలవలె పైనఁబడుచున్నను సౌఖ్యమును పొందుచున్నారు. సౌఖ్యముకొఱకు సార్వభౌముఁడు ఎట్లు ఎల్లప్పుడు యత్నించుచున్నాఁడో అట్లే బిచ్చమెత్తుకొనువాఁడు కూడ యత్నించుచున్నాఁడు. రాజుసుఖము వేఱు. బిచ్చగానిసుఖము వేఱు. ఇరువురును తాము కృతకృత్యులైనట్లే తలంచుచున్నారు. ఫలమును గూర్చి ఆలోచనయే లేక అందఱును ఏమార్గమున పోవుచున్నారో నేనును ఆమార్గముననే పోవుచున్నాను. విమర్శలేని యీలౌకికవ్యవహారప్రజ్ఞ ఇంక చాలును. ఈవిమర్శతోనే దయానిధియైన గురువు నొద్దకు పోవలె. వెనుక నేను తెలిసికొనఁగోరినవి. ఇప్పుడు తెలిసికొనవలసినవి యైనవిషయములు సందేహములు సముద్రమువలె నున్నవి. ఆయన గావించుబోధ అనునౌకచేత ఈసముద్రమును దాటెదను."

ఇట్లు నిశ్చయించుకొని భార్గవరాముఁడు గంధమాదన శైలమునకు పోయి దత్తాత్రేయునకు సాష్టాంగముగ ప్రణమిల్లెను. ఆయన భార్గవు నాశీర్వదించి ఆదరముతో నిట్లనెను. "వత్స! లెమ్ము. నిన్ను చూచి చాలకాల మైనది. నీకు కుశలమే కదా!" భార్గవుఁడు కూర్చుండి అంజలించి యిట్లు పలికెను. "కరుణాసింధువులైన తమయొక్క అనుగ్రహమునకు పాత్రుఁడనైన నాకు కుశలమునకు లోప మెట్లు కలుగును? ఇంతకాలము తమపాదముల సన్నిధినుండి దూరముగా నుంటి ననుచింత తప్ప నాకు ఏకొఱతయును లేదు. ఇప్పుడు తమదర్శనము చేత ఆనందపూర్ణుఁడనై యున్నాను. కాని నాహృదయమునందు చాలకాలముగా ఒక సందేహము మెదలుచున్నది. తమరు అనుమతించినచో అడుగుదును."

అది విని దయానిధియైన దత్తగురువు ప్రీతుఁడై "భార్గవా! నీసంశయ మేమో అడుగుము. నీవు కోరిన విషయమును చెప్పుదును" అని పలికెను.

ఇది జ్ఞానఖండమున విచారోదయమన్నది ప్రథమాధ్యాయము.

# ద్వితీయాధ్యాయము-విచారమాహాత్మ్యము

భార్గవరాముఁడు గురువునకు ప్రణమిల్లి అంజలించి ఇట్లు పలికెను. "భగవానుఁడా! పూర్వము క్రోధముతో రాజవంశములను ఇరువదియొక్కమారులు సంహరించి రక్తముతో నిండినమడుగులో పితరులకు తర్పణము గావించితిని. నాభక్తివిశేషమువలన పితృదేవతలు సంతుష్టులై నాక్రోధమును ఉపశమింపఁజేసిరి. మాతండ్రిగారి యాజ్ఞవలన శాంతుఁడ నైతిని. ఇప్పుడు విష్ణుదేవుఁడు శ్రీరాముఁడుగా అయోధ్యయందు అవతరించియున్నాఁడు. ఆయనయందు కూడ నేను క్రోధముచేత అంధుఁడనై బలగర్వముతో ఆయనను ఎదుర్కొంటిని. ఆయన నాబలగర్వమును తొలఁగించి పరాజితుని చేసి బ్రాహ్మణుఁడ నని దయతలఁచి ప్రాణములతో విడిచిపెట్టెను. అచ్చట నుండి తిరిగి వచ్చుచు నిర్వేదముతో నే నెంతయో దుఃఖించితిని. అప్పుడు మార్గమునందు నివురు గప్పిన నిప్పువలె నున్న సంవర్తుని ఆకస్మికముగా చూచితిని. ఆయన అవధూతేంద్రుఁడని స్ఫురించెను. సంతప్తుఁడైనవానికి చల్లనిగాలి సోకినట్లు ఆయనయొక్క సమాగమమున నాహృదయము చల్లఁబడి ఎంతోమాయి నొందితిని. అప్పుడాయనను, "అయ్యా! తమస్థితి ఎట్టిది?" అని ప్రశ్నించితిని. ఆయన తత్త్వముయొక్క సారమును ముద్దగా చేసి అమృతమును వలె నాకు అందించెను. దరిద్రుడు మహారాజ్ఞిని ఎట్లు తఱచి తఱచి ప్రశ్నింపఁజాలఁడో అట్లే నేనును ఆయనను వివరముగ అడుగఁజాలనైతిని. అయినను అది నాకు నెట్లు సులభముగ తెలియునో అట్లు చెప్పుఁడని ఆయనను ప్రార్థించితిని. అప్పుడాయన తమయొద్దకు పొమ్మని చెప్పెను. పిమ్మట గ్రుడ్డివాఁడు జనులను చేరుకొన్నట్లు నేను మిగుల సుఖప్రదములైన తమపాదములయొద్దకు చేరితిని.

తమవలన త్రిపురాదేవియొక్క మాహాత్మ్యమును సమగ్రమముగా విని ఆమెను భక్తితో ఉపాసించితిని. ఆమె తమయొక్క రూపమున నాచిత్తమునందు నిత్యము భాసించుచున్నది. దీనివలన ఫలమేమి? సంవర్తుఁడు చెప్పిన దేమో కొంచెము కూడ తెలియలేదు. భగవానుఁడా దయయుంచి ఆయన ఏమి చెప్పెనో అది నాకు బోధింపుఁడు. అది తెలియకున్నచో నాకు కృతకృత్యతకలుగదు. దానిని తెలిసికొనకుండ నేను చేయుచున్నదంతయు బాలక్రీడవలె తోఁచుచున్నది. పూర్వము నేను గొప్పదక్షిణలతో విశేషమైన యన్నప్రదానముతో పెక్కు యజ్ఞములను చేసితిని. వానిఫల మంతయు అల్పమే యని సంవర్తుఁడనెను. ఏది అల్పఫలమో అది అన్నివిధముల దుఃఖమే యగు నని తలంచుచున్నాను. సుఖము లేకుండుట దుఃఖము కాదని అల్పమైన సుఖమే దుఃఖ మని చెప్పుదురు. ఎందువల్ల ననఁగా సుఖము పోవునప్పుడు కలుగు దుఃఖము అసలు సుఖమే లేనప్పటి దుఃఖముకన్న మిగుల బాధాకరముగ నుండును. ఇంతమాత్రమే కాదు. అధికమైనసుఖమును సంపాదించినను అది కూడ ఎప్పుడైనను పోవచ్చు ననుభయము ఉండనేయున్నది. ఇంక ఏకర్మలు చేసినను ఏయుపాసనలు చేసినను మృత్యువు రాదు అనుమాట లేదు. త్రిపురాదేవి యుపాసనము కూడ మానసికమైన క్రియయే యగుటచేత అదియును బాలక్రీడవలెనే యున్నది. ఇది ఇట్లు కాకున్నను శాస్త్రభేదముచేత ఇంకొక విధముగా చేయవచ్చును. ఈయుపాసనమును ఈదేవిని గాక మఱియొక దేవతను ఆలంబనముగా గైకొని యైనను చేయవచ్చును. ఏదేవతను ఎట్లు ఉపాసించినను ఈయుపాసనాఫలము కూడ యజ్ఞముల ఫలములవలె అసత్యమే యగును. అసత్యము సత్యముతో సమయాన మెట్లగును? కర్మ గాని, ఉపాసన గాని కర్తవ్యమన్నచో అది నిత్యము చేయవలసియే యుండును. ఇంక దానికి అవధి ఎక్కడ? భగవంతుఁడైన యాసంవర్తుఁడు కర్తవ్యలేశము అను విషాగ్నిజ్వాలకు దూరుఁడై సకలవిధముల చల్లగా నున్నట్లు కన్పించినాఁడు. దావాగ్ని వనమును దహించుచుండఁగా దానికి ఎడముగా నున్నమంచి నీటి కొలనులో క్రీడించుచున్న గజమువలె ఆయన అభయమైన మార్గమును ఆశ్రయించి ఈలోకవ్యవహారమును చూచి నవ్వుచున్నవానివలె నాకు

కన్పించినాఁడు. ఆయన ఎట్టి కర్తవ్యము లేక సంతోషము అనునమృతమును ఆస్వాదించుచు ఆనందించుచున్నాఁడు. ఆయనకు అట్టి స్థితి ఎట్లు కలిగినది? అప్పుడాయన నాకు చెప్పినది ఏమి? ఇదియంతయు నాకు తమరు దయతో చెప్పి నన్ను కర్తవ్యము అను కాలసర్పమునుండి విముక్తుని గావింపవలయును."

ఇట్లు ప్రార్థించి భార్గవుఁడు గురువుయొక్క చరణములయందు సాష్టాంగముగ ప్రణమిల్లెను. అప్పుడు భార్గవుఁడు ముక్తిమార్గమున ప్రవేశించుటకు అర్హుఁడై యున్నాఁడని గ్రహించి దత్తాత్రేయుఁడు దయతో ఇట్లనెను. "వత్స! లెమ్ము. ధన్యుఁడ వైతివి సముద్రములో మునుగుచున్నవానికి నౌకవలె నీకు ఈయాలోచన కలిగినది. సకల కర్మానుష్ఠానములవలనను కలుగవలసిన ఫల మిదియే. సకల ప్రాణులహృదయములందును ఆకాశరూపమున నున్న యాత్రిపురాదేవి 'నీవు తప్ప నాకు వేఱు శరణము లేదు' అని తన్ను ఆశ్రయించుభక్తుని మృత్యువులపరంపరనుండి తప్పించి పరమపావనమైన పదమునకు చేర్చును. కర్తవ్యము అను భేతాళుని చూచి భయపడుచున్నంతవఱకు సుఖ ముండదు. కర్తవ్యము అను విషముచేత మూర్ఛితమై యున్నయీ జగత్తును చూడుము. ఇది తనకు ఏది హితమో దానిని గుర్తింపఁజాలకున్నది. అనాదికాలమునుండి ఇది భయంకరమైన కర్తవ్యమను విషసముద్రమునందు ఉడికిపోవుచు గతిని గానలేకున్నది.

కొందఱు బాటసారులు ఒకప్పుడు వింధ్యపర్వతమును చేరిరి. వారు ఆకలియొక్క తీవ్రతచేత కనులు తిరుగుచుండఁగా విషముష్టిపండ్లను చూచి తుమ్మికిపండ్లు అనుకొని భక్షించిరి. ఆపండ్లవలన కలిగిన విషజ్వాలచేత శరీరములయందు తాపము బయలుదేరగా వారు ఆతాపశాంతికై నిమ్మపండ్లనుకొని ఉమ్మెత్త పండ్లను తినిరి. దానిచేత వారు ఉన్మత్తులై ఒకరితో నొకరు కలహించుచు కొట్టుకొనుచు ముండ్ల పొదలలో పడి శరీరముల నిండ గాయము లగుచుండఁగా అర్ధరాత్రికి ఒకనగరద్వారమును చేరిరి; ద్వారపాలకులు అడ్డగింపఁగా వారితో కలహించిరి. ఆద్వారపాలకులు బెత్తములతో కొట్టనారంభింపఁగా వీరిలో కొందఱు అగడ్తలో కూపములలో పడి మరణించిరి. మఱి కొందఱు బందీలుగా పట్టువడిరి. లోకములో జనులు కూడ ఏదో మేలును కోరుచు కర్తవ్యవిషముచే మూర్ఛితులై నశించుచున్నారు.

భార్గవా! నీవు ధన్యుఁడవు; అభ్యుదయము నొందితివి. శ్రేయస్సు అనుమహాసౌధమును ఆరోహించుటకు మొదటిమెట్టు విచారణమే. సరియైన విచారణము లేకుండ ఎవనికైనను క్షేమము ఎట్లు కలుగును! ఆవిచారమే పెద్ద మృత్యువు. దానిచేతనే జను లందఱు హతులగుచున్నారు. విమర్శించి పనిచేయువాఁడు ఎల్లయెడల అభీష్టమును పొంది జయించుచున్నాఁడు. అవిచారముచే రాక్షసులు హతులైరి. దేవతలు విచారపరాయణులై సుఖము నొందిరి. వారు విచారమువలననే విష్ణువును ఆశ్రయించి శత్రువులను జయించుచున్నారు. సుఖ మనువృక్షమునకు చాల శక్తివంతమైన విత్తనము విచారము. విచారము గలవాఁడే అందఱికన్న అధికుఁ డగుచున్నాఁడు. దానిచేతనే బ్రహ్మవిష్ణుమహేశ్వరులు పూజింపఁబడుచున్నారు. దానిని కోల్పోయినప్పుడు వారు కూడ ఆపదలపాలైనారు. ఎవరు క్షణమైనను విచారమును వదలియుండరో వారే మహాత్ములు. వారికి నిరంతరము నమస్కరించుచున్నాను.

జనులు విమర్శింపకుండ కర్తవ్యములపాలై మూఢులగుచున్నారు. కొందఱు విచారించి అపారములైన సంకటములనుండి విముక్తి నొందుచున్నారు. ఈయవిచారము ఎప్పటినుండియో లోకములను ఆవరించియున్నది. ఎండలు మండుచుండఁగా ఎడారిలో చల్లని నీరు ఎట్లుదొరకదో అట్లే అవిచార మున్నంతవఱకు విమర్శపుట్టదు. విచారము కలుగుటకు దేవియారాధనమే పరమసాధనము. భక్తితో పరదేవతను ఆరాధించినచో ఆమె ప్రసన్నురాలై, ఆకాశము నందు సూర్యునివలె, చిత్తమునందు విచారరూపమున ప్రకాశించును. కావున కపటము లేకుండ గురువును సేవించి ఆయన బోధించిన క్రమమున సర్వాంతర్యామిని ఆత్మరూపయునైన త్రిపురామహేశ్వరిని ఆరాధింపవలయును. నిర్మలమైన భక్తి శ్రద్ధ ఆరాధనమునకు మూలములు. ఆమెమహాత్మ్యమును వినుటవలన భక్తి శ్రద్ధలు కలుగును. కావుననే నీకు మొదట మాహాత్మ్యమును వినిపించితిని. దానిని వినుటవలన ఇప్పుడు నీకు ఈశుభము కలిగినది. విచారము శ్రేయస్సునకు మూలము. కావున ఇంక నీకు భయము లేదు. సన్నిపాతజ్వరము వచ్చినవాఁడు ఔషధమును సేవించునప్పుడు ధాతువులయొక్క పరిశుద్ధత కలుగువఱకు భయముండును. అట్లే అవిచారమున్నంతవఱకు జీవులకు మహాభయము తప్పదు. విమర్శనము పుట్టనంతవఱకు కలుగుజన్మ లన్నియు నిష్ఫలములు. విమర్శనము కలజన్మమే సఫలము. బావిలోని కప్పవలె ఈబ్రహ్మాండ మనుకూపమునందు జీవులు శుభమేదో అశుభ మేదియో విమర్శించి గ్రహింపలేక పుట్టి పుట్టి నశించుచున్నారు. దుఃఖమును కలిగించు

వానియందు సుఖబుద్ధిని, సుఖమును కలిగించువానియందు దుఃఖమను తలంపును పొందుచు అవిచారముయొక్క ప్రభావమువలన సంసారాగ్ని యందు ఉడికిపోవుచున్నారు. ఆడగాడిద వెనుకకాళ్ళతో ఎన్ని పర్యాయములు తన్నుచున్నను మగగాడిద దానివెంటనే ఎట్లు పోవుచుండునో అట్లే జనులు పూడ సంసారమువలన ఎన్ని దుఃఖములు పొందుచున్నను దానిని వదలలేకున్నారు. నీవు విచారాత్మకమైన బుద్ధిని పొందితివి; కావున దుఃఖమును తరింపఁగలవు.

ఇదిజ్ఞానఖండమున విచారమాహాత్మ్యమన్నది ద్వితీయాధ్యాయము.

బాలప్రియ

ఉపాసన మానసికమైనక్రియ. అది కర్తవ్యముగా తోఁచుచున్నంతవఱకు సుఖము కలుగదు. ఆయుపాసనవలన విచారము కలుగవలె. తత్త్వమును విచారించినప్పుడు ఆత్మజ్ఞానము కలుగును. అప్పుడు కర్తవ్యబుద్ధిపోయి సుఖము కలుగును.

# మూఁడవయధ్యాయము - సత్సంగమాహాత్మ్యము

భార్గవరాముఁడు మిగుల కుతూహలముతో దత్తాత్రేయు నిట్లు ప్రశ్నించెను. "భగవానుఁడా తమరు చెప్పినది నిజము అవిచారమువలననే జను లన్నివిధముల నశించుచున్నారు. విచారమువలన శేయస్సు కలుగు ననియు తమరు నిరూపించినారు. కాని యిందు నాకొక పెద్దసందేహము కలుగుచున్నది. ఆవిచారమును పొందుట యెట్లు? దానికి సాధన మేమి? అది సహజమే యైనచో ఎల్లరును దానిని గూర్చి ఏల వినుట లేదు? నా కైనను అది యెప్పటివఱకు ఏల కలుగలేదు? నాకన్నను అధికమైన దుఃఖముకు పొందినవారు జీవితములో అడుగడుగున ఆపదలు పొందినవారు అనేకు లున్నారు? వారందఱును ఈవిచార మనుసాధనమును ఎందులకు పొందుట లేదు? దయతో చెప్పుఁడు."

అప్పుడు మరల దత్తాత్రేయుఁడు సంతోషించి యిట్లనెను. "నాయనా! వినుము. సత్పురుషులతో సమాగమమే సకల దుఃఖములను తొలఁగించి శ్రేయస్సునకు మూలకారణ మగును. పరమార్థ మనుఫలము లభించుటకు సత్సంగమే బీజ మని చెప్పుదురు. నీవు కూడ మహాత్ముఁడైన సంవర్తునియొక్క సమాగమమువలననే శ్రేయస్సునకు మూలమైన యీదశను పొందితివి? సత్పురుషులు సమీపమునకు వచ్చినంత మాత్రముననే మనకు పరమసుఖమును కలిగింతురు. సత్పురుషులతో సహవాసములేకుండ ఎవఁడు ఎప్పుడు పరమశ్రేయస్సును పొందినాఁడు? లోకమునందు ఎవఁడు ఎట్టివానితో కూడి యుండునో వాఁడు నిస్సంశయముగా అట్టిఫలమునే పొందును. ఈవిషయమున ఒకకథను చెప్పెదను వినుము.

పూర్వము దశార్ణ దేశమును ముక్తాచూడుఁడనురాజు పాలించుచుండెను. అతనికి హేమచూడుఁడు మణిచూడుఁడు అని యిరువురు పుత్రులుండిరి. రూపవంతులు విద్యావంతులు గుణవంతులు అయిన వారిరువురు ఒకనాఁడు సేనలతో కూడ వేటకొఱకు సింహవ్యాఘ్రాదులతో భయంకరమైన సహ్యపర్వతముయొక్క వనమునకు పోయిరి. వారు అచ్చట వాడియైన బాణములతో మృగములను సంహరించుచుండఁగా పెద్దగాలి బయలుదేరి ఇసుకను ఱాలను కర్షమువలె కురియఁజొచ్చెను. ఆకాశము దుమ్ముతో నిండిపోయి అమావాస్య రాత్రివలెనయ్యెను. ఆమహాంధకారమున సైన్యమంతయు చెల్లాచెదరయ్యెను. రాజపుత్రులును చెరియొకదిక్కుగా పరువెత్తిరి.

హేమచూడుఁడు ఒకతాపసాశ్రమమును చేరెను. సుందరమైన యా యాశ్రమమున అతఁడు బంగారువర్ణమున అగ్నిశిఖవలె ప్రకాశించుచున్న యొకకన్యను చూచెను. ఆసుందరిని చూచి అతఁడు నవ్వుచు "ఎవరు నీవు? నిర్జనమైన భయంకరమైన యీవనమునందు ఎట్లు నివసించుచున్నావు? ఇచ్చట మీవా రెవరున్నారు? ఒంటరిగా ఎట్లుందువు?"

అని యడిగెను. ఆమె యిట్లనెను. "రాజపుత్రా! నీకు స్వాగతము. ఈయాసనముపై కూర్చుండుము. అతిథులను పూజించుట తపస్వులకు ధర్మము. నీవు తీవ్రమైనగాలిచే బడలియున్నావు. గుఱ్ఱమును ఖర్జూరవృక్షమునకు కట్టివేసి కొంచెము విశ్రమింపుము. తరువాత నావృత్తాంతమును విన్పింతును.

హేమచూడుఁడు అట్లే గావించిన పిమ్మట ఆమె అతనికి ఫలములతో రసములతో ఆతిథ్య మొసంగెను. అతఁడు విశ్రాంతి నొంది సుఖాసీనుఁడై నతరువాత ఆమె మధురముగా ఇట్లు చెప్పెను. "రాజకుమారా! శివభక్తుఁడైన వ్యాఘ్రపాదుఁడనుమునివర్యునకు నేను ధర్మముచేత పుత్రికను. నాపేరు హేమలేఖ. ఆయన తపోబలము చేత పుణ్యతమములైన లోకములను ఆర్జించి మునినాయకులచే పూజింపఁబడుచుండెను. ఒకనాఁడు విద్యుత్ప్రభ అనువిద్యాధరి ఇక్కడ నున్న వేణానదియందు స్నానమొనరింప వచ్చెను. అప్పుడే సుషేణుఁడు అను వంగదేశపురాజు కూడ అచ్చటికి వచ్చి స్నానము చేయుచున్నయామెను చూచి మన్మథవశుఁడయ్యెను. పిదప అతఁ డామెను తన్ను వరింప ప్రార్థించెను. ఆమెయు వానిసౌందర్యమునకు మోహితయై వానితో సంగమించెచు. అతఁడు వెడలిపోయిన తరువాత జరిగిన యపచారమును గ్రహించి, భర్తను తలంచి ఆమె యత్యంతభీతయై సద్యోగర్భమున జన్మించిననన్ను ఇచ్చటనే వదలి వెడలిపోయెను. సంధ్య నుపాసించుటకై నదికి వచ్చిన వ్యాఘ్రపాదుఁడు నన్ను చూచి కరుణించి తెచ్చి పెంచెను. నేను ఆయనకు ధర్మపుత్రికనై పితృసేవాపరాయణనై యున్నాను. ఆయనయొక్క మహిమవలన దుష్టబుద్ధులైనచో దేవదానవులుకూడ ఈయాశ్రమమును ప్రవేశింపఁజాలరు. ఎట్లేని ప్రవేశించి రేని నశింతురు. కావున నాకు భయ మేమియు లేదు. ఇది నావృత్తాంతము. కొంచెము సేపుండుము. మాతండ్రి రాగలఁడు. ఆయనను దర్శించి ప్రణమిల్లి అభీష్టమును పొంది రేపు ఉదయము పోవచ్చును."

ఆమెమాటలను విని సౌందర్యమోహితుఁ డయ్యును అతఁడు మాటాడలేకుండెను. అతనియవస్థను గ్రహించి ఆమె "రాజపుత్రా! ధైర్యమును వహింపుము. ఆయన ఇప్పుడే రాఁగలఁడు. వెంటనే నీయభీష్టమును తెలిపి ప్రార్థింపుము" అని పలికెను. ఇంతలో పత్ర పుష్పాదులను గైకొని వ్యాఘ్రపాదుఁడు చనుదెంచెను. హేమచూడుఁడు లేచి ఆయనకు ప్రణమిల్లి పేరు చెప్పుకొని ఆయన కూర్చుండు మనఁగా కూర్చుండెను. ఆయన యోగదృష్టితో వానివృత్తాంతమును అభిలాషను గ్రహించి యోగ్యుఁడే అని నిశ్చయించి ఆమెను అతనికి పత్నిగా నొసంగెను. హేమచూడుఁడు చాల సంతోషము నొంది ఆమెను గైకొని నగరమునకు పోయెను. ముక్తాచూడుఁడు హేమలేఖను చూచి చాల సంతోషించి గొప్పవైభవముతో విధియుక్తముగా వివాహమును జరిపించెను.

అంతట హేమచూడుఁడు ఆమెతో కూడి సౌధములందు వనములందు నదీతీరములందు భోగపరుఁడై క్రీడింపఁజొచ్చెను. ఆమె ఆతనివలె భోగములందు ఆసక్తి నొందకుండెను. ఆమె ఎల్లప్పుడును ఉదాసీనురాలుగా నుండుటను గమనించుచు హేమచూడుఁడొకనాఁడు ఏకాంతమునందు ఆమెతో నిట్లనెను. "నేను నీయందు అత్యంతము అనురాగము కలిగియున్నాను. కాని నీకు నాయందు అనురాగము లేదా? ఏల భోగములయందు ఎప్పుడును ఆసక్తిని పొందకున్నావు? నీకు అభీష్టములైన భోగములు ఇచ్చుట లేవా? చాల శ్రేష్ఠములైన భోగములయందు కూడ నీవు అనాసక్తితోనే వర్తించుచున్నావు. నీవు అనాసక్తవుగా ఉన్నచో భోగములందు నాకు మాత్రము ఆనందమెట్లు కలుగును? నేను నీయందు ఎంతఆసక్తి కలిగియున్నను నీవు నాయందు మనస్సు లేనిదానవుగా నున్నావు. నేను పలకరించినను నీవు వినిపించుకొనవు. నేను నిన్ను గాఢముగా కౌగిలించుకొని చాలసేపైనను "మీరు ఎప్పుడు వచ్చితిరి?" అని అడుగుచున్నావు. ఇట్టి దాంపత్యమునందు కొయ్యబొమ్మతోడి సాంగత్యమునందువలె సుఖమెట్లుండునో చెప్పుము. నీయభిప్రాయ మేమో తెలుపుము. నిజము చెప్పవేని నామీఁద ఒట్టు."

ఇది జ్ఞానఖండమున సత్సంగమాహాత్మ్యమను తృతీయాధ్యాయము.

బాలప్రియ

హేమలేఖ తల్లియగు విద్యుత్ప్రభ కన్యకాదు. ఆమెకు భర్త యున్నాఁడు. అందువలననే ఆమె సుషేణునితో సంగమించిన తరువాత భయపడుచు పుట్టినబిడ్డను వదలి భర్తయొద్దకు వెడలిపోయినది. తన తల్లి యొక్క వ్యభిచారమును, అందులో కూడ తనపుట్టుకకు కారణమైన వృత్తాంతమును హేమలేఖ హేమచూడునకు నిస్సంకోచముగ తెలిపినది.

దీనివలన ఆమెయొక్క సత్యపరత్వము ఎంత గొప్పదో, హృదయము ఎంత నిర్మలమో వ్యక్తమగుచున్నది. సకల ధర్మములలో సత్యము శ్రేష్ఠము. సకల జీవులలో సత్యపరాయణులు ఉత్తములు. కావుననే హేమచూడుఁడు మాత్రమే కాక ముక్తాచూడుఁడు మొదలగువారు కూడ ఆమెను మిగుల ఆదరించిరి.

హేమలేఖ జీవన్ముక్తురాలు. ఆమెకు సంసారాభిలాష లేదు. వ్యాఘ్రపాదుఁడు కూడ హేమచూడునియందు హేమలేఖపై వాంఛయున్నట్లు గమనించెనే కాని హేమలేఖ యభిప్రాయమును గమనింపలేదు. హేమలేఖ కూడ వివాహమును నిరాకరింప లేదు. ఆమెకు వివాహ మొనర్చి భర్తయొద్దకు పంపవలసిన బాధ్యత వ్యాఘ్రపాదునకు ఏర్పడినది. లేకున్నచో ఆమెసౌందర్యమును చూచి ఎవరైనను ఆమెను కోరవచ్చును. అప్పుడు వారితో సంఘర్షణ తప్పదు. ఆమెకు వివాహ మొనర్చినచో ఆయనకు ఒకపెద్ద బాధ్యత తీరినట్లగును. ఇది గమనించియే ఆమె తనకు సంసారము అక్కఱ లేకున్నను వివాహమునకు అంగీకరించినది. మఱియును జీవన్ముక్తులు వ్యవహారమును ఆత్మకన్న అన్యముగా చూడరు. అందువలన వ్యవహారముచేత వారికి బంధముకలుగదు.

# నాల్గవయధ్యాయము - సత్సంగఫలము

కంఠమును కౌగిలించుకొని ఇట్లు పలుకుచున్న భర్తను చూచి హేమలేఖ దరహాసముతో నిట్లనెను. "నాథ! నామాట వినుము. నేను నీయందు విరక్తురాలను కాను. కాని లోకమున ఏది చాల ప్రియము. ఏది అప్రియము అని ఆలోచించుచున్నాను. ఏదియు నిశ్చయింప లేక స్త్రీ స్వభావమువలన దానిని గూర్చియే చింతించుచున్నాను. ఇందు తత్త్వమేదియో నీవు చెప్పవలె". హేమచూడుఁడు పకపక నవ్వి యిట్లనెను. స్త్రీలు మూఢబుద్ధులనుట నిజము. సందియము లేదు. పశువుల పక్షులు కూడ తమకు ఏది ప్రియమో ఏది అప్రియమో తెలిసికొనుచున్నవి. అవి తమకు ప్రియమైనవానిని సమీపించుచు, అప్రియమైన వానినుండి దూరముగా తొలఁగిపోవుచున్నవి. దేనివలన సుఖము కలుగునో అది ప్రియము. దేనివలన దుఃఖము కలుగునో అది అప్రియము. ఇందులో ఇంత ఆలోచింపవలసిన దేమున్నది?" అప్పుడు హేమలేఖ ఇట్లనెను. "స్త్రీలకు విమర్శనజ్ఞాన ముండ దనుట నిజము. కావుననే నీవు చక్కఁగా విమర్శించి నాకు బోధింపవలె. నీవు చక్కఁగా బోధించినచో నేను కూడ ఈచింతనువదలి నీతోఁ గూడి నిరంతరము భోగముల ననుభవింతును. సుఖము నిచ్చునది ప్రియము, దుఃఖమును కలిగించునది అప్రియము అని సూక్ష్మముగా విమర్శించి చెప్పితివి. కాని ఒకపదార్థమే ఒక ప్రదేశమునందు ఒకసమయమునందు ప్రియముగా ఉన్నను అదియే ఇంకొక ప్రదేశమున వేఱొక సమయమున అప్రియ మగుచున్నది. ఇదియే ప్రియము. ఇదియే అప్రియము, అని దేనినిగూర్చి నిశ్చితముగా చెప్ప వీలగును? చలికాలమున ఇష్టమైన నిప్పుసెగ, ఎండలకాలమున ప్రియ మగుట లేదు. అట్లే చలిదేశములలో సుఖముగా నుండునెండ ఉష్ణదేశములలో తాపమును కలిగించుచున్నది. పరిమాణభేదముచేత ఒకపదార్థమే ప్రియము అప్రియము కూడ అగుచున్నది. కుంపటిలో నున్ననిప్పును ఎవరైనను ఉపయోగించుకొందురు గాని కార్చిచ్చును ఎవ్వరును కోరరు. ధనము భార్య పుత్రులు రాజ్యము మొదలగునవి యన్నియు ఇట్టివే. ఏదియును ఎల్లప్పుడు ప్రియము కాదు. ధనము భార్యలు పుత్రులు రాజ్యము పుష్కలముగా ఉండికూడ మహారాజు ప్రతిదినము ఏదో నొక సమస్యతో చింతించుచునే యుండును. అవియేవియు లేనివాఁడు నిశ్చింతగా నుండుటయు మనము చూచుచునే యున్నాము. సుఖము కొఱకు మనము కోరుచున్న భోగములు కూడ అనంతములుగా నున్నవి. ఎవడును సకల భోగములను పొంది సుఖించుట లేదు. కొంచెము భోగము కలిగినచో సుఖము కలుగదా అని అందువేమో. వినుము. దుఃఖముతో కూడిన సుఖము సుఖమే కాదు. దుఃఖము రెండు విధములుగా నున్నది. శరీరమునందు వ్యాధివలన కలుగుదుఃఖము బాహ్యము. కోరికలవలన మనస్సులో కలుగునది ఆంతరము. మానసికమైన దుఃఖము బలవత్తరమైనది. అదియే యీలోకము నంతను మ్రింగుచున్నది. కోరికయే దుఃఖమను వృక్షమునకు గట్టివిత్తనము. కోరికలకు దాసులైకదా ఇంద్రాదులైన దేవతలుకూడ నిత్యము కార్యనిమగ్ను

లగుచున్నారు. కోరిక తీరుచు అందు కొంచెమే మిగిలి యున్నను అప్పుడు కలుగు సుఖము దుఃఖమువంటిదే యగును. అంత కన్నను పశుపక్ష్యాదులకు కలుగుచున్న సుఖమే మేలు. వందలకొలఁది కోరికలు గలమానవునకు ఏదో కొంచెము లభించినప్పుడు సుఖము కలుగు నన్నచో ఇక సుఖము లేనివాఁ డెవఁ డుండును? అట్లు సుఖముండు నన్నచో శరీరమంతయు దగ్ధ మగుచుండఁగా గంధపు నీటిబిందువుచేతనే వానికి దేహము చల్లఁబడి హాయి కలుగునని చెప్పవలసియుండును. ప్రియురాలియొక్క కౌఁగిలివలన మానవుఁడు సుఖమును పొందుచున్నాఁడు. అప్పుడు సంభవించునట్టి శరీరముయొక్కవైషమ్యమువలన సంభోగముయొక్క పరిశ్రమమువలన తుదకు దుఃఖమే కలుగుచున్నది. నాడీసంఘట్టనమువలన కొంచెము సుఖము కలుగుచున్నచో అంతమాత్రపుసుఖము కుక్కలకు లేదా? వానియందు లేనిసౌందర్యవిశేషము మనుష్యులయం దున్నది? ఆసౌందర్యమును గ్రహించుటవలన మనకు విశేష మైనయానందము కలుగుచున్న దనియందుపేని, అదియును అభిమానమువలన కలుగుచున్నదే ఒకఁడు మెచ్చిన సౌందర్యమును మఱియొకఁడు మెచ్చఁడు. పదిమందికి వికృతముగా కన్పించు పురుషుఁడు ఒకానొక స్త్రీకి ప్రియుడు కావచ్చును.

పూర్వము ఒకరాజకుమారుఁ డుండెను. అతఁడు మన్మథుని మించినయందగాఁడు. ఆతనిభార్య కూడ చాల సౌందర్యవతి. అతఁడు ఆమెయందు అత్యంతము ఆసక్తుఁడై యుండెను. ఆమె మాత్రము ఒకభృత్యునియందు ఆసక్తురాలై యుండెను. వాఁడు ఆరాజపుత్రునకు ఎక్కువమోతాదులో మద్యము నొసంగుచు వానికి బాగుగా మత్తు కలిగినతరువాత కురూపిణియైన యొకచేటికను రాజకుమారునియొద్దకు పంపి తాను ఆసుందరితో భోగించుచుండెను. అతిలోకసౌందర్యవతియైన భార్యతో సుఖించుచున్నానని ఆరాజపుత్రుఁడు అనుకొనుచు ధన్యుఁడ నైతి నని తనతో ఎవఁడును సమానుఁడు కాదని తలంచుచుండెను. ఇట్లు చాలకాలము జరిగెను. ఒకనాఁడు దైవయోగమున ఆభృత్యుఁడు పానపాత్రను రాజపుత్రునియొద్ద నుంచి వేఱొకపనిమీఁద త్వరగా పోవలసివచ్చెను. రాజకుమారుఁడు దానిని ఎక్కువగా త్రాగలేదు. కాని వెంటనే పోయి శయనమందిరమునందున్న చేటికతో రమించెను. అతనికి త్వరలోనే మత్తు వదలి పోయెను; వెనుకటివలె నిద్రముంచుకొని రాలేదు. అందువలన శయ్యపై వికృతాకారముతో నున్న చేటికను చూచి, ఇది యేమి అని విభ్రాంతుఁడై, "నాప్రియురా లెక్కడ?" అని ప్రశ్నించెను. అది భయముతో గడగడ వణఁకుచు మాటాడక నిలిచియుండెను. జరిగిన మోసమును గ్రహించి అతఁడు కోపముతో కనులెఱ్ఱబడుచుండఁగా దానిజుట్టు పట్టుకొని కత్తి జళిపించుచు, "నిజము చెప్పుము. లేకున్నచో నిన్నిప్పుడే నఱికెదను" అని బెదరించెను. అది ప్రాణభీతితో యథార్థమును చెప్పి భృత్యునితో కూడియున్న యతని భార్యను చూపించెను.

ఒకచోట నేలమీఁద చాపపై మలినదేహుఁడు వికృతమైన ముఖము కలవాఁడు నల్లగా మొరటుగా నున్నభృత్యుఁడు ఒడలుమఱచి నిద్రించుచుండెను. వానిని గాఢముగ కౌఁగిలించుకొని సౌందర్యవతి యైన రాజకుమారునిభార్య నిద్రించుచుండెను. వారిని అట్లు చూచి నంతనే రాజకుమారునకు మూర్ఛ వచ్చినట్లయ్యెను. ఆతఁడు కొంతసేపటికి తన్ను తాను నిగ్రహించుకొని ఏమనుకొనెనో వినుము. "ఛీ! సురాపానమత్తుఁడ నైననే నెంతమూఢుఁడను! ఛీ! స్త్రీలయందు అత్యాసక్తులగు పురుషులు ఎంత అధములు! ఒకగోరువంక ఒకచెట్టునే ఆశ్రయించియుండదు. అట్లే స్త్రీలును ఒక్కపురుషునే ఆశ్రయించియుండరు. నేను ఎంతగా దున్నపోతువంటివాఁడను కాకున్నచో దీనిని ప్రాణముల కన్న ప్రియురాలినిగా తలంతునా? శరత్కాలమునందలి మేఘము కన్నను స్త్రీలచిత్తవృత్తి చంచలము. ఎవఁడు స్త్రీలను నమ్మికొని యుండునో వాఁడు నిజముగా అడవిగాడిదయే. స్త్రీస్వభావము ఇట్టిదని ఇప్పటివఱకును తెలిసికొనకుండితిని. కావుననే ఇది నన్ను వదలికురూపుఁడైన భృత్యునితో కూడి కులుకుచు నాయందు ఎంతో భక్తిని నటించుచున్నది. నేను సురాపానమత్తుఁడనై దీనిస్వభావమును రవ్వంతయు గ్రహింపలేక వంచితుఁడనై ఘోరమైన యాకారముగలదానితో క్రీడించుచుంటిని. నిజముగా ఈజగత్తులో నాకన్న మూఢుఁడెవఁడున్నాఁడు? ఇంత వికృతముగానున్న యానీచభృత్యునియందు ఈదుష్టురాలు ఏమి సౌందర్యమును చూచి తనయందు అత్యంత ఆసక్తుఁడనై యున్న నన్ను వీడి వీనిని గూడుచున్నది?"

ఇట్లు అనేక విధముల విలపించి ఆరాజపుత్రుఁడు అత్యంతము నిర్వేదము నొంది సర్వసంగములను వీడి వనములకు పోయెను. కావున సౌందర్య మన్నది మనస్సులో పుట్టునట్టిది. నేను సుందరినని నీవు నాయందు ఎంత ఆనందమును పొందుచున్నావో అంతకన్న అధికముగా కూడ కొందఱు వికృతముగా నుండు స్త్రీలయందు పొందుచున్నారు. ఇచ్చట నొకవిషయమును శ్రద్ధగా గమనింపుము. పురుషుడు స్త్రీని చూచునప్పుడు ఆమె వానికి వెలుపలనే యుండును.

వెలుపల నున్న యామెయొక్క రూపమును అతఁడు తన మనస్సులో చిత్రించుకొనును. ఆరూపమునే అతఁడు మాటిమాటికి భావించుకొనుచు కోరికలను పెంచుకొనుచుండును. ఆకోరికలయొక్క వేగము చేత ఇంద్రియములు క్షోభించుచుండగా ఆమెను కూడి సుఖించుచున్నాఁడు.అట్లు ఇంద్రియములక్షోభను పొందనివాఁడు ఏసుందరియుందును వాంఛను రతిని పొందుటలేదు. ఇంద్రియక్షోభకు మూలము వాంఛ. వాంఛకు మూలము మనస్సులో ఒక యాకారమును చిత్రించుకొనుట. కావుననే బాలురకు యోగులకు ఎంత సౌందర్యవతిని చూచినను ఇంద్రియక్షోభము కలుగుట లేదు. కావున అందము అన్నది మనస్సులోనే పుట్టుచున్నది. వెలుపలి వస్తువు అందులకు నిమిత్తమాత్రమే. ఏస్త్రీయందు పురుషుఁడు రతిని పొందుచున్నాఁడో ఆమె అందముగా నున్నను లేక మనదృష్టిలో వికారముగా నున్నను వాఁడు ఆమెయందు సౌందర్యమునే భావించుచున్నాఁడు. అత్యంత బీభత్సములైన యాకారములు గలస్త్రీలును పురుషులనుగూడి బిడ్డలను పొందుచున్నారు. ఆస్త్రీలు అందముగా నున్నా రని తోఁచకపోయినచో లేదా చాల వికారముగ నున్నా రని తోఁచినచో ఆపురుషులకు వారియందు రతి యెట్లు సంభవించును?

కావున రాజపుత్ర! వినుము. పురుషునకు స్త్రీయందు ఏర్పడుచున్నయభిమానమే అతనికి సుఖహేతు వగుచున్నది కాని ఆమె సౌందర్యముకాదు. తేనెయొక్క తీపివలె దేహమునందు సౌందర్యము సహజమే అయినచో బాలబాలికలకు ఏల అనుభవమునకు వచ్చుట లేదు? దేశభేదములనుబట్టి మనుష్యులు వివిధములైన యాకారములను గలిగియున్నారు. ఒంటికాలు, ఒంటికన్ను, చట్టిముక్కు, మిట్టపండ్లు మొదలగు వికారములు కలవారును పెక్కుమంది కలరు. నీవు నా వలన ఎట్లు సుఖించుచున్నావో వారును అట్లే తమస్త్రీలవలన సుఖించుచున్నారు. స్త్రీశరీరము పురుషులకు, పురుషశరీరము స్త్రీలకు ముఖ్యమైన సుఖసాధనముగా నున్నది. ఈశరీరముయొక్క వాస్తవస్థితి ఎట్టిదో విచారింపుము. ఇది యస్థిపంజరము. ఇది నాడీసముదాయములయల్లికతో రక్తమాంసముల పూతతో చర్మముతో కప్పఁబడి గాదెవలె మలమూత్రములతో నిండియున్నది. ఇది శుక్రశోణితములవలన స్త్రీయొక్క గర్భమునందు ఏర్పడి మూత్రద్వార సమీపమునుండి వెలికివచ్చుచున్నది. ఆహా! ఇట్టి శరీరము కదా ప్రియముగా భావింపఁబడుచున్నది. ఈశరీరమును కోరు చున్నావు కదా! దీనిలోని రక్తమాంసాది భాగములలో ఏది నీకు ప్రియయో చెప్పుము? ఇట్టి బీభత్సమైన శరీరమునందు మనుష్యులు ఆసక్తు లగుచున్నా రన్నచో మలము పైకి ప్రాకుచున్న క్రిములకును వీరికిని భేద మేమున్నది? ఇట్టి వస్తుస్థితియందు ఏది ప్రియమో ఏది అప్రియమో ఎట్లు నిశ్చయింపవచ్చునో చెప్పుము?"

ఈమాటలను విని యాతఁడు ఆశ్చర్యము నొంది ఆలోచించుచు భోగములందు విరక్తుఁ డయ్యెను. పిమ్మట నతఁడు క్రమక్రమముగా ఆమెను ప్రశ్నించుచు తనయందు చిత్స్వరూపిణి యైనపరదేవతను తెలిసికొని అఖిలప్రపంచమును తనస్వరూపముగానే చూచుచు జీవన్ముక్తుఁ డయ్యెను. అతనివలన తత్త్వమును తెలిసికొని తమ్ముఁడు మణిచూడుఁడు, తండ్రి ముక్తాచూడుఁడును జ్ఞానులైరి. ముక్తాచూడుని భార్యయు కోడలివలన జ్ఞానమును పొందెను. మహారాజువలన రాజపుత్రుల వలన ఉపదేశము నొంది మంత్రులు పౌరులు కూడ జ్ఞానవంతులైరి. క్రమముగా ఆనగరమున తత్త్వజ్ఞుఁడు కాని వాఁడెవఁడును లేకుండెను. విశాలమైన యానగరమునందు సంసారవాసనలు శమించి అది బ్రహ్మపురము అను ప్రఖ్యాతి నొంది జగత్తునందు అత్యుత్తమ మైనదిగా ప్రకాశించెను. అచ్చట చిలుకలు గోరువంకలు కూడ పంజరములలో నుండి ఇట్లు పఠించుచుండెను.

"దృశ్యమును వదలి దృక్స్వరూపమైన మీయాత్మను పొందుఁడు. దర్పణమునందు ప్రతిబింబమువలె దృక్కుకన్న అన్యముగా దృశ్యములేదు. దృక్కే దృశ్యముగా నున్నది. నేనును దృక్కే. చరాచరమైన దంతయు దృక్కే సర్వమునకు దృక్కు స్వరూపము అగుటచేతనే సర్వమును భాసిచుచున్నది. దృక్కు మాత్రము స్వతంత్రముగా ప్రకాశించుచున్నది. కావున జనులందఱును భ్రాంతిని వీడి దృక్కును మాత్రమే గ్రహించుచు సర్వమునకు ఆశ్రయమై భాసించుచున్నదృక్కునే భజింపుఁడు".

వాసుదేవుఁడు మొదలైన బ్రాహ్మణు లొకసారి అచ్చటికి వచ్చి ఆచిలుకలు పలుకుచున్నవాక్యమును విని, "ఇందు పక్షులు కూడ విద్యా ప్రసంగమును చేయుచున్నవి. కావున ఇది విద్యానగరమే" అని పలికిరి. అప్పటినుండి అది విద్యానగరముగా ప్రసిద్ధ మయ్యెను.

కావున రామా! సర్వశుభములు కలుగుటకు సత్సంగమే మూలము. హేమలేఖయొక్క సంగమమువలననే ఆనగరములోని వారందరకు తత్త్వవేత్తలైరి. అందువలన శ్రేయస్సునకు శ్రేష్ఠమైన సాధనము సత్సంగమే యని తెలిసికొనుము."

ఇది జ్ఞానఖండమునందు హేమచూడోపాఖ్యానమున సత్సంగ ఫలమున్నది చతుర్థాధ్యాయము.

బాలప్రియ

హేమలేఖ భర్తకు తత్త్వమును బోధించినది. ఆమెవలన అత్తగారును తత్త్వమును తెలిసికొనెను. హేమచూడునివలన తండ్రి. అన్న మొదలగు పెద్దవారు తత్త్వమును తెలిసికొనిరి. అందువలన చిన్నవారివలన, స్త్రీలవలన కూడ తత్త్వమును తెలిసికొనవచ్చు నని వ్యక్తమగు చున్నది.

హేమలేఖ తత్త్వమును బోధింపఁజూచినప్పుడు తనజ్ఞానమును ప్రకాశింపఁజేయలేదు. ఆమె ప్రియము అప్రియము అనువానినిగూర్చి చర్చ మొదలుపెట్టి హేమచూడుఁడు లోకవ్యవహారమునుగూర్చి ఆలోచించునట్లుచేసినది. అతనికి జిజ్ఞాస కలిగి ప్రశ్నించుట మొదలుపెట్టిన తరువాత సమాధానములు చెప్పుచు తత్త్వమును బోధింప మొదలు పెట్టినది. భార్యభర్తృభావమునందు వర్తనమునందును ఆమె ఎట్టి భేదమును పొందలేదు. మఱియును స్త్రీలకు స్త్రీలు. పురుషులకు పురుషులు తత్త్వమును బోధించియుండుట గమనింపఁదగియున్నది.

# అయిదవయధ్యాయము - బంధాఖ్యాయిక

భార్గవుఁడు మిగుల హర్షము నొంది దత్తాత్రేయునితో నిట్లనెను. "భగవానుఁడా ఈకథవలన ఎవఁడు ఎట్టిసంగమును పొందుచున్నాఁడో వాఁడు అట్టిఫలమునే పొందు నని, సత్పురుషులతోడి సంగమమువలన పరమశ్రేయస్సు కలుగు ననియు విశదమైనది. భార్యవలన ఉపదేశము నొందిన హేమచూడుఁడు ఏక్రమమున జీవన్ముక్తుఁ డయ్యెనో దయతో వివరింపుఁడు."

దత్తాత్రేయుఁడిట్లు చెప్పెను. "ఆమె మాటలను విన్నతరువాత హేమచూడుఁడు సకలవిషయములను విరసములనుగా చూచుచు మిగుల నిర్వేదము నొందెను. చాలకాలముగా విషయవాసనలకు లోఁబడియున్నవాఁ డగుటచే భోగములను వెంటనే వదలుకొనుటకుఁ గాని వెనుకటివలె అనుభవించుటకుఁ గాని చేతకానివాఁ డయ్యెను. అతఁడు సిగ్గుపడి ఆమెతో ఏమియు చెప్పలేదు. వికలమైనమనస్సుతో అతఁ డిట్లు కొన్నిదినములు గడపెను. భృత్యులు భోగములను సమకూర్చుచున్నప్పుడు ప్రియురాలు చెప్పినదానిని స్మరించుచు, తన్ను తాను ఏవగించుకొనుచుండియు. పూర్వవాసనాబలమున వానిని అనుభవించుచుండెను. తరువాత ఆభోగములయందలి దోషములనుగూర్చి చింతించుచు మాటిమాటికి దుఃఖము నొందుచుండెను. ఊగుచున్న యుయ్యెలయం దున్నట్లుగా అతని చిత్తము ఆందోళిత మగుచుండెను. శ్రేష్ఠమైన భోజనము వస్త్రము భూషణము వనిత వాహనము మిత్రులు మొదలుగా దేనివలనను అతఁడు సుఖమును పొందఁజాలకుండెను. భోగములను వదలలేక పూర్వమువలె అనుభవింపలేక అతఁడు సర్వమును పోఁగొట్టుకొన్నవానివలె దీనుఁడై యుండెను.

అతనిస్థితిని గమనించి హేమలేఖ ఒకనాఁడు ఏకాంతమునుందు ఇట్లనెను. "నీవు ఎందువల్లనో వెనుకటివలె ఉల్లాసముతో నుండుట లేదు. దిగులుపడుచున్నట్లు కప్పించుచున్నావు. కారణ మేమి? భోగములవలన రోగములు కలుగు నని చెప్పుదురు. నీకు అట్టిబాధ ఏమియు కలుగలేదు కదా? సాధారణముగా సకల దేహములయందును. రోగములు ఉండునే యుండును. ఆహారము వస్త్రములు వాక్కు దర్శనము స్పర్శనము దేశకాలములు చేయుచున్నపని మొదలుగా దేని యందు వైపరీత్యము కలిగినను శరీరమున దోషములు ప్రకోపించును. కావుననే అవి

మనకు తెలియకుండఁగనే రోగములను కలిగించుచున్నవి. అవి పైకి వచ్చినతరువాత వానికి చికిత్స చెప్పఁబడుచున్నది. పుట్టని రోగమునకు ఎవఁడును ఎక్కడను చికిత్సను చెప్పలేదు కదా! కావున నీకు దేనివలన దుఃఖము కలుగుచున్నదో చెప్పుము."

హేమచూడుఁ డిట్లనెను. "నీమాటలను విన్నప్పటినుండి వెనుకటివలె దేనివలనను నాకు సుఖము కలుగుటలేదు. ఉరిశిక్ష విధింపఁబడినవానికి ఏభోగమైనను ఎట్లు సుఖమును కలిగింపదో అట్లే నాకును మానాయనగారు సమకూర్చుచున్న భోగము లేవియు సుఖమును కలిగించుట లేదు. వెట్టిచాకిరి చేయుచున్నవానివలె ఇంద్రియ వాసనలకు లోఁబడి వర్తించుచున్నాను. ఏమిచేసినచో నాకు సుఖము కలుగునో చెప్పుము."

అప్పుడు హేమలేఖ తనలో ఇట్లు అనుకొనెను. "ఈతనికి నామాటలవలన గాఢమైన నిర్వేదము కలిగినది. ఈతనియందు శ్రేయస్సునకు బీజము ఉన్నది. కావుననే ఇట్లయ్యెను. ఎవరియందు శ్రేయస్సుయొక్క బీజము ఉండదో అట్టివారికి ఎట్టిబోధలవలన కూడ రవ్వంతయు మార్పు కలుగదు. స్వాత్మదేవతయైన త్రిపురాదేవిని ఎప్పుడో ఒకప్పుడు చిరకాలము ఆరాధించియున్న వారికే ఇట్లు భోగములందు వైముఖ్యము కలుగును." పిదప ఆమె ప్రియునకు తత్త్వమును బోధింపఁదలఁచి తనపాండిత్యము ప్రకాశింప నీయక ఇట్లు చెప్పెను.

పురాతనమైన నావృత్తాంతమును వినుము. పూర్వము మా అమ్మ నాకొక చెలికత్తె నొసంగెను. అది సహజముగా మంచిదే యైనను శూన్య అను దుష్టురాలితో సఖ్యము కలిగియుండెను. విచిత్రములు వివిధములును అయిన విషయములను ఆశ్చర్యకరముగ సృష్టింపఁగలయాదుష్టురాలు మాతల్లికి కన్నుగప్పి నాచెలికత్తెతో చేరుచుండెను. దానిని నాచెలికత్తె వీడఁజాలకుండెను. నేను కూడ నా చెలికత్తెను వదలలేకుంటిని. నేను దానియొక్క నిర్మలస్వభావమునకు లోనై దానిని వదలి క్షణము కూడ ఎచ్చటను నిలువఁజాలకుంటిని. ఆదుష్టురాలు రహస్యముగా నాచెలికత్తెను తనకుమారునితో కూర్చెను. వాఁడుసురాపానముచే మదించిన మూఢాత్ముఁడు. వాఁడు నాయెదుటనే ఆమెను ఆక్రమించి భోగింపఁజొచ్చెను. అది వానిచేత అనుభవింపఁడుచు నన్ను ఎప్పుడును వీడకుండెను. నేను కూడ దానిని వదలలేకుంటిని. తరువాత ఆమూఢునకు వానివంటివాఁడే అస్థిరుఁడు అను కొడుకు పుట్టెను. వాఁడు వెంటనే యువకుఁడై అతిచంచలుఁ డయ్యెను. తండ్రియొక్క మూఢత్వము నాయనమ్మయొక్క గుణము కలిగి వాఁడు అనేకములైన చిత్రవిషయములను నిర్మింప సమర్థుఁడై యుండెను. వాఁడు స్వయముగా పెక్కువిషయములలో విశారదుఁడయ్యును శూన్య అనుపేరుగల నాయనమ్మచేత మూఢుఁడు అనుపేరు గల తండ్రిచేత నిపుణతనుపొంది అత్యంతశీఘ్రము అకుంఠితమునైన గమనము కలవాఁడయ్యెను.

ఇట్లు జన్మచేత నాసఖి మంచిస్వభావము కలదయ్యును దుష్టురాలిసాంగత్యముచేత చాల మాలిన్యమును పొందెను. ఆమె ప్రియుని యందు పుత్రినియందు అత్తయందును దృఢమైన యనురాగమును పొంది నన్ను క్రమముగా విడిచిపెట్టెను. నేను సహజముగా సరళమైన స్వభావము కలదాన నగుటచే ఆమెను వదలిపెట్టఁజాలక ఆమెనే అనుసరించుచు నుంటిని. అంతట ఆమూఢుఁడు ఆమెను ఎల్లప్పుడు అనుభవించుచుండుటయే కాక నన్ను కూడ ఆక్రమించుటకు పూనుకొనెను. కాని నేను స్వభావముచేత పరిశుద్ధురాల నగుటచే వాస్తవముగా వానికి వశపడలేదు. అయినను నేను ఆమూఢునిచే అనుభవింపఁబడుచున్నా నని లోకములో అన్నియెడల పెద్దయపవాదు ప్రబలెను. నా స్నేహితురాలు అస్థిరుఁడను తనకుమారుని నాకు అప్పగించి నిరంతరము మూఢుని కౌఁగిలిలో మెలఁగుచు తత్పరురాలై యుండెను. పిమ్మట అస్థిరుఁడు నాచేత పెంచఁబడి నాయనమ్మయొక్క అనుమతితో ఒక ప్రౌఢురాలిని పొందెను. దానిపేరు చపల. అది వానియిష్టము ననుసరించి ప్రతిక్షణము భిన్నభిన్నములైన మనోహరరూపములను ధరించుచు వానిని వశపఱచుకొనెను. వాఁడుక్షణములో లెక్కలేనన్ని యోజనములు పోయి తిరిగివచ్చును. కాని రవ్వంతయు బడలికనొందఁడు. చపల కూడ వాఁడు ఎక్కఁడికి పోయినను వానివెంటనే అచ్చటికి పోయి వానికి యిష్టమైన రూపముతో వానిని సంతోషపెట్టుచుండెను. ఆమెకు వానివలన అయిదుగురు కుమారులు కలిగిరి. వారు మాతాపితృపరాయణులు. నాచెలికత్తె వారిని తెచ్చి నాదగ్గఱ ఉంచెను. నేను నాసఖియందలి యనురాగముచేత వారిని బలవత్తరులను గావించితిని. వారు తల్లిచేత చక్కఁగా పోషింపఁబడి ఒక్కొక్కరు ఒక్కొక్కటిగా విచిత్రములు విశాలములు శ్రేష్ఠములును అయిన స్థానములను ఏర్పఱచుకొని తండ్రిని తమవశ మొనర్చుకొనిరి. క్షణక్షణము వారు తండ్రిని తమస్థానములకు తీసికొని పోవఁజొచ్చిరి. అస్థిరుఁడు జ్యేష్ఠకుమారుని నిలయమునందు ఒక్కొక్క ప్రదేశమున ఒక్కొక్క విధముగా సుస్వరములు,

విస్వరములు సంగీతము మంగళ వాద్యములు వేదమంత్రములు శాస్త్రములు ఆగమములు ఇతిహాసములు భూషణములసవ్వడి తుమ్మెదలపాటలు కోకిలలయాలాపములు మొదలుగా వివిధములైన శబ్దములను విని సంతోషించుచుండెను. అంతట కుమారుఁడు పేటొకపైపునకు వానిని గైకొని పోయెను. అచ్చట అస్థిరుఁడు భయంకరములైన సింహాదిగర్జనలు మేఘములయుఱుములు పిడుగుల ధ్వనులు వినుచు చకితుఁ డగుచుండఁగా ఏడుపులు మూల్గులు కేకలు పెడబొబ్బలు మొదలగునవియు వినఁబడఁజొచ్చెను. అంతటితో అఁతడు వికలచిత్తుఁడై రెండవకుమారునివెంట వానిభవనమునకు పోయి దానియందు మెత్తగానున్న యాసనములను శయనములను, కఠినత వేడిమి చల్లదనము మొదలైన స్పర్శగుణములను కలిగిన పదార్థములను ప్రియములైనవానిని అప్రియములైనవానిని గూడ చూచి అటనుండి బయల్వెడలెను. మూఁడవకుమారుని యింటియం దతఁడు కంటికింపుగా అనేకవర్ణములలో మనోహరముగా నున్న పదార్థములను భయంకరములైనవానిని బీభత్సముగా నున్నవానిని చూచుచుండఁగా నాల్గవకుమారుఁడు తండ్రిని తన భవనమునకుఁ గొని పోయెను. అచ్చట అస్థిరుఁడు రసవంతములైన పుష్పములను ఫలములను మధురములైన భక్ష్యములను పానీయములను కటువుగా చేదుగా పుల్లగా ఉప్పగా ఉండుపదార్థములను కూడ రుచిచూడవలసివచ్చెను. అప్పుడు చివరికొడుకు అతనిని తనయింటికి తీసికొనిపోయెను. అక్కడ అఁతడు ఆహ్లాదమును ఏవగింపును వికారమును మూర్ఛను కలిగించునట్టి వాసనలుగల యనేకపదార్థములను అనుభవింపవలసివచ్చెను. ఇట్లు అతఁడు పుత్రులయొక్క భవనములందు నివసించుచు ఇష్టములైనవి లభించినప్పుడు సంతోషించుచు అప్రియములైనవి తటస్థించినప్పుడు దుఃఖించుచు రాకపోకలు చేయుచుండెను. ఆకుమారులును తండ్రియందున్న ప్రేమచేత ఎచ్చట నైనను ఏపదార్థము నైనను కొంచెముగా కూడ తండ్రి లేనప్పుడు తాకకుండిరి. అస్థిరుఁడు వారియిండ్లలో బహుపదార్థములను అనుభవించి కొన్నింటిని దొంగిలించి రహస్యముగ తెచ్చుకొని పుత్రులు లేకుండ భార్యతో కూడి నిత్యము అనుభవించుచుండెను.

చపలకు మహాశన అనుచెల్లెలు కలదు. ఆమెయును అస్థిరునేపతినిగా వరించెను. అతఁడు ఆమెయందు ఆసక్తుఁడై ఆమెయొక్క ప్రీతికొఱకు పెక్కుభోగములను సంపాదించుచుండెను. వాని నన్నింటిని ఆమె క్షణములో భక్షించి ఇంకను తెమ్మని పలుకుచుండెను. అతఁడును అయిదుగురు పుత్రులును ఎన్ని పదార్థములను సమకూర్చుచున్నను వాని నన్నింటిని క్షణములో భుజించుచు ఆమె ఎల్లప్పుడును ఆకలితోనే అల్లాడుచుండెను. ఆమె అల్పకాలముననే జ్వాలాముఖుఁడు నింద్య వృత్తుఁడు అనుకొడుకులను కనెను. వారిరువురు తల్లికి ప్రియతములుగా నుండిరి. అస్థిరుఁడు మహాశనయందు ఆసక్తుఁడై నంతనే జ్వాలాముఖునియొక్క జ్వాలలచే పీడితుఁడై గాఢమైనమూర్ఛ నొందుచుండెను. ఒక్కొక్కప్పుడు నిందవృత్తునితో కూడి ఎల్లరచే నిందింపఁబడుచు చచ్చినవానితో సమానుఁ డగుచుండెను. ఇట్లు అస్థిరుఁడు దుఃఖమును పొందుచున్నప్పుడు, నాచెలికత్తె స్వభావముచేత మంచిదే యైనను, పుత్రునియందలి అమిత వాత్సల్యముచేత వానితో చేరి తానును దుఃఖించుచు మనుమలైన జ్వాలాముఖుఁడు నింద్యవృత్తుఁడు వచ్చి కౌఁగిలించుకొను చుండఁగా ఒడల మండిపోవుచుండ లోకముచే నిందింపఁబడుచు చచ్చినదానితో సమాన యగుచుండెను. ఆమెతో ఎల్లప్పుడు కలిసియుండునేను కూడ ఇంచు మించుగా అట్లే అయితిని. ఇట్లు నాసఖియొక్క దుఃఖముచేత నేనును దుఃఖించుచుండఁగా చాల ఏండ్లు గడచిపోయెను.

మహాశనను పరిగ్రహించుటవలన అస్థిరుఁడు అస్వతంత్రుఁడయ్యెను. అతఁడేదో యొకకర్మ ననుసరించి ఒకచోట పదిద్వారములుగల పురమును పొందెను. దానియం దతఁడు భార్యాపుత్రాదులతో నివసించుచు రాత్రింబవళ్ళు సుఖమును కోరుచు దుఃఖము ననుభవించుచుండెను. భార్య లిద్దఱు ఇటునటు లాగుచుండఁగా జ్వాలాముక నింద్యవృత్తులచేత ఒడలు మండిపోవుచుండఁగా, ప్రతిదినము లోకులచే నిందింపఁబడుచు, వారిని వీడ్కొని అయిదుగురు కుమారులయొక్క భవనములకు పోవుచు తిరిగివచ్చుచు బడలిక నొందుచు ఎచ్చటను సుఖము పొందలేకుండెను.

కుమారుఁడిట్లు దుఃఖపడుచుండుటచేత వానితల్లియగు నాచెలికత్తెయు మిగుల దుఃఖముతో మూర్ఛనొందినదానివలె ఆపురమునందు పడియుండెను. జ్వాలాముఖ నింద్యవృత్తులతో కూడి మహాశన, శూన్యచేత (భర్త యొక్క నాయనమ్మ) మాయమైన మూఢునిచేత పోషింపఁబడుచు. సవతియైన చపలతో కూడి విజృంభించి అస్థిరుని తనవశము గావించుకొని ఆపురమునందుండెను. నాసఖియందలి ప్రీతిచేత నేను కూడ ఆమెతో కూడి అచ్చటనే యుంటిని. ఆమె యొక్క దుఃఖముచేత నేనును దుఃఖితురాలనై చచ్చినదానివలె నైనను వారి నందఱును రక్షింపవలయునని పూనుకొని

యుంటిని. నేను అక్కడ ఒక్కక్షణము లేకున్నచో వారు ఎవ్వరును నిలువలేరు. నేను గదా సర్వమును రక్షించుచుంటిని.

నేను శూన్యతో కూడినప్పుడు శూన్యత్వమును, మూఢునితో మూఢత్వమును, అస్థిరునితో అస్థిరత్వమును, చపలతో చపలత్వమును జ్వాలాముఖునితో ప్రజ్వలనమును, నింద్యవృత్తునితో నింద్యమైన వర్తనమును పొందుచుంటిని, సఖియొక్క సంయోగమువలన నేను ఇట్లు ఆయారూపములను పొందుచుంటిని, నేను దానిని వదలినచో అది క్షణములో నశించును. వారితో కూడియున్న నన్ను చూచి మూఢులైన జనులందఱును వ్యభిచారిణి యని పలుకుచుండిరి; కాని నిపుణులైనవారు మాత్రము నన్ను నిర్మలమైన దానినిగానే గ్రహించుచుండిరి.

మాతల్లి మహాపతివ్రత పరిశుద్ధురాలు. నిర్మల మైన యాకృతి కలది. ఆమె ఆకాశముకన్నను విశాలమైనది. పరమాణువుకన్నను సూక్ష్మమైనది. ఆమెసర్వజ్ఞురాలైనను ఏమియు తెలియనిదిగా నుండును; సర్వమును చేయుచున్నను ఏమియు చేయనట్లే యుండును. సకలమునకు ఆమెయే ఆశ్రయ మయ్యును ఏయాధారము లేనిదానివలె నుండును. ఆమె సర్వమునకు ఆధారమై యుండియు ఎవ్వరికిని ఆశ్రయ మిచ్చినట్లు కన్పింపదు. అన్ని రూపములు ఆమెవే అయినను ఆమెకు ఏరూపములేదు. సర్వము ఆమెతో కూడియున్నను ఆమె దేనితోను కూడియుండదు. ఆమె ఎల్లయెడలను ప్రకాశించుచున్నను ఎవ్వనిచేతను ఎచ్చటను తెలిసికొనఁబడుటలేదు. ఆమె మహానందము కల దయ్యును ఆనందము లేనిదానివలె నుండును. ఆమె తల్లిదండ్రులను వదలిపెట్టెను. ఆమెకు నావంటి పుత్రికలు సముద్రములో తరంగములవలె లెక్కలేనంతమంది యున్నారు. వారందఱును నా వలెనే సఖీకుటుంబపరాయణలై యుండిరి. సఖీగణములతో కూడి యుండినను నేను ఒకమహామంత్రముయొక్క సామర్థ్యముచేత స్వరూపమునందు మాతల్లివలెనే యుంటిని.

నాసఖియొక్క పుత్రుఁడు ఆపురమునందు తిరిగి తిరిగి ఎప్పుడు బడలిక నొందునో అప్పుడు అస్థిరుడు తల్లియొక్క యొడియందు చేరి గాఢముగ నిద్రించును. అతఁడు నిద్రించినంతనే వానిపుత్రులు మొదలగు వా రందఱును నిద్రింతురు. ఎవ్వఁడును మేల్కొనియుండఁడు. అప్పుడు అస్థిరునియొక్క ప్రియమిత్రుఁడు ప్రచారుఁడు అను పేరుగలవాఁడు ముందున్న రెండుద్వారములో చరించుచు పురమును రక్షించుచుండును. అస్థిరుని తల్లియైన నాసఖి పుత్రునితో నిద్రించునప్పుడు ఆమెయొక్క అత్త చెలికత్తెయు నైన శూన్య పుత్రునితో కూడ వారి నందఱును ఆవరించి రక్షించుచుండును. ఇట్లు అందఱు నిద్రించిన తరువాత నేను మాతల్లిని చేరి ఆమెకౌఁగిటియందు ఆనందముతో నుందును. మరల వారందఱు లేచినవెంటనే వారివెంట పోవుచుంటిని.

అస్థిరునకు మిత్రుడైన ప్రచారుఁడు మహాబలము గలవాఁడు. వాఁడు ప్రతిదినము అస్థిరుఁడు మొదలగువారిని పోషించుచుండును. వాఁడు ఒక్కఁడే అనేకవిధములుగా రూపొంది పురమును పురవాసులను అందఱును పరస్పరసంబంధము కలవారినిగానొనర్చి రక్షించుచుండును. హారమునందు కూర్పఁబడినమణులు దారము తెగిపోయినచో ఎట్లు రాలిపోవునో అట్లేవాఁడు లేకున్నచో వారందఱును ఎవరికి వారుగా విడిపోయి నాశ మొందుదురు. వాఁడు నాతో కూడి నాచేత సంజీవితుఁడై నన్ను వారందఱితో కూర్చుచు ఆపురమున సూత్రధారుఁడుగ నున్నాఁడు. ఆపురము జీర్ణ మైనచో వాఁడు వారి నందఱను వేఱొక పురమునకుఁ గొనిపోవుచుండును. ఇట్లు ఆప్రచారుని ఆశ్రయించి అస్థిరుఁడు విచిత్రములైన పెక్కుపురములకు అధిపతి యయ్యెను. భార్యాపుత్రులున్నను మహాబలుఁడైన ప్రచారునియొక్క ఆశ్రయముండినను నేను అండగా ఉండినను అస్థిరుఁడు అన్ని విధముల దుఃఖమునే పొందుచుండెను. వాఁడు భార్యలచేత పుత్రులచేత నిరంతరము ఇటునటు లాగఁబడుచు రవ్వంతయు సుఖమును పొందలేక పోఁగా మహాక్లేశములను పొందుచుండెను. ఒక్కొక్కప్పుడు అయిదుగురు పుత్రులు వానిని అయిదువైపులకు లాగుచుందురు. చపలతో కూడినప్పుడు మిగుల చంచలుడై ఖేదము పొందుచుండును. ఒకప్పుడు మహాశన కొఱకు ఆహారమును సంపాదించుటకు పరువెత్తుచుండును. వేఱొకప్పుడు జ్వాలాముఖునితో కూడి విజృంభించి ఆపాదమస్తకము మంట పుట్టుచుండఁగా దానిని శాంతింపఁజేసికొనుటకు ఉపాయము నెఱుఁగక పెద్దమూర్ఛను పొందుచుండును. నింద్యవృత్తునితో కూడినప్పుడ ఇతరులచే నిందింపఁబడి బెదరింపఁబడి దుఃఖించుచు తన్ను చచ్చిన వానితో సమానముగ తలంచుచుండును. దుష్కులమునందు పుట్టిన యాయస్థిరుఁడు దుష్టులైన భార్యాపుత్రులతో కూడి వారియందలి మోహముచేత ఎల్లప్పుడు వెంట తిరుగుచు ఒకప్పుడు గొప్ప నగరములలో మఱియొకప్పుడు

నీచప్రదేశములలో నివసించుచుండెను. క్రూర మృగములతో నిండిన యరణ్యములలో, ఎండలు మండిపోవుచుండు ఎడారులలో, నీరు గడ్డకట్టుచుండు శీతల ప్రదేశములలో, దుర్వాసన ప్రబలుచుండు తావులలో, చీఁకటిగుహలలో నివసించుచు అస్థిరుఁడు ఎంతో దుఃఖమును పొందుచుండును. కుమారుని దుఃఖముచేత నా సఖియు దుఃఖించుచుండును. సహజముగా పరిశుద్ధురాలినే యైనను ఆమెను ఆకుటుంబమును అనుసరించుచు నేను కూడ నిష్కారణముగా మూఢురాలివలె నైతిని. ఎడారిలో వేసవియందు ప్రయాణముచేయు వాఁడు దప్పికను ఎట్లు తీర్చుకొనలేఁడో అట్లే దుష్టసాంగత్యము కల వాఁడును ఎచ్చటను కొంచె మైనను సుఖమును పొందఁజాలఁడు.

ఇట్లు చాలకాలము గడచినతరువాత ఒకనాఁడు నాచెలికత్తె అత్యంత దుఃఖముచేత వికలచిత్తయై నన్ను రహస్యముగా కలిసికొనెను. ఆమె నన్నే ఆశ్రయించుకొని ఉపాయమును పొంది మంచి భర్తను గైకొని తనకుమారుని జయించి వానిపుత్రులు మొదలగు వారిని కొందఱను చంపి కొందఱను బంధించి నాతో కూడి మాతల్లి యొక్క పురమునకు వడిగా చేరెను. కల్మషమును తొలఁగించుకొన్న నాసఖి మాతల్లిని మాటిమాటికి కౌఁగిలించుకొనుచు ఆనందసముద్రమున మునిగినదానివలె నయ్యెను. కావున నాథా! నీవు కూడ ఇట్లే చెలికత్తెవలన పుట్టిన దుర్వర్తనుని నిగ్రహించి మీతల్లిని చేరి నిత్యమైనసుఖమును పొందుము. నేను అనుభవించిన వృత్తాంతమును సుఖమును కలిగించునట్టిదానిని నీకు చెప్పితిని."

ఇది జ్ఞానఖండమున హేమచూడోపాఖ్యానమునందు బంధాఖ్యాయిక అనుపంచమాధ్యాయము.

బాలప్రియ

ఏవిషయము నైనను నేరుగా చెప్పినదానికన్నను చిత్రవాక్యములతో విషయమును స్ఫురింపఁజేయుచు చెప్పినచో ఎక్కువగా మనస్సునకు పట్టును. ఈకారణముచేతనే సాహిత్యమునందు రచయితలు వాచ్యముగ నిరూపించుపద్ధతికన్నను వ్యంగ్యముగ స్ఫురింపఁజేయు పద్ధతినే (Suggestive method) ఎక్కువగా ఆదరించుచున్నారు. వ్యంగ్యపద్ధతిలో చెప్పినప్పుడు వినువాఁడు ఆవిషయమునుగూర్చి ఆలోచించుచు దానిస్వరూపము మనస్సునకు గోచరించినప్పుడు చాల సంతోషపడును. అప్రయత్నముగా పొందినదానికన్నను ప్రయత్న పూర్వకముగా సంపాదించినదే మనస్సునందు చిరకాలము హత్తుకొని యుండును. కావున హేమలేఖ తత్త్వమును నేరుగా చెప్పక కథారూపమున చెప్పినది.

ఈకథలో "నేను" అనఁగా జీవాత్మ. ఇది జీవాత్మయొక్క కథ. శుద్ధచైతన్యము జీవాత్మకు తల్లి. తల్లి యొసంగిన చెలికత్తె బుద్ధి. బుద్ధి సహజముగా శుద్ధమే. బుద్ధికి స్నేహితురాలు శూన్య. అజ్ఞానమే శూన్య. అజ్ఞానముతో కూడిన బుద్ధి ననుసరించుచు జీవుఁడు బహిర్ముఖుఁడై విషయములందు ప్రవర్తించుచుండును. అందువలన జీవుఁడు బుద్ధిని వదలియుండఁడు. అజ్ఞానము లేక అవిద్యయొక్క కుమారుఁడు మోహము లేక మహామోహుఁడు. అవిద్య బుద్ధికి మోహముతో సాంగత్యమును కలిగించును. మోహమువలన బుద్ధికి పుట్టినవాఁడు అస్థిరుఁడు. మనస్సే అస్థిరుఁడు. మోహము బుద్ధిని మాత్రమే ఆక్రమించినది జీవుని ఆక్రమింప లేదు చిదాత్మస్వరూపుఁడగు జీవుఁడు ఎప్పుడును శుద్ధుఁడే. బుద్ధియొక్క సంబంధమువలన జీవుఁడు కూడ మోహగ్రస్తుఁడైనట్లు కన్పించునే కాని యథార్థముగా శుద్ధుఁడుగానే యుండును. "జీవుఁడు నిత్యశుద్ధబుద్ధస్వభావుఁడు" అని తెలియనివారు జీవుఁడు కూడ మూఢుఁడయ్యె నని తలంచుచుందురు. బుద్ధిని మోహము ఆక్రమించినప్పుడు జీవుండు మనస్సునకు అధీనమగును. మనస్సుయొక్క భార్య చపల, ఇది ఊహచేత విషయములను కల్పించుకొనఁగలశక్తి. మనస్సుయొక్క ఈకల్పనశక్తియే చపల. వీరికి కలిగిన పుత్రులు శ్రోత్రము. త్వక్కు. చక్షుస్సు, జిహ్వ, ఘ్రాణము అను నైదు ఇంద్రియములు. ఈయైదుగురును శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము అనువిషయములను తమస్థానములనుగా పెంపొందించుకొనిరి. మనస్సు ఒక్కొక్క యింద్రియము వెంట ఒక్కొక్క విషయమునందు ప్రవేశించి అనుకూలవిషయముల వలన సుఖము, ప్రతికూల విషయములవలన దుఃఖము పొందుచుండును. ఇట్లు మనస్సు ఇంద్రియముల కధీనమై సుఖదుఃఖములను పొందుచు వానియొక్క సంస్కారములను లేక వాసనలను హృదయమునందు చేర్చుచు వానిని స్వప్నములందు మరల అనుభవించు చుండును.

చపలయొక్క చెల్లెలు మహాశన ఇదియే కామము. ఆశన మనఁగా ఆహారము. మహాశన అనఁగా పెద్దఆహారము కావలసినది. కామమునకు ఎంత ఆహారమును సమకూర్చినను అది ఇంకను కోరుచునే యుండును. అందువలన అది మహాశన. ఇది మనస్సునకు రెండవభార్య. మనస్సునకు కామమువలన పుట్టిన కుమారులు క్రోధము, లోభము. క్రోధము జ్వాలాముఖుఁడు. క్రోధము అగ్ని జ్వాలవలె ప్రజ్వలించి మనస్సును తపింపఁజేయును. లోభము నింద్యవృత్తుఁడు. లోభము కలవాఁడు, ధృతరాష్ట్రునివలె, పాపవర్తనము కలవాఁడై లోకముచేత నిందింపఁబడును. క్రోధలోభములచేత మనస్సు మాత్రమే కాక బుద్ధి, జీవుఁడు కూడ దుఃఖముచేత మూర్ఛను పొందినట్లున్నారు. మనస్సు కామమునకు వశమై కర్మవశమున శరీరమును పొందును. అది పదిద్వారములుగల పురమువంటిది. రెండు కన్నులు, రెండు చెవులు, రెండు ముక్కులు, మూత్రద్వారము, మలద్వారము, బ్రహ్మరంధ్రము అనునవి పదిద్వారములు. మనస్సు ననుసరించి బుద్ధి, జీవుఁడు ఒకశరీరమునుండి మఱియొకశరీరమునకు చేరుచుండిరి. జీవుఁడు లేకున్నచో బుద్ధి మనస్సు ఇంద్రియములు మొదలుగా ఏవియును పనిచేయవు. జీవునియొక్క చైతన్యమువలననే అవి పనిచేయుచున్నవి. వానివ్యవహారమును చూచి అది యంతయు జీవునిదే అని తలంచుచు కొందఱు "జీవుఁడు మూఢుఁడు, చంచలుఁడు"అనే మనస్సుయొక్క బుద్ధియొక్క లక్షణములను జీవునియందు ఆరోపించుచున్నారు. నిజమునకు ప్రతిబింబములతో అద్దమునకు ఎట్లు సంబంధము లేదో అట్లే మనోబుద్ధుల వ్యవహారముతో జీవునకు ఎట్టిసంబధంము లేదు. జీవునితల్లి అనఁగా స్వరూపము శుద్ధచైతన్యము అందువలన జీవుఁడు ఎప్పుడును శుద్ధుఁడే అని తత్త్వజ్ఞులు గ్రహింతురు.

మనస్సు బడలిక నొందినప్పుడు బుద్ధియొక్క యొడియందు విశ్రమించును. అప్పుడు ఇంద్రియములు కూడ నిద్రించును. అప్పుడు మనస్సునకు మిత్రమైన ప్రాణము లేక ప్రచారుఁడు శరీరమును రక్షించుచుండును. అప్పుడు జీవుఁడు శుద్ధచైతన్యముతో ఏకీభవించుచు సుఖించుచుండును. ప్రాణము లేకున్నచో మనస్సు ఇంద్రియములు మొదలుగా ఏవియు నిలువజాలవు. వీనికి జీవునకును ప్రాణమువలననే సంబంధము కలుగుచున్నది. ప్రాణమునకు శక్తియంతయు జీవుని చైతన్యమువలననే కలుగుచున్నది. కర్మానుభవము పూర్తి యైనప్పుడు శరీరము శిథిలమై పడిపోవును. అప్పుడుప్రాణము ఆశరీరమును వదలిపెట్టి మనస్సును బుద్ధిని ఇంద్రియములను గైకొని మరల కర్మననుసరించి ఇంకొకశరీరమున ప్రవేశించును. ఇట్లు జీవుఁడు మనస్సుతో ప్రతిశరీరములో ఏవో పుణ్యములను పాపములను చేయుచు వానియొక్క సంస్కారముల ననుసరించి దివ్యశరీరములను క్రిమికీటకాదశరీరములను పొందుచు పరిభ్రమించుచుండును. ఒకప్పటికి బుద్ధి విరక్తినొంది మోహమును వదలి మంచిభర్తను పొందును. అఁనగా బుద్ధి సద్గురువును ఆశ్రయించును. నిర్మలమైన బుద్ధి సద్గురుబోధ వలన రహస్యమైన జీవుని స్వరూపజ్ఞానమను గ్రహించి ఇంద్రియములను జయించి మనస్సును నిగ్రహించి శుద్ధచైతన్యముతో మాటి మాటికి కూడుచు మహానందమును పొందును. అనఁగా బుద్ధి శుద్ధచైతన్యమునుగూర్చి నిరంతరము మననము చేయుచు దానితో తాదాత్మ్యమును పొందును. అదియే జీవునకు ముక్తి.

శుద్ధచైతన్యమునందు హేమలేఖవంటి జీవులు లెక్కలేనంత మంది యున్నారు. అందఱికథ ఇట్టిదే. ప్రతిజీవుఁడు బుద్ధి మనస్సు అవిద్య అనువాని ననుసరించుచు సంసారి అగుచున్నాఁడు. కాని యథార్థముగ జీవు లందఱును సముద్రములోని తరంగములు, సముద్రముకన్న భిన్నముగా ఎట్లు లేవో, అట్లే శుద్ధచైతన్యముకన్న అన్యముగా లేరు. వారు. 'మేముసంసారులము. బద్ధులము' అని తలంచుచున్నప్పుడు కూడ వారి స్వరూపము శుద్ధచైదతన్యమే, అన్యముకాదు. త్రాడునందు పాము అను భ్రాంతి కలిగినప్పుడు ఆపాము ఎప్పుడు ఎట్లు లేదో అట్లే జీవునియందు సంసారిత్వము కూడ ఎప్పుడును లేదు. అందువలన జీవుఁడు యథార్థముగా ఎప్పుడును శుద్ధ చైతన్యరూపుఁడే.

### కథలోని సంకేతములు.

తల్లి = శుద్ధచైతన్యము లేక త్రిపురాదేవి

కూతురు = జీవుఁడు

తల్లి యొసంగిన చెలికత్తె = బుద్ధి

బుద్ధియొక్క స్నేహితురాలు = శూన్య = అవిద్య

శూన్యయొక్క కొడుకు = మోహము (మహామోహుఁడు)

మోహమువలన బుద్ధికి పుట్టినకొడుకు అస్థిరుఁడు = మనస్సు

మనస్సుయొక్క మొదటిభార్య చపల = కల్పన

మనస్సువలన చపలకు పుట్టిన కొడుకులు పంచజ్ఞానేంద్రియములు -

ఇంద్రియములు: స్థానములు :

శ్రోత్రము శబ్దము

త్వక్కు స్పర్శము

చక్షుస్సు రూపము

జిహ్వ రసము

ఘ్రాణము గంధము

చపలయొక్క చెల్లెలు మహాశన = కామము = మనస్సునకు రెండవభార్య

మనస్సువలన కామమునకు పుట్టిన కొడుకులు-

(1) జ్వాలాముఖుఁడు = క్రోధము

(2) నింద్యవృత్తుఁడు = లోభము

పదిద్వారములుగలపురము = శరీరము

అస్థిరుని (మనస్సుయొక్క) ప్రియమిత్రుఁడు పురరక్షకుఁడు

ప్రచారుఁడు = ప్రాణము

బుద్ధి మంచిభర్తను పొందుట = సద్గురువు నాశ్రయించుట

## ఆఱవయధ్యాయము-శ్రద్ధాప్రశంస

ప్రియురాలి మాటలను విని హేమచూడుఁడు విస్మితుఁడై నవ్వుచు ఇట్లనెను. "నీవు చెప్పిన దంతయు గగనకుసుమమువలె నిరాధారముగా తోఁచుచున్నది. నీవు అప్సరసకు జన్మించి వనములో మహర్షిచేత పెంచఁబడినావు కదా! నీవుఇప్పుడిప్పుడే ౹ౕవన దశలో అడుగిడుచున్నావు. నీకు తారుణ్యము ఇంకను పూర్తిగా రాలేదు. ఇట్టినీవు వేలయేండ్లుగా నున్నట్లు చెప్పుచున్నావు. దయ్యము పట్టినదానిమాటలవలె అసందర్భముగానున్న నీవచనములవలన యథార్థముగ నేమి తెలిసికొందును? చెప్పుము. నీచెలికత్తె ఆమె కొడుకు ఎక్కడ నున్నారు? ఆపురము లెక్కడ నున్నవి? అది పోనిమ్ము. నాకు మాయమ్మ ఏసఖిని ఈయలేదే! మాతండ్రిగారికి మాయమ్మ తప్ప ఇంక ఎవరును భార్యలు లేరే! నీవుచెప్పినదంతయు విదూషకుని ప్రసంగమువలె నున్నది. గొడ్రాలికొడుకు రథముయొక్క నీడనెక్కి మనుష్యుల కొమ్ములతో ఆకాశములోని యరణ్యమునందు పుట్టబోవురాజును చంపి ఎండమావులనీళ్ళలో స్నానముచేసి కలలోని కామినులతో క్రీడించుచున్నాఁడని చెప్పుట ఎట్టిదో నీ ప్రసంగము అట్లున్నది."

అప్పుడు హేమలేఖ ఇట్లనెను. "నాథా! నీకు నేను చెప్పినది అర్థములేనిది ఎట్లగును? మావంటివారిమాట నిరాధారము కానేరదు. అసత్యము తపస్సును నాశమొనరించును. సత్యశీలురయందు అసత్య మెట్లుండును? విషయమును తెలిసికొనఁగోరుచున్నవానికి అసత్యమును చెప్పువాఁడు ఏలోకమందును సుఖపడఁజాలఁడు. మఱి ప్రియుఁడవైన నీకు నేను అసత్యమును ఏల చెప్పుదును? నేను చెప్పునది యసత్యమే యనుకొనుము. దానిని నీవు మంచి బుద్ధితో విమర్శింపవచ్చును గదా. లోకమునందు వ్యవహారకుశలుఁడు ప్రతివిషయమును ఏదో యొకయంశమునందు పరీక్షించి ఆవిషయము సరిగా నున్నదో లేదో తెలిసికొనుచున్నాఁడు. నీకు ఈవిషయమున నిదర్శనము చూపెదను. చూడుము. నేను నీకు పూర్వము చెప్పినదంతయు సుఖసాధనమే యైనది కదా! ఇప్పుడు చెప్పునది మాత్రము సుఖసాధనమెందులకు కాదు? వెనుకటి నావాక్కుల నిదర్శనమువలననే ఇదియును సత్యమే యని గ్రహింపుము. నేను చెప్పుచున్నదానిని నిర్మలమైన బుద్ధితో గ్రహింపుము. ఆప్తులయొక్క వచనమునందు నమ్మకము లేకపోవుటయే సాధువులకు శత్రువు. ప్రేమగల తల్లి బిడ్డను పెద్దభయములనుండి ఎట్లు రక్షించునో అట్లే శ్రద్ధయును సాధకుని సర్వవిధముల రక్షించును. ఆప్తవాక్యములయందు శ్రద్ధలేనిమూఢుని సంపద యశస్సు సుఖము త్యజించుచున్నవి. శ్రద్ధలేనివాఁడు సర్వవిధముల హీనుఁడగును. జగత్తులకు శ్రద్ధ దాదివంటిది. ఎల్లరకు శ్రద్ధయే జీవనము. తల్లియందు శ్రద్ధ లేకున్నచో బాలుఁడు ఎట్లు బ్రతుకునో చెప్పుము? భార్యయందు శ్రద్ధ లేకున్నచో యువకుఁడు ఎట్లుసుఖము పొందగలఁడు? బిడ్డలయందు నమ్మకము లేని వృద్ధుఁడు చక్కఁగ నెట్లుండఁగలఁడు? పంట వచ్చు నను నమ్మకము లేకున్నచో కృషీవలుఁడు భూమి నెట్లు సాగుచేయఁగలఁడు? శ్రద్ధయే లేకున్నచో ఎచ్చట నైనను ఎవ్వని కైనను ధనము సంపాదించుటకుఁగాని ధానమొనర్చుటుకుఁగాని పూనిక ఎట్లు కలుగును? శ్రద్ధలోపించినచో లోకములయొక్క స్థితియే తలక్రిందు లగును.

కేవలము నమ్మకమువలననే లోకవ్యవహారము జరుగుచుండుటలేదు. దున్నినప్పుడు భూమి పండుట దున్ననప్పుడు పండకుండుట అనుభవముచేత గ్రహించి కృషీవలుఁడు సాగుచేయుచున్నాఁడు ఒకరిమాటలను అతఁడేల నమ్మవలె? అని నీ వందువేని వినుము. ఒకఁడు ఒకసంవత్సరము భూమి దున్నినాఁడు; పంట వచ్చినది. అట్లే మరల పంట వచ్చునను నమ్మకమువలననే కదా వాఁడు రెండవసంవత్సరము దున్నుచున్నాఁడు కావున అనుభవముతో పాటు నమ్మకము కూడ ఆవశ్యకమే. శ్రద్ధ లేకున్నచో లోకమే నశించును. కాఁబట్టి దృఢమైన శ్రద్ధతో శ్రేష్ఠమైన సుఖమును పొందుము. చిన్న వారిమాటలను ఏల నమ్మవలె; అని తలంపకుము. చిన్నవారి మాటలను నమ్మనక్కఱలేదు అనునది కూడ ఒక నమ్మకమే గదా! నమ్మకము లేకున్నచో ఏపని నైనను ఎట్లు చేయఁగలవు?"

అప్పుడు హేమచూడుఁడిట్లనెను. "శ్రేయస్సును కోరువాఁడు సత్పురుషులయందే శ్రద్ధను కలిగియుండవలెఁగాని అన్యులయందు ఉండరాదు. గాలమునకు తగిలించినయెఱను చూచి ఆహారమేయని నమ్ముచున్న చేపలు ఎట్లునశించుచున్నవో అట్లే మానవులును విచారించకుండ నమ్మినచో వినాశము నొందుదురు. కావుననే చక్కఁగా విచారించి మంచివాఁడే అని నిశ్చయించుకొన్న వానినే నమ్మవలె; లేకున్న నమ్మరాదు. కావున ఏపని చేయుట కైనను విచారణ ముఖ్యముకాని నమ్మకము కాదు. కాఁబట్టి 'నమ్మకము లేకున్నచో ఏపని నైనను ఎట్లుచేయగలవు?; అను నీప్రశ్న ఎట్లు కుదురును.?"

హేమలేఖ ఇట్లనెను. "ఎట్లు కుదురునో చెప్పెదను వినుము. ఒకఁడు సత్పురుషుఁడో కాదో ఎట్లు నిశ్చయింతువు? శాస్త్రము ననుసరించి సత్పురుషుల లక్షణములనుబట్టి నిశ్చయింపవచ్చు నందువేని అప్పుడు శాస్త్రము నైనను నీవు నమ్మక తప్పదు. కావున విశ్వాసము వలననే లోకమంతయుప్రవర్తించుచున్నది. అంతులేని తర్కము చేతఁగాని, అసలు తర్కమే లేకుండుటవలనఁగాని ఎవ్వఁడును ఎచ్చటను శ్రేయస్సును పొందఁజాలఁడు. తర్కమే లేనివానికి ఒకప్పటికి శ్రేయస్సు కలుగునేమో కాని, అంతులేని తర్కముచేత మాత్రము ఎవ్వఁడును శ్రేయస్సును పొందఁజాలఁడు.

పూర్వము సహ్యాగిరియందు గోదావరీతీరమున బుద్ధిశాలియైన కౌశికుఁడను విప్రుఁడుండెను. ఆయనకు వందలకొలఁదిగ శిష్యులుండిరి. వా రొకసారి గురువు లేనప్పుడు తమబుద్ధి ననుసరించి లోకస్థితిని నిర్ణయించుకొనఁదలంచుచు ఒకరితో నొకరు చర్చించు కొనుచుండిరి. అప్పుడు శుంగుఁడను శుష్కతార్కికుఁడు వారికడకు వచ్చి వారి నందఱను ఆక్షేపించి ఇట్లు బోధించెను. "మీ రందఱు నామాట వినుఁడు. సత్యమన్నది ఎక్కడను సిద్ధింపదు. ప్రమాణము చేత గ్రహింపఁబడునది కదా సత్య మని చెప్పఁబడును. ప్రమాణము దోషయుక్త మైనచో సత్యము నిరూపితము కాదు. కాఁబట్టి మొదట ప్రమాణము సరియైన దగునా కాదా అని నిశ్చయింపవలె. అందులకు మఱియొక ప్రమాణము ఆవశ్యకము. దానియొక్క ప్రామాణ్యమును నిశ్చయించుటకు వేఱొక ప్రమాణము కావలె. ఇట్లు దీనికి అంతము లేదు. అందువలన సరియైన ప్రమాణము సిద్ధింపదు. ప్రమాణము లేక సత్యము సిద్ధింపదు. కావున ప్రమాణము, దానివలన కలుగు జ్ఞానము, ఆజ్ఞానము పొందు వ్యక్తి -వీనిలో ఏదియు సిద్ధింపదు. కావున ఈవ్యవహార మంతయు శూన్యముపై ఆధారపడి యున్నది. అందువలన శూన్యమ తప్ప ఈలోకమున సత్యమేదియు లేదు." ఈమాటలను నమ్మి వారిలో కొందఱు జడులై పోయిరి. తక్కినవారు గురువు దగ్గఱకు పోయి విచారించి సరియైన సమాధానములను పొంది కృతార్థులైరి. కాఁబట్టి శుష్కమైన తర్కమును అవలంబింపరాదు. ఎల్లప్పుడును శాస్త్రానుకూలమైన తర్కమునే ఆశ్రయించి శ్రేయస్సును పొందవలయును."

హేమలేఖ ఇట్లు మిగుల ధైర్యముతో పలుకఁగా హేమాచూడుఁడు చాల ఆశ్చర్యపడి ఇట్లనెను. " ఓహో! నీకు ఇంత పాండిత్యమున్నదిని నా కింత వఱకును తెలియ లేదు. నీవు ధన్యురాలవు. నీవలన నేనును ధన్యుఁడ నైతిని. శ్రద్ధవలన సకలశ్రేయస్సులు కలుగు నని చెప్పుచున్నావు. దేనియందు శ్రద్ధ ఉంచవలె? దేనియందు ఉంచరాదు? పరస్పరవిరుద్ధములుగ శాస్త్రములు అనంతముగా నున్నవి. ఆచార్యులమతములు వ్యాఖ్యాతలయభిప్రాయములు భిన్న భిన్నములుగా నున్నవి. మనసొంతబుద్ధి కేవలతర్కముతో దేనిని శ్చయింపలేదు. గదా! ఇంక గ్రహింపఁదగిన దేది? గ్రహింపరాని దేది? ఎవనికి ఏది ఇష్ట మగునో దానిని వాఁడు 'ఇదియే నిశ్చిత' మని చెప్పును; అట్లే తనకు ఇష్టము కానిది హాని కలిగించు నని చెప్పును. ఈపరిస్థితిలో ఎవఁడైనను ఏమి నిశ్చయింపఁగలఁడు? శూన్యమును నిశ్చయించి చెప్పిన శుంగుఁడు సత్యమును నిరాకరించుట సహజమే కదా! అతఁడును తర్కాశాస్త్రము ననుసరించియే చెప్పుచుండఁగా అతనివాదమును ఏల విశ్వసింపరాదు? దీనిని చక్కఁగా వివరింపుము."

జ్ఞానఖండమున హేమచూడోపాఖ్యానమునందు శ్రద్ధాప్రశంసనమన్నది ఆఱవయధ్యాయము.

# ఏడవయధ్యాయము-ఈశ్వరునిరూపణము

హేమలేఖ భర్తతో నిట్లనెను. "నీవు అడిగినదానికి సమాధానము చెప్పెదను. స్థిరచిత్తుఁడవై ఆదరముతో వినుము. మనస్సు మర్కటమువంటిది. దానివలననే పామరులు గొప్పయనర్థమును -పొందుచున్నారు. మనస్సు నిశ్చలమైనప్పుడు నిద్రలో సుఖము కలుగుచుండుట, -చంచలమైనప్పుడు అదియే సర్వదుఃఖములకు మూరకారణ మగుచుండుట తెలిసినదే. కావున స్థిరచిత్తముతో వినుము. అనాదరముతో విన్నచో అది విననిదానితో సమానమే యగును. అది బొమ్మలోని చెట్టువలె ఫలము నొసంగఁజాలదు. వినాశకరమైన శుష్కతర్కమును వదలి శాస్త్రానుకూలమైన తర్కమును ఆశ్రయించిన వాఁడు సత్వరముగా ఫలము నొందును. కావున శాస్త్రానుకూలమైన తర్కముతో శ్రద్ధతో నీకు ఏది శ్రేయస్సో నిశ్చయించుకొని దానికై ప్రయత్నింపుము. సర్వమును శూన్యముగా భావించిన

శుంగునియనుచరులవలె పురుషకారమును వీడకుము. పౌరుషముతో ప్రయత్నింపకున్నచో ఫల మెట్లు కలుగును? ప్రయత్నమువలననే కదా ఎల్లరును తమకు అభీష్టములై నవానిని పొందుచున్నారు. అంతులైని తర్కముతో అశ్రద్ధతో ఎప్పుడైనను ఎచ్చటనైనను ఎవ్వడైనను కొంచెను ఫలము నైన పొందెనేమో విమర్శించి చెప్పుము. ఎక్కడనో ఒకచోట అనుకొన్నట్లుగా ఫలము లభింపలేదని దేనిని నమ్మకుండువాఁడు దైవహతుఁడని యెఱుంగుము. వాఁడు తనకు తానే శత్రు వగును. కావున శ్రద్ధతో సరియైన తర్కముతో ప్రయత్నించి శ్రేయస్సునకు ముఖ్యతమమైన సాధనమును అవలంబింపవలయును. విచిత్రములుగానుండు వివిధసాధనములలో ఏది నీకు అన్నివిధముల సులభసాధ్యమో అధియే నీకు ముఖ్యతమము. దానిని పెద్దలయనుభవముతో విచారించి నిశ్చయించి వెంటనే ఆరంభింపుము. ఆపద్ధతి నంతయు చెప్పెదను. సావధానుఁడవై వినుము.

దేనిని పొందినతరువాత మరల శోకము కలుగదో అదియే శ్రేయస్సు. సూక్ష్మదృష్టితో చూచినచో ఎల్లయెడలశోకమే కన్పించునును. ఏది శోకముతో కూడియుండునో అది శ్రేయస్సు కానేకాదు. భార్య పుత్రులు రాజ్యము మొదలగునది యంతయు అస్థిరము; కాలము అనుసర్పముచేతక మ్రింగఁబడుచున్నది. ఈ విషయములలో అన్నింటియందు శేకమునకు చాలశక్తివంతమైన బీజ మున్నది. ఇట్టివి పరమ శ్రేయస్సునకు సాధనము లెట్లగును? ఈధనాదివిషయములు గ్రహింపఁదగినవే అనుభ్రమ మోహమువలన కలుగుచున్నది. జగత్కర్తయైన మహేశ్వరునివలన ఎల్లరును మోహమును పొందుచున్నారు. కొంచెము విద్యగలిగిన గారడీవానివలననే అనేకులు మోహితు లగుచుండఁగా జగత్కర్తయైన మహేశ్వరుని మహామాయనుండి ఎవఁడు తప్పించు కొనఁగలఁడు? గారడిలోని మాయ నెఱింగినవాఁడు దానినుండి తప్పించుకొనఁగల్గుచున్నాఁడు. అట్లే మహేశ్వరునిమాయ నెఱింగిన వాఁడును దానినుండి తప్పించుకొని శాశ్వతమైన సుఖమును పొందుచున్నాడు. కాని ఈశ్వరుని యనుగ్రహమును పొందినవాఁడే ఆ మహామాయను గుర్తించి దానినుండి తప్పించుకొనఁగలఁడు. కావున సర్వవిధముల మహేశ్వరుని శరణమును పొందినవాఁడు ఆయనవలన ఆత్మవిద్యను పొంది మాయామోహమునుండి తప్పించుకొనఁగలఁడు. శ్రేయస్సాధనములైన యోగము లనేకములు కలవు. అవి ఏవియును మహేశ్వరుని యనుగ్రహములేక ఫలింపవు. కావున మొదట విశ్వకారణుఁడైన మహేశ్వరుని ఆరాధింపవలె. అనంతరము మోహమును నశింపఁజేయు ఏయోగము నైనను సాధింపవచ్చును.

ఈజగత్తు ప్రత్యక్షముగా కన్పించుచున్నది. వస్త్రము గృహము మొదలుగా ప్రతిపదార్థము ఒకానొకకర్తచేత సృష్టింపఁబడుచున్నది. అట్లే ఈజగత్తు ఈశ్వరునిచే సృష్టింపఁబడుచున్నది. ఇది తర్కము చేతనే కాక పెక్కుశాస్త్రములచేత కూడ నిరూపింపఁబడుచున్నది. 'ఈలోకమునకు కర్త ఎవఁడునులేఁడు. సృష్టి తనస్వభావముచేతనే జరుగుచున్నది' అని చెప్పు ఆగమము ఒకటి కలదు. కాని అతి తర్కయుక్తములైన పెక్కు ఆగమములచేత ఖండింపఁబడినది. ప్రత్యక్షము నొక్కదానినే ప్రమాణముగా గ్రహింప, దేహము నశించుట తోడనే ఆత్మకూడ నశించు నని చెప్పుచున్న యీయాగమము యధార్థముగా ఆగమమే కాదు. కావుననే దానిని వివేకముగల మహాత్ము లెవ్వరును అంగీకరింపలేదు. శుష్కతర్కముపై ఆధారపడిన యీశాస్త్రమును పరిగ్రహింపరాదు.

ఈజగత్తు సనాతనమైన దని, దీనికి అచేతనమైన ప్రకృతియే కారణ మని కొందఱు చెప్పుచున్నారు. ఈమతము కూడ అసమంజసమే. క్రియ లన్నియు బుద్ధిపూర్వకముగానే జరుగుచున్నవి. బుద్ధి రహితమైనయెడ క్రియ కన్పించుటలేదు. బుద్ధి కలవాఁడే క్రియను చేయున్నాఁడని శాస్త్రములవలననే కాక ప్రత్యక్షముగాకూడ కన్పించుచున్నది. కావున బుద్ధిశాలియైన కర్తయే ఈజగత్తును సృష్టించుచున్నాఁడని నిరూపిత మగుచున్నది. కాని ఈజగత్తు సాధారణపదార్థమువలె కాక, ఊహకందనిరూపముతో అనంతమైనశక్తితో విలసిల్లుచున్నది. కావున ఇట్టి జగత్తు యొక్క కర్త కూడ లోకములని పదార్థముల యొక్క కర్తలకన్న విలక్షణముగా మితిలేనిసామర్థ్యముకలవాఁడై యున్నాఁడు.

అట్టి జగత్కర్తయైన యీశ్వరుండే తన్ను ఆశ్రయించినవారిని సముద్ధరింపఁగలఁడు. కావున ఆయననే ఎల్లప్పుడు సకలవిధముల శరణుపొందుము; లోకమున కొంచెము ప్రాభవము కలవఁడు కూడ తన్ను నిష్కపటముగా ఆశ్రయించినవానియెడల ప్రసన్నుఁడై వాని యభీష్టములను తీర్చుచున్నాఁడు. అట్టియెడల లోకేశ్వరుఁడు భక్తవత్సలుఁడును ఆయిన దేవుని చక్కఁగా ఆరాధించినచో ఆయనవలన మనము పొందరానిదే ముండును? లోకములో ప్రభువుల నిలుకడ లేని వారుగ నిర్దయులుగా కృతఘ్నులుగా నుందురు. అందుచేత వారివలన కలుగుఫలము కూడ అస్థిరముగనే యుండను. మఱి పరమేశ్వరుఁడు దయాసముద్రముఁడు కృతజ్ఞుఁడు చక్కని వ్యవస్థ కలవాఁడు. అట్లు

కానిచో ఆయన ఎట్టినిందను పొందకుండ అనాదియైన యీజగత్తును ఇంతచక్కనియేర్పాటుతో ఎట్లు నడుపఁగలుగుచున్నాఁడు? వ్యవస్థలేనిరాజ్యము నశించుచుండుట మనము చూచుచునే యున్నాము. కావుననే ఆయన దయాసముద్రుఁడని చక్కనివ్యవస్థ కలవాఁడని ప్రశంసింపఁబడుచున్నాఁడు. వెంటనే నీవు ఆయనను శరణము పొందుము. ఆయనయే నీకు శ్రేయస్సును కలిగించుసాధనమును నిర్దేశింపగలఁడు. దేవినవల శ్రేయస్సు కలుగును. అని సాధనమునుగూహర్చి నీవిప్పుడు ఆలోచింపవలదు.

రోగము పోవలయు నని కొందఱు, సంపదలు కావలయునని కొందఱు అనేకవిధములుగా ఈశ్వరుని ఉపాసించుచున్నారు. ఎవఁడో ఒకానొకఁడు ఎట్టికోరికలు లేకుండ ఆయనను ఉపాసించును. అదియే సత్యమైన యుపాసనము. ఆర్తితో ఆరాధించునప్పుడు ఈశ్వరుఁడు భక్తియందలి తారతమ్యమునుబట్టి ఒకటికి దయతో రోగమును తొలగించును; మఱియొకనికి ఉపేక్షింపవచ్చును. అట్లే సంపదలు కోరు వారికిని లభించు ఫలము మితముగ అనేక విధములుగ నుండును. ఒకానొకఁడు తమ్ము నిర్హేతుకముగా సేవించుచున్నచో లోకములో ప్రభువులు ఆవిషయమును కొంతకాలమునకు గ్రహించి వానికి అధీనులగుచున్నారు. ప్రభువులు అజ్ఞులు కావుల సేవకునియందలి నిష్కామత్వమును గ్రహించుటకు వారికి చాలకాలము పట్టును. కాని సర్వజ్ఞుఁడైన పరమేశ్వరుఁడు భక్తుని యొక్క నిష్కామత్వమునువెంటనే గ్రహించి సత్వరముగా ఫలమము నొసంగును. ఆర్తునకు ధనాదుల నర్థించువానికి ఈశ్వరుఁడు జగత్తుయొక్క వ్యవస్థ ననుసరించి వారియొక్క కర్మ పరిపాకమును పొందినప్పుడే ఫలము నొసంగును. "నీవు తప్ప నాకు శరణము లేదు" అని శరణాగతి చేసిన భక్తుని విషయమున భగవంతుఁడు వానియోగక్షేమములను వహించుచు వానకర్మ పరిపాకములను పొందినను పొందకున్నను జగత్తులోని వ్యవస్థయొక్క నియమములను కూడ అతిక్రమించి వానికి సత్వరముగా శ్రేయస్సాధనమును కలిగించుచున్నాఁడు ఇదియే ఆయనయొక్క మహాప్రభుత్వము ఎదురులేని స్వాతంత్ర్యము.

ప్రారబ్ధము కాని, జగత్తు యొక్క నియతి కాని, మహేశ్వరుని యెదుట నిలువలేవు. మార్కండేయుని విషయమున మహేశ్వరుఁడు ప్రారబ్ధమును నియతిని అతిక్రమించి దీర్ఘాయువు నొసంగుట ఎల్లరకును తెలిసినదే. ప్రారబ్ధము నియతి సాధారణముగా దాటరానివే. అసమర్థులైనవారి ప్రారబ్ధమును అతిక్రమింపలేరు. కాని సమర్థు లైనయోగులు ప్రాణాయామములచేత దానిని జయించుచున్నారు. యోగులు ప్రారబ్ధమును జయింపఁగల రనుటయు నియతిలో ఒక భాగమే. ప్రారబ్ధమనఁగా ఫలము నిచ్చుటకు ప్రారభించిన మన కర్మయే. నియతి యనఁగా ఈశ్వరునియొక్క సత్యసంకల్పరూప మైనశక్తి. అందువలననే అది దాటరానిది. కావున నియతి ప్రారబ్ధమును త్రోసివేయఁగలదు. అట్టినియతి కూడ సంపూర్ణముగా పరమేశ్వరుని శరణుచొచ్చిన భక్తునియందు కుంటువడును. అట్టిభక్తుల యందు అది అట్లు కుంఠిత మగుచుండుట కూడ దానిస్వభావమే. కావున కుతర్కమును వదలి నిష్కామముగా పరమేశ్వరుని శరణుపొందుము. ఇదియే క్షేమ మనుసాధమునకు మొదటి సోపానము. దీనిని వదలినచో తక్కిన సాధనము లేవియు ఫలింపవు."

అంతట హేమచూడుఁడు చాలసంతోషముతో నిట్లనెను. "ఎవని శక్తిచేత ఈ జగత్తు నియమింపఁబడుచున్నదో అట్టి సర్వకర్త స్వతంత్రుఁడు అయిన మహేశ్వరుఁడెవరో చెప్పుము. విష్ణువు శివుఁడు గణపతి సూర్యుఁడు నృసింహుఁడు బుద్ధుడు సుగతుఁడు అర్హతుఁడు వాసుదేవుఁడు ప్రాణము సోముఁడు పావకుఁడు కర్మ ప్రధానము అణువులు మొదలుగా అనేకులు అనేకవిధములుగా పరమేశ్వరుని నిరూపించుచున్నారు. ఈదేవతలలో ఎవరు మహేశ్వరుఁడని మన మామరాదింపవలె? భగవంతుఁడైన వ్యాఘ్రపాదుని వాత్సల్యమునకు పాత్రురాలవైన నీకు తెలియని దేమియు నుండదు. ఆయన యనుగ్రహము వలననే కదా స్త్రీ వైనను నీవు ఇట్టి జ్ఞానముచేత ప్రకాశించుచున్నావు."

అప్పుడు హేమలేఖ హర్షముతో నిట్లనెను. "నాథా! ఈశ్వర స్వరూపనిర్ణయమును చెప్పెదను వినుము. లోకములను సృష్టించి పాలించి లయమొందించువాఁడే ఈశ్వరుఁడు. ఆయనయే విష్ణువు శివుఁడు బ్రహ్మ. ఆయనయే సకలదేవతలు "ఆయన శివుఁడే విష్ణువు కాదు; విష్ణువే శివుఁడు కాదు" అని ఈ విధముగా చెప్పుటకు వీలులేదు. పంచముఖుఁడు త్రినేత్రుఁడు అయిన శివుఁడు జగత్కర్త అని చెప్పుచున్నారు. లోకములో కుండలు మొదలగువానిని చేయువాఁడు చేతనుఁడుగా శరీరము కలవాఁడుగా నున్నాఁడు. అచేతనుఁడు శరీరములేనివాఁడు ఎక్కడను కర్తగా కన్పించుటలేదు. కావున ముఖ్యకర్తృత్వము చేతనునకే సంభవించును. స్వప్నములయందు జీవుఁడు స్థూలశరీరమున

వదలిచైతన్యమయమైన దేహముతో వివిధ పదార్థములను సృష్టించుచున్నాఁడు. కావున చేతనుఁడైన జీవునకు శరీరము ఉపకరణము మాత్రమే. జీవులు అపూర్ణులు అస్వతంత్రులు. కావున వారికి ఉపకరణములు ఆవశ్యక మగుచున్నవి. మఱి పరమేశ్వరుఁడు పూర్ణుఁడు స్వతంత్రుఁడు. అందువలన ఆయన ఏసాధనమును అపేక్షింపక సర్వమును సృష్టించుచున్నాఁడు. కావున ఆయనకు శరీరము లేదు. ఆయనకు శరీరము ఉన్నదన్నచో లోకము లోని కార్యకర్తలకువలె ఆయనకుకూడా, కుండను చేయుటకు మట్టివలె జగత్తును సృష్టించుటకు ఒక పదార్థము కావలసియుండును. ఆయన ఆవిధముగా దేశము కాలము మొదలగు వానిని అవలంబించి సృష్టిచేయువాఁడైనచో, ఆయన కూడ జీవుఁడే అగును ఆయన సృష్టిచేయుటకు అసాధనములను అవలంబించుచున్నాఁడన్నచో అవి సృష్టికి పూర్వమే సిద్ధమైయున్నవన్నమాట. అనఁగా వానిని ఆయన సృష్టింపలేదని చెప్పవలె. అట్లయినచో ఆయన సర్వమునకు కర్త అని చెప్పుట కుదురదు. కావున దేహము దేశము కాలము మొదలగు సాధనములు ఏవియు లేకుండఁగనే ఈశ్వరుఁడు సృష్టించును. కావున ఆయనకు స్థూలమైన శరీరములేదు. స్థూలమైన బుద్ధికలవారు పరమే శ్వరుని యొక్క అశరీరత్వమును గ్రహింపఁజాలరు. అందువలన భక్తులు తన్ను ఏలోకమునందు ఏరూపముకలవానినిగా ధ్యానించుచున్నారో వారికి ఆయన ఆరూపమును ధరించి ప్రత్యక్షమగును. కావున ఆయన చైతన్యమాత్రుఁడు. ఆయన ధరించుదేహము కూడ చైతన్య మైత్రమే. ఆచైతన్యరూపిణియే త్రిపురా పరమేశ్వరి. ఆమె యందే జగత్తు అంతయు వివిధ భేదములతో భాసించుచున్నది. చరాచరాత్మకమైన యీజగత్తు అంతయు ఆమెయందు, అద్దములోనగరమువలె, కన్పించుచున్నది. ఈజగత్తులో ఆమెకన్న అన్యముగా ఏదియు లేదు. అంతయు అమెయే. అందువలన జగత్తులో ఉత్తమము అధమము అనుభావనకు అవకాశము లేదు. శివుఁడు విష్ణువు మొదలకు మూర్తులందున్న చైతన్యశక్తి ఆమెయే కావున ఆదేవతలయందును ఒకరు ఎక్కువ మఱియొకరు తక్కువ అని భావింపరాదు. మఱి ఆయాశాస్త్రములందు ఆయాదేవతలకు సర్వశ్రేష్టత్వము వచెప్పఁబడియున్నను ఆరూపము లన్నియు ఆమెయందు కల్పింపఁబడినవే కావున అవి ముఖ్యములు కావు. ప్రాజ్ఞుఁడు నిరాకారమైన చైతన్యమునే ఉపాసింపవలె. అందులకు సామర్థ్యములేని వాఁడు తనకు ఏదేవతారూపమునందు బుద్ధి లగ్న మగునో ఆరూపమునే ద్యానించుచు, ఫలమును కోరకుండ, ఈశ్వరుని ఆరాధించినచో శ్రేష్ఠమైన శ్రేయస్సును పొందును. ఈశ్వరారాధనము చేయకుంఁడ కోటిజన్మలెత్తినను సుగతి కలుగదు.

ఇదిజ్ఞానఖండము హేమచూడోపాఖ్యానమునందు ఈశ్వర నిరూపణ మున్నది సప్త మాధ్యాయము

# ఎనిమిదవయధ్యాయము - సంసారాఖ్యాయికా వివరణము

1 హేమచూడుఁడు ప్రియురాలి మాటలవలన పరమేశ్వరుని స్వరూపము చిన్మయ మని తెలిసకొని, గురువులవన గుణరూపిణియైన త్రిపురాదేవియొక్క ఉపాసనమునకొఱకు మంత్రతంత్రాదికమైన విధానము నెఱింగి ఏకాగ్రచిత్తముతో ఆమెను ఆరాదింపఁజొచ్చెను. అట్లు కొన్ని మాసములు గడచెను. ఆదేవి ఆతనిహృదయమునందు ప్రసన్నురాలయ్యెను. అప్పుడు ఆమెయనుగ్రముచలన ఆతనిచ్చతము భోగవిషయములనుండి విముఖమై ఆత్మవిచారమునందు ఆసక్తమయ్యెను. ఆపరాదేవియొక్క అనుగ్రమహములేక మోక్షమునకు ముఖ్యకారణమైన ఆత్మవిచారము ఎవ్వనికిని కలుగదు. అది లేకుండ ఇత రోపాయములు ఎన్ని యున్నను శ్రేయస్సు కలుగదు.

పిమ్మట హేమచూడుఁడు ఒకదినమున హేమలేఖ యొద్దకు పోయెను. ఆమె వానికి ఎదురేగి స్వాగతమును చెప్పి అర్ఘ్యపాద్యములతో పూజించి మిక్కిలి అనురాగముతో ఇట్లనెను. "నాథా! చాలకాలమునకు కన్పించితిని. ఆరోగ్యముతో నున్నావుకదా! నన్ను చూడకుండ నాతో మాటాడకుండ నీవు ఒక్కపూట కూడ గడువువాఁడవుకావు. మఱి ఇంతకాలమైనను నీవు నన్ను ఏల స్మరింపవైతివి? నీకు ఇష్టముకాని పద్ధతియందు నేను కలలో కూడ వర్తింపను. ఏల ఇట్లు దూరమైతివి? నేను లేకున్నచో ఒక్కక్షణము కూడ నీకు ఒక కల్పముగా నుండెడిది. మఱి ఇన్నిరాత్రులు ఎట్లు గడిపితివి?" ఇట్లు పలుకుచు ఆమె అతనిన కౌఁగిలించుకొని భిన్నురాలివలె నుండను.

అతఁడు ఆమెయొక్క కౌఁగిటియందు ఉండియు ఎట్టివికారమును పొందక ఇట్లనెను. "ప్రియా! నాకేల మోహమును కలిగింతువు? నీవు ఈలోకమును పరతత్త్వమును తెలిసికొన్న ధీరురాలవు. నిన్ను మోహము ఎట్లు స్పృశించును? నీకు దుఃఖమునకు కారణమే లేదని నాకు దృఢముగా తెలియను. నీవు ఇంతకు పూర్వము నీవృత్తాంతమును చెప్పియుంటివి. దానినిగూర్చి ప్రశ్నించుటకు వచ్చితిని. నీవు చెప్పిన మీతల్లి ఎవరు? ఆమె యొసంగిన సఖి ఎవరు? ఆమెయొక్క భర్త పుత్రులు మొదలగువారు ఎవరు? ఎక్కడ నున్నారు? వారు నాకు ఎట్లు సంబంధింతురు? ఇది యంతయు నాకు స్పష్టముగా చెప్పుము. నీవు చెప్పినది అసత్యము కాదని ఏదో ఒకసంకేతముతో అట్లు చెప్పితివని తలంచుచున్నాను. కాఁబట్టి దానిని నాకు తెలియునట్లు స్పష్టముగా వివరించి చెప్పుము. నేను నిన్ను శరణము పొందుచున్నారు. నాహృదయములోని సంశయము ఛేదింపుము."

మాటలను విని హేమలేఖ ఇట్లనుకొనెను. "ఈయనకు దేవి యనుగ్రహములవల బుద్ధి నిర్మల మయ్యెను. పూర్వపుణ్యములు ఫలించి ఈయన విషయ సుఖములందు విముఖుఁడై ధీరుఁడైనాఁడు. ప్రబోధించుటకు ఇది తగినసమయము. కావున ప్రబోధింతును." పిమ్మట ఆమె ప్రసన్నమైన ముఖముతో ఆతనిని అనురాగముతో చూచుచు ఇట్లు పలికెను. "నాథా! ఈశ్వరానుగ్రహమును నీకు మహా భాగ్యము కలిగినది. భోగములయందు విముఖత్వము విచారము నందు ఆసక్తి అనునవి ఈశ్వరానుగ్రహమునకు సూచకములు. ఇంక నాస్థితిని చెప్పెదను వినుము. కేవలమైన చైతన్యమే నాజనని, ఆమె యొసంగిన చెలికత్తె బుద్ధి, బుద్ధితో కుడియుండిన దుష్టురాలు అవిద్య. అవిద్యకు ఎంత విచిత్రమైన సామర్థ్యమున్నదో లోకమున ప్రసిద్ధమే. అది త్రాడునందు సర్పము తోఁచునట్లుగా చేసి గొప్పభయమును కలిగించుచున్నది. మహామోహుఁడు ఆమెకు పుత్రుఁడు. వాని కుమారుఁడైన అస్థిరుఁడే మనస్సు. మనస్సుయొక్క భార్య కల్పన, జ్ఞానేంద్రియములు అయిదు కల్పనయొక్క పుత్రులు. వారి స్థానముల నుండి విషయములను దొంగిలించుట యనఁగా సుఖదుఃఖనుభవములకు పిమ్మట మనస్సునందు వానిసంస్కారము ఏర్పడుట. ఆసంస్కారములవలన కలుగుననుభవమే స్వప్నము. కల్పనయొక్క చెల్లెలు మహాశన. మహాశనపుత్రులు క్రోధము లోభము. నాపురమనఁగా ఈశరీరమే. స్వరూపస్ఫురణము నాకున్న మహాతంత్రము. మనస్సునకు ప్రియమిత్రుఁడైన ప్రచారుఁడు ప్రాణము. అడవులు మొద లైనవి నరకములు. నేను బుద్ధితో కూడియుండుట సమాధి. నేను నాతల్లియొక్క లోకమునకు చేరుట మోక్షము. ఇది నావృత్తాంతము నీవృత్తాన్తము కూడ ఇట్టిదే. నేను మోక్షమును పొందినవిధానమును చక్కఁగా తెలిసికొని నీవు కూడ పరమమైన శ్రేయస్సును పొందుము.

జ్ఞానఖండమున హేమచూడోపాఖ్యానమునందు సంసారాఖ్యాయికావివరణ మన్నది. అష్టమాధ్యయము.

బాలప్రియ

"నేను నిన్ను శరణము పొందుచున్నాను" అని హేమచూడుఁడు భార్యకు శరణాగతి చెసెను. ప్రియాప్రియములనుగూర్చి చర్చ ఆరంభమైనప్పుడు అతఁడు స్త్రీలకు లోకజ్ఞాన ముండదు అనుతలంపుతో నుండెను. స్త్రీత్వముచేత, వయస్సుచేత, జ్ఞనముచేత, భార్యత్వము చేత హేమలేఖ తనకన్న తక్కువస్థాయిలో నున్న దని తాను పరుషుఁడుగా, పెద్దవాఁడుగా, విద్యాధికుఁడుగా, భర్తగా ఆమెకన్న అన్నివిధముల అధికుఁడని అతఁడు గట్టిగా తలంచుచుండెను. అట్టివాఁడు "నేను నిన్ను శరణము పొందుచుచున్నాను" అని పలికె నన్నచో అతనియందు పెద్దమార్పు కలిగె నన్నమాట. మొదట ఆమెమాటలను అతఁడు చిన్నపిల్ల చెప్పుచున్న మాటలనువలె వినోదముతో వినెను. ఆమెమాటల యందలి నిజమును గ్రహించినతరువాత భోగములయందు విరక్తుఁడై వానిని వదలుకొనలేక వానివలన సుఖపడలేక క్లేశము నొందుచుండియు ఆమెతో చెప్పుకొనుటకు సిగ్గపడుచుండెను. అతనియవస్థను ఆమెయే గ్రహించి అతనిని బుజ్జగించి త్రిపురాదేవి నుపాంచిననే కాని భోగములయందు పూర్ణమైనవిరక్తి కలుగ దని సూచించి తాను ముక్తిని పొందిన విధమును, సంకేతము లతో కథగా చెప్పను. అప్పటికి అతనికి నేను అధికుఁడను అనుభావముపోయి ఆమెమాటలు మిత్రునియొక్క మాటలనువలె ఆదరముతో వినెను. ఆయినను ఆకథ ఏమియు అర్థము కాకపోవుటవలన ఆమెమాటలయందు అతనికి శ్రద్ధ ఏర్పడలేదు. ఆమె వెంటనే శ్రద్ధయొక్క ఆవశ్యకతను సహేతుకముగా నిరూపించెను. గురువుచెప్పునది బోధపడకున్నచో ఆయననే నమ్మి సందేహములు తీరువఱకు ప్రశ్నించుచు తత్త్వమును గ్రహింపవలె కాని ఆయన మాటలయందు అనాదరమును చూపరాదని నచ్చఁజెప్పెను. ఈశ్వరానుగ్రహము వలన తప్ప

మఱియొకవిధముగా తత్త్వజ్ఞానమును పొందుటకు అర్హత కలుగదని తెలిసికొనిన హేమచూడుఁడు హేమలేఖయొక్క విజ్ఞానాతి శయమును గుర్తించి "ఈశ్వరుఁడెవరో" నిరూపింపుమని ఆమెను ప్రశంసాపూర్వకముగా కోరెను. అప్పుడామె త్రిపురాదేవి యొక్క ఉపాసనము ఆవశ్యక మని చెప్పఁగా ఆమె మాటలను దృఢముగా విశ్వసించి అతఁడు గురువువలన మంత్రతంత్రాదికమైన విధానమును తెనిసికొని త్రిపురాదేవి నుపాసించెను. మంత్రదీక్ష నతఁడు ఆమె వలన పొందలేదు. ఆదీక్షను మంత్రసిద్ధులైన పెద్దలవలననే స్వీకరింపుమని ఆమెయే చెప్పియుండును. ఏమైనను అప్పటికి అతఁడు ఆమెను గురువునుగా భావించుటలేదని గ్రహింపవచ్చును.

త్రిపురోపాసనము గావించిన తరువాత దేని యనుగ్రహమువలన ఆతని దృక్పథమున పెద్దమార్పు వచ్చెను. అతనిమనస్సు భోగముల నుండి విముఖమైన ఆత్మవిచారమునందు లగ్నమగుటయే కాక, "హేమలేఖ తత్త్వజ్ఞురాలు; సామాన్యురాలు కాదు. ఆమెను గురువునుగా గైకొని శరముపొందిననే తప్ప నాకు ముక్తి కలుగదు"అను భావము దృఢముగా ఏర్పడెను. అందువలననే ఆమె సాధారణమైన భార్యవలెనే అతనిని కౌఁగలించుకొని ప్రియముగా మాటాడుచున్నప్పుడు, అతఁడు ఆమెవలన భోగమును ఆపేక్షింపక, ఆమెను భార్యమాత్రముగా తలంపక, కేవలము గురువునుగా భావించుచు సకలసంకోచములను వీడి "నేను నిన్ను శరణము పొందుచున్నాను. నాహృదయములోని సంశయములను ఛేదింపుము" అని ప్రార్థించుచు శిష్యుఁడయ్యెను.

గురుశిష్యసంబంధము శిష్యునివలననే ఏర్పడవలె. ఇతరులకు తత్త్వమును బధింపవలయు ననుకుతూహలము జ్ఞానులకు ఉండదు. ఎవరైనను వచ్చి తమ్ము ఆశ్రయించినను వారిశ్రద్ధను పరీక్షించిన తరువాతనే జ్ఞానులు తత్త్వమును బోధింతురు. శ్రీకృష్ణుడు అర్జునునకు తత్త్వమును బోధింపవలె నని ఎప్పుడను కుతూహలము నొందలేదు. అర్జునుఁడు విషాదమునుపొంది కర్తవ్యమును బోధింపు మని శ్రీకృష్ణుని "నేను నీకు శిష్యుఁడను. నిన్ను శరణుఁజొచ్చితిని నన్ను శాసింపుము" (శిష్యస్తే7హంశాధి మాం త్వాం ప్రపన్నమ్) అని ప్రార్థించినప్పుడు అర్జునుఁడు శిష్యుఁడై శ్రీకృష్ణుఁడుగురు వయ్యెను అంతవఱకును వారిరువురు బావమఱుదులే. అట్లే హేమచూడుఁడు హేమలేఖను శరణుపొందినంతనే అతఁడు శిష్యుఁడై ఆమె గురువయ్యెను. కావున పూర్వసంబంధము ఎట్టిదైనను, మోక్షమును కోరువాఁడు సకలసంకోచములను వీడి గురువును ప్రత్యక్షదైవతముగా భావించుచు శరణుఁజొచ్చిననే తప్ప ఉపదేశ ఫలింప దనుట స్పష్టము.

దీనినిబట్టిచూచినచో ఈశ్వరానుగ్రహమువలననే గురువునందు భక్తి కూడ కుదురు నని స్పష్టమగుచున్నది. "నన్ను పూజించువారికి నన్ను చేరుటకు సాధనమైన బుద్ధియోగము నొసంగుదును" (దదామి బుద్ధియోగంతం యేన మా ముపయాంతితే భగవద్గీత) అన శ్రీకృష్ణుఁడు చంప్పెను." ఎవనికి దేవునియందు పరమభక్తి కలదో, అట్లే గరువునందు కూడ పరమభక్తి కలదో అట్టి మహాత్మునకే ఉపనిషత్తు నందు చెప్పఁబడిన యీవిషయములు ప్రకాశించును" అని శ్వేతాశ్వత రోపనిషత్తునందు కూడ చెప్పఁబడియున్నది.

యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురే|

తస్యైత కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మగః ||

ముందుగా దగేవునియందు పరమభక్తిని పొంది దేవునియను గ్రహమువలన గురువునందు కూడ అట్టిభక్తినే పొందవలయు నని, అట్టి గురుభక్తి పొందినవాఁడే మహాత్ముఁడని, అట్టివానికే ఉపనిషత్తులలో ప్రతిపాదింపఁబడిన తత్త్వము చక్కఁగా బోధపడు నని స్పష్టమగుచున్నది. మఱి గురువులవలననే కదా దేవునిమహిమను తెలిసి కొని ఎవఁడైనను దైవభక్తి నొందును. అందువలన గురుభక్తి వలననే దైవభక్తి కలుగు నని ఏల చెప్పరాదు? పురాణములవల్లనో హరికథలవల్లనో పెద్దల ప్రసంగములవల్లనో ఏవిధముగా నైనను దైవభక్తి కలుగవచ్చును. దైవభక్తి కలిగినంత సులభముగా గురుభక్తి కలుగదు. జగత్కర్త జగత్పరిపాలకుఁడు అని భావింపఁబడుచున్న పరమేశ్వరునియందు భక్తి కలుగునట్లుగా, మనవలెనే మనుష్యుఁడుగా కన్పించుచున్న గురువునందు భక్తి కలుగుట సులభముకాదు. విద్యాసంస్కారము చిత్తనిర్మల్యము కలిగినవారే పెద్దల యొక్క మహిమను గుర్తించి గౌరవింపఁగలరు. చిత్తనైర్మల్యము ఈశ్వరారాధనమువలన కలుగును. ఈశ్వరునియందు భక్తి సత్సంగమువలన కలుగను. పూర్వపుణ్యమువలన సత్సంగము సంభవించును.

హేమచూడునకు పూర్వపుణ్యమువలననే హేమలేఖతో సాంగత్యము కలిగినది. ఆసాంగత్యమువలన అతఁడు త్రిపురాదేవి నుపాసింపఁగలిగెను. ఆదేవియొక్క అనుగ్రహమున అతఁడు హేమలేఖ యొక్క మహత్త్వమును గుర్తించి నిస్సంకోచముగా ఆమెకు శిష్యుఁడై తత్త్వమును బోధింపు మని ప్రార్థింపఁగలిగెను. అతని శ్రద్ధను గమనించి ఆమె తత్త్వమును బోదింపఁగా అతఁడు కృతార్థుఁడయ్యెను. ఇట్టి గురుశిష్యసంబంధము లేకపువుటవలన కువలుఁడు పౌరాణికుని బోధవలన కృతార్థుఁడు కాఁజాలకపోయెను.

భర్త తనదగ్గరకు వచ్చినప్పుడెల్ల హేమలేఖ అతనియారోగ్య మునుగూర్చి మిగుల ఆదరముతో ప్రశ్నించుచుండుట గమనింపఁదగియున్నది. భర్తయొక్క ఆరోగ్యమునందు భార్య శ్రద్ధ యుండుట సహజము. మఱి దత్తాత్రేయుఁడు కూడ పరశురాముని విషయమున ఇట్లే ఆరోగ్యమును గూర్చి ప్రశ్నించెను.

ఇట్లు ప్రశ్నించుటలో ప్రేమ వాత్సల్యము అనునవియే కారణములు కాదు. మోక్షము కోరువానికి విషయములయందు విరక్తి అవశ్యక మైనట్లే ఆత్మవిచారము చేయుటకు తగినయారోగ్యము కూడ ఆవఖ్యకమే. "దేహము అనిత్యము తుచ్ఛము హేయము" అను తలంపుతో సాధుకఁడు దేహముయొక్క ఆరోగ్యమును ఉపేక్షింపరాదు. శరీరము ఆరోగ్యము సామర్థ్యమును కలిగియున్నప్పుడే సాధకుఁడు చక్కగా గురువునకు శుశ్రూష యొనర్చి ఆత్మవిచారమును కొనసాగించి కృతార్థుఁడు కాఁగలుగును. ముక్తి కలుగువఱకు జ్ఞానమును సంపాదించుటలో ముఖ్యసాధనమైన శరీరమును ఉపేక్షింపరాదు. నదిని దాటువఱకు మంచిపడవ ఎట్లు ఆవశ్యకమో అట్లే అజ్ఞానసము ద్రమును దాచువఱకు మోక్షమును గోరువానికి ఆరోగ్యముదగల శరీరము ఆవశ్యకము. ఈవిషయమును హెచ్చరించుటయకే గురువులు శిష్యులయారోగ్యవిషయమున శ్రద్ధను చూపుచుందురు.

# తొమ్మిదవయధ్యాము - హేమచూడుని విశ్రాంతి

హేమచూడుఁడు ప్రియురాలిమాటలను విని మిగుల హర్షము నొంది ఇట్లనెను. "ఆహా! నీవు ధన్యురాలవు! ఏమి నీజ్ఞానవైభవము! కథారూపమున విషయము నంతయు చాల నిపుణముగా చెప్పితిని. ఇట్టి దొకవృత్తాంతము నాకు కూడ కల దని యిప్పటివఱకును నాకు తెలియదు. ఇప్పుడు నీమాటలవలన నావృత్తాంతమును కూడ, చేతిలోని యుసిరిక పండువలె, స్పష్టముగా జరిగినదానిని స్మరించుచున్నాను; జరుగుచున్నదానిని అనుభవించుచున్నాను. పరమ చైతన్యరూపిణియైన యాజనని యవరు? ఆమెనుండి మన మెట్లు జన్మించితిమి? మనము ఎవరు? మన స్వరూప మేమి? చెప్పుము."

అప్పుడామె ఇట్లనెను. "నాథా! ఇది గూఢమైన విషయము. నీస్వరూపమును నీవే అత్యంతనిర్మలమైన బుద్ధితో విచారించుకొనుము. ఆత్మస్వరూపము చూపుటకు ఒకదృశ్యము కాదు; చెప్పుటకు మాటలకు అందునది కాదు. కావున ఎట్లు చెప్పఁగలను? నీకు నీస్వరూపము తెలసినచో ఆతల్లిని కూడ తెలిసికొనఁగలవు. తన్ను తాను తెలిసికొనునప్పుడు ఏయుపదేశము ఉండదు; ఉపదేశించువాండుఁను ఉండఁడు. శుద్ధమైన బుద్ధితో నీస్వరూపమును తెలిసికొనుము. దేవతలు మొదలుగా పశుపక్షాదులవఱకు సకల ప్రాణులయందు వాని కన్నింటికి స్వరూపముగా అది భాసించుచునే యున్నది. లౌకికములైన శాస్త్రజ్ఞానములకు, ఆజ్ఞానములకు సాధనములైన ప్రత్యక్షాదిప్రమాణములకు అది గోచరింపక అంతటను ఎల్లప్పుడు భాసించుచునే యున్నది. ఎక్కడైనను ఎప్పుడైనను ఎవనిచేత నైనను అది లేశమాత్రముగా నైనను ఎట్లు నిరూపింపఁబడును? నాస్వరూపమును తెలుపుము అని నీవు అడుగుట నాకంటికి నాకు చూపు మని అడుగుటవలె నున్నది. ఎంత నిపుణుఁడైన గొప్పయాచార్యుఁడైనను నీకంటిని తెచ్చి నీకెట్లు చూపఁగలఁడు? నీకంటిని

నీవు గ్రహించుటకు ఆయన యుపాయమును మాత్రము చెప్పఁగలఁడు. కావున నేను కూడ ఉపాయమును చెప్పెదను; శ్రద్ధతో వినుము. "ఇది నాది, ఇదినాది" అని ఎంతవఱకు బుద్ధియందు విషయములు భాషించుచుండునో అంతవఱకు ఆవిషయమలు నీస్వరూపము కాదు, 'నాకు ఏది గోచరించుచున్నదో అది నేను కాదు' అని నీవు ఆవిషయముల నన్నింటిని త్రోసివేసిన తరువాత, అట్లు వానిని త్రోసివేయుచున్నట్టిది, త్రోసివేయుటకు వీలులేనిది యైన నీస్వరూపము గోచరించును. కావున ఏకాంతమునందు కూర్చుండి బుద్ధియందు "నాది" అని గోచరించు ప్రతివిషయమును త్రోసివేయుచుండుము. "ఈమె నా భార్య" అనినన్నుగూర్చి తలంచుచున్నావు కదా! భార్యసంబంధముచేత నేను నీకు ఆత్మీయురాల నైనను నీస్వరూపములో నేను లేను కదా! అట్లే "నాది" అని గోచరించు సర్వమును త్యజించి దేనిని త్యజించుటకు శక్యము కాదో అట్టి నీస్వరూపమును తెలిసికొని పరమశ్రేయస్సును పొందుము."

వెంటనే హేమచూడుఁడు అటనుండి లేచి గుఱ్ఱముపై నెక్కి నగరము వెలుపలన్న యుద్యానవనమునందున్న సౌధమునందు ప్రవేశించెను. అనుచరుల నందఱను పొమ్మని చెప్పి ద్వారపాలకులను పిలిచి, "నేను ఇచ్చట ఏకాంతముగా నుందును. నేను మీకు ఆజ్ఞఇచ్చువఱకును మంత్రులు గురువులు మొదలుగా ఎవ్వరిని లోనికి రానీయవలదు" అని శాసించెను. పిమ్మట అతఁడు ఆసౌధములోని తొమ్మిదవయంతస్తులోకిని పోయి మెత్తనితూలికలు గలయాసనముపై కూర్చుండి ఏకాగ్రతతో ఇట్లు ఆలోచింపఁజొచ్చెను. "ఈజనులు ఎట్లు ఈవిధముగా మోహము నొందుచున్నారు? ఒక్కఁడైనను తన్ను గూర్చి రవ్వంతయు తెలిసికొనుట లేదు. ఎల్లరును సుఖము కావలయు నని ఏమేమో చేయుచున్నారు. కొందఱ వేదశాస్త్రాదులను నిత్యము పఠించుచున్నారు. కొందఱు ధనము నార్జించుచుండఁగా మఱికొందఱు భూమిని పాలించుచున్నారు. కొంతమంది శత్రువులతో పోరాడుచుండఁగా కొందఱు భోగములయందు ఆసక్తులై యున్నారు. ఇది యంతయు స్వార్థముగనే వారు తలంచుచున్నారు. కాని ఈవిషయములలో తమస్వరూపమైన దేది అని ఒక్కఁడును విచారించుట లేదు. ఈ భ్రాంతి ఎందు వలన వీరికి కలుగుచున్నది? ఆత్మను తెలిసికొనంత వఱకు ఎంత ఘనకార్యమును సాధించినను అది యంతయు, స్వప్నములో జరిగినకార్యమువలె, వ్యర్థము కావున ఇంక ఆత్మను గూర్చియే విమర్శింతును. గృహము ధాన్యము రాజ్యము భార్యమొదలగునవి యన్నియు నాకన్న భిన్నముగా నుండుటచే నాస్వరూపముకావు. "నేను" అన్నప్పుడు ఈదేహమును గ్రహించుచున్నాను. కావున దేహమే నాస్వూరూపము. దీనిచేతనే నేను క్షత్రియుఁడును బంగారువర్ణము కలవాఁడును అగుచున్నాను. కావున సందేహము లేదు; దేహమే నాస్వరూపము. ఇతరులు కూడ "నేను" అని చెప్పునప్పుడు దేహమునే గ్రహించుచున్నారు."

ఇట్లు అనుకొని ఆరాజకుమారుఁడు దేహమునుగూర్చి ఆలోచింపఁజొచ్చెను. ఆలోచించినకొలఁది అతనికి దేహము ఆత్మ అనుటసమంజసముగా తోఁచలేదు. అప్పుడు అతఁడు ఇట్లు అనుకొనెను. "నాయిల్లు, నారాజ్యము అన్నట్లే నాదేహము అని చెప్పుచున్నాను. ఇల్లు రాజ్యమ నాస్వరూపము కానట్లే ఈశరీమ కూడ నాస్వరూపము కాదు. రక్తము అస్థికలు మొదలగువాని సముదాయముతో ఏర్పడి ప్రతిక్షణము వికారమున పొందుచున్న యీ శరీరము నే నెట్లగుదును? దీని నుండి హస్తమో పాదమో ఛేదింపఁబడినచో అది కట్టెవలె మట్టి పెడ్డవలె కన్పించుచున్నది. మఱియును స్వప్నమునందు వేఱొక దేహము కన్పించుచున్నది. ఈదేహమును ఆదేహమును గుర్తించుచున్న నేను దేహ మగుట కుదురదు.

ఇట్లే నాప్రాణములు నామనస్సు నాబుద్ధి అని వానిని గుర్తించుచున్నాను. కావున నాచే గుర్తింపఁబడుచున్నప్రాణము మొదలగునని నాస్వరూపము కావు. గాఢ నిద్రయందు నాది యని ఏదియు స్ఫురించుట లేదు. ఆశూన్యము నాస్వరూప మగునా? కాని "నేను లేను" అనుట ఎప్పుడును లేదు. నేను ఎప్పుడును భాసించుచునే యున్నాను. సంశములేదు. అయినను నాస్వరూపము ఎందువలన నాకు స్పష్టముగా గోచరించుట లేదు? దేనిచేత నాస్వరూపము నాక స్పష్టముగా గోచరింపఁగలదు? సౌధము సంగీతము మొదలగు విషయములు కన్ను చెవి మొదలగువానిచోత భాసించుచున్నవి. చర్మమునందలి ఉష్ణస్పర్శచేత ప్రాణము గ్రహింపఁబడుచున్నది. విషయముల జ్ఞానసములచేత వానిని గ్రహించుచున్న మనస్సు ఉన్నదని ఊహింపఁబడుచున్నది. అట్లే బుద్ధియు ఉన్నదని ఊహించుచున్నాను. కాని నాస్వరూపము దేనిచేత భాసించునో తెలియుట లేదు. లేక, అసలు ఇవి యున్నవి నిరంతరముగా భాసించుచుండుటచేతనే నాస్వరూపము భాసించుట లేదేమో; అట్లయినచో వీనిగూర్చి అనుకొనుటయే మానుకొందును. అప్పుడు నాస్వరూపము గోచరించును."

ఇట్లు నిశ్చయించుకొని యతఁడు మనస్సులోనికి ఏవిషయము రాకుండునట్లు చేసికొనెను. అతనికి తదక్షిణమే గాఢమైన యంధకారము కన్పించెను. 'ఇదియే నాస్వరూప' మని తలంచుచు అతఁడు సంతోషించెను. కాని ఆసంతోషము నిలువ లేదు. ఇది కూడ నాచేత చూడఁబడుచున్నది కదా, నాస్వరూప మెట్లగును"? అని తలంచుచు నతఁడు "మనస్సునందు దేనిని గ్రహింపకుండును గాక" అని దృఢమైన సంకల్పముతో మనస్సుయొక్క వృత్తిని నిరోధించెను. మనస్సు నిరుద్ధమైనంతనే క్షణమాత్రమున ఆదియు అంతమును లేనితేజస్సు అతనికి గోచరించెను. వెంటనే అతఁడు మనస్సుయొక్క నిరోధమును వదలి ఆశ్చర్యముతో "ఇది యేమి? ఇందాక చీఁకటిగా ఇప్పుడ తేజస్సుగా నాస్వరూపము భిన్నభిన్నముగా గోచరించుచున్నదే! మరల చూతను" అని తలంచి మరల మనస్సును నిరోధించెను అప్పుడు అతనిమనస్సు నిద్రయందు చాలసేవు లీనమయ్యెను. ఆ నిద్రయందు ఆతఁడు విచిత్రములైన స్వప్నములనుచూచెను. మేల్కొన్న తరువాత అతనికి పెద్దచింత కలిగెను. "నిద్రచేత ఆవరింపఁబడి స్వప్నములను చూచుచన్నా నేమిటి? ఇంతకు పూర్వము తమస్సును తేజస్సును చూచితిని. అవికూడ స్వప్నములే అగునా ఏమి? మఱిస్వప్నము కూడ మనస్సుయొక్క వ్యవహారమే కదా! దీనిని తొలఁగించుకొనుట ఎట్లు? మరల మనస్సును నిగ్రహించి చూతును" అని తలంచి అతఁడు దృఢముగా మనస్సును నిరోధించెను అది అప్పుడు కొంచెము స్థిరముగా నుండెను. అప్పుడు అతఁడు ఆనందసముద్రమున మునిఁగినవానివలె అయ్యెను. కాని మరల మనస్సు చలించి నంతనే ఆయానందస్థితి తొలఁగిపోయెను. అప్పుడాతఁడు ఇట్లు తలంచెను. ఇది యేమి స్వప్నమా లేక చిత్త విభ్రమమా? లేక సత్యమే యగునా? ఇది ఏమో నాయాలోచనకు అందుట లేదు. నే నేమియు కాలేదు. అయినను నాకు సుఖ మెట్లు కలిగినది? ఈసుఖమునకు కారణమేదియు కన్నించుటచ లేదు. కారణము లేకుండ సుఖ మెట్లు కలుగును? ఆత్మను తెలిసికోవయునని పూనుకొంటిని. అది తెలియలేదు. ఏదేదో కన్పించుచున్నది. నాస్వరూపము ప్రకాశమా అంధకారమా సుఖమా లేక మఱియొకటియా? లేక వీనియొక్క పరంపరయా? నాకు ఏమియు నిశ్చయము కలుగుట లేదు. హేమలేఖనే మరల అడుగవలె." వెంటనే అతఁడు ద్వారపాలకున పిలిచి ఆమెను తీసికొని రమ్మని ఆజ్ఞాపించెను.

హేమలేఖ అచ్చటికి వచ్చి శాంతముగా నిశ్చలముగానిర్వికారముగనున్న భర్తను చూచి ప్రక్కన కూర్చుండెను. ఆతఁడు కనులు విప్పి తన్ను చూచినంతనే ఆమె వానిని ప్రేమతో కౌఁగిలించుకొని మధురముగా "నాథా! నన్నేల పిలిపించితివి? శరీరమునందు ఆనారోగ్యము ఏమియు లేదు కదా! నావలన ఏదైన పని యున్నదా?" అని యడిగెను. ఆతఁడిట్లునెను. "ప్రియురాలా! నీవు చెప్పనట్లుగా నేను ఏకాంతమునందు స్వరూపమును తెలిసికొనుటకై వవిచారించుచుంటిని. అది అనేకవిధములు చిత్రముగ గోచరింపఁజొచ్చినది. ఆత్మనాస్వరూపమే కావున అది సదా నాకు ప్రాప్తించినదే అయి సదా భాసించునది కూడ అయి యుండవలె. కాని ఇతర పదార్థములు ఏవో ఎప్పుడును భాసించుచుండుటవలన ఆత్మ చక్కఁగా భాసించుటలేదు అని తలంచి మనస్సునందు విషయము లేవియు భాసింపకుండునట్లు నిరోధించితిని. అప్పుడు మొదట అంధకారము తరువాత ప్రకాశము పిమ్మట మహాసుఖము గోచరించెను. ఇది యేమో చెప్పుము. ఆత్మ యొక్క రూపము ఇదియేనా? ఇంకైదైనఁగలదా? వివరించి చెప్పుము. దానిని తెలిసి కొందును?

హేమలేఖ ఇట్లనెను. "బాహ్యవిషయములు మనస్సులోనిక రాకుండ నీవుకావించిన చిత్తనిరోధము ఆత్మవేత్తల కందఱకు సమ్మతము శుభప్రదమునైన ముఖ్యసాధనము. చిత్తనిరోధము లేకుండ ఆత్మను ఎవఁడును ఎప్పుడును ఎచ్చటను పొందలేదు. కాని ఆత్మమనస్వరూపము అగుటచే మనకు ఎప్పుడును ప్రాప్తించియే యున్నది. కావున దానిని పొందుటకు చిత్త నిరోధము కారణము కాదు. ఏది మనచేత వేఱొకపదార్థమువలె పొందఁబడునో అదిమనస్వరూప మెట్లగును? కావున ఆత్మ ఎప్పుడను పొందఁదగినది కాదు? దానిని పొందుట యన్నది లేనేలేదు. ఆత్మ మనకు ఎప్పుడును ప్రాప్తించియే యున్నను. దానియొక్క జ్ఞానము మాత్రము అంతఱకు ఉండుట లేదు. ఇంతకు పూర్వములేని యాజ్ఞానము ఇప్పుడు కలుగుచున్నది. అయినను చిత్తనిరోదము గాని యీయాత్మజ్ఞానము కాని ఆత్మను మనకుతెచ్చి యిచ్చుట లేదు. దీని కొకనిదర్శనము చూడుము. ఒక వస్తువు చీఁకటిలో నుండి కన్పించుట లేదు. దీపమును తెచ్చి చీఁకటిని నిరోధించినపుడు అంతకు పూర్వము అక్కడ ఉన్నవస్తువే మనకు ప్రాప్తించుచున్నది. దీపకాంతి చీఁకటినిమాత్రమే తొలఁగిచినది కాని వస్తువును తెచ్చిపెటలేదు. అట్లే ఒకఁడు ఏదో విషయమునుగూర్చి తీవ్రముగ ఆలోచించుచు ఉత్తరీయములో ముడిచియుంచిన బంగారు నాణమును మఱచే ననుకొనుము. అప్పడు వాఁడు దానికొఱకు వెదుక నారంభించెను. కొంతసేపైన తరువాత వాఁడు ఇతరాలోచనములను నిరోధించి నాణము తనయొద్దనే యున్నదని జ్ఞప్తికి తెచ్చుకొనెను. అప్పడు వాని కది క్రొత్తగా ప్పాప్తించినట్లే యుండును. కాని నిజమునకు

అది వానికి ఇందివఱకే ప్రాప్తిమై యున్నది. కావున ఇతరాలోచనములను నిరోధించుట ఆనాణముయొక్క ప్రాప్తికి కారణము కాదు. ఆనాణ మిదివఱకే వానికి ప్రాప్తమైన యున్నది కదా! అట్లే ఆత్మకూడ మనకు స్వరూపము ఎల్లప్పుడు ప్రాప్తించియే యుడుటవలన చిత్త నిరోధము దానియొక్క ప్రాప్తికి కారణము కాదు. అట్లయినచో మనకు ప్రాప్తించియేయున్న యాత్మ ఏల గోచరించుట లేదు అన్నచో వినుము. దానయొక్క పరిజ్ఞానము మనకు లేకుండుటచే దానిని మనము గుర్తింపలేకున్నాము. "దీపకాంతివలన వస్తువులు ప్రకాశించును" అని కాంతియొక్క జ్ఞానము లేనివాఁడు రాత్రిపూట రాజ సభకు పోయినప్పుడు అక్కడ సభ్యులను దీపములను కూడ చూచుచు ఆశ్చర్యము నొందును దీపములకాంతియే సభ్యులను దీపములను కూడ ప్రకాశింపఁజేయుచున్న దని వానికి తెలియదు.

నీవు చిత్తమును నిరోధించితివి. ఆనిరోధముయొక్క అంతమునందు నీకు అంధకారము కన్పించినది. ఆయంధకారమునకు పూర్వము ఏదియును గోచరింపలేదు. అప్పుడు దృశ్యమేదియును లేక జ్ఞానము మాత్రమే యున్నది. అదియే మరమానందదాయకమైన మన స్వరూపము. దానిసే ఎల్లప్పుడు భావించుచుండుము. ఈవిషయమున బహిర్ముఖులైనవారు. ఎచ్చటనో ఆత్మ యున్న దనుమహామోహమునకు లోనగుచు, దానిని వెదకి వెదకి ఈభావమును సైతము పొందఁజాలకున్నారు. శాస్త్రమునుతెలసికొన్నవారు. విన్నదానిని చక్కఁగా తర్కముతో మననము చేసికొనఁకలిగినవారు కూడ కేవలచిత్తనిరోధమువలన స్వరూపమును తెలిసికొనలేక రాత్రింబవళ్ళు దుఃఖించుచున్నారు. శాస్త్రమునందలి శబ్దములయొక్క అర్థముల యొక్క ఆందమును గ్రహించిచనంతమాత్రమున స్వరూపముయొక్క అనుభవము కలుగదు. ఎంతవఱకు అన్వేషణమువిచారము జరుగుచుండునో అంతవఱకు ఆత్మయొక్క అనుభవము ప్రాప్తింపదు. ఎందువల్ల ననఁగా అది బుద్ధిచేత గ్రహింపఁదగినది కాదు. ఇంద్రియము లను ఎంత దూరము ప్రసరింపఁజేసినను అది యొక బాహ్యపదార్థము కాకపోవుటడచే వానిచేత గ్రహింపఁబడదు. ఇంద్రియములను నిగ్రహించినప్పుడు అది మనయందే సిద్ధమై యుండుటచే గోచరించును. అట్లే విచార మొనర్చుచున్నను అది తెలియఁబడదు. ఆవిచారమును నిలిపి మనస్సును నిరోధించినప్పుడు అది ప్రకాశించును. అనఁగా ఇంద్రియములను మనస్సును నిరోధించినప్పుడే అది భాసించును. ఇది తప్ప ఇంక ఏపని చేసినను ఎవఁడును స్వరూమును గ్రహింపలేఁడు. ఎవఁడు ఎంతదూరము పరువెత్తినను తన నీడను తాను గ్రహింపలేఁడు. స్వచ్ఛముగానున్న యద్దమునందు బాలుడు ఎన్ని ప్రతిబింబములను చూచుచున్నను ఆప్రతింబములకు ఆధారముగానున్న యద్దమును గ్రహింపలేఁడు. అట్లే జను లందఱును తమయొక్క ఆత్మయను అద్దమునందు ప్రతిబింబముగానున్న జగత్తును చూచుచు తమ యాత్మను గ్రహింపలేకున్నారు. వారికి ఆత్మయొక్క పరిజ్ఞానము లేకుంఁడుటయే అందువలకు కారణము. ఆకాశమునుగూర్చి తెలియని వాఁడు దానియందున్న జగత్తును చూచుచు దానికి ఆశ్రయమైనయున్న యాకశమును గుర్తింపఁజాలఁడు. అట్లే జనలు సర్వమును చూచుచుదానికి ఆశ్రయమైయున్న తమయాత్మను గుర్తింపలేకున్నారు.

ఒకవ్యక్తి యొక్క పరిచయము లేకున్నచో ఆవ్యక్తి మనకు కన్పించుచున్నను "ఇతండు ఫలానావాఁడు" అని ఎట్లు గుర్తింపలేమో, అట్లే చితక్త నిరోధమున స్వరూపము గోచరించుచున్నను, దానిని గూర్చి పరిచయము లేకున్నచో, "ఇది నాస్వరూపము" అని గూర్తుంచుట సాధ్యముకాదు. కావున ఆత్మస్వరూపమునుగూర్చి చెప్పెదను వినుము. సూక్ష్మముగా చూచినచో జగత్తు అంతయు జ్ఞానము జ్ఞేయము అని రెండు విధములుగా నున్నది. ఆత్మవిషయమున జ్ఞానము స్వతస్సిద్ధము అనఁగా "నే నున్నాను" అని గ్రహించుటకు ప్రత్యక్షము అనుమానము మొదలైన ప్రమాణములు ఏవియు అక్కఱలేదు. మఱియును ఆద్దము లేకున్నచో ప్రతిబింబము లేనట్లు, ఆత్మ లేకున్నచో ఏదియును లేదు. ప్రమాణములు లోకమున జ్ఞానమును కలిగించుటకు సాధనములు జ్ఞానము కావసినవానికి అవి ఆవశ్యకములగును. కాని వాఁడు తన్నుగూర్చి తాను తెలిసికొనునప్పుడు ఆప్రమాణములు ఉపయోగింపవు. స్వరూపము స్వతసిద్ధమగుటచే దానిని గ్రహించుటకు ప్రమాణములతో పనిలేదు. సూర్యుని చూపుటచకు దీపములతో నెట్లు పనిలేదో అట్లే ఆత్మన గ్రహించుటకు ప్రమాణములతో పనిలేదు. కావున ఆత్మ ఏసాధనముచేతను సిద్ధించునది కాదు. అట్టిజ్ఞానరూపమైన యాత్మ ఎక్కడ ఉన్నదని ఆక్షేపించువానికి ప్రశ్న సమాధానము రెండును కుదురువు. ఎవఁడైనను ఆత్మలేదన్నచో వాఁడును లేనివాఁడు అగును. ఉన్నవాఁడు ప్రశ్నింపఁగలఁడు గాన లేనివాఁడు ఎట్లుప్రశ్నించును? అట్లే ఆత్మలేనిచో సమాధానము చేప్పువాఁడును ఉండుఁడు. ఇంక సమాధానము ఎట్లు పుట్టును? కావున ప్రతిబింబములకు అధారమైయున్న యుద్దము లేదని చెప్పుటకు ఎట్లు వీలు లేదో అట్లే సకలజగత్తుయొక్క ప్రతిబింబమునకు ఆధారమై జ్ఞానరూపముగా పెద్దయుద్దమువలె ఎల్లరయందును ప్రకాశించుచున్నయాత్మ లేదని చెప్పుటకు వీలు లేదు.

దేశకాలముచేత కూడ దానియందు విభాగములు ఏర్పడుట లేదు. ఎందువల్ల నఁనగా అవికూడ దానియందలి ప్రతిబింబములే. మహాకాశమునందు అనేకవిభాగములతో వివిధపదార్థములు గోచరించుచున్నట్లు ఆత్మయందు జగత్తు వివిధపదార్థములుగా గోచరించుచున్నది. దేశకాలములు నామరూపములు మొదలగువానివలన కన్పించుచున్న భేదము లన్నియు జగత్తునకు సంబంధించినవే కాని ఆత్మకు సంబంధింపవు. అట్లు జగత్తునకు ఆధారమైయున్న యాత్మయే నీకును స్వరూపము. వెండిచెంబు వెండికంచము మొదలగు విశేషనామరూపముల కన్నింటికిని వెండి సామాన్యపదార్థము. అది ఆ నామరూపములకు అతీతము. సామాన్యమైన వెండియందు చెంబు కంచము మొదలుగా పెక్కుపదార్థమలు ఎట్లున్నవో అట్లే సామాన్యచైతన్యమునందు జగత్తులోని పదార్థము లన్నియు ప్రాకశించుచున్నవి. జగత్తునకు ఆధారమైన దానికి ఉనికిన (Existence) ప్రకాశమును (Appearence) కలిగించుచున్న యాసామాన్యచైతన్యమును తనస్వరూపమునుగా, "ఆచైతన్యమే నేను" అని గ్రహించి యాస్థితిలో నిలిచిన వానికి పరమేశ్వరత్వము సిద్ధించును.

ఆచైతన్యమును గుర్తించుటకు అనువైనస్థానమును చెప్పెదను వినుము విషయములతో సంబంధమును పొందక కేవలముగా (Absolute) నుండుజ్ఞానమే సామాన్యచైతన్యము. దానిని మనము నిద్రకు జాగ్రత్తునకు మధ్యలో గ్రహింపవచ్చును మనస్సు వివిధ పదార్థములను గ్రహించుచుండుట జాగ్రత్తు. అది తమస్సుచేత కప్పఁబడియుండట నిద్ర. జాగ్రత్తును వదలి తమస్సులో లీన మగుటకు ముందు మనస్సు క్షణకాలము పదార్థములయొక్క రూపములను పొందక కేవలచైతన్యముగా (Absolute Consciousness) ఉండును. అట్లే జాగ్రత్తులో కూడ మనస్సు ఒకపదార్థముయొక్క జ్ఞానమును వదలి మఱియొక పదార్థముయొక్క జ్ఞానమును పొందుటకు ముందు క్షణకాలము విషయరహితముగా కేవలచైతన్యముగా నుండును. చెట్టును దానిపైనున్న పక్షిని చూచునప్పుడు చెట్టుయొక్క జ్ఞానమునకు పక్షి యొక్క జ్ఞానమునకు నడుమ కొంచెము అంతర ముండును. వెండి యందు చెంబుయొక్క ఆకార ముండగా కంచముయొక్క ఆకారముండదు. చెంబు యొక్క రూపమును తొలఁగించి కంచముయొక్క ఆకారమును ఏర్పరచుటకు ముందు మధ్యలో వెండి సామాన్యముగా ఎట్లుండునో అట్లే మనస్సు ఒకపదార్థముయొక్క జ్ఞానము వదలి మఱియొక పదార్థముయొక్క జ్ఞానమును పొందుటకు ముందు సామాన్య చైతన్యముగా నుండును. కావున ఇట్లు జాగ్రత్తునకు నిద్రకు మధ్యలో ఒక విషయజ్ఞానమునకు మఱియొకవిషయ జ్ఞానమునకు మధ్యలోనుండు కేవల జ్ఞానమును సూక్ష్మబుద్ధితో గుర్తింపుము. అదియే నీస్వరూపము. దీనిని ఎఱుంగకపోవుటవలననే ఈజగత్తు ఇట్లు తోఁచుచున్నది. ఈస్వరూపమునందు రసము గంధము స్పర్శము శబ్దము సుఖము దుఃఖము గ్రహించునది గ్రహింపఁబడునది ఏదియును లేదు. ప్రతిబింబములకు అద్దమువలె ఇదియే సకల జగత్తునకు ఆధారమైనప్పటికి ఇది ఎప్పుడును అద్దమువలె నిరాకారమే. ఇదియే బ్రహ్మ విష్ణువు ఈశ్వరుఁడు సదాశివుఁడు సర్వేశ్వరుఁడు.

మనస్సును నిద్రలోనికి పోకుండ నిలిపి, విషయములపై ప్రసరింపకుండ ఆపి, కేవలజ్ఞానమైన స్వరూపమును చూడుము. "నాస్వరూపమును చూచుచున్నాను" అను తలంపుకూడ లేకుండ, గ్రుడ్డివానివలె మనస్సుయొక్క వ్యాపారమును నిలిపి యూరకుండుము. అదియే స్వరూపస్థితి. దానిని వెంటనే పొందుము"

అది విని హేమచూడుఁడు ఆమె చెప్పినట్లే స్వరూపస్థితినిఁగని అందు చాలసేపు విశ్రాంతి నొంది బహిఃప్రపంచము విస్మరించెను.

ఇది జ్ఞానఖండమునందు హేమచూడునివిశ్రాంతి యన్నది నవమాధ్యాయము.

# దశమాధ్యాయము-హేమచూడుని జీవన్ముక్తి

అట్లు సమాధిస్థితి నొందియున్న భర్తను చూచి ఆతనిని కదలింపకుండ హేమలేఖ ప్రక్కన కూర్చుండి యుండెను. అతఁడు కొంత సేపటికి కనులు తెఱచి ప్రియురాలిని జగత్తును చూచెను. కాని అతఁడు మరల ఆసమాధిస్థితిలోనికి

పోయివిశ్రాంతిసుఖమును పొందవలయునని తొందరపడుచు కనులు మూసికొనుచుండెను. అప్పుడుహేమలేఖ నవ్వుచు ఆతనిపై చేయిపైచి తనవైపు త్రిప్పుకొని మధురముగా నిట్లనెను "నాథా! నీవు ఏమి నిశ్చయించుకొంటివో చెప్పుము. కనులు మూసికొనుటవలన లాభముకాని తెఱచుటవలన నష్టము కాని ఏమి కలుగుచున్నదో చెప్పుము. కనులు తెఱచినప్పుడు నీవు పొందకున్నది యేది? కనులు మూసికొనినప్పుడు పొందుచున్న దేమి? నీస్థితి ఏమోచెప్పుము."

అప్పు డాతనికి ఆమెతో మాటాడుటకు కూడ ఇష్టము లేకుండెను. వెంటనే సమాధిసుఖమును పొందవలయు నను తొందఱతో నుండి ఆలస్యమును భరింపలేక మదమత్తునివలె ఇట్లనెను. "ప్రియురాలా! చిరకాలమునకు నేను అత్యంతమైన విశ్రాంతిని పొందితిని దుఃఖభూయిష్ఠమైన యీబాహ్యప్రపంచమునందు ఎక్కడను నాకు విశ్రాంతి లేదు. పిప్పియైన చెఱకుముక్కను నమలినట్లుగా రుచిలేని యీప్రపంచవ్యవహారము ఇంక చాలును. దౌర్భాగ్యముచేత అంధుఁడైన ఇప్పటివఱకును ఆత్మసుఖము నెరుంగనైతిని. తన యింటి యందే పెద్దలు నిక్షేపించిననిధిని ఎఱుంగంక ఒకఁడు భిక్షాటనము చేసెనఁట. అట్లే నేనును నాయందేయున్న సుఖసముద్రమును తెలిసికొనక దుఃఖపరంపరలతో సంకీర్ణమైనయున్న విషయసుఖములకొఱకు ప్రాకులాడుచుంటిని. మెఱపుతీగవలె క్షణములో మాయమగునట్టి సుఖములను కోరుచు దుఃఖములచేత కొట్టఁబడుచు విశ్రాంతిని పొందకుంటిని. అహో ఏమి యీజనులవర్తనము. వీరు సుఖ మేదియో దుఃఖమేదియో కూడ తెలిసకొనలేక నిరంతరము సుఖమును కోరుచు దుఃఖములను ప్రోవుచేసుకొనుచున్నారు. ప్రయత్నపూర్వకముగా దుఃఖమును తెచ్చుకొని అనుభవించుట ఇంక చాలును. ప్రియురాలా! నీకు అంజలిచేసి ప్రార్థించుచున్నాను. నాయందు దయచూపుము. సుఖ రూపమైన నాయాత్మయందు చాల విశ్రాంతిని కోరుచున్నాను. నన్ను కదలింపకుము. నీవు ఆత్మానందము నెఱింగియు దానియందు మిశ్రమింపక దుఃఖమును కలిగించు వ్యవహారమందు ఉండుటను చూడఁగాదైవహతురాల వని (Unfortunate) తో ఁచుచున్నది.

ఆమాటలు విని హేమలేఖ మందహాసముతో నిట్లెనెను. "నాథా! పరమపావనమైన యాత్మపదము నీకు తెలియలేదు. ఆత్మస్థితియందుండి అది తప్ప వేఱుమియు లేదని రూఢిగ నెఱింగిన పండితులుకనులు మూసికొన్నచో ఒకవిశేషము తెఱచినచో ఇంకొక విశేషము కలుగు నని భ్రాంతి నొందఱు. నీవు కొంచెము తెలిసికొంటివి. తెలిసి యా కొంచెము తెలియనిదానితో సమానముగా నున్నది. ఆత్మ పదము కనులు మూసికొనుటచేఁగాని తెఱచుటచేఁగాని గోచరించునదికాదు. అట్లే ఒకపని చేయుటవలనఁగాని చేయకుండుటవలనఁగాని, ఒకతావునకు పోవుటవలనఁగాని పోకుండుండుటవలనఁగాని అది లభించునది కాదు. ఒకపని చేసియో లేక చోటికి పోవుటవలననో మన మొకదానిని పొందినచో అదిపూర్ణ మెట్లుగును? మనకంటి ఱప్పలు ఎనిమిదివడ్లగింజలు వరుసగా పేర్చినచో ఎంత పొడవుండునో అంతపొడవుగా కూడ నుండవు. అట్టి యీఱప్పలు తెఱచినంతనే అంతర్ధానము నొందునట్టి యాత్మ పూర్ణవస్తు వగునా? అహో! నీకు ఎంత భ్రాంతి కలిగినది! కోట్లకొలఁది బ్రహ్మాఁడములు దేనియందొకమూల నొదిగియున్నవో అట్టి పూర్ణమైన యాత్మ అంగుళము పొడవు కూడ లేని కనుఱప్పలు తెఱచుటవలన మాయ మగునా?

తత్త్వసారమును చెప్పెదను వినుము. గ్రంథులు తెగనంత వఱకు ఎవనికి సుఖము కలుగదు. మోహము అను త్రాడునందు కోట్లకొలఁది ముడులున్నవి. స్వరూపము నెఱుంగకుండయే మోహమనుత్రాడు. వస్తుస్థితికి విరుద్ధముగా మనము చేయుభావనలే అముడులు. దేహేంద్రియాదులను ఆత్మగా తలంచుచుండుట మొదటిముడి. ఈదేహాత్మబుద్ధి అను ముడివలననే ఈసంసారము అనివార్యముగా సిద్ధిమగుచున్నది. అట్లే జగత్తు వేఱు నేను వేఱు అనుతలంపు మఱియొకముడి. ఈవిధముగానే జీవుఁడు వేఱు ఈశ్వరుఁడు వేఱు, ఒక జీవునకన్న మఱియొక జీవుఁడు భిన్నుఁడు-మొదలైన తలంపులన్నియు ముడులే. స్వరూపము నెఱుంగకుండుట అను నీయజ్ఞానము అనాదికాలమునుంలడియు త్రాడువలె ఏన్నో మెలికలు తిరిగి ముడులుపడి పురుషుని చుట్టుకొనియున్నది. ఆముడులు విచ్చిపోయి ఆత్రాడు జాఱి పోయినచో పురుషుఁడు ముక్తుఁడగును. నీవు కనులు మూసికొని దేనిని పొందుచున్నావో అది నీస్వరూపమే. ఆదియే శుద్ధమైనజ్ఞానము. దానికి పైది ఏదియులేదు. అదియే సకలప్రపంచము ప్రతిబింబించుటకు ఆధారమైన యుద్దముగా నున్నది. అది ఎచ్చట ఎప్పుడు ఏరూపమున లేదో చెప్పుము. ఏప్పుడైనను ఏరూపముతో నైనను ఎందైనను నీ నిజరూపమైన సామాన్యచైతన్యము లేదని నీవు చెప్పుదువేని ఆకాలము ఆదేశము ఆపదార్థము గొడ్రాలి బిడ్డవలె లేనివేఅగును. ఎందువల్ల ననఁగా అద్దము లేకుండ ప్రతిబింబములు ఎట్లుండవో అట్లే చైతన్యము లేకుండ ఏపదార్థము ఉండదు, ప్రకాశింపదు. చైతన్యమును వలననే జగత్తు అంతయు

భాసించుచున్నది. చైతన్యమును వదలినచో ఎచ్చటను ఏదియును భాసింపదు. అట్టి సర్వవ్యాపకమైన చైతన్యము నీవు కనులు తెఱచినంతమాత్రముగ మాయమగునా

"నేను చిత్తనిరోధముచేత ఆత్మను తెలిసికొనుచున్నాను" అని నీవు ఎంతవఱకు తలంచుచుందువో అంతవఱకు ఆయభిమానమే ఒక గ్రంథిగా రూపొంది గట్టిపడును. "ఆత్మ నాస్వరూపముగా నాకు ఎప్పుడును ప్రాప్తించియే యున్నది" అని నీకు తోఁచువఱకు ఆయాత్మ పదము నీకు ప్రాప్తింపనట్లే. కనులు మూసికొని గాని తెఱచి గాని ఏపదమును పొందితి నని తలంచుచున్నావో అది పూర్ణమైన(All pervading) పదము కాదు. ఎందువల్ల ననఁగా నీవు చిత్తమును నిరోధించినపుడు ఆసమయమున అది నీలోపలనే భాసించుచున్నచో నీకు అది వెలుపల లేనట్లే కదా! ఒకక్రియచేత ఒకసమయమునందు ఒకచోటనే ప్రకాశించునట్టిది పూర్ణ మెట్లగును? ప్రళయకాలాగ్ని జ్వాలవలె ప్రకాశించుచున్న యామహాచైతన్యము ఎక్కడ లేదు? కాలాగ్ని జ్వాల ఎట్లు ప్రతిపదార్థమును తనదిగా చేసికొనునో అట్లే మహాచైతన్యము కూడ సకలజగత్తును తనదిగా చేసికొని దానికి స్వరూపముగా నున్నది. ఆచైతన్యమును గ్రహించినచో నీకు చేయవలసినపని ఏదియు నుండదు. "నేను చిత్తమును నిరోధించి ఆత్మను చూచుచున్నాను" అన్న యీయభిమానగ్రంథిని ఛేదింపుము. "కన్పించుచున్న యీజగత్తు నేను కాదు" అన్న భేదగ్రంథిని కూడ ఖండింపుము. అఖండమైన యానందరూపముగా నున్న యాత్మను ఎల్లయెడలను చూడుము. అద్దములో ప్రతిబింబమునువలె అఖిలమును నీస్వరూపము నందే చూడుము. "ఎల్లయెడలను సర్వమునను నాస్వరూపమే చూచుచున్నాను" అని ముందు నిశ్చయింపుము. ఆనిశ్చయమునందు రెండు భాగములు కలవు. "సర్వము నాస్వరూపమే" అనుభావన మొదటిది. దానిని భావించుచున్న నీవు రెండవభాగము. భావనారూపమైన మొదటిభాగమును వదలి దానిని భావించుచున్న నీస్వరూపమైన సామాన్యచైతన్యమును అవలంబించి దానిని వదలకుండ స్వస్థుఁడవు కమ్ము."

హేమలేఖ చెప్పినది గ్రహించి హేమచూడుఁడు భ్రాంతిరహితుఁడై సర్వవ్యాపకమైన తనపూర్ణస్వరూపమును తెలిసికొని క్రమముగా ఆభావనయందు స్థిరత్వము నొందెను. అంతకు పూర్వము "దేహమే నేను" అని దేహముతో తాదాత్మ్యము ఎంత దృఢముగా నుండెనో, అంత దృఢముగానే "కేవలచైతన్యమే నేను" అని చైతన్యముతో తాదాత్మ్యము (Identification) ఏర్పడెను. పిమ్మట నతఁడు హేమలేక మొదలైన యువతుల సముదాయముతో విహరించుచు శత్రువులను జయించి రాజ్యమును పాలించుచు శాస్త్రములను వినుచు ఇతరులకు వినిపించుచు ధనములను సంపాదించుచు అశ్వమేధము రాజసూయము మొదలైన మహాయజ్ఞములను చేయుచు ఇరువది వేలసంవత్సరములు ఈలోకమున జీవన్ముక్తుఁడై యుండెను.

అట్లున్న హేమచూడుని చూచి తండ్రియగు ముక్తాచూడుఁడు. సోదరుఁడు మణిచూడుఁడును ఇట్లు అనుకొనిరి. "ఏవిధముగాఁ జుచినను వీడు వెనుకటివలె కన్పించుటలేదే! వీఁడు సుఖము కలిగినప్పుడు పొంగిపోవుట లేదు; దుఃఖము కలిగినప్పుడు కృంగుటయు లేదు. వీఁడు ఎందువల్లనో లాభనష్టములను లెక్కపెట్టుట లేదు; శత్రువులకు మిత్రులకు భేదమును గణించుట లేదు. రంగస్థలమున నటునివలె వీఁడు రాజకార్యము లన్నియు నిపుణముగా నిర్వహించుచున్నాఁడు. మద్యముచేత మత్తు పొందినవానివలె ఎల్లప్పుడు పరధ్యానముతో ఏమియును పట్టించుకొనక తాను చేయవలసినకృత్యమును మాత్రము ఎంత వఱకు ఎట్లు చేయవలయునో అంతవఱకు అట్లు చేసి ఫలితమునుగూర్చి అనుకొనుటయే లేక వెడలిపోవుచేన్నాఁడు." ఇట్లు అనుకొనుచు వారిరువురు అతనిని ఏకాంతమునందు కలిసికొని ప్రశ్నించిరి. హేమచూఁడుడు వారికి జరిగిన వృత్తాంతమును క్రమముగా చెప్పి తనస్థితిని వివరించెను. అతని బోధనమువలన వారిద్దఱు పరతత్త్వమును పొంది జీవన్ముక్తులైరి. అంతట మంత్రులు కూడ మహారాజువలన జగత్తుయొక్క స్థితిని గతిని ఆత్మయొక్క స్వరూపమును విచారించి తెలిసికొని జ్ఞానులైరి. ఈవిధముగా క్రమక్రమముగా విశాలనగరములో ఆబాలగోపాలముగా స్త్రీలు పురుషులు యువకులు వృద్ధులు దాసదాసీ జనములు కూడ ఒకరివలన ఒకరు ఉపదేశమును పొందుచు అందఱును తత్త్వమును తెలిసికొనిరి.

వారి కెవరికిని దేహాభిమానము లేకుండెను. బాలునకుఁ గాని వృద్ధునకుఁ గాని, వారికి తెలియకుండ, కామము క్రోధము లోభము కలుగుటయే లేదు. వారు తమకు కావలసినప్పుడు కామక్రోధాదులను పొందుచు వ్యవహారమును జరుపుకొనుచుండిరి. తల్లి బిడ్డను తత్త్వమునకు సంబంధించినమాటలతో ఆడించుచుండెను. పరతత్త్వప్రసంగములతో దాసదాసీజనులు యజమానులను సేవించుచుండిరి. తత్త్వప్రసంగములు గల పాత్రలతో నటులు నాటకములను

ప్రదర్శించుచుండిరి. వివేకమును బోధించుగీతములను గాయకులు గానముచేయుచుండిరి. విదూషకులు ఎల్లప్పుడును లోకవ్యవహారమును దూషించుచుండిరి. పరతత్త్వవిచారమునకు అర్హములైన యుదాహరణములతో విద్వాంసులు శాస్త్రములను శిష్యులకు బోధించుచుండిరి. ఈవిధముగా అచ్చట దాసదాసీజనములు నటులు విటులు భృత్యులు భటులు శిల్పులు వారాంగనలు కూడ తెలిసికొవలసిన తత్త్వమును తెలిసికొని అంతకు పూర్వము ఏర్పడియున్న సంస్కారములు బలముచేతనే వ్యవహారములను జరుపుకొనుచుండిరి. వారు జరిగిపోయిన శుభమును గాని అశుభమును గాని స్మరింపకుండిరి. అట్లే వారు జరుగుచున్న సంఘటనములనుబట్టి కలుగబోవు సుఖమును దుఃఖమును ఊహింపకుండిరి. సుఖమునో దుఃఖమునో అనుభవించుచున్నప్పుడు వారు నవ్వుచు సంతోషించుచున్నట్లు దుఃఖించుచున్నట్లు కోపించుచున్నట్లు వ్యవహరించుచు మద్యపానమత్తులవలె ఏదియు పట్టకుండిరి.

అట్లున్న విశాలనగరమునకు సనకాదిమహర్షులు వచ్చి చూచి, "ఇది ప్రసిద్ధ విద్యానగరము" అని కీర్తించిరి. అక్కడ పంజరముల యందున్న చిలుకలు ఇట్లు పలుకుచుండెను. "దృశ్యమును వదలి దృక్స్వరూపమైన యాత్మను పొందుఁడు. ప్రతిబింబము అద్దముకన్న భిన్నముగా ఎట్లు లేదో అట్లే దృక్కునందు ప్రతిబింబించుచున్న దృశ్యము కూడా దృక్కునకు భిన్నముగా లేదు. దృక్కే దృశ్యముగా కన్పించుచున్నది. ఆదృక్కే నేను. అదియే చరాచరమైన సర్వముగా గోచరించుచున్నది. దృక్కువలననే సర్వము భాసించుచున్నది. కాని దృక్కు మాత్రము స్వతంత్రముగా భాసించుచున్నది. కావున జనులారా! భ్రాంతినివీడి సకలమునకు ఆధారమై సకలమును భాసింపఁజేయుచున్న దృక్కును దానియందే దృష్టకలవారై భజింపుఁడు."

పక్షులు సైతము ఇట్లు పలుకుచుండు ఆపురమును ఇప్పటికిని ప్రసిద్ధ విద్యానగర మని చెప్పుచున్నారు. ఇట్లు హేమలేఖవలన వారు అందఱు జీవన్ముక్తు లైరి. కావున శ్రేయస్సును కలిగించుటలో మొట్టమొదటి సాధనము సత్సంగము. అందువలన శ్రేయస్సును కోరువాఁడు సత్పురుషులను ఆశ్రయించుటకే నిరంతరము ప్రయత్నించుచుండవలయును.

ఇది జ్ఞానఖండమున హేమచూడుఁడు జీవన్ముక్తుఁ డగుట యన్నది దశమాధ్యాయము.

బాలప్రియ

హేమచూడునకు జ్ఞానము కలిగిన ప్రకారము గమనింపఁదగి యున్నది. అతఁ డొక సామాన్యుఁడైన రాజపుత్రుఁడు. అతఁడు సజ్జనుఁడే కాని యతనికి తత్త్వమునుగూర్చి ఆలోచనయే లేదు. అతఁడు హేమలేఖయొక్క సౌందర్యమును చూచి ముగ్ధుఁడై ఆమెను ప్రేమించి పెండ్లిచేసికొని ¸వనమునందు సహజముగా నుండు తీవ్రమైనయభిలాషతో ఆమెతో కూడి భోగములను అనుభవింపఁజొచ్చెను. ఆమెకు అట్టియభిలాష లేదు. ఆమె ఆత్మజ్ఞానమువలన నిరంతరము ఆనందరూపిణియై యుండెను. ఆమెయొక్క సహజస్థితి ఎట్టిదో అతనికి తెలియదు. ఎంతకాలము ఎంత గాఢముగ స్నేహముతో నున్నను సామాన్యులకు తమతో కూడియుండు వారియొక్క మహత్త్వము తెలియదు. శ్రీకృష్ణుఁడు పరబ్రహ్మ మని ఆయనతో కూడియున్న మిత్రులు గాని భార్యలు గాని పుత్రులు గాని ఎంతమంది గుర్తింపఁగలిగిరి? "నేను నీకు శిష్యుఁడను; నన్ను శాసింపుము" అని శరణాగతిచేసిన యర్జునుఁడు కూడ స్థితిప్రజ్ఞుఁడైన శ్రీకృష్ణుని చూచుచు"స్థితిప్రజ్ఞుడెట్లుండునో చెప్పుము" అని ప్రార్థించెను. అర్జునునకు విషాదము కలుగకపోయినచో, శ్రీకృష్ణుఁడు తత్త్వమును ఉపదేశించపకున్నచో అర్జునుఁడు ఆయనయొక్క యథార్థమైన మహత్త్వమును ఎప్పటికిని గుర్తించియుండక పోవచ్చును. తత్త్వజ్ఞులు లోకమున సామాన్యులవలెనే వర్తించుచుందురు. తత్త్వమును ఎఱింగినవారు మాత్రమే ఆమహాయోగులయొక్క యథార్థస్థితిని గుర్తింపఁగలుగుదురు కావున హేమలేఖ జీవన్ముక్తురాలని హేమచూడుఁడు గుర్తింపలేకపోవుట సహజము.

హేమలేఖ అతనినిగూర్చి పట్టించుకొనక ఊరకున్నచో హేమచూడుఁడు తుదివఱకు అజ్ఞుడుగానే యుండియుండును. కాని తన్ను మిగుల ప్రేమించుచున్న యతనియందు ఆమెకు దయ కలిగెను. అందువలన ఆమె అతనికి ఆత్మజ్ఞానమును కలిగింప నెంచెను. అది ఆతని పూర్వపుణ్యఫలము. తెలిసికోవలయు నని యాదరముతో ఎదుటివాఁడు

అడిగినప్పడే ఏవిషయము నైనను చెప్పవలయును కాని ఊరక చెప్పరాదు. తత్త్వమునుగూర్చి అసలే చెప్పరాదు. అట్లు చెప్పఁబూనినవాఁడు పరిహాసము పాలగును. అందువలన ఆమె ముందుగా ఆతని యందు ఆలోచనమును రేకెత్తింపఁజేయుటకై తనకు భోగములు యందు అభిలాషలేకపోవుటను అతఁడు గుర్తించునట్లు చేసినది. ఆమెకు ఆతలంపే లేకున్నచో, శ్రీకృష్ణుఁడు భార్యలతో క్రీడించినట్లు. ఆమె కూడా అతనితో సమానముగ భోగాభిలాష యున్నట్లే వర్తించియుండెడిది, కాని ఆమె అతనియందు ఆలోచనమును విమర్శను కలిగించుటకే తనకు భోగములయందు అభిలాష లేకుండుట అతనికి స్ఫురించునట్లు వర్తించినది. "నీవు ఎందులకు భోగములయందు ఆసక్తిని చూపుట లేదు?" అని అతఁడు అడిగినపుడు ఆమె ప్రియము అప్రియము అనువానినిగూర్చి చర్చ ఆరంభించి, అందమన్నది శరీరములయందు లేదని, మనకు అయావ్యక్తులయందున్న అభిమానమే అట్లు కన్పించుటకు కారణ మని నిరూపించినది. తుదకు ఆమె శరీరమునుగూర్చి "ఇది నాడీసముదాయములయల్లికతో రక్తమాంసములు పూతతో చర్మముతో కప్పఁబడి గాదెవలె మలమూత్రములతో నిండియున్నది. ఇట్టి బీభత్సమైన శరీరమునందు మనుష్యులు ఆసక్తులగుచున్నా రన్నచో మలముపైకి ప్రాకుచున్న కృములకును వీరికిని భేద మేమున్నది?" అని భోగములయెడ వైముఖ్యము కలుగునట్లు చేసినది.

ఇంతవఱకును జగత్తునుగూర్చి జీవితమునుగూర్చి విమర్శయే లేకుండ సాధారణ యువజనులవలె వర్తించుచున్న హేమచూడునకు ఈమాటలవలన మొదటిసారిగా విమర్శనాత్మకమైన యాలోచనము ఆరంభమయ్యెను. ఇది జీవన్ముక్తి అనునున్నతమైన సౌధమును చేరుటకు మొదటిమెట్టు. ఈమెట్టుపై నిలిచి ఆలోచింప మొదలు పెట్టగా అతనికి భోగవిషయము లన్నియు విరసములుగా తోఁపఁజొచ్చెను. కాని పూర్వవాసనలయొక్క బలముచేత వానిని వదలుకొనలేక వానివలన పూర్వమువలె సుఖమును పొందలేక హేమచూడుని మనస్సు కలఁత నొందెను. ఆతనియవస్థను ఆమె గ్రహించి మెల్లమెదిగా అతనిని లాలించి, "నీవు దిగులుపడుచున్నట్లున్నావు? కారణమేమి?" అని యడిగెను. అప్పు డతఁడు సంకోచమును వీడి తన స్థితిని వివరించి, "ఏమి చేసినచో నాకు సుఖము కలుగునో చెప్పుము" అనెను.

అప్పు డామె తాను జీవన్ముక్తిని పొందినప్రకారమును సంకేతములతో గూఢముగ ఒకకథగా చెప్పెను. అది యతనికి అభూతకల్పనగా తోఁచి, "నీవు దయ్యము పట్టినవానివలె మాటాడుచున్నావు" అని అతఁడు ఆమెను పరిహసించెను. ఎదుటివారు చెప్పుచున్నది ఏమాత్రము అసమంజసముగా తోఁచినను దానినిగూర్చి ఆలోచింపకుండఁగనే వారి మాటలను తిరస్కరించుచుండుట మానవులకు సహజము. ఆప్తుల విషయమున ఇట్టితిరస్కారబుద్ధి పనికిరాదు. వారు చెప్పునది ఇప్పుడు సహేతుకముగా సమంజసముగా తోఁచకపోయినను కొంతకాలమునకు ఆమాటలయొక్క అభిప్రాయము తప్పక బోధపడఁగలదు అను విశ్వాసము గురువులయెడ శిష్యులకు అత్యంతము ఆవశ్యకము. అట్టి విశ్వాసము లేకున్నచో ఎంతటి గొప్ప యుపదేశమైనను ఫలింపదు. శ్రద్ధ యొక్క ఆవశ్యకతను నిరూపించుటకొఱకు ఆమె యిట్టి గూఢమైన కథను చెప్పెను. ఆమె యూహించినట్లే అతఁడు పరిహసించెను. ఆతని పరిహాసము ఎంత అయుక్తమో ఆమె సహేతుకముగా నిరూపించి "శుష్కమైన యంతులేని తర్కముతో ఎవఁడును శ్రేయస్సును పొందఁజాలఁడు. శాస్త్రానుకూలమైన తర్కముతో ఆప్తులవాక్యముల యందు శ్రద్ధతో నీకు దేనివలన శ్రేయస్సు కలుగునో నిశ్చించుకొనుము" అని బోధించెను. అప్పటికి అతఁడు ఆమె ఏమి చెప్పినను అర్థరహితముగా అసమంజసముగా ఉండదు అని నమ్మి, "నీవలన నేను ధన్యుఁడ నైతిని. దేనియందు శ్రద్ధ ఉంచవలయునో చెప్పుము" అని యడిగెను. అప్పుఁ డామె, "శ్రేయస్సును పొందుటకు వివిధ సాధనములుకలవు. వానిలో నీకు ఏది అన్నివిధముల సులభసాధ్యమో అదియే నీకు ఉత్తమము. దానియందే నీవు శ్రద్ధవహింపవలె. సాధనము ఏది యైనను ఈశ్వరానుగ్రహము లేక ఫలింపదు" అని చెప్పెను.

ఈప్రసంగమువలన అతఁడు, "సంసారమునందు సుఖముకన్న దుఃఖమే అధికముగా నున్నది. ఇది వలదు. కేవల సుఖరూపమైన శ్రేయస్సే కావలె" అను నిశ్చయమునకు వచ్చెను. ఇది రెండవమెట్టు ఈమెట్టుమీఁద నిలిచి యతఁడు, "అట్లయినచో బ్రహ్మాది దేవతలలో ఎవనిని పరమేశ్వరునిగా ఆరాధింపవలె? నిశ్చియించి చెప్పు" అని యడిగెను. అప్పుడు డామె, "పరమేశ్వరునకు రూపము లేదు. భక్తులు తన్ను ఏలోకమునందు ఏరూపము కలవానినిగా ధ్యానించుచున్నారో వారికి ఆయన ఆరూపముతో ప్రత్యక్ష మగును. ఆయన చైతన్యమాత్రుఁడు. ఆచైతన్యరూపిణియే త్రిపురామహేశ్వరి. శివుఁడు విష్ణువు మొదలగు దేవతామూర్తులయందున్న చైతన్యశక్తి ఆమెయే." అని చెప్పెను.

అప్పు డతఁడు పెద్దలవలన త్రిపురాదేవియొక్క ఆరాధనదీక్షను గైకొని ఆమెను కొన్నిమాసములు ఉపాసించెను. ఈయుపాసనము మూఁడవమెట్టు. ఈయుపాసనమువలన దేవియొక్క అనుగ్రహము కలిగి ఆతనిమనస్సు పూర్తిగా భోగములనుండి విముఖమై ఆత్మవిచారమునందు ఆసక్త మయ్యెను.

ఒకనాఁ డతనికి ఆమె చెప్పినకథ స్మృతికి వచ్చెను. తనకు నిర్వేదము కలిగినప్పుడు "ఏమి చేసినచో సుఖము కలుగునో చెప్పుము" అని అతఁ డామెను అడిగెను. అప్పుఁ డామె ఆకథను చెప్పెను. ఆ కథలోని తాత్పర్యము కేవలసుఖరూపమైన శ్రేయస్సును పొందుటకు ఉపాయమై యుండవలె. కావున ఆమె నడిగి ఆయుపాయ మేదియో తెలిసికోవలె అనుతలంపుతో అతఁడు ఆమె యొద్దకు పోయెను. ఆమె ఎంతో అనురాగముతో ఆతనిని కౌఁగిలించుకొని ఆతనియెడఁబాటునకు ఖిన్నురాలైనట్లుగా నుండెను. దేవియొక్క అనుగ్రహముచేత పూర్తిగా భోగములయదు వైముఖ్యమును పొందియుండుటచే అతఁడు ఆమె యొక్క కౌఁగిటియందు కూడ నిర్వికారముగ నుండి, "నేను నిన్ను శరణుపొందుచున్నాను" అని నిస్సంకోచముగా ఆమెను గురువునుగా స్వీకరించి ఆకథయొక్క తత్త్వమును చెప్పుమని ప్రార్థించెను. అప్పటికి ఆతనికి సంపూర్ణమైన గురుభక్తి కలిగినది. ఇది నాల్గవమెట్టు. ఇది దేవియుపాసనకు ఫలము. అప్పు డామె, "కేవలచైతన్యమే నా తల్లి. ఆమెతో నేను కూడియుండుటయే మోక్షము" అని ఆకథయొక్క తాత్పర్యమును సంగ్రహముగా చెప్పెను. ఇది తత్త్వపదేశమున వినుట (శ్రవణము) అను నైదవమెట్టు.

విషయము నాతఁడు ఆమెవలన విన్నతరువాత దానినిగూర్చి ఆలోచించుచు, "ఆచైతన్యరూపిణి యెవరు? ఆమెనుండి మన మెట్లు జన్మించితిమి? మనము ఎవరు?" అని అడిగెను. అప్పుడామె, "నీకు నీస్వరుపము తెలిసినచో ఆమెను కూడ తెలిసికొనఁగలవు. గోచరించుచున్న దేదియు నీస్వరూపము కాదు. కావున గోచరించుచున్న దానినంతను త్రోసివేసి, అట్లు త్రోసివేయుటకు వీలులేక ఇతరమును త్రోసివేయుటకు సాధనమై మిగిలియున్న జ్ఞానమును నీస్వరూపముగా గ్రహింపుము" అని చెప్పెను. వెంటనేఅతఁడు ఏకాంతప్రదేశమునకు పోయి తనస్వరూపము ఏమి అని తీవ్రముగ ఆలోచించెను. ఇది మననము అనునాఱవమెట్టు.

ఇట్లు మననము చేయుచు అతఁడు తనచేత గుర్తింపఁబడుచున్న ప్రపంచము తనశరీరము, ప్రాణము, మనస్సు బుద్ధి మొదలుగా ఏదియు తనకు స్వరూపము కాదని గ్రహించెను. అయినను తన స్వరూప మేదో దాని నెట్లు గుర్తింప వీలగునో తెలియలేదు. "ఆత్మ నాస్వరూపమే. కావున నాకు అది సదా ప్రాప్తించియే యుండవలె. అది సదా భాసించునదికూడ అయి యుండవలె. కాని ఇతర పదార్థములు ఏవో ఎప్పుడును భాసించుచుండుటవలన నాస్వరూపము భాసించుట లేదేమో! కావున మనస్సునందు ఏదియు భాసింపకుండునట్లు చేయుదును" అని నిశ్చయించి అతఁడు చిత్త వృత్తులను నిరోధించెను. ఈచిత్తవృత్తి నిరోధమునే పతంజలిమహర్షి యోగ మని చెప్పెను. దీనిని నిదిధ్యాసన మనియు చెప్పవచ్చును. ఇది ఏడవమెట్టు. ధ్యానింపవలయు నని కోరుట దిధ్యాసనము. నిరంతరముగా ధ్యానించపవలయునని కోరుట నిదిధ్యాసనము. చిత్తవృత్తులను అన్నింటిని నిరోధించి, అనఁగా ఏవిషయమునుగూర్చియు ఆలోచింపకుండ స్వరూపమాత్రమున గ్రహించుటకై మనస్సును నిలిపివేయుట నిదిధ్యాసనము.

అతఁడు ఇట్లు చిత్తవృత్తిని నిరోధించినప్పుడు మొదట చీఁకటి తరువాత వెలుఁగు, పిమ్మట నిద్ర స్వప్నము అతనికి గోచరించెను. అవి కూడ మనస్సుయొక్క వృత్తులే కావున స్వరూపము కాదని మరల అతఁడు మనస్సును నిరోధించి శాంతిసుఖమును పొందెను. నిరోధమును వదలినంతనే ఆసుఖము తొలగి పోయెను. ఆసుఖము తనస్వరూప మగునో కాదో అతనికి తెలియలేదు. వెంటనే అతఁడు హేమలేఖను పిలిపించి తన యనుభవమును చెప్పి సంశయమును తీర్పుమనెను. అప్పు డామె ఇట్లు చెప్పెను. "ఆత్మ మనస్వరూపమగుటచే మనకు ఎప్పుడును ప్రాప్తించియే యున్నది. దానిని పొందుటకు చిత్త నిరోధము కారణము కాదు, ఏది మనచేత పేటొకపదార్థమువలె పొందఁబడునో అది మనస్వరూప మెట్లగును? ఎంతవఱకు దానిని గూర్చి అన్వేషణము మననము జరుగుచుండునో అంతవఱకును దానియొక్క అనుభవము కలుగదు. మనస్సును నిద్రలోనికి పోకుండ నిలిపి, విషయములపై ప్రసరింపకుండ ఆపి, "నాస్వరూపమును చూచుచున్నాను" అనుతలంపుకూడ లేకుండ ఊరకుండుము. అదియే స్వరూపస్థితి."

వెంటనే అతఁడు ఆమె చెప్పినట్లే చేసి స్వరూపస్థితిని పొంది చాలసేపు విశ్రాంతి నొందెను. ఇది విశ్రాంతి యను నెనిమిదవమెట్టు. ఈవిశ్రాంతిసుఖమును పొందినవారు అనేకులు ఇదియే ఆత్మసాక్షాత్కారమని అపరోక్షానుభూతి అని స్వరూపస్థితి అని భ్రాంతిపడి అందే నిలిచి పోవుచుందురు. ఆభ్రాంతిని తొలఁగింపవలయు ననుతలంపుతో హేమలేఖ ఆతనియొద్దనే యుండెను. ఆమె ఊహించినట్లే అతఁడు ఆసమాధిస్థితినుండి ఒకసారి వెలుపలికివచ్చి ఆమెను చూచియు ఆవిశ్రాంతి సుఖమును వదలుకొనుటకు ఇష్టములేక మరల సమాధిస్థితి నొందుటకై కనులు మూసికొనుచుండెను. నిద్రించుటకు వీలులేక పనిచేయుచు అలసిపోయినవానికి విశ్రాంతి లభించినంతనే నిద్ర ఎట్లు ముంచుకొనివచ్చునో, అట్లే చిరకాలము ఇంద్రియములవెంట పరువెత్తి పరువెత్తి అలసిపోయిన మనస్సునకు స్వరూపస్థితియందు కొంచెము విశ్రాంతి లభించినంతనే సుఖానుభూతి (Experience of happiness) సాధకుని ముంచి వేయును. గాఢనిద్రలో నున్నవాఁడు నిద్రనుండి లేచుటకు ఎట్లు ఇష్టపడఁడో అట్లే సమాధియందు విశ్రమించిన సాధకుఁడు కూడ ఆసమాదిని వదలి వ్యవహారములోనికి వచ్చుటకు ఇష్టపడఁడు, అందువలననే హేమచూడుఁడు కూడ మరల వెంటనే సమాధిస్థితి నొందుటకు ప్రయత్నింపఁజొచ్చెను.

అప్పుడు హేమలేఖ అతనిపై చేయివైచి తనవైపునకు త్రిప్పుకొని, "నీవు ఏమనుకొనుచున్నావో చెప్పుము. నీకు కనులు మూసికొనుటవలన కలిగినలాభ మేమి? కనులు తెఱచుటవలన కలిగిననష్టమేమి? చెప్పుము" అని మధురముగా అడిగెను. అతఁడు మద్యముచేత మత్తిల్లినవానివలె ఆమెవంక చూచుచు ఇట్లనెను. "ఇప్పటివఱకును ఆత్మసుఖము నెఱుంగనైతిని. ఇప్పటికి పొందితిని, ఇప్పుడు దీనిని వదలుకొని దుఃఖభూయిష్ఠమైన ప్రపంచవ్యవహారములోనికి ఏల రమ్మనుచున్నావు? నీకు మ్రొక్కెదను. నన్ను కదలింపకుము. ఇట్టి సుఖము నెఱింగియు నీవు ఇంకను వ్యవహారమునందే యుండుట చూడఁగా నీవు దైవోపహతురాల వనియే తలంచుచున్నాను.

అప్పుడు ఆమె చెప్పిన మాటలు గమనింపఁదగి యున్నవి. "పరమపావనమైన ఆత్మపదము నీకు తెలియలేదు. నీవు కొంచెము తెలిసికొంటివి. ఆకొంచెము తెలియనిదానితో సమానముగా నున్నది." సమాధి సిద్ధించి సుఖము కలిగినంతమాత్రమున ఆత్మజ్ఞానము కలుగదని యామె స్పష్ట మొనర్చెను. ఎందువలన? ఎంతగాఢముగ నిద్రించినను మనస్సుయొక్క సంస్కారములయందు కొంచెము కూడ మార్పు కలుగదు. నిద్రనుండి లేచినవాఁడు అంతకు పూర్వము ఎట్లు వర్తించెనో అట్లే వర్తించును, ఆవిధముగానే సమాధినుండి లేచిన వాఁడు కూడ అంతకు పూర్వము ఎట్లుండునో అట్లే యుండును. దేహాత్మ బుద్ధి, జగత్తు వేఱు, నేను వేఱు, జీవుఁడు వేఱు, ఈశ్వరుఁడు వేఱు, ఒకజీవునికన్న మఱియొకఁడు భిన్నుఁడు మొదలుగా అజ్ఞానమువలన ఏర్పడిన హృదయ గ్రంథులు రాగద్వేషాదివాసనలు ఏవియును ఈసుఖానుభవముచేత నశింపవు. అజ్ఞానము జ్ఞానము చేత తప్ప మఱియొక విధముగా నశింపదు. కొందఱు జీవితాంతము వఱకు సమాధియందే నిలిచియుందురు. ఆసమాధిస్థితికి పూర్వము వారికి ఆత్మజ్ఞానము ఉన్నచో మరల జన్మింపరు. కాని ఆత్మజ్ఞానము కలుగకముందే సమాధిస్థితి నొందినవారు, ఆదేహము పడిపోయిన తరువాత మఱియొక జన్మమును తప్పక పొందుదురు. అప్పుడు మరల ఆత్మవిచార మొనర్చి జ్ఞానమును పొంది వారు ముక్తులు కావలసియుండును.

ఆత్మవిచారమువలననే కాక ప్రాణాయామాదిసాధనమువలన కూడ సమాధి సిద్ధించును. తపస్సుచేసి సిద్ధిని పొందినవారందఱు ఈసమాధిని పొందుదురు. ప్రాణశక్తిని నియమించినచో మనస్సు, కుండలో నుంచిన దీవముపలె, నిశ్చలముగా ప్రకాశించుచుండును. అదియే సమాధి. ఆమనస్సునందు తమ యిష్టము ననుసరించి బ్రహ్మనో విష్ణువునో ఈశ్వరునో ధ్యానించుచుందురు. అట్లే తపస్సులో నిశ్చలముగా వందలకొలఁదిసంవత్సరము లుందుడు. అప్పుడు వారి శరీరములచుట్టును పుట్టలు కూడ ఏర్పడును. వాల్మీకి చ్యవనుఁడు హిరణ్యకశిపుఁడు మొదలగువారి వృత్తాంతములలో ఇది ప్రసిద్ధము. అప్పుడు వారిచే ఆరాధింపఁబడిన బ్రహ్మయో విష్ణువో ఈశ్వరుఁడో ప్రత్యక్షమై వారికి వరము లొసంగును. వారికి అట్లు దేవుఁడు ప్రత్యక్షమైనను వారి చిత్తవృత్తులలో ఏమాత్రము మార్పు కలుగదు. అంతకు పూర్వమున్న రాగద్వేష్వాదిభావములన్నియు అట్లే యుండును. అర్జునునకు ఈశ్వరుఁడు ప్రత్యక్షమైనను పాశుపతము లభించినదే కాని ఆత్మజ్ఞానము కలుగలేదు; కనీసము ఆత్మనుగూర్చి తెలిసికోవలయునను కోరిక కూడ కలుగ లేదు. సాక్షాత్తుగా శ్రీకృష్ణుఁడే యుద్ధసమయమున తత్త్వమును బోధించినప్పుడు కూడ అర్జునునకు అది మనస్సునకు పట్టలేదు. వెంటనే అతఁడు యుద్ధకార్యమున నిమగ్నుఁడగుట వలన విన్న తత్త్వమును మనననిధ్యాసనములతో చక్కఁగా గ్రహించుటకు అతనికి అవకాశము కలుగలేదు, అందువలననే అతఁడు, "నీవు యుద్ధమునకు ముందు బోధించిన

విజ్ఞానవిషయములను నేను కార్యవేగమున మరచితిని. మఱల బోధింపుము" అని శ్రీకృష్ణుని ప్రార్థించెను. అప్పు డాయన మరల అతనికి తత్త్వమును బోధించెను. ఆసందర్భము అనుగీత అనుపేరుతో మహాభారతమున ప్రసిద్ధమై యున్నది. కావున ఆత్మవిచారమువలన కాక సమాధివలన జ్ఞానము కలుగ దనుట నిశ్చితము. ఈకారణముచేతనే రాక్షసులు తపస్సు వలన వరములను పొందినవెంటనే రాగద్వేషములతో విజృంభించి అక్రమముగా పదవులను భోగములను పొందుటకే ప్రయత్నించుచుండిరి. కావున సమాధివలన కలుగుశక్తులు ఆత్మజ్ఞానమును కలిగింపకపోఁగా అహంకారమును రాగద్వేషాదులను పెంచి వినాశమును కలిగించుటకు కూడ అవకాశమున్నది. ఈకారణముచేతనే ఉపనిషత్తులు, భగవద్గీత మొదలగు గ్రంథములలో ఆత్మవిచారపూర్వకముగ జ్ఞానమును పొందుపద్ధతియే ప్రశంసింపఁబడినది, కాని ప్రాణాయామాదులవలన లభించు సమాధిస్థితి ప్రశంసింపఁబడ లేదు.

ఈకారణముచేతనే సమాధిస్థితియందే నిలచిపోవుటకు సిద్ధముగా నున్న హేమచూడుని బలవంతముగా నైనను తనవైపునకు త్రిప్పుకొని హేమలేఖ ఆత్మతత్త్వమును బోధించెను. "నీవు కనులు మూసికొని దేనిని పొందుచున్నావో అది నీస్వరూపమే. అదియేజ్ఞానము, శుద్ధచైతన్యము. ఆచైతన్యమే సకల జగత్తునకు కూడ ఆత్మ. కావున నీస్వరూపమైన యాత్మ ఎచ్చట ఎప్పుడు ఏరూపమున లేదో చెప్పుము. అది లేనిచో జగత్తే లేదు. అదియే జగత్తునకు ఆధారము. అట్టి సర్వవ్యాపకమైన నీస్వరూపచైతన్యము నీవు కనులు తెఱచినంత మాత్రమును మాయమెట్లగును? కనులు మూసికొని గాని తెఱచిగాని ఏపదమును పొందితి నని తలంతువో అది పూర్ణ మెట్లగును? ఎందువల్ల ననఁగా నీవు చిత్తమును నిరోధించినప్పుడు ఆసమయమున అది నీ లోపలనే భాసించుచున్నచో నీకు అది వెలుపల లేనట్లేకదా! ఒక క్రియచేత ఒకసమయమునందు ఒకచోటనే భాసించునట్టిది పూర్ణ మెట్లగును? "నేను చిత్తమును నిరోధించి ఆత్మను చూచుచున్నాను" అన్న యీయభిమానగ్రంథిని భేదింపుము. 'ఈజగత్తు నేను కాదు' అన్న భేదగ్రంథిని కూడ ఖండిపుము. అఖండమై ఆనందరూపముగా నున్న యాత్మను ఎల్లయెడలను చూడుము."

ఆమె చెప్పినది గ్రహించి హేమచూడుఁడు భ్రాంతిని వీడి సర్వవ్యాపకమైన స్వరూపమును తెలిసికొని క్రమముగా ఆభావనయందు స్థిరత్వము నొందెను. అంతకు పూర్వము "దేహము నేను" అనుభావము ఎంత దృఢముగా నుండెనో" "కేవలచైతన్యమే నేను" అనుభావము అంత దృఢ మయ్యెను. అది ఆత్మసాక్షాత్కారమను తొమ్మిదవమెట్టు.

ఈమెట్టుపైనుండి అతఁడు జీవన్ముక్తి అను సౌధమున ప్రవేశించెను. జీవించుచుండియు ముక్తుండైనవాఁడు జీవన్ముక్తుఁడు. సుఖదుఃఖములను అనుభవించుచుండుటయే జీవించుట. సుఖము గాని దుఃఖము గాని ఏది సంభవించినను అతది దేహమునకో ఇంద్రియములకో మనస్సుకో సంబంధించినదిగా చూచుచు సాక్షిగా నుండి ఏభావముచేతను బద్ధుఁడు కానివాఁడు ముక్తుఁడు. ఆత్మజ్ఞానము కలిగినంతనే సంచిత కర్మలు నశించును. దేహాభిమానము లేకుండుటవలన ఇప్పుడు చేయుచున్న కర్మలవలన ఆగామి పుట్టదు. ప్రారబ్ధముమాత్రము మిగిలియుండును. దానివలన కలిగిన దేహవ్యవహారము జరుగుచునే యుండును. ఆవ్యవహారము జరుగుచున్నను దానిని లీలా మాత్రముగ చూచుచు జీవన్ముక్తుఁడు స్వరూపస్థితియందే యుండును.

జీవన్ముక్తులు ప్రపంచమును తమ స్వరూపముగనే చూచుండదురు. అందువలన వారు కోరఁదగినది పొందవలసినది యేదియు నుండదు. ప్రారబ్ధము ననుసరించి వారికి వ్యవహారము జరుగుచుండును. ఒకదిక్కునందు ప్రయోగింపఁబడిన బాణము ఆదిక్కునందే పోవుచు వేగము తగ్గినప్పుడు పడిపోవును. దానికి దిక్కు గాని లక్ష్యము గాని లక్ష్యము గాని మాఱదు. అట్లే ప్రారబ్ధవేగముచేత జరుగుచున్న దేహవ్యవహారము జ్ఞానము కలుగుటకు పూర్వము ఎట్లుండునో తనువాత కూడ అట్లే యుండును. రాజు రాజుగానే యుండును. మంత్రి మంత్రిగానే యుండును. గురుశిష్యులు, భార్యాభర్తలు వెనుకటివలెనే యుందురు. తాము ఏకులమునందు ఏవర్ణమునందు జన్మించిరో ఆ కులమునకు వర్ణమునకు శాస్త్రముచేత లోకాచారముచేత విహితములైన ధర్మములను, వానివలన తమకు ఏఫలము లేకున్నను, చక్కగా నిర్వర్తించుచుందురు. జ్ఞానియైన ధర్మవ్యాధుఁడు కులవృత్తియైన మాంసవిక్రయమును మానుకొనలేదు. క్షత్రియులుగా జన్మించిన శ్రీరాముఁడు శ్రీకృష్ణుఁడు జ్ఞాను లయ్యెను. యుద్ధము చేయవలసివచ్చినప్పుడు, అది ఎంత హింసాకృత్య మైనను, దానిని నిర్వర్తించుటకు వెనుఁదీయ లేదు. అర్జునుఁడు యుద్ధకృత్యమును ఏవగించుకొని భిక్షావృత్తిని అవలంబించుట మేలని తలంచుచుండఁగా శ్రీకృష్ణుఁడు "యుద్ధము క్షత్రియునకు స్వధర్మము. క్షత్రియుఁడ వైననీవుయుద్ధమును వదలుకొనుట, భిక్షావృత్తిని అవలంబించుట తప్పు" అని దృఢముగా బోధించెను. కావున

జీవన్ముక్తుల తమ వర్ణములకు ఆశ్రమములకు విహితములైన ధర్మములను చక్కఁగా పాటించుచుండుటయే గాక యితరులను కూడ వారికి విహితములైన ధర్మములయందు ప్రవర్తింపఁజేయుదురు. వారు ఎప్పుడును ధర్మమును అతిక్రమింపరు; అధర్మమును ప్రోత్సహింపరు. లోకములో అజ్ఞానుల కామవేగమునకో క్రోధవేగమునకో లోఁబడి ఏదియో సాధింపవలె నను నావేశముతో ధర్మమును తాము అతిక్రమించుచు ఇతరులను కూడ అందులకు ప్రోత్సహింతురు. మఱి, ప్రపంచమును ఆత్మస్వరూపమునుగా చూచుచున్న జీవన్ముక్తులకు అజ్ఞానము ఉండదు; కామక్రోధముల వేగము కూడ ఉండదు. కోరఁదగినది పొందఁదగినది ఏదియు లేనప్పుడు వారు దేనికొఱకై ధర్మమును అతిక్రమింతురు? వారు శరీరమున్నంతవఱకు లోకక్షేమముకొఱకై శాస్త్రవిహితమైన ధర్మమున తాము వర్తించుచు ఇతరులను ప్రవర్తింపఁజేయుచుందురు.

# పదునొకండవయధ్యాయము- జగత్స్వభావనిరూపణము

అద్భుతమైన హేమచూడుని కతను విని భార్గవరాముఁడు తనకు తోఁచిన సందేహములను దత్తాత్రేయునితో నిట్లు చెప్పెను. "భగవానుఁడా! నీవు చెప్పిన యీజ్ఞానము మహాద్భుతముగా నున్నది. కాని ఇది అనుభవమునకు విరుద్ధముగా అసాధ్యముగా నాకు తోఁచుచున్నది. దృశ్యముగా కన్పించుచున్న యీజగత్తు అంతయు దృక్కు మాత్రమే ఎట్లగును? ఇట్లే లోకములో కన్పించుటలేదు. చూచుచున్నవాఁడు వేఱుగా వానిచే చూడఁబడుచున్న దృశ్యములైన పదార్థములు వేఱుగా కన్పించుచున్నవి. మీరు చెప్పునది కేవలము మీయందున్న శ్రద్ధచేత నమ్మవలసియున్నది, దృశ్యమును వదలి దృక్కును మాత్రమే గ్రహించుట ఎవనికిని అనుభవమునందు లేదు. ఇది ఏవిధముగాను సహేతుకముగా కుదురుట లేదు. ఇది మనస్సున కెట్లు పట్టును? దీనిని మీరు సకలవిధముల దయతో బోధింపవలయును."

దత్తగురువు ఇట్లనెను. "భార్గవా! దృశ్యముయొక్క తత్త్వమును చెప్పెదను వినుము. మనకు కన్పించుచున్న యిది యంతయు మనయొక్క దృక్కే; దానికన్న భిన్నముగా లేదు. దీనికి హేతువును చెప్పెదను శ్రద్ధతో వినుము, మనము చూచుచున్న ప్రతిపదార్థము ఏదో నొక కారణమునుండి పుట్టి కార్య మగుచున్నది. మట్టి కారణము దానినుండి పుట్టినకుండ కార్యము. క్రొత్తగా కన్పించుటయే పుట్టుట. మట్టియే కుండయొక్క ఆకారముతో క్రొత్తగా కన్పించినప్పుడు కుండపుట్టిన దనుచున్నాము. ఇట్లు పదార్థములు ప్రతిక్షణము క్రొత్తగా కన్పించుచుండుటవలననే జగత్తు భాసించుచున్నది. కుండ కన్పించినప్పుడు కుండయొక్క ఆకారము, అందులో రేగుపండ్లు కన్పించి నప్పుడు వానియొక్క ఆకారము వలన మన విజ్ఞానమునందు రూపొందుచున్నవి. అసలు మన విజ్ఞానము అఖండము(Undivided) ఏకరూపము అని, దానియందు ప్రతిక్షణము క్రొత్తగా భాసించుచున్న పదార్థములయొక్క ఆకారములవలన ఈజగత్తు మనకు ఇట్లు కన్పించుచున్న దని కొందఱు అందురు. మట్టియందు కుండ చట్టిమూకుడు మొదలుగా ఎన్ని పదార్థములను మనము క్రొత్తగా చూచుచున్నను మట్టి మట్టిగానే అఖండముగా ఏకరూపముగా ఎట్లున్నదో అట్లే విజ్ఞానము నందు కూడ ఎన్ని యాకృతులు తోచినను మన విజ్ఞానము మాత్రము ఎప్పుడును అఖండముగ ఏకరూపముగనే యుండును.

మఱికొందఱు స్థిరములు చరములు అను పదార్థములయొక్క సముదాయమే జగత్తు అని చెప్పుదురు. ఆకాశము మొదలగు పదార్థములు స్థిరములు. కుండలు మొదలగునవి చరములు.

ఎట్లు చెప్పినను మొత్తముమీఁద ఈజగత్తు పుట్టుక కలదియనుట నిశ్చితము. ఈవిషయమున, కారణముతో సంబంధము లేకయే కార్యము పుట్టు నని, అట్లే పుట్టుటయే దానిస్వభావ మని జగత్తు కూడ అట్లే కారణము లేకుండ, దానిస్వభావముచేతనే పుట్టు చున్నదని, కొందఱు చేయుచున్నవాదము సమంజసము కాదు. ఎందువల్ల ననఁగా మట్టి అనుకారణముతో సబంధము లేకుండ కుండ పుట్టు నని చెప్పుచో, మట్టినుండి వస్త్రము కూడ పుట్టవచ్చు నని చెప్పవలె, అట్లు చెప్పుట కుదురదు. మఱియును మట్టియున్నప్పుడే కుండ ఏర్పడుట, మట్టి లేనప్పుడు కుండ

ఏర్పడ కుండుటయు ప్రసిద్ధిమే. కావున కారణము లేకుండ కార్యము పుట్టదు. "మఱి ఒక్కొక్కప్పుడు ఆకస్మికముగా శుభములు అశుభములు వచ్చిపడుచున్నవి. వానికి ప్రత్యక్షముగా ఏదియు కారణముగా కన్పింపదు. అట్టియెడల కారణము లేకుండ కార్యము పుట్టదు అని చెప్పుట పొసఁగదు" అని స్వభావవాదిఅన్నచో ఆమాట నిలువదు. ప్రాయికముగా ప్రతికార్యమునకు మనకు తగినకారణము కన్పించుచుండఁగా, ఎక్కడేన ఒకానొక కార్యమునకు కారణము కన్పింపకున్నచో, అది మనకు తెలియకపోయినను ఉన్న దనియే చెప్పవలెఁగాని లేదనుటకు వీలు లేదు. శరీరముపై గడ్డ లేచినపుడు దానికి కారణమైన రక్తదోషము మనకు కన్పింపదు. అయినను గడ్డనుబట్టి దానికారణమును గ్రహించుచున్నాము. అట్లే శుభమో అశుభమో వచ్చినప్పుడు దాని కిప్పుడు కారణము మనకు కన్పింపకున్నను పూర్వమెప్పుడో చేసిన పుణ్యమె పాపమో కారణముగా ఉన్న దని గ్రహింపవలె. అది కన్పింపనంతమాత్రమున లేదని చెప్పుటకు వీలులేదు. అదియును గాక లోకములో ఎల్లరును తగిన కారణముల నవలంబించి కార్యములను సాధించుకొనుచున్నారు. రాజుసేవ చేసినవాఁడు రాజువలన సంపదలను పొందుచున్నాఁడు. ఎక్కడేని ఒకానొకఁడు అట్లు పొందకుండినచో కారణమైన సేవ సమగ్రముగ లేదని చెప్పవలె. అట్లు కాక కార్యమునకు తగినకారణము ఉండ నక్కఱ లేదన్నచో లోకప్రవృత్తియే కుదురదు. కావున కారణము లేకుండ ఆకస్మికముగా ఏకార్యమును పుట్టదు; జగత్తులో ప్రతిది సకారణముగా పుట్టునే కాని నిష్కారణముగా పుట్టదు. అందువలన స్వభావవాదము అసమంజసము.

కొందఱు జగత్తు అనుకార్యము పరమాణువులవలన పుట్టు నని ఇట్లు చెప్పుచున్నారు. అత్యంతసూక్ష్మములై అగోచరములైన పరమాణువులు సృష్టికి పూర్వమున శక్తిమంతములై స్థిరములై యుండును. సృష్టియొక్క ఆరంభమునందు పరిపక్వమైయున్న జీవుల కర్మయొక్క సహకారముతో ఈశ్వరుని యిచ్ఛవలన ఆపరమాణువుల యందు క్రియ (Movement or Action) ఆరంభమగును. ఆక్రియ వలన రెండేసి పరమాణువులు (Atoms) ఒక్కొక్క జంటగా సంయుక్తము లగును. ఆద్వ్యణుకములలో(Molecules of two atoms) మరల ఈశ్వరుని యిచ్ఛవలననే క్రియ ఆరంభమగును. అప్పుడు మూఁడేసి ద్వ్యణుకముల సంయుక్తములై త్రసరేణువులు (Component of three molecules or six atoms) రూపొందును. కిటికీలో నుండి ప్రసరించు సూర్యకిరణములందు గోచరించు సూక్ష్మకణములను (Particles of matter) త్రసరేణువు లందురు. అట్టి త్రసరేణువుల సంయోగమువలన క్రమముగా నీరు నిప్పు మొదలుగా జగత్తులోని సకలపదార్థములు రూపొందుచున్నవి. కావున పరమాణువులు కారణముగా ద్వ్యణుకముల మొదలైనకార్యములు పుట్టుచున్నవి. కారణములైన పరమాణువులకన్న కార్యములైన పదార్థములు భిన్నములు. నశించినతరువాత పదార్థములు కుందేటి కొమ్ములవలె అత్యంతము అసత్తు లగును. (Non existent)

ఈపరమాణువాదము కూడ సమంజసము కాదు. కుండ పుట్టక పూర్వము మట్టి ఉన్నది. కుండ తాను పుట్టక పూర్వము లేదు నశించిన తరువాత లేదు. కావున అసత్తు. దానికి కారణములైన మట్టి పరమాణువులు అసత్తు కాదు. సత్యమైన పరమాణువులనుండి అసత్యమైన కుండ ఎట్లు పుట్టును? ఒకపదార్థమునందే కుండ ఉండుట లేక పోవుట అను విరుద్ధ ధర్మముల ఎట్లుండును? తెల్లగానున్నవస్తువు నల్లగా కూడ ఉండు ననుట అసంబద్ధము కదా! వెలుఁగు చీఁకటి ఒకటి కానేరవు. అట్లు విరుద్ధధర్మములు ఒక పదార్థమునందే యుండునన్నచో ఇంక ఏపదార్థముకూడ తనకు సొంతమైనధర్మముతో ప్రత్యేకముగ నుండునని చెప్పుటకు వీలుండదు. కావున పరమాణువులవలన వానికన్న భిన్నమైన కార్యము పదార్థముగా పుట్టునని చెప్పుటకు వీలులేదు. మఱియును పరమాణువులు అచేతనములు. వానియందు ఈశ్వరునియిచ్ఛవల్ల క్రియ ఎట్లే కలుగును? లోకములో ఎవనియిచ్ఛా మాత్రముచేతనే ఏయచేతనపదార్థమునందును క్రియ పుట్టుట లేదు. అట్టిది సంభవమే యైనచో రాజుయొక్క ఇచ్ఛామాత్రముగనే ఆయన యొద్ద నున్న యాయుధములు బయలుదేరి పోయి శత్రువులను సంహరించి తిరిగి రావలసియుండును. కావున ఈశ్వరుని యిచ్ఛవలన పరమాణువులందు సృష్టి ఆరంభ మగునునుటయు యుక్తముగా లేదు.

మఱికొందఱు ఇట్లు చెప్పుచున్నారు. సత్త్వరజస్త మోగుణములయొక్క సామాన్యవస్థయే(State of equilibrium) ప్రకృతి. అదియే ఆగుణములయందు కలుగునట్టి వైషమ్యమువలన, అనఁగా హెచ్చుతగ్గులవలన, జగత్తుగా పరిణమించుచున్నది. ఈపరిణామవాదము కూడ యుక్తము కాదు. ప్రకృతి జడము. దానియొక్క సామ్యావస్థయందు వైషమ్యము కలుగుటకు హేతు వేమి? అట్లే ప్రళయము సంభవించినపుడు అవైషమ్యము పోయి సమస్థితి కలుగుటకు హేతువేమి? లోకములో బండి యంత్రము మొదలుగా అచేతనము లను చేతనుఁడు నడపుట కలదు. గాని, అచేతనము తనయంతట తాను మార్పు నొందుట ఎచ్చటను లేదు. కావున జడమైనప్రకృతి జగత్తునకు కారణ మనుట కుదురదు.

ఇంక జగత్తనకు కారణమును నిశ్చయించుటకు వేదమే ప్రమాణము కాని ఇతరము కానేరదు. మనకు జ్ఞానము కలిగించుటలో మొదటి ప్రమాణము ప్రత్యక్షము, ఇంద్రియములవలన "ఇది యిల్లు, వీఁడు రాముఁడు" మొదలుగా సన్నిహితములైన విషయములనుగూర్చి మనము పొందు జ్ఞానము ప్రత్యక్షము. అజ్ఞానములలో ఒకదానినిబట్టి వేఱొకవిషయములను ఊహించి పొందుజ్ఞానము అనుమితి. పొగ ప్రత్యక్షముగా కన్పించుచున్నప్పుడు ఆపొగయున్న ప్రదేశమున నిప్పు ఉన్న దని యూహించుట అనుమితి. ఈరెండు ప్రమాణములను జగత్తుయొక్క కారణమును గ్రహించుటకు ఉపయోగింపవు. జగత్తుయొక్క ఆరంభము ఎవని యింద్రియములకును సన్నిహితము కాదు. అందువలన జగత్తుయొక్క కారణము మనకు ప్రత్యక్షము కాదు. అందువల్ల ప్రత్యక్షముమీఁద ఆధారపడిన యనుమానప్రమాణము కూడ దానిని గ్రహించుటకు సాధనము కానేరదు. కావున ఈశ్వర ప్రవర్తితమైన వేదమే ప్రమాణముగా మనము దానిని గ్రహింపవలసియున్నది.

జగత్సృష్టియొక్క ఆరంభమునందు ఈశ్వరుఁడున్నాఁడనుట కేమి ప్రమాణమున్నది? లోకములో ప్రతికార్యము చేతనుఁడైన కర్తవలననే ఏర్పడుచున్నది. అట్లే జగత్తు కూడ చేతనుఁడై న కర్తవలననే ఏర్పడుచున్న దని గ్రహింపవచ్చును. జగత్తు సామాన్య కార్యము కాదు. అది అచింత్యము(Unimaginable). అట్టి జగత్తునకు కర్తయైన యీశ్వరుఁడు అచింత్యమైనశక్తి(Unimaginalble power) కలవాఁడే యగును. ఆయనయొక్క వాక్కులే వేదములు. వానివలననే మనము తత్త్వమును తెలిసికోవలయును. ఆయన సర్వశక్తిమంతుఁడు సర్వజ్ఞుఁడును అగుటచే వేదములు సకలశాస్త్రములలో శ్రేష్ఠములు. అవి ఏయితరప్రమాణములచేతను కుంటుపడవు. అట్టి వేదములందు సృష్టికి పూర్వము మహేశ్వరుఁ డొక్కఁడే యుండినని, ఆయన తనస్వాతంత్ర్యముయొక్క మహిమవలన పదార్థముతో (Matter) పనిలేకుండా తనస్వరూపమునందే విలాసముగా జగత్తు అను చిత్రమును భాసింపఁజేసె నని చెప్పఁబడియున్నది. స్వప్నమునందు మనకొకదేహము కల్పింపఁబడుచున్నది. అప్పడు ఆదేహమే నేను అని వ్యవహరించుచున్నాము. అట్లే మేల్కొనియున్నప్పుడు కూడ మనస్సు ఏవో ఊహలు చేయుచున్నప్పుడు ఆయూహాలోకములనందు కూడ మన కొకదేహము ఏర్పడుచున్నది. అప్పుడు కూడ ఆదేహమే నేను అని వ్యవహరించుచున్నాము. ఆవిధముగానే పరమేశ్వరుఁడు కూడ విలాసముగా తాను భాసింపఁజేయుచున్న జగత్తు తానుగా వ్యవహరించుచున్నాఁడు. మనకు ఊహాలోకములో కన్పించుచున్న శరీరము స్వప్నములో ఉండదు; స్వప్నములో కన్పించుచున్న శరీరము జాగ్రత్తులో ఉండుట లేదు. కావున ఆశీరీరములు మనస్వరూపము కావు. అట్లే పరమేశ్వరునకును విలాసకల్పితమైన యీజగత్తు ప్రళయమునందు ఉండదు. కావున ఇది ఆయనకు స్వరూపము కాదు. ఎన్ని దేహములు మాఱుచున్నను ఆదేహముల నన్నింటిని చూచుచున్న దృక్కు మాత్రమే నీస్వరూప మైనట్లు, విలాసమాత్రమైన యీజగత్తు ప్రళయములో నశించినపుడు మిగిలియుండు దృక్కు మాత్రమే పరమేశ్వరునకు కూడ స్వరూపము. ఆదృక్కునందే ఆయనచేత ఈజగత్తు ఒక చిత్రముగా భాసింపఁజేయఁబడుచేన్నది. సృష్టికి పూర్వము దృక్కు తప్ప రెండవది ఏదియును లేదు, అట్టియెడ జగత్తు అనునీచిత్రము దృక్కునందు తప్ప ఎచ్చట భాసించును? దృక్కే చైతన్యము. అది లేకుండ ఎప్పుడైనను ఎక్కడైనను ఏదియైనను ఎట్లుండును? ఒకచోట ఎచ్చట నైనను నీవు చైతన్యము లేదని చెప్పుదువేని ఆప్రదేశ##మే ఉండదు. ఎందువల్ల నఁనగా చైతన్యమువలననే సకలమునకు ఉనికి(Existence), ప్రకాశము (Appearance) కలుగుచున్నవి. నీకును పరమేశ్వరునకును స్వరూపమై సర్వవ్యాపకముగా నున్న చైతన్యము లేదని ఎట్లుచెప్పగలవు? కావున పరమము (Supreme)కేవలము (Absolute) అయిన యాచైతన్యమే సకల జగత్తుయొక్క ఉనికికి ఆధారమై (Cause of the existence of the universe) సర్వవ్యాపకమై (All pervading) పూర్ణమై (Indvisible whole) ప్రకాశించుచున్నది. సముద్రము లేకుండ తరంగములు, సూర్యుఁడు లేకుండ ఎండ ఎట్లుండదో అట్లే చైతన్యము లేకుండ జగత్తు ఉండదు. ఎవనియందు ఈజగత్తు భాసించుచున్నదో ఆమహాదేవునకు శుద్ధచైతన్యమే (Pure consciousness)స్వరూపము.

సృష్టికి పూర్వము ఆమహాదేవుఁడే ఉన్నాఁడు, చరాచరమైన యీజగత్తు ఆయనవలననే పుట్టి ఆయనయందే ఉండి తుదకు ఆయన యందే విలీన మగుచున్నచి. ఇది వేదములయందు ప్రసిద్ధమైన విషయము. ప్రత్యక్షముగాఁ గాని ఊహచేతఁ గాని తెలిసికొనుటకు సాధ్యముగాని విషయములందు మనకు వేదమే ప్రమాణము. సర్వజ్ఞుఁడైన యీశ్వరునిచే చెప్పఁబడినదగుటచే మనకు అగోచరములైన సకలవిషయములందును ఆవేదమే ప్రమాణము. దానిని కాదసఁగలిగినది మఱియొకటి లేదు. ఎందువల్ల ననఁగా మణులు మంత్రములు మొదలగువానియొక్క

మహాఫలములనుగూర్చి అల్పమైన ప్రజ్ఞకల మానవుఁడు తెలిసికొనలేఁడు. సమస్త జగత్తునుగూర్చి మానవుల ప్రజ్ఞకు అగోచరములైన విషయములను బోధించుచున్న వేదము సర్వజ్ఞుఁడైన యీశ్వరునిచేతనే చెప్పఁబడినదనుట నిశ్చితము, ఈ జగత్తుయొక్క సృష్టికి పూర్వము దేవుఁ డొక్కఁడే యుండెనని, పూర్ణము(Complete) స్వచ్ఛము(Natural, not obtanied from any cause) అయిన స్వాతంత్ర్యము(Power of freewill) కలవాఁడగుటచే, ఆదేవుఁడు ఏద్రవ్యము లేకుండఁగనే సమస్త జగత్తును సృష్టించెను. కుమ్మరివానికి కుండచేయుటకు మట్టి కావలసినట్టు. ఆయనను ఏద్రవ్యము అక్కఱలేదు.

చైతన్యరూపమైన తనయందే ఆయన గోడమీఁద బొమ్మను వలె ఈజగత్తును భాసింపఁజేసెను. ఈశ్వరుఁడు అంతటను నిండి పూర్ణుఁడై యండుటచేత ఆయనకు భిన్నముగ వెలుపల వేఱొకతావులేనేలేదు. కావున ఈజగత్తు ఆయనయందే భాసించుచున్నది. చైతన్యమే ఆయన అగుటచే ఆయనకు భిన్నముగా ఎచ్చటను ఏదియు ప్రకాశించుటకు వీలు లేదు. అద్దమునందు ప్రతిబింబమువలె ఈజగత్తు ఆయనయందు కన్పించుచున్నదనుట సర్వవిధముల సమంజసము. ద్రవ్య మేదియు లేకుండఁగనే సంకల్పమాత్రముచేతనే యోగి పదార్థములను ఎట్లు సృష్టించుచున్నాఁడో ఈశ్వరుఁడును అట్లే తనయందు జగత్తును భాసింపఁజేయుచున్నాఁడు. కావున ఈసృష్టి దేవునియొక్క సంకల్పనగరముతో సమాన మనుట ఎల్లరకును సమ్మతము. భార్గవా! దీనిని నీయనుభవనమును అనుసరించి కూడ విచారింపుము నీవు ఆలోచించునప్పుడు నీమనస్సునందు ఎంతోమంది వ్యక్తులు, వారిచేత గ్రహింపఁబడుచున్న యెన్నో పదార్థములు గోచరించుచున్నవి. అది యొకలోకమే కదా! ఆలోకమునదు స్త్రీలు పురుషులు నదులు కొండలు మొదలుగా ఎన్నియో భేదములు కన్పించుచుండును. ఎన్ని భేదము లున్నను ఆలోక మంతయు కేవలము మనోమయమే(Absoulutely a phase of the mind). మనస్సునందు పుట్టి, అందే ఉండి, దానియందే లీనమగుచున్న యాయాలోచనాప్రపంచము అంతయు కేవలము మనోరూపమే. అట్లే శివునియందు పుట్టి అందే ఉండి ఆయనయందే లీనమగుచున్న యీప్రపంచము కూడ కేవలము శివరూపమే, చైతన్యమే శివునిరూపము, చైతన్యమునకు శరీరము లేదు.

త్రిపుర అనంతశక్తి సర్వసాక్షిణి అని చెప్పఁబడుచున్న యా చైతన్యము అంతటను నిండి పూర్ణముగానున్నది. దానియందు విభాగములు లేవు. లోకమున కాలముచేత దేశముచేత విభాగములు ఏర్పడును. ఆకారముచేత ఏర్పడునది దేశము. క్రియచేత ఏర్పడునది కాలము. పొడవు వెడల్పు వైశాల్యము వర్తులత్వము మొదలగు లక్షణములతో ఏర్పడునాకారమే దేశము. రాముఁడు పుట్టెను. పుట్టు చున్నాఁడు పుట్టగలఁడు అను క్రియలయొక్క భావనచేత ఏర్పడునదికాలము. ఆకారము క్రియ అను రెండును చైతన్యమునే ఆశ్రయించియున్నవి. చైతన్యమును వదలినచో అవి ఉండుట (Existence) మనకు కన్పించుట (Appearence) జరుగదు. అట్టి ఆకారాత్మకమైన దేశము, క్రియాత్మకమైన కాలము తమకు ఆధారమైనచైతన్యమునందు విభాగములను ఎట్లు కల్పింపఁగలవు? చైతన్యములేని దేశము కాని కాలము కాని ఏదైనా కలదా? చెప్పుము. ఎక్కడ నీవు చైతన్యము లేదని చెప్పుదువో అది అస లెట్లుండును? పదార్థములకు అస్తిత్వము(Existence) చైతన్యము వలననే కలుగుచున్నది; మఱిదేనివలనను కాదు. చైతన్యమే చితి దృక్కు అని పెక్కుపేర్లతో చెప్పఁబడుచున్నది. అది లేనిచో ఏపదార్థమునకు కూడ ప్రకాశముండదు. జడములు స్వయముగా ప్రకాశింపవు. అవి చితివలననే ప్రకాశించుచున్నవి. సకలమును ప్రకాశింపఁజేయుచున్న యాచితి స్వయముగా ప్రకాశించుచు స్వతంత్రముగా నున్నది.

"అస్తిత్వమునకు (Existence) ప్రకాశమునకు (Appearence) సంబంధ మేమున్నది? ఒకవస్తువు ఉండవచ్చును; అది మనకు కన్పింపకపోవచ్చును" అని నీవు అడుగవచ్చును. సమాధానము వినుము. మనకు ప్రకాశింపని పదార్థము, అనఁగా మనకు తెలియని పదార్థము కూడ ఉండు నని యొప్పుకొన్నచో, మనకు కన్పించుచు ఉన్న వస్తువునకు, లేని వస్తువునకును భేద మెట్లు చెప్పఁగలవు. ఒకపదార్థము మనకు కన్పించుచున్నప్పుడు అది ఉన్న దనుచున్నాము. వేఱొకటి మనకు కన్పింపనప్పుడు దానిని లేదనుచున్నాము. నీవు చెప్పినట్లుగా కన్పింపనిదానిని కూడ ఉన్నదని చెప్పవలె నన్నచో, "ఇది ఉన్నది; అది లేదు" అను వ్యవహారము ఎట్లు జరుగును. ఒక చోట నారింజపండు ఉన్నది. అది కన్పించినప్పుడు "ఇదిగో నారింజపండు ఉన్నది" అనుచున్నాము. అప్పుడు మామిడిపండు కన్పింపకుండినచో"మామిడిపండు లేదు" అను చున్నాము. "మనకు ఇప్పుడు మామిడిపండు కన్పింపకపోయినను ఇంకొకచోట ఉండదా?" అన్నచో ఆమాట నిలవదు. ఇప్పుడు నారింజపండునకు ఉన్నయస్తిత్వము ఇక్కడ మామిడిపండునకు లేదు. ఈనారింజపండు ఉండి మనకు కన్పించి మనచేత అనుభవింపఁబడుచున్నది.

మామిడిపండు మనచేత అనుభవింపఁబడుట లేదు మనకు కన్పించుటకూడ లేదు. కావున "నారింజపండు ఉన్నది. మామిడిపండు కూడ ఉన్నది" అని ఎట్లు చెప్పగలవు? అదియును గాక నీకు ప్రకాశింపనిది, అనఁగా నీకు తెలియనది, చెప్పుమన్నచో ఎవఁడైనను చెప్పగలఁడా? అనఁగా నీకు ఏది తెలియదో అది నీకు లేదు. అది తెలిసినవారికి ఇతరులకు ఉన్నను నీకు లేదు. ఎవనికి ఉది ఉన్న ను వానికి తెలిసియే యుండును. అనఁగా పదార్థము ముందుగా మనజ్ఞానమునందు ప్రకాశించి తరువాత ఉన్నవిగా వ్యవహారమునకు ఉపయోగపడుచున్నది. కావున పదార్థములయొక్క అస్తిత్వము (Existence) ప్రకాశము (Appearance) రెండును జ్ఞానముపైననే ఆధారపడి యున్నవి. జ్ఞానమే చితి. చితివలననే పదార్థములకు అస్తిత్వము ప్రకాశము కలుగుచున్నవి. కావున ప్రతిబింబములయొక్క అస్తిత్వము ప్రకాశము. దర్పణము యొక్క అస్తిత్వముకన్న ప్రకాశముకన్న ఎట్లు భిన్నము కావో, అట్లే పదార్థములయొక్క అస్తిత్వము చితియొక్క ప్రకాశముకన్న భిన్నముకాదు. అట్లే చితియే జగత్తుయొక్క అస్తిత్వము. అందువలన సర్వము చితియే.

చితియే సర్వమైనచో అదియే భాసింపవలె కాని, చెట్టు గోడమొదలుగా వివిధములైన యాకారములు ఎట్లు భాసించుచున్నవి? ఆ చితిలోని నిర్మలత్వముయొక్క మహిమవలననే ఈయాకారములన్నియు అందు భాసించుచున్నవి. అద్దము యొక్క కఠినత్వముచే నిర్మల త్వముచేతను దానియందు ప్రతిబింబము లేర్పడుచున్నవి. ఆరెండు గుణములయొక్క హెచ్చుతగ్గులచేత ప్రతిబింబములు స్పష్టముగా నుండుట అస్పష్టముగా నుండుట ఏర్పడుచున్నది. నిర్మలమైన జలమునందు కాఠిన్యము లేకుండుటచే ప్రతిబింబము అస్పష్టముగా నుండును. నిర్మలత్వము అసలే లేకుండుటచే గోడయందు కాఠిన్యము బొత్తిగా లేకుండుటచే ఆకాశమునందును ప్రతిబింబము ఏర్పడుటలేదు. అద్దము జడము అస్వతంత్రము అగుటచేత దానికన్న భిన్నముగా పదార్థము లున్నప్పుడే అవి దాని యందు ప్రతిబింబంచును. పదార్థము లేకున్న అద్దమును ప్రతిబింబము లుండవు. కాని సర్వవ్యాపకము స్వతంత్రమును అయిన చితి అద్దమువంటిది కాదు. దానికి తనకున్న భిన్నములైన పదార్థములతో పనిలేదు. స్వప్నమునందు మనస్సులోనే జరుగుసంఘటనమువలె, చితి తనయందే జగత్తును ప్రకాశింపఁజేయుచున్నది. అద్దము మొదలుగా అన్నింటిలోకన్నను చితియందు నిర్మలత్వము కఠినత్వము అధికముగా నున్నవి. పదార్థములు అవయవముల సముదాయముచే రూపొందును. అప్పుడు అవయవముల మధ్యలో ఇతర పదార్థముల యవయవములు చేరినచో మాలిన్యమేర్పడును. అద్దముపై దుమ్ముచేత మాలిన్య మేర్పడుచున్నది. అవయవముల కూర్పుయొక్క గాఢతను బట్టి(Closeness) పదార్థములయొక్క కఠినత్వము ఏర్పడును. అవయవముల కూర్పుయొక్క గాఢతచేతనే రాయి కఠిన మగుచున్నది. ఆకూర్పు విరళ మగుట చేత నీరు పల్చగా నున్నది. చితి ఆకాశమువలె సదా నిర్మలము అఖండము ఏకరూపమై ఆవయవములులేని దగుటచే దానియందున్న నిర్మలత్వము కఠినత్వము అనుగుణములు అన్ని పదార్థములలో కన్న అధికముగా నున్నవి. అందువలన చితియందు జగత్తు అద్భుతమైన చిత్రముగా ప్రతిబింబించుచున్నది.

మనకు ప్రత్యక్షముగా కన్పించుచున్న యీజగత్తు ప్రతిబింబమెట్లగును? అసలు ప్రతిబింబ మనఁగా నేది? అద్ద మున్నప్పుడు దానియందు ఎదురుగా ఉన్నకలశముయొక్క ప్రతిబింబము ఏర్పడును. అద్దము లేకున్నచో కలశప్రతిబింబము ఉండదు. కావున తాను స్వయముగా భాసింపక ఇతరముయొక్క సంబంధముచేత భాసించునట్టిది అనఁగా ఏర్పడునట్టిది ప్రతిబింబము. జగత్తు స్వయముగా భాసింపక చితివలననే భాసించుచున్నది. అందువలన అద్దములో ప్రతిబింబము వలె చితిలో జగత్తు ప్రతిబింబముగా ప్రకాశించుచున్న దనుట సమంజసము. అద్దమునుందు ఎన్నివిధములైన పదార్థముల వర్ణములు భాసించుచున్నను ఆరంగు లేవియు కొంచెముకూడ అద్దమునకు అంటుకొనవు. దానిస్వరూపమునందు ఎప్పుడును మార్ప కలుగదు. అట్లే జగత్తులోని విశేషము లేవియు కొంచెము కూడ చితికి అంటుకొనవు. దాని స్వరూపమునందు ఎప్పడును మార్పు కలుగదు. ప్రతిబింబములు అద్దముకన్న భిన్నముగా ఎట్లుండవో అట్లే జగత్తు కూడ చితికన్న అన్యముగా లేదు. బింబమైన పదార్థము కారణముగా అద్దమున ప్రతిబింబము ఏర్పడుచున్నది. కాని చితియొక్క స్వాతంత్రమే కారణముగా చితియందు జగత్తుయొక్క ప్రతిబింబము ఏర్పడుచున్నది. స్వాతంత్ర్యమువలన ప్రతబింబ మేర్పడునా అని శంకింపకుము. భార్గవా! చూడుము. నీసంకల్పమువలన నీమనస్సునందే ఎన్నోభావములు ప్రతిబింబించుచున్నవి. వానికి బింబములైన పదార్థములు ఎక్కడ నున్నవి? అద్దమున వస్తువులు ప్రతిబింబించుటకు సూర్యుని వెలుఁగు కాని దీపపుకాంతి గాని ఏదోనొకటి

యుండవలె. అట్టి వెలుఁగుతో నిమిత్తము లేకుండనే నీమనస్సునందు భావములు ప్రతిబింబించుచున్నవి. కావున వెలుపలి పదార్థముతో దేనితో నిమిత్తము లేకుండనే చిదాత్మయందు జగత్తు ప్రతిబింబించుచున్నది.

చిదాత్మకు స్వాతంత్ర్య మనుశక్తి యున్నది. ఆశక్తివలన అత్యంతము సూక్ష్మమైన యాచిదాత్మ స్థూలమై దృశ్య మగుచున్నది. అట్లు కాఁగలిగిన స్వాతంత్ర్యమే చితియొక్క సంకల్పము. నీయొక్క స్వాతంత్ర్యమే సంకల్పరూపమై నీమనస్సునందు అనేకభావములను ఎట్లు ప్రతిబింబింపఁజేయుచున్నదో అట్లే చిదాత్మయొక్క స్వాతంత్ర్యమే సంకల్పరూపమై జగత్తును భాసింపఁజేయుచున్నది. సంకల్పములేని దశయందు చిదాత్మ ప్రతిబింబరహితమై స్వచ్ఛముగ ఏకరూపముగ చిన్మాత్రముగ నుండును. ఇట్లు సృష్టికి పూర్వము విశుద్ధముగ ఏకరూపముగనున్న చిదాత్మకు గొప్పస్వాతంత్ర్యశక్తి ఉండెను (Potentially existent) అదియే సంకల్పమై దానివలన ప్రతిబింబాత్మక మైన జగత్తు చిదాత్మయందు భాసించుచున్నది. అట్లయినచో మన సంకల్పమువలన మనమనస్సునందు కలుగుచున్న భావములు ఎట్లు అస్థిరములుగా నున్నవో అట్లే చిదాత్మయొక్క సంకల్పరూపమైన జగత్తు కూడా ఆస్థిరమగునా? చిదాత్మయొక్క సంకల్పశక్తి అత్యంతము గొప్పది యగుటచే ఆజగత్తు కూడ సుస్థిరముగా భాసించుచున్నది. మనసంకల్పమువలన కలిగిని భావములు మనమనస్సులందే తోఁచును కాని యితరులకు తోఁపవు. ఎవరిభావములు వారివిగా నుండును. అవి అందఱకు సాధారణములుగా (Common to all) నుండవు. మన స్వాతంత్ర్యము సంకల్పము అపూర్ణము లగుటయే (Incomplete) ఇందులకు హేతువు. చిదాత్మయొక్క స్వాతంత్ర్యము సంకల్పము పరిపూర్ణము లగుటచే వానివలన భాసించుచున్న జగత్తు కూడ ఎల్లరకును సాధారణముగా (Common to all) కన్పించుచున్నది.

జీవులలో కూడ కొందఱయందు ఈస్వాతంత్ర్యము హెచ్చుగా కన్పించుచున్నది. మణులు మంత్రములు మొదలగువానిచేత మనస్సుయొక్క సంకోచము (Limitedness) తగ్గుకొలఁది స్వాతంత్ర్యము పెరుగుచుండును. ఆస్వాతంత్ర్యముయొక్క ఆధిక్యముచేత వారు గావించు సృష్టియు పులువురకు సత్యముగా భాసించుచున్నది. భార్గవా! ఇందజాలికుని చూడుము. వాడు పదార్థ మేదియు లేకుండనే సంకల్పమువలననే గుఱ్ఱములు ఏనుఁగులు మొదలగువానితో ఒకప్రపంచమును భాసింపఁ జేయుచున్నాఁడు. అది అందఱకును సాధారణమై (Commonly visible) స్థిరమై గజము నారోహించుట గుఱ్ఱముపై స్వారిచేయట మొదలగు వ్యవహారములు కలది యగుచున్నది. ఆ ప్రపంచము అతఁడు మరల తనయందు ఉపసంహరించుకొనచున్నాఁడు. "నేను చిదాత్మను" అని తెంపులేకుండ అభ్యసించు చున్నట్టి యోగికి ఈస్వాతంత్ర్యశక్తి ఇంకను హెచ్చుగా నుండును. అట్టి యోగులయొక్క సృష్టిని చూడుము. అది ఇంద్రజాలముకన్నను పూర్ణమై స్థిరమై యొప్పుచున్నది. కాని వారియొక్క స్వాతంత్ర్యము కూడ పరిమితమే (Limited). అందువలన వారిసృష్టికూడ వారికి వెలుపలనే గోచరించుచున్నది. చిదాత్మయొక్క స్వాతంత్ర్యము అపరిమితము (Unlimited) అగుటచే జగత్తు అంతయు చిదాత్మయందే పూర్ణముగా స్థిరముగా వ్యవహారరూపముగా భాసించుచున్నది. కావుననే అద్దమునకు భిన్నముగా ప్రతిబింబమునకు ఎట్లు సత్యత్వము లేదో అట్లే చిదాత్మకు భిన్నముగా జగత్తునకు సత్యత్వము లేదు.

చక్కఁగా విచారించినప్పుడే జగత్తు అసత్యమని తెలియును. మఱి యేసాధనముచేతను తెలియదు, ఎప్పటికిని మాఱనిది సత్యము. ఎప్పటి కైనను మాఱునది అసత్యము. ఈదృష్టితో జగత్తును చూడుము. ఇది అతిచంచలము. అద్దములోని ప్రతిబింబముయొక్కదృష్టాంతము ననుసరించి సకములనందును సత్యాసత్యములను విభజించి గ్రహింపుము. అద్దము అచలము. దానిలోని ప్రతిబింపము చలము. ఇప్పుడన్న ప్రతిబింబము కొంచెము సేపటికి ఉండదు. అట్లే జగత్తు నిరంతరము మాఱుచుండును. కాని దాని కాధారమైన చిదాత్మకు మార్పు లేదు. కావుననే జగత్తులోని పదార్థముల సత్యత్వము విచారించినచో నిలువదు. చూడుము. సూర్యునికాంతి వస్తువులను ప్రకాశింపఁజేయును గదా! ఆవెలుఁగులో గుడ్లగూబలకు వస్తువులు కనఁబడవు. చీఁకటిలో గుడ్లగూబలకు వస్తువులు కన్పించుచుండఁగా మనుష్యులకు కనఁబడవు. అట్టియెడల వస్తువులను ప్రకాశింపఁజేయునది వెలుఁగు అని చెప్పుదువా? చీఁకటి అని చెప్పుదువా? ఇట్లే ఒకనికి విషమైనది మఱియొకనికి ఆహార మగుచున్నది. పర్వతములు సముద్రములు గమనమునకు ప్రతిబంధకములై మనుష్యులకు భయమును కలిగించుచున్నవి. కాని యోగులకు గంధర్వులకు అవి ప్రతి బంధకములు కావు. మనుష్యులకు దీర్ఘముగా కన్పించు దేశము కాలము యోగులకు దేవతలకు స్వల్పముగా కన్పించుచున్నది. కావున విచారించినచో జగత్తు యొక్క స్వభావము ఏవిషయమునందును

స్థిరము (Constant) కాదు. ఆశ్రయమైన చిదాత్మలేక జగత్తులో ఏదియు లేదు. ఏది జగత్తులో ఉన్న దని కన్పించుచున్నదో అద యంతయు చితియే. ఈవిధముగా చితికి లేక దృక్కునకు అన్యముగా చేత్యము లేక దృశ్యము లేదని నిరూపింపఁబడినది.

జ్ఞానఖండమునందు జగత్తుయొక్క స్వభావనిరూపణ మన్నది ఏకాదశాధ్యాయము.

బాలప్రియ

హేమలేఖ హేమచూడునకు తత్త్వమును బోధించుచు తుదకు ఇట్లు నిశ్చయించి ఉపదేశించెను. "కన్పించుచున్న జగత్తు నేను కాదు అన్న భేదగ్రంథిని కూడ ఖండింపుము, అద్దములో ప్రతిబింబమును వలె అఖిలమును నీస్వరూపమునందే చూడుము." విశాలనగరము నందలి పంజరములలోని చిలుకలు కూడ దృశ్యమును వదలి దృక్స్వరూపమైన యాత్మను పొందుఁడు. "ప్రతిబింబము అద్దముకన్న భిన్నముగా ఎట్లు లేదో అట్లే దృక్కునందు ప్రతిబింబించుచున్న దృశ్యము కూడ దృక్కునకు భిన్నముగాలేదు. దృక్కే దృశ్యముగా కన్పించుచున్నది." అని పలుకుచుండె నని దత్తాత్రేయుఁడు చెప్పెను.

ఇది విని పరశురాముఁడు గురువు నిట్లుప్రశ్నించెను. "దృశ్యముగా కన్పించుచున్న యీజగత్తు అంతయు దృక్కు మాత్రమే ఎట్లగును?..... చూచుచున్నవాఁడు వేఱుగా వానిచే చూడఁబడుచున్న దృశ్యములైన పదార్థములు వేఱుగా కన్పించుచున్నవి. దృశ్యమును వదలి దృక్కును మాత్రమే గ్రహించుట ఎవనికిని అనుభవమునందు లేదు."

ఈసందేహమునకు సమాధానముగా దత్త గురువు దృగ్దృశ్యములతత్త్వమును అనేకవిధముల వివరించెను. దానిసారము నిట్లు గ్రహింపవచ్చును. దృక్కు అనఁగా కంటిచూపు మాత్రమే కాదు. గ్రహించునది దృక్కు; దానిచే గ్రహింపఁబడునది దృశ్యము. "ఇది మామిడిచెట్టు" అని చెట్టును చక్షురింద్రియము గ్రహించుచున్నది. "ఈసంగీతము మధురముగా నున్నది" అని శబ్దమును శ్రోత్రేంద్రియము గ్రహించుచున్నది. అందువలన చెట్టు దృశ్యము చక్షుస్సు దృక్కు అగుచున్నది. అట్లే శబ్దము దృశ్యము దానిని గ్రహించుచున్న శ్రోత్రము దృక్కు అగును. ఈవిధముగా ఇంద్రియము లన్నియు దృక్కులు, వానిచేత గ్రహింపఁబడుచున్న విషయము లన్నియు దృశ్యము లగుచున్నవి. "వెనుక చూపు బాగుండెను. ఇటీవల చూపు మందముగా నున్నది. ఇప్పుడు అస లేమియు కన్పించుట లేదు" అని చక్షురింద్రియముయొక్క విశేషములను మనస్సు గ్రహించుచున్నది. అట్లే "రుచులలో సూక్ష్మభేదములను కూడ జిహ్వ గ్రహించుచుండెను. ఇటీవల అంతగా రుచి తెలియుట లేదు, ఇప్పుడు బొత్తిగా రుచియే తెలియుట లేదు" అని జిహ్వేంద్రియము యొక్క విశేషములను కూడ మనస్సు గ్రహించుచున్నది. అందువలన మనస్సు దృక్కు, దానిచేత గ్రహింపబడుచున్న యింద్రియములు దృశ్యము లగును. "వెనుక నాబుద్ధి చాల చుఱుకుగా నుండెను. ఇటీవల మనస్సు బాగుగాలేక బుద్ధి మందగించినది. ఇప్పు డస లది పనిచేయుటయే లేదు" అని మనస్సుయొక్క బుద్ధియొక్క విశేషములను మనము గ్రహించుచున్నాము. అప్పుడు మనస్సు బుద్ధి దృశ్యములై వానిని గ్రహించుచు మనయందున్న చైతన్యము దృక్కు అగుచున్నది. "నేను" అని మనయందు స్ఫురించుచున్న చైతన్యము దేనిచేతను గ్రహింపఁ బడుటలేదు. దేహము ఇంద్రియములు మనస్సు బుద్ధి ఎన్నిమార్పులను పొందినను, అది మాత్రము మార్పును పొందక ఆమార్పులను అన్నింటిని చూచుచు జాగ్రత్తు స్వప్నము నిద్ర బాల్యము కౌమారము వృద్ధత్వము మొదలుగా సకలదశలలో ఏకరూపముగనే స్ఫురించుచున్నది. కాఁబట్టి అది ఎప్పుడును దృక్కే. అది ఎప్పుడును దృశ్యము కాదు. తక్కిన వన్నియు దృశ్యములే.

కావున దృక్కు దృశ్యము అని ప్రధానముగా రెండు పదార్థములే యున్నవి. ఈరెండింటికిని అవినాభావసంబంధ మున్నది. అనఁగా దృక్కు లేకున్నచో దృశ్యము ఉండదు. కాని దృశ్యము లేనప్పుడ కూడ దృక్కు ఉండును. "చెట్టు ఉన్నది" అన్నమాట ఎవఁడో ఒకఁడు ఒకచెట్టును చూచినప్పుడే చెప్పుట సంభవించును. ఎవఁడును ఏచెట్టును చూడనప్పుడు ఆమాటయే పుట్టదు. కావున ఎవఁడు ఏవిషయము నైనను "ఉన్నది" అని చెప్పినప్పుడు, "అదిముందు వానిచేత గ్రహింపఁబడి తరువాత ఉన్నది" అన్నమాట. అనఁగా ఏది మనచేత గ్రహింపఁబడదో అది మనకు ఉండదు. "నీకు తెలియని వస్తువును చెప్పుము" అన్నచో ఎవఁడును చెప్పలేఁడు. ఎవడు ఏది చెప్పినను తనకు దెలిసినదానినే

చెప్పును; తెలియనిదానిని చెప్పలేడు. ఒకవస్తువు మనకు తెలియకున్నంతమాత్రమున అసలదిలేకుండ పోవునా? ఉండవచ్చును. ఎవఁడు దానిని తెలిసికొను చున్నాఁడో వాని కది యుండును. నీకు తెలియనంతవఱకు అది నీకు లేదు. ఒకఁడు తల్లితో తండ్రితో భార్యతో పుత్రినితో కూడి కొండపైకి పోవుచున్నాఁడు. పులివలె ఒకమృగము వానికి దూరమున కన్పించినది. వాఁడు వెంటనే భయముతో వణఁకుచు మూర్ఛిల్లినాఁడు. ఆక్షణమునందు వానికి తల్లి తండ్రి భార్య పుత్రుఁడు కొండ పులి మొదలుగా ఏదియును లేదు. ఎందువలన? ఆసమయమున దృక్కురూపమైన వానియొక్క చైతన్యమునందు ఇది ఏదియు ప్రతిబింబించుట లేదు. మూర్ఛనుండి తేఱుకొన్నంతనే మరల వానికి తల్లి తండ్రి మొదలుగా వ్యవహార మేర్పడుచున్నది. ఎందువలన? అప్పుడు దృక్కు రూపమైన వానిచైతన్యమునందు ఇది యంతయు ప్రతిబింబించుచున్నది. నిద్రలో సమాధిలో కూడ దృక్కు దేనిని గ్రహింపకుండుటచే దృశ్యమైన జగత్తు ఉండుట లేదు. కావునేసమయమునందైనను నీచేత గుర్తింపఁబడని లేదా గ్రహించపఁబడని జగత్తు నీకు లేదు. కావున నీకు దృశ్యమైన నీజగత్తు దృక్కుగా నున్న నీయందే యున్నది. "నేను వేఱు జగత్తు వేఱు" అని అనుకొనుట అనేక జన్మలుగా పేరు కొనియున్న అజ్ఞానముయొక్క ముడి అనుట స్పష్టము.

లోకములో మనుష్యు లందఱు దుఃఖమును తొలఁగించుకొనుటకు సుఖమును సంపాదించుకొనుటకు యత్నించుచున్నారు; అందులకై ప్రతికూలములైన విషయములను తొలఁగించుకొనుచు అనుకూల విషయములను సమకూర్చుకొనుచున్నారు. కాని సుఖము తనయందున్నదా విషసయములందున్నదా? రుచికరములైన పదార్థములు సుందరులైన యువతులు మొదలైన మొదలైన విషయములందు సుఖ మున్నచో అవి ఎప్పుడును సుఖమునే కలిగించుచుండవలె. కాని అవి యొకప్పుడు సుఖకరముగా నున్నను కొంతసేపైన తరువాత వానిని వదలుకొనుటయే సుఖ మగుచున్నది. చాలసేపు విషయములతో సుఖ మనుభవించిన తరువాత ఒకప్పటికి కన్నులు చూడవు; చెవులు వినవు; ఇంద్రియము లన్నియు స్థబ్ధత నొందును. అదే నిద్ర. ఆనిద్ర ఎంతగాఢముగా నున్నచో అంత సుఖము కలుగుచున్నది. అప్పుడు దేనివలన అంత సుఖము కలుగుచున్నది? మనోరూపముగానున్న చైతన్యము ఏదృశ్యమును గ్రహింపక దృక్కుమాత్రముగా ఉండుటచేత అంత సుఖము కలుగుచున్నది. సమాధియందు కూడ మనస్సు ఏదృశ్యమును గ్రహింపక దృక్కుగా నిశ్చలమగా ఉండుటచేతనే సుఖము కలుగుచున్నది. దృశ్యమైన జగత్తుతో సంబంధమున్నప్పుడు దుఃఖము దానితోపాటు కొంచెము సుఖము కలుగుచున్నది. దృశ్యమును వదలి దృక్కురూపముగా నున్నప్పుడు దుఃఖము అసలు లేకుండుటయే కాక మహాసుఖము కలుగుచున్నది. కావున "దృశ్యమును వదలి మీస్వరూపమైన దృక్కునే భజింపుఁడు" అని విశాలనగరమున చిలుకలు పలుకుచుండుట సమంజసముగానే యున్నది.

"లోకములో ఎవనియిచ్ఛామాత్రముచేతను ఏయచేతన పదార్థమునందును క్రియ పుట్టుట లేదు .... కావున ఈశ్వరుని యిచ్ఛవలన పరమాణువులందు సృష్టి ఆరంభ మగు ననుట యుక్తముగా లేదు" - దీనిని సిద్ధాంతముగా గ్రహింప నక్కఱలేదు. కేవలము సంకల్పము యొక్క బలముచేతనే కొందఱు దూరముగానున్న అచేతనపదార్థములయందు కదలికను కలిగింపఁగలిగియున్నారు. అట్టియెడల పరమేశ్వరుఁడు సంకల్పమాత్రముచేత అచేతనములైన పరమాణువులయందు క్రియను కలిగించుట అసంభవము కాదు. అట్లు ఈశ్వరుని సంకల్పమువలన సృష్టిక్రియ సంభవించుచున్నప్పుడు ఆసృష్టికిపరమాణువు లతో పనియే లేదు. ఆయన పరిమితమైనశక్తి గల కుమ్మరివంటివాఁడు కాడు. కుమ్మరి మట్టి లేకున్నచో కుండను సృష్టింపలేఁడు. ఇంద్రజాలికులు యోగులు పదార్థము లేకుండనే ఎంతో సృష్టిచేయుచున్నారు. ఇంక అనంతశక్తి కలిగిన పరమేశ్వరునకు సృష్టిచేయునపుడు పరమాణువులతో పని యేమున్నది? కావున పరమాణులు స్వయముగా సృష్టిని ఆరంభింపలేవు. ఈశ్వరుఁడు సృష్టిని ఆరంభింపవలసివచ్చినచో ఆయనకు పరమాణువులతో పని లేదు, అని చెప్పుటయే పై వాక్యమునకు తాత్పర్యము.

"అట్టి యాకారాత్మకమైన దేశము క్రియాత్మకమైన కాలము తమకు ఆధారమైన చైతన్యమునందు ఎట్లు విభాగములను కల్పింపఁగలవు?" కుండ చట్టి మొదలగువానివలన వానికి ఆధారమైన మట్టి యందు, ఇంతవఱకు ఈమట్టి కుండయైనది. ఇంతవఱకు ఈమట్టి చట్టి యైనది. అని విభాగము లేర్పడు చున్నవి. అట్లే నిన్న అది జరిగినది, ఇప్పుడు ఇది జరుగుచున్నది, రేపు మరియొకటి జరుగును, అని ఆక్రియలచేత వాని కాధారమైన మనభావనయందు విభాగము లేర్పడుచున్నవి. కావున దేశము కాలము తమకు ఆధారమైన చైతన్యమునందు కూడ విభాగములను ఏర్పఱచు నని ఏల చెప్పరాదు? అనుసందేహము కలుగవచ్చును. కాని చైతన్యము మట్టివంటిది మనభావనవంటిది కాదు. అది

అఖండము (Undivided) అద్వితీయము (Only one without a second) అనిక్రియము (Unchangeable) కావున దానియందు ఎట్టియాకారము ఏర్పడుదు. అందువలన దేశవి భాగము లేదు. అట్లే దానియందు ఏక్రియ కూడ సంభవము కాదు. అందువలన కాలవిభాగము ఏర్పడదు. ఈకారణముచేత దేశకాలములు చైతన్యమునందు విభాగములను ఏర్పఱుపఁజాలవు.

# పండ్రెడవయధ్యాయము - గండశిల లోకావలోకనము

జగత్తుయొక్క తత్త్వమును విని భార్గవరాముఁడు ఇంకను సందేహములు కలవాఁడై ఇట్లు ప్రశ్నించెను. "భగవానుఁడా! జగత్తునుగూర్చి నీవుచెప్పినది నిజమే. అయినను ఇది ఎల్లప్పుడును సత్యముగా ఎందులకు గోచరించుచున్నది? నేనే కాదు. బుద్ధిమంతులైన యితరులు కూడ దీనిని సత్యమునుగా ఎందులకు నిశ్చయించుచున్నారు? ఇది అసత్యమని నీవలన ఇంతగా విన్నప్పటికిని ఇంకను నాకు ఈజగత్తు సత్యమువలె ఎందులకు తోఁచుచున్నది? ఈభ్రమ నశించునట్లుగా నాకు దయతో బోధింపుము."

దత్తాత్రేయుఁడు ఇట్లు చెప్పెను. "భార్గవా! ఈజగత్తు సత్యమను భ్రాంతి సనాతనము. దీనికి మూలము అవిద్య, అది అనాది. ఉన్నదానికి ఉన్నట్లు గ్రహింపక విరుద్ధముగా గ్రహించుటయే అవిద్య. దానివలన ఉన్న చిదాత్మను గ్రహింపక లేని జగత్తుని ఉన్నట్లుగా దృఢముగా భావించుచుండుటయే ఈభ్రాంతికి మూలము. ఆత్మను తెలిసికొనక మానవులు శరీరమే ఆత్మ అని తలంచుచున్నారు గదా! రక్తమాంసములు ముద్దయైన శరీర మెక్కడ? అత్యంతనిర్మలమైన చిదాత్మ ఎక్కడ; ఆత్మ చిద్రూపము నిర్మలము అని తెలిసినప్పటికిని కేవలమైన భావనయొక్క దృఢత్వముచేతనే ఇంకను ఆత్మ శరీరముగానే కన్పించుచున్నది. ఇట్లే భావనవల్లనే జగత్తు కూడ సత్యముగా తోఁచుచున్నది. దీనిని నివారించుటకు ఒక్కటే ఉపాయము కలదు. ఇప్పుడ చేయుచున్న భావనకు విరుద్ధముగా , 'ఈజగత్తు సత్యము కాదు; ఆత్మయే సత్యము' అని దృఢముగా భావించుచున్నచో ఈభ్రాంతి నశించును. ఈజగత్తునుగూర్చి ఎవఁడు ఎట్లు భావించుచున్నాఁడో వానికి అట్లే గోచరించును. ఇది యోగులకు వారి ధ్యానధారణముల ననుసరించియే కదా గోచరించుచున్నది. ఈవిషయమున అద్భుతమైన కథను చెప్పెదను వినుము.

వంగదేశమున సుందర మనుపేరుగల పురము గలదు. అది పరమపావనము. అందు సుషేణుఁడు అను ధీమంతుఁడైన రాజు ఉండెను. ఆతనికి మహాసేనుఁడను ప్రియుఁడైన తమ్ముఁ డుండెను. ఆయన ధర్మబద్ధముగా పాలించుచు అశ్వమేధములతో మహేశ్వరుని అర్చించెను. అప్పుడు మహాబలపరాక్రమశాలులైన రాజుకుమారులు పెద్దసైన్యముతో యజ్ఞాశ్వముపెంట వోయిరి. వారు అశ్వమును అడ్డగించినవారిని జయించుచు ఐరావతీనదీతీరమునకు చేరిరి. అచ్చట వారు తపోనిధియైన తంగణుఁడు అను రాజర్షిని చూచిరి. వారు గర్వముతో ఆయనను దర్శింపక ముందుకు పోఁజొచ్చిరి. వారు అట్లు తనతండ్రిని అవమానించుటను చూచి తంగణునిపుత్రుఁడు వారిని బెదిరించుచు అశ్వమును పట్టుకొనెను. ఆరాజకుమారు లందఱును వానిని చుట్టుముట్టిరి. అప్పుడ డతఁడు వారందఱు చూచుచుండఁగా ఎదుట నున్న గండశైలములోనికి గుఱ్ఱముతో కూడ ప్రవేశించెను. వారు ఆగండశైలమును ఆయుధములతో పగులఁగొట్టిరి. అది పగిలినంతనే దానిలో నుండి ఆఋషి కుమారుఁడు మహాసేనతో వెలువడి వారి నందఱును క్షణములో జయించెను. పిదప అతఁడు సుషేణునిసైన్యమును సంహరించి రాజకుమారులను బంధించి మరల గండశైలమునఁ ప్రవేశించెను.

హతుశేషులై నభటులు నగరమునకు పోయి జరిగిన వృత్తాంతమును సుషేణునకు నివేదించిరి. ఆయన ఆశ్చర్యము నొంది తమ్ముని చూచి యిట్లనెను. "వత్సా! తంగణమునియున్నచోటికి వెంటనే పొమ్ము. తపస్సులశక్తి మనయూహలకు అందదు. వారిని దేవతలు కూడ జయింపఁజాలరు. కావున ఆమునిని ప్రార్థించి కుమారులను అశ్వమును సత్వరముగా తీసికొనిరమ్ము. యజ్ఞమునకు యోగ్యమైన యీవసంతఋతువు దాటిపోకుండ వెంటనే తిరిగిరమ్ము. తాపసులవిషయమున ఎప్పుడును అభిమానమును పూనరాదు. వారు కోపించినచో ఈలోకములను క్షణములో భస్మము కావింపఁగలరు. కావున ఎట్లయినను ఆయనను ప్రసన్నుని గావించుకొని మనకార్యమును సాధింపుము."

వెంటనే మహాసేనుఁడు బయలుదేరి తంగణమునియున్న చోటికి వచ్చెను. ఆయన నిర్వికల్ప సమాధియందు నిశ్చలుఁడై యుండెను. మహాసేనుఁడు సాష్టాంగముగ ప్రణమిల్లి లేచి చేతుల జోడించి ఆమునీశ్వరుని అనేకవిధముల స్తుతింపఁజొచ్చెను. అట్లు మూఁడుదినములు గడచెను. ఆస్తుతులకు సంతోషించి తంగణునిపుత్రుఁడు అచ్చటికి వచ్చి మహాసేనునితో ఇట్లనెను. 'రాజా! నీస్తవమువలన నేను సంతోషించితిని, నీకోరిక ఏమొ చెప్పుము. వెంటనే తీర్చెదను. నేను ఈతంగణమహాముని కుమారుఁడను. ఇప్పుడు మాతండ్రిగారు మాటాడరు. ఆయన పండ్రెండేండ్లదీక్షతో సమాధి నొందియున్నారు. ఇప్పటికి అయిదేండ్లు మాత్రమే గడచినవి. కావున నీవాంఛిత మేమో చెప్పుము. నేను తపసునందు మాతండ్రిగారితో సమానుఁడను. నన్ను బాలునిగా తలంపకుము. యోగులకు తపస్వులకు లోకమున అసాధ్య మేదియునులేదు." ఆమాటలు విని మహాసేనుఁడు అతనికి ప్రణమిల్లి కృతాంజలియై ఇట్లే పలికెను. "మునికుమారా! నీవు నిజముగా నాకోరికను నెరవేర్చెద వేని మీతండ్రిగారిని సమాధినుండి మేల్కొలుపుము. నేను ఆయనతో మాటాడఁగోరుచున్నాను. ఇదియే నాకు అత్యంత ఇష్టము. నీవు నా యందు దయఁజూపుదువేని ఈకార్యమును త్వరగా సాధింపుము." అప్పుడు ఆమునిపుత్రుఁడు ఇట్లనెను. "రాజా! నీకోరిక అసాధ్యము అయినను నీకోరికను తీర్చెద నని ప్రతిజ్ఞజేసి నేను మాఱుమాట ఎట్లు చెప్పఁగలను? దయచేసి ముహూర్తమాత్రము వేచియుండుము. యోగముయొక్క సామర్థ్యమెట్టిదో చూడుము. మాతండ్రిగారు పరమ పావనమైన శాంతిస్థితియం దున్నారు. బాహ్యాయత్నములతో వారిని ఎవరు మేల్కొల్పఁగలరు? నేను సూక్ష్మమైన యోగము యొక్క ఉపాయముచేత ఆయనను మేల్కొల్పుదును,"

ఇట్లు పలికి ఆమునికుమారుఁడు కూర్చుండి ప్రాణమునందు అపానమును ఏకమొనర్చి అహంకారాత్మకమైన యంతఃకరణముతో శరీరమునుండి వెలికివచ్చి తండ్రియొక్క శరీరమున ప్రవేశించి ఆత్మయందు లీనమైనయున్న యాయనయొక్క మనస్సును ఆకర్షించి మేల్కొలిపి వెంటనేతిరిగివచ్చి తనశరీరమున ప్రవేశించెను. ఇంతలో తంగణమహాముని బాహ్యస్మృతి నొంది ఎదుట స్తోత్రము చేయుచు ప్రణమిల్లియున్న మహాసేనుని చూచెను. 'ఇదియేమి' అని ఆయన యోగదృష్టితో జరిగినదానిని తెలిసికొని ప్రసన్నచిత్తుఁడై కుమారునితో నిట్లనెను. "వత్సా! నీవు మరల ఇట్లు చేయకుము. క్రోధము తపస్యునకు శత్రువు. రాజులు చక్కఁగా ప్రజలను రక్షించినప్పుడే తపస్సు కూడ వర్థిల్లును. యజ్ఞమునకు విఘ్నము చేయుట దైత్యుల లక్షణము. మునులకు ఇది తగదు. నీవు మంచిమనస్సుతో అశ్వమును రాజు కుమారులను ఇతనికి అర్పింపుము. త్వరపడుము. లేకున్నచో యజ్ఞమునకు యోగ్యమైనకాలము అతిక్రమించును." వెంటనే ఆమునికుమారుఁడు క్షణములో గండశైలములోనికి పోయి గుఱ్ఱమును రాజపుత్రులను తీసికొనివచ్చి ప్రీతితో మహాసేనునకు అప్పగించెను.

మహాసేనుఁడు ఆశ్చర్యపడి రాజపుత్రులను అశ్వముతో నగరమునకు పంపి తంగణునకు ప్రణమిల్లి ఇట్లు ప్రార్థించెను. "భగవానుఁడా! అశ్వముతో కూడ మాయన్నకుమారులు గండశైలములోపల ఎట్లుండిరి? దయతో చెప్పుము." తంగణుఁడు ఇట్లు చెప్పెను. "రాజా! నేను కూడ పూర్వము రాజుగా నుండి భూమియంతయును చిరకాలము పాలించితిని. పిదప మహాదేవుని యనుగ్రహముచేత చితిరూపమైన త్రిపురామహేశ్వరిని తెలిసికొని రసహీనమైన యీ లోకవ్యవహారమును విమర్శించి విరక్తుఁడనై రాజ్యమును కుమారులకు అప్పగించి భార్యతో కూడ ఈవనమునకు వచ్చితిని. ఇచ్చట నేను తపస్సు చేయుచుండఁగా పదికోట్ల సంవత్సరములు గడచెను. నన్ను సేవించుచు నాభార్య కూడ పరమసిద్ధిని పొందెను. విధివశమున ఒకనాఁడు ఆమె సమాధియందే కామముచేత పీడితురాలయ్యెను. ఆమె సమాధిని వీడి గాఢసమాధియందున్న నన్నుజూచి కామవేగమును భరింపఁజాలక నాతో రమించునట్లే భావించెను. గాఢమైన భావనచేత ఆమె నాతో సంభోగమునుపొంది గర్భమును ధరించి ఈకుమారుని కనెను వీనిని నాయొడియందుంచి నన్ను సమాధినుండి మేల్కొలిపి దేహమును పంచభూతములయందు లీనముగావించి పరమాత్మత్వమును పొందెను. పిదప నేను ఒడియందున్న వీనిని జూచి ఆమె పరమగతిని పొందిన దని గ్రహించి వీనిని పెంచితిని. వీఁడు ఒకసారి నేను పూర్వము రాజ్యపాలనము చేసియుంటినని విని తానుకూడ రాజ్యమును పాలింపవలయును నని ప్రార్థించెను. తరువాత వీఁడు నావలన ఉపదేశమును పొంది ఉత్తమమైన యోగసమృద్ధిని సాధించి భావనాయుగమువలన ఈమహాశైలమునందు ఒకలోకమును నిర్మించి అందు సముద్రపర్యంతమైన పృథివిని ప్రతిదినము పాలించుచున్నాఁడు. ఆలోకమునందే మీగుఱ్ఱము రాజపుత్రులు బంధింపఁబడి తరువాత వదిలిపెట్టఁబడినారు."

ఇది విని మహాసేనుఁడు ఆశ్చర్యము నొంది ఆలోకమును చూడఁగోరెను. ఆతనికి ఆలోకమును చూపు మని కుమారునకు అదేశించి తంగణుఁడు మరల సమాధియందు ప్రవేశించెను. మునికుమారుఁడు అతనిని గైకొని

గండశైలమునొద్దకు పోయి తాను అందు ప్రవేశించి మహాసేనును రమ్మని పిలిచెను. మహాసేనుండు అందు ప్రవేశింపలేకపోయెను. అప్పుడు మునికుమారుఁడు వెలుపలికి వచ్చి యిట్లనెను. "యోగులుకానివారు ఇందు ప్రవేశించుట అసాధ్యము. యోగశక్తి లేకున్నచో ఈగండశైలము పెద్ద ప్రతిబంధక మగును. గడ్డిచేత కప్పఁబడియున్న యీబిలమునందు నీస్థూలశరీరమును వదలి మనోమాత్రశరీరుఁడవై నాతో కూడ ఇందు ప్రవేశింపుము." మహాసేనుఁడు, "దేహమునుండి ఎట్లు వెడలఁగలను? బలవంతముగా శరీరమును ఎట్లయినను వీడినచో తప్పక నశింతును" అని పలికెను. మునిపుత్రుఁడు మహాసేనును జూచి నవ్వి "అయ్యో! నీకసలు యోగమేతెలియదే. సరే! కానిమ్ము. కనులు మూసికొనుము" అని చెప్పి అతఁడు కనులుమూసికొన్నంతనే వానియందు ప్రవేశించి అరనిముసములో వానిలింగశరీరమును వెలుపలికి తెచ్చి వానిస్థూలశరీరమును బిలమునందుంచెను. పిదప వానిలింగశరీరముతోఅతఁడు శైలము నందు ప్రవేశించెను. స్థూలశరీరమునుండి వెలుపలికి వచ్చుటనే మహా సేనుఁడు లింగశరీరమునందు నిద్ర నొందెను. మునిపుత్రుడు సంకల్పమాత్రమును ఒకస్థూలదేహమును సృష్టించి దానియందు మహాసేనుని గశరీరమును ప్రవేశపెట్టి మేల్కొలిపెను. మహాసేనుఁడు మేల్కొని పైకి క్రిందికి చూచెను. ఎటు చూచినను అతనికి ఆకాశమే అనంతముగ భయంకరముగా కన్పింపఁజొచ్చెను. తాను ఆకాశమధ్యమున ఉన్నట్లు గ్రహించి మహాసేనుఁడు భయపడి, "అయ్యా! నన్ను వదలకుము. నీవు వదలినచో నేను ఎక్కడనే పడిపోయి నశింతును" అని పలికెను. మునికుమారుఁడు నవ్వి, "భయపడకుము. నిన్ను వదలిపెట్టను. శైలములోని యీలోకము నంతను ధైర్యముతో అన్నినివైపుల తిరిగి చూడుము" అని చెప్పెను.

అప్పుడు మహాసేనుండు ధైర్యము నవలభించి చూడఁజొచ్చెను. ఆతనికి క్రిందుఁగా దూరమునందు చీఁకటిచే ఆవరింపఁబడి నక్షత్రములతో కూడినయాకాశము కన్పించెను. అతఁడు అక్కడికి చేరి దానికి క్రిందుగానున్న విశాలమైన చంద్రమండలమును చూచెను. దానియొద్దకు పోయినంతనే మహాసేనుఁడు చలిచేత గడ్డ కట్టుకొనిపోవుచుడఁగా మునిపుత్రుఁడాతనికి వేఁడి కలిగించి రక్షించెను. అక్కడనుండి అతఁడు సూర్యమండలమును చేరి తాపము నొందఁజొచ్చెను. ఋషిపుత్రుఁడు యోగబలముచేత వానికి చల్లఁదనము కలిగించెను. ఇట్లు మహాసేనుఁడు ఆలోకమునంతను తన భూలోకమునకు ప్రతిబింబమువలె నున్నట్లు గ్రహించెను. పిదప బంగారుకొండయొక్క శిఖరమున మునికుమారునితో కూడ కూర్చుండి ఆతఁడు చూపుచున్న దంతయు చూచెను. మునికుమారుఁడొసంగిన దివ్యదృష్టితో మహాసేనుఁడు గుండ్రముగానున్న లోకాలోకపర్వతమును దానివెలుపల చీఁకటినిదానిలోపల బంగారుభూమిని సముద్రములను సప్తద్వీపములను నదులను పుర్వతములను సర్వభువనములను ఇంద్రుఁడు మొదలైన దేవోత్తములన దైత్యులను మనుష్యులను రాక్షసులను యక్షులను కింపురుషులను మొదలుగా అనేకులనుచూచెను. మునికుమారుడే సత్యలోకమున బ్రహ్మగా వైకుఁఠమున విష్ణువుగా కైలాసమున శివుఁడుగా ఉండి సర్వలోకములయొక్క సృష్టి మొదలైనవ్యవహారమును నిర్వహించుచు భూలోకమునందు మఱియొక రూపముతో సార్వభౌముఁడుగా పరిపాలించుచుండుటను మహాసేనుఁడు చూచెను. మునికుమారునియొక్క అద్భుతమైన యోగశక్తి సమృద్ధిని చూచి అతఁడు మిగుల విస్మితుఁడయ్యెను. అప్పుడు మునికుమారుఁడు "రాజా! నీవు ఈలోకమును చూచుచుండఁగా నూటఇరువదికోట్ల సంవత్సరములు గడచిపోయినవి. ఆకాలము ఇక్కడ ఒక్కదినమైనది. మాతండ్రిగారున్నచోటికి వెలుపలికి పోవుదము రమ్ము" అనిపలికెను. పిమ్మట అతఁడు మహాసేనుని గైకొని మహాకాశములోనికి ఎగిరిపూర్వము లోపలికి చొచ్చిన ప్రకారముననే గండశైలమునుండి వెలుపలికి వచ్చెను.

ఇది జ్ఞానఖండమునందు గండశైలలోకమును చూచుట అన్నది ద్వాదశాధ్యాయము.

# పదమూఁడవయధ్యాయము - మహాసేనుని నిర్వేదము

మునిపుత్రుఁడు గండశైలములోనుండి బయలుదేరునపుడు మహాసేనుని మూర్ఛితునిగావించి ఆతని లింగశరీరమును మాత్రము గైకొని వెలుపలికివచ్చిన తరువాత దానిని అతనియొక్క పూర్వస్థూలదేహమునందు ప్రవేశపెట్టెను. ఆదేహమునందు చక్కఁగా కుదురు కొనునట్లుగా చేసి అతనిని మునిపుత్రుఁడు మేల్కొలిపెను. పైకిలేచిన మహాసేనుఁడు బాహ్యలోకమున భూమిని జనులను వృక్షములను నదులను మొదలగు సర్వమును క్రొత్త వానినిగా చూచుచు అత్యంతము విస్మితుఁడై మునిపుత్రునితో నిట్లనెను. "మహాశయా! ఇది ఏ లోకము? చాలక్రొత్తగా నున్నది. ఈయద్భుత మేమో చెప్పుము?" మునికుమారుఁడిట్లు చెప్పెను. "అయ్యా! ఇది యింతకు పూర్వము మనమున్నలోకమే. అదియే దీర్ఘకాలవశమున చాలమార్పు నొందినది. గండశైలలోకమందు మనము ఒక్కదినము గడిపితిమి. అంతలోపల ఇక్కడ నూటఇరువదికోట్లసంవత్సరములు గడచిపోయినవి. కావున ఈ లోకముయొక్క రూపము పూర్తిగా మాఱిపోయినది, చూడుము. ఎల్లయెడల వ్యవహారము భాష వెనుకటికన్న చాల భిన్నముగానున్నవి. కాలవశమున ఇట్టి మార్పు కలుగుచుండను. ఈజగత్తుయొక్క స్థితి ఇట్లు మాఱుచుండుట అనేక పర్యాయములు చూచితిని. సమాధియందు భగవంతుఁడైన మాతండ్రిగారు కదలకుండ ఎట్లున్నారో చూడుము. నీవు ఇచ్చటనే మాతండ్రిగారిని స్తోత్రము చేసియుంటివి. మనము ప్రవేశించిన గండశైల మిదియే. మీయన్నగారి వంశమున వేలకొలఁదితరముల గడచినవి. వంగదేశమున సుందర మనుపేరు గల మీనగరమున్నచోట ఇప్పుడు క్రూరమృగములతో నిండినయడవి వ్యాపించియున్నది. యన్నగారివంశమున వీరబాహువు అనువాఁడు ఇప్పుఁడు క్షిప్రానదీతీరమున విశాలనగరమునందు మాళవదేశపాలకుఁడై యున్నాఁడు. నీవంశమున సుశర్మ అనువాఁడు ద్రావిడదేశమునందు తామ్రపర్ణీనదీతీరమున వర్ధనమును నగరమునందు ప్రభువైయున్నాఁడు. ఈలోకస్థితి ఎప్పుడును ఇట్లే మాఱుచుండును. అల్పకాలమునకే ఇది నూతనమైన జగత్తుగా రూపొందినది. దీర్ఘకాలవశమున కొండలు నదులు మడుగులు కూడ రూపాంతరములను పొందు చుండును. జగత్తుయొక్క గతి యింతే. కొండలుపల్లములు అగును. పల్లములు కొండ లగును. ఎడారులు జలమయము లగును. పర్వతములు ఇసుకప్రదేశము లగును. ఊరిసేల మెత్తనిపొల మగును. ఒకప్పుడు మనుష్యులధికముగా నుండుఁగా ఇంకొకప్పుడు పశుపక్ష్యాదు, లధికముగా నుండును. కాలవశమున జగత్తులో ఎన్నియో పరిణామములు సంభవించుచుండును. ఇప్పుడు ఈవిధముగ కన్పించుచున్న యీలోకము మనము వెనుక నివసించినదే."

ఈమాటలు విని మహాసేనుఁడు మిగుల దుఃఖముతో మూర్ఛనొందెను. మునిపుత్రుఁడు సేదదీర్పఁగా కొంత సేపటికి తెలివినొంది మహాసేనుఁడు అన్నను అన్నకొడుకులను తనభార్యను పుత్రులను స్మరించి విలపింపఁజొచ్చెను. మునికుమారుఁడు అతనిని చూచి యిట్లనెను. "రాజా! నీకు తెలివి యున్నట్లే లేదే! ఎవరినిగూర్చి యైనను విలపించి ఏమి లాభము? బుద్ధిమంతులు నిష్ఫలముగా ఏపనియును చేయరు. మనము చేయుపనికి ఫల మున్నదా లేదా అని ఆలోచింపకుండ పనిచేయువాఁడు మూర్ఖుఁడు. నీవు ఎవరినిగూర్చి ఎందులకు విలపించుచున్నావో చెప్పుము." మహాసేనుఁడు విలపించుచు ఇట్లనెను. "నాకు సంబంధించినది యంతయు నశించియుండఁగా ఏల దుఃఖింతు వని కారణ మడిగెద వేమి? నేను ఎందులకు దుఃఖించుచున్నానో నీకు తెలియుట లేదా? తండ్రియో సోదరుఁడో ఎవఁడో ఒకఁడు పోయిననేచాలు, లోకమున ఎంతో దుఃఖమును పొందుదురు. మఱి నాకు సర్వబంధునాశమే సంభవించినది. ఇంక దుఃఖింపక ఎట్లుందును? నీ వేల యిట్లు అడిగెదవు? మునికుమారుఁడు నవ్వుచు మరల నిట్లనెను. "అయ్యా! చెప్పుము. చచ్చినవారికై శోకించుట సనాతనమైన కులధర్మమా? ఇట్లుశోకింపకున్నచో పెద్దదోషము కలుగునా? లేక నీవు దుఃఖించినచో చనిపోయినవారు తిరిగివత్తురా? రాజా! ధైర్యముతో విమర్శింపుము. శోకించుటవలన ఎవనికైన ఏమైన ఫలము కలుగుచున్నదా! బంధువులు నశించినప్పుడు దుఃఖింప నక్కఱలేదా అని అందువేని వినుము. నీతాతలు ముత్తాతలు ఎందఱో చనిపోయినారు కదా! వారి నందఱనుగూర్చి దుఃఖింపవలసియే యున్నచో ఎల్లప్పుడు దుఃఖింపవసియే యుండును. వారినిగూర్చి నీవు దుఃఖించుట లేదే! వారికన్నను అన్నలుమొదలగువారు సన్నిహితులందువేని. అసలు బంధువు లనఁగా ఎవరు? బంధుత్వమెట్టిది? విచారింపుము, ఒకశరీరమువలన

కలిగినవారుపరస్పరము బంధువు లగు చున్నా రందువేని, నీతల్లితండ్రులయొక్క నీయొక్క శరీరములనుండి నీవు నీసోదరులు నీబిడ్డలేకకాక స్వేదము మొదలగువానివలన క్రిములు ఆసంఖ్యాకములుగా పుట్టినవి కదా! అవిఏల నీకు బంధువులు కాలేదు. వానికొఱకు ఏల నీవు శకించుట లేదు?

అది యుండనిమ్ము. అసలు నీ వెవరు? నీవు ఎవరికొఱకు దుఃఖించుచున్నావో ఆబంధువు లెవరు? విమర్శింపుము. నీవు దేహమా లేక దేహభిన్నుఁడవా? "నేను ఈదేహమే" అని యందువేని ఈ దేహము పెక్కుఅవయవముల కూర్పుగానున్నది. మఱి దేహమంతయు నశించినచో నాశము కలిగిన దందువా. లేక ఒకభాగము నశించినను నాశమే యగునా? దేహమునందు గోళ్ళు వెంట్రుకలు మొదలుగా ఏవో కొన్ని భాగములు ప్రతిక్షణమునశించుచున్నవి. అయినను దేహము నశించుట లేదు. "అయ్యా! అట్లు కాదు ఇప్పుడు మాబంధువుల దేహములు పూర్తిగా నశించినవి. అందువలన వారు నశించి రని దుఃఖించుచున్నాను" అని నీ వందువేని, అట్లు చెప్పుటయు కుదురదు. నీకు కన్పింపకున్నను నీయన్న మొదలగువారియొక్క దేహములలో అంశములైన అగ్ని జలము మొదలగునవి పంచభూతములలో చేరియుండనేయున్నవి. అదియును గాక నీవు దేహము కాదు. ఎందు వల్ల ననఁగా "ఇది నాదేహము" అని ఇతరులకు చూపుచు చెప్పుచున్నావు కదా! "ఇది నావస్త్రము" అని చెప్పునప్పుడు వస్త్రము నీవు ఎట్లు అగుట లేదో అట్లే "ఇది నాదేహము" అని చెప్పుచున్నావు కావున ఈదేహము నీవుకాదు. నీవు దేహము కానప్పుడు ఇంకొక దేహముతో నీకేమి సంబంధము? మీయన్నంధరించిన వస్త్రములతో నీకు ఎట్లుసంబంధము లేదో ఆయన ధరించిన శరీరముతో కూడ నీకు సంబంధము లేదు. వస్త్రమునకు శరీరమునకు పెద్ద తేడా ఏమున్నది. వస్త్రము అల్పకాలములో జీర్ణమై నశించుచుండఁగా శరీరము మఱి కొంతకాలములకు జీర్ణమై నశించుచున్నది. "నాశరీరము నాయింద్రి యములు నాప్రాణము నామనస్సు" అని చెప్పుచున్నావు కదా! ఇవి యేవియు నీవు కావనుట స్పష్టము. ఇంక నీస్వరూపము ఏమో చెప్పుము.

అప్పుడు మహాసేనుఁడు మూహుర్త కాలము ఆలోచించి ముని కుమారుఁడు అడిగినప్రశ్నకు సమాధానము దొరకక మిగుల దీనుఁడై ఇట్లనెను. "భగవానుఁడా! ఎన్నివిధముల ఆలోచించినను నే నేవఁడనో నాకు తెలియుట లేదు. ఆకలిదప్పికలవలన బాధపడుచున్నట్లే దుఃఖము పొర్లిపొర్లి వచ్చుచుండఁగా విలపించుచున్నాను. ఆకలిదప్పికలకు కారణ మెట్లు కన్పించుట లేదో ఈ దుఃఖమునకు కారణము తెలియుట లేదు. దుఃఖింపకుండ ఉండలేకపోవుటచే దుఃఖించుచున్నాను. నేను దీనుఁడనై నిన్ను శరణు పొందుచున్నాను. ఇది ఏమో చెప్పుము. ఎల్లరును ఎవఁడేని ఒకబంధువు చనిపోయినంతనే దుఃఖించుచున్నారు; కాని యితరులు పోయినచో దుఃఖింపరు. తమ స్వరూపమును గూర్చియు ఎవరును తెలిసికొనుట లేదు. ఇట్లేల జరుగుచున్నది? శిష్యుఁడనైన నాకు ఇది స్పష్టముగా బోధపడునట్లు చెప్పుము."

అప్పుడు ఆమునికుమారుఁడిట్లనెను. "రాజా! వినుము. మాయారూపిణియైన మహాదేవిచేత జను లందఱును మోహితులై తమస్వరూపమును తెలిసికొనక వ్యర్థముగా నిరంతరము శోకించుచున్నారు. ఎంతవఱకు తమస్వరూపము తెలిసికొనరో అంతవఱకే ఈదుఃఖము ఉండును. స్వరూపమును తెలిసికొన్నచో ఎవఁడును ఎక్కడను దుఃఖింపఁడు. నిద్రచేత మోహితుఁడై నవాఁడు దానిచేత కలలో ప్రదర్శింపఁబడుచున్న దొంగలు మొదలగువారిని చూచి భయపడి దుఃఖించుచున్నాఁడు. జాగ్రదవస్థలో కూడ ఇంద్రజాలకునిమంత్రముచేత బయలుదేరిన మాయచేత మోహితుఁడైనవాఁడు దానిచేత కల్పింపఁబడుచున్న పాములు మొదలగువానిని జూచి భయపడి వణఁకి పోవుచున్నాఁడు. అట్లే ఆమహాదేవియొక్క మహామాయచేత మోహితుఁడైనవాఁడు తనస్వరూపము నెఱుంగక శోకించుచున్నాఁడు. స్వప్నములోనుండి మేల్కొన్నవాఁడు, ఇంకను స్వప్నములోనే యుండి కేకలుపెట్టుచున్నవారికి చూచి నవ్వుకొనుచున్నాఁడు. ఇంద్రజాలము నెఱింగినవాఁడు కూడ తాను కలఁత నొందక, కలఁతనొందుచున్న యితరులను చూచి పరిహాసించుచున్నాఁడు. అట్లే ఆదేవియొక్క మాయనుండి ముక్తులైనవారు ఎప్పుడను ఏసందర్భముననను దుఃఖము నొందక, దుఃఖించుచున్న యితరులను చూచి పరిహసించుచుందురు, కావున నీవు కూడ చక్కఁగా విమర్శించి తత్త్వమును తెలిసికొని మాయను దాటి దానివలన కలుగుచున్న శోకమున వీడుము."

మహాసేనుఁడది విని అతనితో నిట్లనెను. "అయ్యా! నీవు చెప్పిన దృష్టాంతము సరిగా లేదు. స్వప్నమునందుఁగాని ఇంద్రజాలమునందుఁగాని వస్తువులుండవు అవి లేకపోయినను ఉన్నట్లే అప్పుడు భాసించుచుండును. మఱి

యీజాగ్రత్ప్రపంచమున సకల పదార్థముల ద్రవ్యముతో రూపొంది మనకు ఉపయోగపడుచు ఫలము లను కలిగించుచున్నవి. కావున యదార్థమైన యీప్రపంచము కలతోఎట్లు సమానమగును?"

మునికుమారుఁడు మరల నిట్లు చెప్పెను. "దృష్టాంతము సరిగా లేదనుచున్నావు. ఇది నీకు మఱియొక భ్రాంతి. స్వప్నములో కన్పించుచున్న వృక్షము, స్వప్నము జరుగుచున్న సమయమున, బాట సారులకు నీడ యిచ్చుట లేదా? పండ్ల నిచ్చుటలేదా? అది అప్పటికి యథార్థముగనే కన్పించుచున్నది. "మేల్కొన్నంతనే ఆస్వప్నప్రపంచ మంతయు అసత్య మగుచున్నది కదా" అని యందువేని ఈజగ్రత్ప్రపంచము కూడ నిద్రలో లేకుండపోవుచున్నది. "నిద్రలో లేకుండ పోయినను నిన్న కన్పించినప్రపంచమే ఈదినము కూడ అట్లే కన్పించుచున్నది. కావున ఇది స్వప్నమువలె అసత్యము కాదు" అని యందువేని ఆమాట నిలువదు నిన్నటివారు కొందఱు ఇప్పటికి మరణించియుందురు. క్రొత్తగా ఈనాడు కొందఱు పుట్టుచున్నారు. అదియునుగాక ప్రతిపదార్థమునందు ప్రతిక్షణము మార్పు సంభవించు చుండుఁగా నిన్నఁటిప్రపంచమే నేఁడును ఉన్న దనుట ఎట్లుసంగతమగును? కొండలకు అచలము లనిపేరు. అవి యదార్థముగా మార్పును పొందకుండ నున్నవా? అనుక్షణము అవి అడవియేనుఁగులచేత వరాహములచేత సెలయేళ్ళచేత తరిగిపోవుచు మార్పు నొందుచునేయున్నవి. స్థిరములని మనము అనుకొనుచున్న పర్వతములు సముద్రములు మొదలగునవి యన్నియు అనుక్షణము మార్పునొందుచునే యున్నవి. "నిన్నటి ప్రపంచమే నూటికి నూఱుపాళ్ళు నేఁడు లేకపోయినను నిన్నఁటిదానికి నేఁటిదానికి సామ్య మున్నది గదా" అనియందువేని అట్టిసామ్యము నిన్నఁటి స్వప్నప్రపంచమునకు మొన్నఁటి దానికి కూడ ఉన్నది. కావున స్వప్న మెట్టిదో జాగ్రత్పపంచము కూడ అట్టిదే. "స్వప్నమునుండి మేల్కొన్నవానికి ఆస్వప్నప్రపంచము జాగ్రద్దశలో కన్పించుట లేదు. కాని జగ్రత్ప్రపంచము అట్లు మాయము కాకుండ ఎప్పుడును కల్పించుచునే యున్నది. కావున జగ్రత్తె స్వప్నము సమానము కాదు" అని యందువేని ఆమాటయు నిలువదు. నిద్రలో ఈజాగ్రత్ప్రపంచము ఎవనికిని కన్పించుట లేదు. నిద్రలో జాగ్రత్ప్రపంచము కూడ మాయమగుచుటనే యున్నది. కావున ఇది స్వప్నముతో సమానము. "అయ్యా! అట్లుకాదు. స్వప్నము నుండి మేల్కొన్న ప్రతివాఁడును స్వప్నము యథార్థముగ జరుగలేదు అని రూఢిగ తెలిసికొనుచున్నాఁడు. కాని యీజాగ్రత్ప్రపంచము అసత్యమని ఎవ్వఁడును ఎప్పుడును అనుకొనుట లేదు. కావున ఈ రెండును సమాన మనుట సరి కాదు" అని యందువేని అదియును ఆలోచించినచో నిలువదు. నీవంటిభ్రాంతులకు ఈజగత్తు అసత్యముగా తోఁచదు. స్వప్నమును చూచునున్నంతసేపు అది అసత్యమని తోఁచదు. కాని అంతకన్నను కొంచెము స్థిరముగానున్న యీజగత్తును చూచుచున్నప్పుడు స్వప్నము అసత్యముగానే తోఁచుచున్నది. అట్లే ఈజగత్తునకు అతీతమైన దీనికి ఆధారమై ఎప్పుడును ఎట్టిమార్పును పొందక ఏకరూపమున భాసించుచున్న యాత్మతత్త్వమును ఎవఁడు చూచుచున్నాఁడో వాని కీజగత్తు అసత్యముగానే తోఁచును.

కావున స్వప్నమువలె జాగ్రత్తుకూడ అసత్యమే. స్వప్నము స్వల్పకాలము భాసించుచుండఁగా జాగ్రత్ప్రపంచము మఱికొంతకాలము దీర్ఘముగా భాసించుచున్నది. అంతే భేదము. పదార్థములు కూడ జాగ్రత్తులో ఎట్లుయథార్థములుగా తోఁచుచు సుఖదుఃఖములను కలిగించుచున్నవో అట్లే స్వప్నములోకూడ యథార్థములుగానే తోఁచుచు సుఖదుఃఖములను కలిగించుచున్నవి. పండును ఇచ్చినచో సంతోషము, కొట్టినచో దుఃఖము జాగ్రత్తులో ఎట్లు కలుగుచున్నవో స్వప్నములో కూడ అట్లే కలుగుచున్నవి. అంతే కాదు. జాగ్రద్దశలో స్వప్నమును ఎట్లు స్మరించుచున్నామో అట్లే స్వప్నములో కూడ జాగ్రత్ప్రంచమును స్మరించుచునే యున్నాము. ఈప్రపంచములోని వ్యక్తులును సన్నివేశములే కదా స్వప్నమునందును కన్పించుచుండును. కావున స్వప్నమునకు జాగ్రత్తునకు వాస్తవముగా భేదము లేదు. స్వప్నము లోని బంధువులనుగూర్చి ఎట్లు దుఃఖింపనక్కఱలేదో అట్లే జాగ్రత్ప్రపంచములోన బంధువులనుగూర్చి కూడ దుఃఖింప నక్కఱలేదు.

ఇంత అనుకొన్నను ఈజగత్తు ఇంకను సత్యముగా కన్పించు చుండుట నిజమే. ఇది సత్యము అని దృఢముగాభావించుచుండుట మాత్రమే ఇందులకు కారణము. జగత్తు అసత్యము అని దృఢముగా భావించుచున్నచో ఇది అసత్యమన్నభావమే అచంచలముగా నిలుచును. నీభావన స్థిరముగా లేదు. ఇది యసత్యము కాదేమో అనుసందేహము నీకు ఇంకను కలదు. అపనమ్మకము లేకున్నచో భావన స్థిరమైమనము దేనిని గూర్చి ఎట్లు భావించుచున్నామో అది యావస్తువుగా అట్లే గోచరించును. ఇందులకు నిదర్శనము ఈగండశైలములో నేను నీకు చూపినలోకమే. ఈ గండశైలమును చుట్టును దిరిగి చూచి వత్తుము రమ్ము.?

పిదప మునికుమారుఁడు మహాసేనుని చేయిపట్టుకొని శైలము చుట్టును త్రిప్పి తీసికొనివచ్చి యిట్లు చెప్పెను. "రాజా! చూచితిని కదా! ఈశైలము అర్థక్రోశమాత్రమే (ఒకమైలు) యున్నది. కాని దీనియొక్క లోపలిభాగమున విశాలమైనలోకమును స్పష్టముగా చూచియున్నావు. మఱి ఇది జాగ్రద్దశయా స్వప్నమా సత్యమా మిథ్యయా? శైలలోకమునందు ఒకదినముగానైన కాలము ఇక్కడ నూటఇరువది కోట్లసంవత్సరములైనది. వీనిలో ఏది సత్యమో ఏది యసత్యమో విమర్శింపుము. రెండు స్వప్నములను చూచినతరువాత ఒక స్వప్నమునుబట్టి రెండవస్వప్నముయొక్క సత్యత్వమునుగాని అసత్యత్వమును గాని ఎట్లు నిశ్చయించుటకు వీలు లేదో అట్లే ఈ రెండింటియందును శైలలోకమునుబట్టి ఈజగత్తుయొక్క సత్యత్వమునుగాని అసత్యత్వమును గాని, ఈ జగత్తునుబట్టి ఆలోకముయొక్క సత్యత్వముగాని అసత్యత్వమునుగాని నిశ్చయించుటకు వీలు లేదు. కావున ఈజగత్తు నకు భావనమాత్రమే సారమని యెఱుంగుము. నాసంకల్పమాత్రము ననే ఆశైలలోకము భాసించినది. నేను దానినిగూర్చి భావించుట మానుకొన్నచో అది క్షణమాత్రములో విలయము నొందును. బ్రహ్మ దేవుని సంకల్ప మాత్రమైన యీజగత్తు అట్టిదే. ఆయన దీనినిగూర్చి భావించుట మానుకొన్నచో క్షణములోలయము నొందును. కావున ఈజగత్తును స్వప్నసమానముగా గ్రహించి శోకమున వీడుము. స్వప్నప్రపంచములు ఎన్ని జరిగినను వానికి ఆధారమైన నీజ్ఞానస్వరూప మునందు మార్పు కలుగుట లేదు. అట్లే అద్దమునందు ప్రతింబింబమువలె ఈ జగత్ప్రపంచదృశ్యములు వచ్చుచు పోవుచు నున్నను వానికి అద్దమువలె నున్న చేతన్యరూపమైన నీయాత్మ ఎప్పుడును పరిశుద్ధముగనే యున్నది. అట్టి స్వరూపమునువ శీఘ్రముగా తెలిసికొని పరమానందమును పొందుము."

ఇది జ్ఞానఖండమునందు మహాసేనుని నిర్వేదము మన్నది త్రయో దశాధ్యాయము.

# పదునాల్గవధ్యాయము- భావనాసిద్ధి

మునికుమారుఁడుచెప్పిన దంతయు మహాసేనుఁడు మంచి బుద్ధితో విచారించి జగత్తుయొక్క స్థితి స్వప్నస్థితివంటిదే అని తెలిసికొని వెంటనే శోకమును వీడెను. ధైర్యము నవలంబించి యతఁడు శోకరహితుఁడై మరల మునికుమారుని ఇట్ల ప్రశ్నించెను. "మహాభాగా! నీకు తెలియనిది ఏదియుకొంచెను కూడ లేదని తలంచుచున్నాను. కావున నేను అడుగుచున్నదానిని దయతో చెప్పుము. ఇది యంతయు భావనవలననే కలుగుచున్నది. చెప్పుచున్నావు. అది ఎట్లు కుదురును? నేను నామనస్సులో దేనినిగూర్చి ఎంతగా భావించి ననుఅది వెలుపల వస్తువుగా రూపొందుట లేదు. మఱి నీవు భావనయొక్క సిద్ధచేత శైలమునందు పెద్దలోకమును కల్పించితివి. అదియును గాక దేశము కాలము ఒక్కసమయమునందే శైలలోకములో ఒకవిధముగా ఈజగత్తులో ఇంకొకవిధముగ ఎట్లున్నవి? వీనిలో సత్యమైన వేవి, అసత్యమైన వేవి;

మునికుమారుఁడిట్లు చెప్పెను. "ఇది యిట్టిది అని అనుకొనుటయే భావన. అది సిద్ధము ఆసిద్ధము అని రెండువిధములు. ఇది అట్టిది కాదు అనుతలంపు వికల్పము. వికల్పములేని భావన సిద్ధమగును. వికల్పము కలిగినచో భావన అసిద్ధమగును. బ్రహ్మ యొక్క సిద్ధభావనచేత ఈజగత్తు పుట్టినది. ఆయనయొక్క భావన అత్యంతదృఢ మగుటచేత ఈ జగత్తు అందఱకును సత్యముగానే తోఁచుచున్నది. ఈబ్రహ్మసృష్టియందున్న సత్యత్వబుద్ధి మన భావనలయందు మనకు లేదు. "ఇది నాభావనయే కాని, సత్యము కాదు. బహ్మ సృష్టియే సత్యము" అని తలంచుచున్నాము. ఈవికల్పముచేత మన భావనకు సిద్ధి కలుగుటలేదు. లోకమునందు భావనయొక్క సిద్ధి అనేకవిధముల ఏర్పడుచున్నది. జన్మము మణులు ఔషధము తపస్సు మంత్రసిద్ధి దేవత లిచ్చువరము మొదలగువానిచేత భావనయొక్క సిద్ధి పెక్కువిధముల రూపొందుచున్నది. బ్రహ్మదేవునకు జన్మచేత, యక్షులకు రాక్షసులకు మణులచేత, దేవతలకు ఓషధీరూపమైన యమృతముచేత, యోగులకు యోగముచేత, తాపసులకు తపస్సుచేత, జపపరాయణులకు మంత్రసిద్ధిచేత, విశ్వకర్మ మొదలగువారికి వరమువలనను భావనకు సిద్ధి కలుగుచున్నది. అట్టిసిద్ధి కలుగవలయు నన్నచో, "ఈకార్యమునకు నేను ఇట్లు సంకల్ప మొనర్చితిని"

అన్నవిషయమును మఱచిపోవలయును. అప్పుడే భావన స్థిరమగును. అట్లు గాక "నేను ఈకార్యమును సంకల్పించితిని" అని మనస్సునకు తోఁచుచున్నచో, ఆకార్యము అంతకు పూర్వము లేకుండుట అప్పుడు క్రొత్తగా ఆరంభమగుట తోఁచును. అప్పుడు ఆకార్యము అసత్య మనియు తోఁచును. ఇది వికల్పమైన భావనను భంగపఱచును. అప్పుడు భావనకు సిద్ధ కలుగదు. నాటకమునందు పాత్రధారిని చూచునప్పుడు "వీఁడు హరిశ్చంద్రుఁడే" అన్న బావన దృఢముగ నున్నంతవఱకే ప్రేక్షకునకు రససిద్ధికలుగుచుండును ఏకారణముచేత నైనను "వీఁడు హరిశ్చంద్రుఁడు కాఁడు. మనవీధిలోనున్న వెంకయ్య కదా వీఁడు; ఈవేషము వేసినాఁడు" అని తోఁచినచో ప్రేక్షకునకు రససిద్ధి కలుగదు. అట్లే భావనయందును క్రొత్త విషయముగా సంకల్పించినతరువాత దానికి పూర్వమందున్న స్థితిని పూర్తిగా విస్మరించి ఆవిషయమునే నిరంతరము భావించుచుండవలె. ఇట్లు చిరకాలము అభ్యసించినచో పూరక్వస్థితి జ్ఞప్తికి రాకుండు బావన స్థిర మగును. ఈయభ్యాసముయొక్క ఆరంభమునందు పూర్వస్థితివి విస్మరీంచుటకై పూనిక చేయవలసియో యుండును. కాని అభ్యాసము కొనసాగుకొలఁది అప్రయత్నముగనే పూర్వవిస్మృతి కలిగి భావనయందు నిమగ్నమగుట సభవించును. ఇట్లు అభ్యాసబలమున భావనను మొదలుపెట్టినంతనే పూర్వస్మృతి కొంచెము కూడ లేకుండ, ఆభావనను నిర్వికల్పముగా కొనసాగింపఁగల సామర్థ్య మేర్పడును. అప్పుడు ఆభావన సిద్ధమై మహాఫలమును సాధింపఁగలుగును. మఱి నీకు పూర్వస్మృతులు బలముగా నున్నవి. అవి మాటిమాటికి నీభావనకు వికల్పములను కలిగించుచు భంగపఱచుచున్నవి. అందువలన నీ భావము సిద్ధమగుట లేదు. నీవు కూడ సృష్టిని చేయఁగోరుచున్నచో భావనను శీఘ్రముగా సాధింపుము.

ఇంక నీవు అడిగిన దేశకాలముయొక్క ద్వైవిధ్యమునుగూర్చి (Dual nature of time and space) వినుము. ఏకకాలమునందే ఈలోకములో అర్థక్రోశమాత్రముగనున్న కొండలో అనంతమైన దేశము. ఆకొండలోపలి లోకములో ఒక దినము కాఁగా ఈలోకములో నూటిరువదికోట్లసంవత్సరము కాలము ఎట్లు సంభవించిన వని నీవు ఆశ్చర్యపడుచున్నావు. లోకవ్యవహారమును నీవు చక్కఁగా పరిశీలించి విమర్శింపలేదు. అందువలన నీకది అద్భుతముగానున్నది. జగత్తులో ఒక్కవిషయమే అనేక విధములుగా భాసించుచుండుట సహజముగా నున్నది. సూర్యునికాంతి మనకు వెలుఁగు నిచ్చుచుఁడఁగా గ్రుడ్లగూబలకు చీఁకటి యగుచున్నది. నీటిలో మునిఁగినప్పుడు మానవులకు పశువులకు ఆనీరు శ్వాసకు ప్రతిపంధక మగుచున్నది. ఆనీరే చేపలయొక్క శ్వాసకు ఆటంకమగుట లేదు. మన కందఱకు గాలి పీల్చుకొనుటకు హాయిగానుండు తీరప్రదేశమున అవిగాలి పీల్చుకొనలేవు. అగ్ని అన్నింటిని దహించును. కాని అత్తిరిపక్షులు అగ్ని కణములను భక్షించును, నీటిచేత నిప్పు నశించును. కాని బడబాగ్ని సముద్రమధ్యమున జ్వలించుచున్నది. ఇట్లు జగత్తుల విషయము లన్నియు ద్వైరూప్యముతో (Duality) నున్నవి.

ఇంతవఱకును ఇంద్రియములు చక్కఁగా పనిచేయుచు సమానములైన యనుభవములను పొందుచున్న మనుష్యులు పశువులు పక్షులు మొదలగుప్రాణులలో కన్పించుచన్న ద్వైవిధ్యము (Duality) మాత్రమే గమనించితిమి. ఇంక ఒక్కొక్కఇంద్రియము ఒక్కొక్క లోపముతో పనిచేయుచుండు ప్రాణులయందు ఒకవిషయమునే విరుద్ధభావములు వందలకొలఁదిగా వేలకొలథిగా నున్నవి. దృష్టాంతమును చెప్పెదను శ్రద్ధాగా వినుము. మనకు కన్పించుచున్న పదార్థము లన్నియు మన చక్షురింద్రియమువలన మనమనస్సులో రూపొందుచున్నవే. మనమనస్సుల ఏర్పడుచున్న రూపములకన్న అన్యముగా మనకు ఏదియ వెలుపల లేదు. అందువలన ఆ చక్షురింద్రియమునందు ఏవికారముండునో ఆవికారమునుబట్టియే పదార్థములు కూడ వమనస్సునందు రూపొందుచుండును, పైత్యప్రకోపము కలిగిన వానికి ప్రతి వస్తువు పచ్చగా కన్పించుచుండును. తిమిరదోషము కలవాడు ఒక్కదానిని రెండుగా చూచును. ఇట్లు విచిత్రములైన కంటిదోషములు కలవారు జగత్తును వివిధప్రకారములుగా చూచుచందురు తూర్పుసముద్రమధ్యమున కారండకమను ద్వీపముకలదు. అందలి జనులకు ఎల్లప్పుడు ప్రతివస్తువు ఎఱ్ఱగా కన్పించుచుండును. అట్లే రమణకద్వీపమున జనులకు ప్రతివస్తువు తలక్రిందులుగా కన్పించును. ఇతరద్వీపములందును ఇట్లే విశేషములు కలవు. ఎల్లయెడలను జనులు తమనేత్రములయొక్క స్వభావము ననుసరించి వస్తువులను చూచుచుందురు. ఎప్పుడైనను ఒకానొకఁడు తనద్వీపములోనివారి కన్న భిన్నముగా చూచుట తటస్థించినచో వెంటనే వానికి ఔషధములతో చికిత్స చేసి వెనుకటివలె అందఱితోఁబాటు సమానముగా చూడఁగల్గునట్లు చేయుదురు కావున ఎవఁడు తనదృష్టిచేత ఏపదార్థములను ఎంతవఱకు ఏరూపములతో గ్రహించుచున్నాఁడో అదియే వాని దృశ్య ప్రపంచమగుచున్నది. (His visible world). ఇట్లే తక్కిన యింద్రియముల విషయమున కూడ ఆయింద్రియముల విశేషములను బట్టి ఒక ప్రపంచమే భిన్నజనులచేత భిన్నభిన్నముగా

గ్రహింపఁబడుచున్నది. కొందఱకు వినిపించుధ్వనులు మఱికొందఱకు వినఁబడవు. నేలపై అడుగులగుర్తులను వాసనచూచి కుక్కలు దొంగలను గుర్తింపఁగలవు మనుష్యులకు అట్టిశక్తి లేదు. ఇట్లే కేవలము మానసికములైన భావనలు (Imaginations) ఆలోచనలు (Thoughts) మొదలగునవి కూడ ఆయావ్యక్తులయొక్క సంస్కారవిశేషములనుబట్టి (Differences in out look and culture) భిన్నభిన్నముగనే యుండును.

దేశమునందు కాలమునందు మనము భావించుచున్నక్రమము కూడ ఇట్టిదే. "ఇది ముందు అది వెనుక" అని అనుకొటయే క్రమము. సూర్యుఁడుదయించుచున్న దేశమును ముందు తూర్పు అనుకొన్నచో దాని కెదురుగా తరువాత కన్పించుదేశము పడమర యగును. లేదా ముందుగా దక్షిణమును గుర్తించినచో దానికెదురుగా తరువాత కన్పించునది ఉత్తరమగును. కాశీక్షేత్రము ప్రయాగలో నున్నవారికి తూర్పున నుండఁగా దాక్షిణాత్యులకు ఉత్తర మగుచున్నది. ఇట్లే కాలమునందు కూడ ముందు ఒకపని జరిగినప్పుడు అది భూతకాలమని, తరువాత ఇప్పుడ జరుగుచున్న పనిని వర్తమానకాల మని, జరుగఁబోవు క్రియను భవిష్యత్కాల మని చెప్పుచున్నాము. ఈదేశక్రమము గాని కాలక్రమము గానిఇంద్రియములవలన మన మనస్సులలో కలుగుచున్నభావములను అనుసరించే గ్రహించుచున్నాము. మనప్రపంచము మనభావములందే యున్నది కాని కొంచెము కూడ వెలుపల లేదు. అంతకు మించి ఇతరుల ఏదేని గ్రహించుచున్నచో అది వారిప్రపంచమున వారికి ఉండును గాని మనప్రపంచమున మనకు ఉండదు. మనము దేనిని గ్రహించుచున్నామో అదియే మనప్రపంచము. ఎవనికి ఏది తెలియదే వానికి అది యుండదు. కావున దేశముయొక్క కాలముయొక్క దీర్ఘత్వము (Length) అల్పత్వము (Shortness) మన యింద్రియముల జ్ఞానముపైననే ఆధారపడియుండును. అందువలన ఒక్కదేశము ఒక్కకాలము రెండువిధములుగ తోఁచుట అసంభవము కాదు. నీవు శైలలోకములో దేశమును చూచునపుడు దానికి అంతము (End) నీకు కన్పించలేదు. అందువలన నీకు అది అనంతముగా కన్పించినది. కొండను చుట్టివచ్చినప్పుడు అదియే నీకు అర్ధక్రోశముగా కన్పించినది. అందువలన నీకు అది అల్పప్రదేశముగా తోఁచినది. అట్లే శైలలోకములో చాలకొలఁదిగా సంఘటనములను (Events) చూచితివి. అందువలన అది అల్పకాలముగా తోఁచినది. వెలుపలికి వచ్చినతరువాత ఇక్కడ వేలకొలఁది తరములలో సంభవించిన సంఘటనములను పరిణామములను చూచితివి అందువలన అది దీర్ఘకాలముగా తోఁచినది. కావున దేశకాలములు భావనామాత్రములు.

ఇంక మనకు వెలుపల వస్తువుగా (Objective reality) బహిఃప్రపంచ మున్న దనుమాటనుగూర్చి వినుము. గోడమీఁద బొమ్మలను చిత్రించినప్పుడు ఆచిత్రములకు ఆధారముగా గోడ యున్నది. అట్లే జగత్తు అనుచిత్రమునకు కూడ ఆధారమైన పదార్థము ఒకటి యుండవలె. అనఁగా గ్రహించుచున్న మనము కాక మనచేత గ్రహింపబడుచున్న బహిఃప్రపంచము వేఱుగా నుండవలె నిజమే. రెండు పదార్థములు లున్నప్పుడు వానిలో ఒకదానియొక్క స్వరూపమైన విస్తృతిని (Magnitude) గ్రహించునప్పుడు మొదటిదానిని అవధిగా (Demarcation) చేసి రెండవదానియొక్క స్వరూపమును గ్రహింతుము. ఈ యవధినే అపాదాన మనియు చెప్పుదురు. హిమాలయమునుండి గంగ పుట్టినది. గంగయొక్క స్వరూపవిస్తృతిని హిమాలయమును అవధిగా చేసికొని అక్కడనుండి గ్రహింపవలసియున్నది. అప్పుడు హిమాలయము గంగకు అపాదాన మగును. ఆవిధముగా నీవు బహిఃప్రపంచము అని చెప్పుచున్నదానికి ఏది అపాదానము? దేనిని అవధిగా చేసికొని దానిని గ్రహింపవలె? "నాశరీరమే అవధి. దానికి వెలుపల నాకు గోచరించుచున్న దంతయు బహిఃప్రపంచము" అని నీవనవచ్చును. కాని నీపైనున్న వస్త్రములు నీకు ఎట్లు గోచరించుచున్నవో అట్లే నీశరీరము కూడ నీకు గోచరించుచున్నది. కాఁబట్టి శరీరము కూడ నీకు గోచరించుచున్న బహిఃప్రపంచములో భాగమగునే కాని దానికి అవధి కాఁజాలదు.

"అయ్యా! అట్లయినచో శరీరమును బహిఃప్రపంచమును భాసింపఁజేయుచున్నది నాయాత్మ. అది యవధిగా దానిచేత భాసింపఁజేయఁపబడుచున్న శరీరముతో కూడ ఈప్రపంచ మంతయు వెలుపల నున్నది" అని నీ వనవచ్చును. కాని భాసకమునకు (Illuminater) వెలుపల దానిచేత భాసింపఁజేయబడుచున్న భాస్యము (That which is illuminated) ఉండు నని చెప్పుటకు వీలు లేదే! దీపముయొక్క కాంతి సూర్యుని వెలుఁగు పదార్థములను ప్రకాశింపఁజేయుచున్నవి కాంతి, వెలుఁగు భాసకములు; పదార్థములను భాస్యములు. పదార్థములు దీపపుకాంతిలోపల సూర్యుని వెలుఁగులోపల ఉన్నప్పుడే ప్రకాశించుచు భాస్యము లగును. లేకున్నచో అవి వానికి భాస్యములు కావు; ప్రకాశింపవు. కాఁబట్టి భాస్యము భాసకమునకు వెలుపల నుండునని చెప్పుటకు వీలు లేదు. కావున ఆత్మచైతన్యముచేత

భాసింపఁజేయఁబడుచున్న శరీరము ప్రపంచము ఆచైతన్యములోపల నున్నవని చెప్పవలయునే కాని దానికి వెలుపల నున్న వని చెప్పుటకు వీలు లేదు. కిరణములు వానివలన కలుగుచున్న ప్రకాశనము సూర్యునికన్న భిన్నములు కావు. అనఁగా భానము భాసకముకన్న భిన్నము కాదు. (Illumination is not different from the illuminater) భాసకస్వరూపమే భానము (Illumination is the nature of illuminater). చైతన్యము ప్రకాశరూపమై పూర్ణమై యున్నది. దానిచేత దేశకాలములు వ్యాప్తములై యున్నవి (Time and spce are pervaded by it). అది ఆవిధముగ అంతటను వ్యాపించియుండుటచేతనే అది పూర్ణమై యున్నది. సూర్యకిరణములకు లోపల ఉండనివస్తువు ఎట్లుప్రకాశింపదో అట్లే చైతన్యమునకు లోపల ఉండనిది ఏదియు ప్రకాశింపదు. అందువలన దేశకాలములు ఆత్మచైతన్యమునకు లోపలనే యున్నవి. కావున ఆత్మ చైతన్యమును అవధిగాఁజేసి దానికి వెలుపల దేశకాలములు ఉన్న వని చెప్పుటకు వీలు లేదు. కాఁబట్టి ఆత్మచైతన్యమునకు వెలుపల బహిఃప్రపంచ మున్నది ఏదియు లేదు. లోపల వెలుపల అని నీవు ఏది చెప్పినను అది యంతయు, అద్దములో ప్రతిబింబ మున్నట్లు, ఆత్మ చైతన్యమునందే యున్నది.

ఈవిధముగ ఆత్మయొక్కటియే సర్వప్రపంచమును తనయందే ప్రతిబింబింపఁజేయుచు స్వతంత్రముగా సర్వాద ప్రకాశించుచున్నది. ఈ యాత్మయే పరాచితి త్రిపురాపరమేశ్వరి బ్రహ్మము విష్ణువు శివుఁడు శక్తి అని యనేకులచేత అనేకవిధములుగా పేర్కొనఁబడుచున్నది. ఆత్మకు చైతన్యమే స్వరూపము. అదియే ముఖ్యము. దానినిగూర్చి నామరూపములతో త్రిపురామహేశ్వరి విష్ణువు శివుఁడు అన వర్ణించుట యంతయు అల్ప మని (Unimportant) ఎఱుంగుము. ఆచైతన్యమును భాసక మని చెప్పుట కూడ సహజమైన వర్ణనము కాదు. ప్రపంచము మనకు గోచరించుచున్నది. కాబట్టి, అది యట్లు ఆచైతన్యమువలన భాసించుచున్నది కాఁబట్టి, ఆచైతన్యమును భాసక మని మనము చెప్పుచున్నాము. అంతే కాని దానికి స్వతసిద్ధముగా భాసకత్వమను లక్షణము లేదు. అది కేవలము చైతన్యమాత్రమే.

ప్రతిబింబము అద్దమునందు ఎట్లు ఇమిడియుండునో అట్లే భాసకమైన చైతన్యమునందు భాస్యమైనజగత్తు (Illuminated world) ఇమిడియున్నది. ప్రతిబింబము అద్దమును ఎట్లు అతిక్రమించియుండదో అట్లే జగత్తు కూడ ఆత్మచైతన్యమును అతిక్రమించి యుండదు. నిండుగా గట్టిగా ఏకరూపముగా ఉన్నయద్దమునందు దానికి భిన్నముగా వేఱొకపదార్థముగా (Another reality) ఒక నగరము ఉండుట ఎట్లు అసంభవమో అట్లే పరిపూర్ణము చైతన్యఘనము ఏకరూపమును అయిన యాత్మయందు దానికి భిన్నముగా వేఱొకవస్తువుగా జగత్తు ఉండుట అసంభవము. ఎన్నివిధములైన ప్రతిబింబములు వచ్చుచు పోవుచునున్నను అద్దము ఏ వికారమును పొందక ఒక్కరూపముతోనే పరిశుద్ధముగా ఎట్లు వుండునో అట్లే చిత్రవిచిత్రములైనజగత్ప్రతిబింబములు ఎన్ని వచ్చుచు పోవుచునున్నను, సృష్టియందు ప్రళయమునందును, ఆత్మచైతన్యము కూడ ఏవికారమున పొందక ఏకరూపముగ పరిశుద్ధముగా నున్నది. కాని ఆత్మ కేవలము అద్దమువంటిది కాదు. అద్దము అచేతనము. ఆత్మ చైతన్యఘనము (Absolute intelligence) స్వతంత్రము (Independent). ఎదుట వస్తు వున్నప్పుడే అద్దమునందు ప్రతింబింబము కన్పించును. ఆత్మయందు ప్రతింబింబము కన్పించుటకు దానికి ఎదురుగా వేఱొక వస్తువు ఉండ నక్కఱలేదు. అది తన స్వాతంత్ర్యముయొక్క మహిమవలన రెండవస్తువే లేకుంఁడ తనయందే చరాచరమైన జగత్తును భాసింపఁజేయుచున్నది. కుండరూపొందుటకు కుమ్మరివాడు, వానిదండము నిమిత్త కారణములు. మట్టి దానికి ఉపాదానకారణము. ఈకారణములు ఏవియు లేకుండఁగనే ఆత్మ తనయందే జగత్తును భాసింపఁజేయుచున్నది. ఆయ్యా! ఇది యెట్లు సంభవ మని సందేహింపకుము. నీ మనః ప్రపంచమునే పురిశీలింపుము. నీసంకల్పమాత్రముచేతనే కదా నీమనస్సునందుఒక ప్రపంచము భాసించున్నది. అద్దమునకు ఎదురుగా వస్తువువలె నీ మనస్సునందు వేఱొకవస్తువు వేమున్నది? ఆప్రపంచ మంతయు నీమనస్సేతప్ప మఱియొకటికాదు "మనస్సునందు పూర్వసంస్కారము లున్నవి. వానియొక్క ప్రతిబింబములు మనస్సునందు రూపొందుఅని నీ వనవచ్చును. కాని మట్టి తనయంతట తాను మట్టిగానే యుండును గాని కుండ కాఁజాలదు. అద్దమునకు ఎదురుగా మట్టి యున్నప్పడు మట్టి తప్ప కుండ ఎట్లు ప్రతిబింబింపదో అట్లే మనస్సు చెంత సంస్కారము లున్నచో నామారూపాత్మకమైన ప్రపంచ మెట్లు ప్రతింబింబించును? కావున ఆత్మయందు జగత్తు భాసించుచుండుటకు అద్దమునకు ఎదురుగా వస్తువు కావలసినట్లు, వేఱొకవస్తువు అక్కఱలేదు.

ఇట్లు ఆత్మయందు బాహ్యపదార్థము ఉన్నట్లు తోఁచుటయే మొదటిసృష్టి. అదియే అవిద్య తమస్సు అని చెప్పఁబడుచున్నది. పూర్ణమైనవస్తువు ఒక్కయంశముగా తోఁచుటయే అవిద్య. మనకు శరీరమునందు "నేను" అనుభావన పూర్ణముగ వ్యాపించి యున్నది. కాని శరీరమునుండి ఏదేని ఒకయంగము ఖండింపఁబడినప్పుడు, ఆ యంగమునందు "నేను" అను భావన ప్రసరించుట లేదు. అట్లే అఖండము పూర్ణమును అయినయాత్మయొక్క ఒకయంశమునందు ఆత్మస్వరూపము తోఁచకుండుట అవిద్య. దీనినే అవ్యక్త మని జడశక్తి అని చెప్పుచున్నారు. తరంగములు లేకుండ నిశ్చలముగానున్న సముద్రమునందు దానియందలిజలమే అనంతములైన భిన్నతరంగము లుగా రూపొందునట్లు, సృష్టియొక్క ఆరంభమునందు ఆఖండము పూర్ణము నిశ్చలము అయిన ఆత్మయందు దానయందలి చైతన్యము నుండియే అనంతములైన చిదంశలు ఉదయించును. అన్నితరంగములలో సమానముగనున్న జలమువలె అన్నిచదంశలయందును సమానముగనున్న చైతన్యమును శివతత్త్వమందరు. చిదంశలుపుట్టుటకు పూర్వమున్న నిశ్చలమైన యాత్మను పరశివతత్త్వ మందురు. ఒక్కొక్క చిదంశలో సామాన్య చైతన్యముగానున్న శివతత్త్వము "నేను" "నేను" అని అనుకొనుట శక్తి యను తత్త్వముగా చెప్పఁబడుచున్నది. అవిద్యయే వెలుపలనున్న వేఱొకవస్తువువలె చిదంశలకు తోఁచుచుండును. అదియే జగత్తు అనుచిత్రమునకు ఆధారము. "నేను?, "నేను" అని అనుకొనుచున్న శివతత్త్వము బహిఃపదార్థముగా తోఁచుచున్నయవిద్యను చూచి "నేనుఇది" అని తలంచినప్పుడు సదాశివతత్త్వ మని చెప్పఁబడుచున్నది. అదియే అవిద్యయే తాను అయినట్లుగా అనుకొనుచు, "ఇది నేను" అని తలంచినప్పుడు ఈశ్వర తత్త్వమగును. అనఁగా చైతన్యము ప్రధానమై అవిద్యను ఆవరించి నప్పుడు సదాశివతత్త్వముగా, అవిద్య ప్రధానమైచైతన్యమును ఆవరించినప్పుడు ఈశ్వరతత్త్వమగును. ఈశ్వరతత్త్వమును చైతన్యము అప్రధానమై అవిద్య ప్రధాన మగును. సదాశివతత్త్వ మునకు ఈశ్వరతత్త్వమునకుగల భేదమును అభేదమును విమర్శించి గ్రహించుశక్తి శుద్ధవిద్యాతత్త్వము. "నేను ఇది", "ఇది నేను" అను రెండు విధములైన భావనలయందును అంతర్గతముగా ఉన్న "నేను" అను చైతన్యమును గుర్తించుచుండుట శుద్ధవిద్య. శివము శక్తి సదాశివము ఈశ్వరము శుద్ధవిద్య అనునీయైదు తత్త్వములందు అవిద్య ప్రబలముగా ముండదు; అనఁగా అది జడరూపమై కార్యముగా పరిణమింపదు. అందువలన అద్వితీయమైన యాత్మచైతన్యము గోచరించుచునే యుండును. ఆకారణముచేత ఈయైదుతత్త్వములను శుద్ధతత్త్వములందరు.

అవిద్యయే జడశక్తి. అదియే భేదశక్తి. శుద్ధతత్త్వములసృష్టికి పిమ్మట జడశక్తి బలమును పొంది ప్రధానమైన చైతన్యము ఆప్రధానమగును. వస్తువును ధర్మిఅని, దాని గుణమును ధర్మము అని చెప్పుదురు. అగ్ని అనువస్తువు ధర్మి. దహించుట అను దాని యొక్క గుణము ధర్మము. వస్తువు ప్రధానము, దానిగుణము అప్రధానము. ఇచ్చట జడశక్తి ధర్మియై చైతన్యము దానికి ధర్మముగా నుండును. శుద్ధతత్త్వము లై దింటియందును చైతన్యము ధర్మియై జడశక్తి ధర్మముగా నుండును. భేదబుద్ధి ప్రబలమై జడశక్తి ధర్మి త్వమును పొంది మాయాతత్త్వమగును. మాయచేత ఆవరింపఁబడిన చైతన్యము సంకుచిత మగును. అప్పుడు కళ, అవిద్య, రాగము, కాలము, నియతి అను నైదుకంచుకములచేత చుట్టఁబడి చైతన్యము పురుషుఁడగును, కొంచెము కర్తృత్త్వము కళ. కొంచెము తెలిసియుండుట అవిద్య. "ఇది నాది యగును గాక" అనుకోరిక రాగము. ఆయుస్సు ననుసరించి దినములు మాసములు వత్సరములు అను పరి గణనమే కాలము. ఈనాలుగింటికి లోఁబడియుండుట నియతి. పరమశివునకు సర్వకర్తృత్వము సర్వజ్ఞత్వము నిత్యతృప్తత్వము నిత్యత్వము స్వాతంత్రము అను నైదు శక్తులు కలవు. అవియే సయేచితములై అయిదు కంచుకము లైనవి. ఈ యైదుకంచుకములచేత చైతన్యము నకు పురుషుఁడను వ్యవహారము ఏర్పడుచున్నది. జనులయొక్క విచిత్రములైన కర్మసంస్కారముల అనాదిగా నున్నవి. సృష్టియొక్క ఆరంభమున ఆసంసారము లన్నియు ఒకపెద్ద ముద్దవలె చైతన్యము లోని జ్ఞానశక్తి ఆశ్రయించి యుండును. ఆసంస్కారములముద్దను ప్రకృతి యందురు, పుణ్యములు పాపములు మిశ్రమములు అని కర్మలు మూఁడువిధములుగా నుండును. అందువలన వానిసంస్కారములు ముద్దయైన ప్రకృతి కూడ సత్యము రజస్సు తపస్సు అను మూఁడురూపములను గలిగియుండును. జీవులకు సంబంధించి ఈ ప్రకృతియే ఒకదశయందు చిత్త మని చెప్పఁబడుచున్నది. ఇది గాఢ నిద్రయందు ప్రకృతి యని జాగ్రత్స్వప్నముల యారంభమునందు చిత్తమని చెప్పఁబడుచున్నది. వాసనలయొక్క ముద్దగానున్న యీప్రకృతియే అవ్యక్త మని చెప్పఁబడుచున్నది. వాసనల సముదాయముతో అనఁగా ప్రకృతితో కూడిన చైతన్యమే చిత్తము. పురుషులయొక్క వాసనలు వివిధములుగా నుండును. దానియొక్క భేదములనుబట్టి పురుషుల చిత్తము భిన్నములుగా నుండును. సుషుప్తియందు వాసనలు అవ్యక్తస్థితిని (Unmanifest state) పొందును. కుండలు మట్టి ముద్దలైనట్లు పురుషులయొక్క భిన్నభిన్నములైన చిత్తము లన్నియు గాఢనిద్రయందు ప్రకృతి యగును. జాగ్రద్దశ గాని

స్వప్నము గాని ఆరంభ మైనంతనే ఆప్రకృతియే చిత్తముగా వ్యవహరించును. చైతన్యముయొక్క ప్రాధాన్యమును ఉద్దేశించినప్పుడు చిత్తమే పురుషుఁడని చెప్పఁబడుచున్నది. ప్రకృతియొక్క ప్రాధాన్యమును ఉద్దేశించినప్పుడు చిత్త మని చెప్పుచున్నారు.

చిత్తమును అంతఃకరణ మందురు. కరణ మనఁగా సాధనము. దేహేంద్రియాదులకు లోపల ఉండి పనిచేయుచుండు సాధనము అంతఃకరణము. ఇది నిర్వహించుపనులయందలి భేదములనుబట్టి అహంకారము బుద్ధి మనస్సు అని మూఁడువిధములుగా పేర్కొనఁబడుచున్నది. దీనియొక్క సత్త్వగుణమునుండి జ్ఞేనేంద్రియములైదు రజోగుణమునుండి కర్మేంద్రియము లైదు, తమోగుణమునుండి శబ్ద స్పర్శరూపరస గంధములు అను సూక్ష్మభూతములు ఐదు కలిగినవి. సూక్ష్మభూతములనుండి ఆకాశము వాయువు అగ్ని జలము పృథివి అను నైదుస్థూలభూతములు పుట్టినవి.

ఈవిధముగా ఆపరమచైతన్యము వెలుపల ఏదో పదార్థమున్నట్లుగా భాసింపఁజేయుచు జగత్తుయొక్క సృష్టి స్థితి లయము అను క్రమమున క్రీడించుచు దాని కంతకును సాక్షిగా నున్నది. అది శక్తియైన త్రిపురాదేవియొక్క భావనచేత హిరణ్యగర్భుఁడు ఉదయించెను. ఆయనయొక్క భావననుండి ఈజగత్తు ఉదయించెను. ఈ జగత్తులో "నీవు", "నేను" అని స్ఫురించుచున్న జ్ఞానము పరమచైతన్యమే. ఎవరిచే ఎన్ని విధములుగా సృష్టి జరిగినను ఎల్లయెడల ఈ చైతన్యము ఏకరూపముగానే యుండును. పెద్దకుండలు చిన్నపిడులు మొదలగుభేదములు కుండలకు పిడుతులకే గాని మట్టికి ఎట్లు సంబంధిపవో అట్లే సృష్టిభేదములు కూడ చైతన్యమునకు సంబంధింపవు. ఈభేదము లన్నియు బ్రహ్మయొక్క భావనచేతనే భాసించుచున్నవి. ఆయన భావించుట మానుకొన్నచో భేదములు భాసింపవు. "చిదాత్మకు భావనయందు స్వాతంత్ర్యము సహజము. నాయందును చిదాత్మకలదు. మఱి నాయందు అభావనాశక్తి కన్పించుట లేదే?" అని నీవు అడుగవచ్చును. నీయందున్న భావనాశక్తి మాయచేత ఆవరింపఁబడి యున్నది. మాయ తొలఁగినచో నీకుఁగూడ భావన సిద్ధించును. దేశమునుగాని కాలమును గాని ఎవఁడు ఏ విధముగా భావించుచున్నాఁడో అది ఆప్రకారముగా దీర్ఘము అల్పము మొదలగు భేదములతో భాసించుచున్నది. నేను శైలలోకమున ఏకదినరూపమున ఏకాలమునుగూర్చి భావించితినో ఆకాలమునే బ్రహ్మ నూటనిరువదికోట్లసంవత్సరములుగా భావించెను. ఆకారణముచేత ఒకకాలమే శైలలోకమున అల్పముగా ఇచ్చట దీర్ఘముగా భాసించినది. ఇట్లే బ్రహ్మ శైలమునుగూర్చి అరకోసుమాత్రముగా భావింపఁగా నేను దానిలోపల ప్రదేశమును అనంతముగా (Unending space) భావించితిని. అందువలన నీకది అనంతముగా తోఁచినది. ఈవిధముగా ఈ రెండు సత్యము అసత్యము కూడా అగుచున్నవి. నీవు కూడ నీమనస్సు నందు మొదట క్రోశమాత్రమైన ప్రదేశమును సూక్ష్మమైనకాలమును భావింపుము. తరువాత ఆప్రదేశమునందే అనంతములైన యోజనములను, ఆకాలమునందే అసంఖ్యాకములైన సంవత్సరములను భావింపుము. నీవు ఎంతవఱకు అట్లు భావించుచుందువో అంతవఱకు అవి అట్లే భాసించుచుండును. ఆవిధముగానే చిదాత్మరూపమునందు వెలుపల నున్నట్లుగా ఈజగత్తు భావనామాత్రముగానే భాసించుచున్నది. గోడమీఁది కన్పించుచున్నబొమ్మ గోడకన్న అన్యమైనవస్తువు ఎట్లు కాదో అట్లే ఆత్మకు వెలుపల నున్నట్లుగా తోఁచుచున్నయవ్యక్తమును గోడపై భాసించుచున్న జగత్తు అనుచిత్రము కూడ అవ్యక్తముకన్న భిన్నము కాదు. చిదాత్మయందు తోఁచుచున్న యా యవ్యక్తము చిదాత్మకన్న అన్యముకాదు. కావున జగత్తు చిదాత్మయందే భాసించుచున్నది కాని వెలుపల ఎచ్చటను లేదు. సర్వము చిదాత్మయే యగుటచే దానికి వెలుపల అన్నమాటకు అవకాశమే లేదు. ఈకారణము చేతనే సాధారణమానవులు ఎంతోకాలము ప్రయాణముచేసి చేరుకోఁగలుగునట్టి దూరప్రదేశములకు యోగులు క్షణకాలములో చేరి అక్కడటి విశేషములు అన్నింటిని చక్కఁగా చూచుచున్నారు. కావున దూరము దగ్గర చిరకాలము శీఘ్రము అనునవి యన్నియు భావనామాత్రములే. "జగత్తు చిదాత్మ అనునద్దమునందు ప్రతిబింబమాత్రమే. అది చిదాత్మ కన్న భిన్నముగ వస్తువుగా లేదు." అని నిశ్చయించుకొని "దేహేంద్రియాదులుకు అతీతముగానున్న చైతన్యమే నేను" అను భావనను నిరంతరముగా కొనసాగించుచు "ఈజగత్తు సత్యము" అను భ్రాంతిని తొలగించుకొనుము. అప్పుడ నీవు కూడ నావలెనే స్వతంత్రుఁడవు కాఁగలవు."

ఇట్లు తంగణునిపుత్రుఁడు బోధింపఁగా మహాసేనుఁడు "జగత్తు సత్యము. దేహము నేను" మొదలైన భ్రాంతిని వీడి చిదాత్మ తప్ప మఱిఏదియు లేదని తెలిసికొని కామక్రోధాదిరహితుఁడై సమాధియోగములు అభ్యసించి భావనాసిద్ధిచే సృష్టించుటయందు స్వాతంత్ర్యమును పొంది చిరకాలము విహరించి అభాసమాత్రముగ తోఁచుచున్న శరీరమును కూడ

త్యజించి విదేహముక్తి పొందెను. కావున భార్గవా! ఈజగత్తు "ఇది సత్యము" అను నీ భావనమాత్రమే. విచారించినచో ఈ భ్రాంతి పోవును."

ఇది జ్ఞానఖండమున భావనాసిద్ధి యన్నది చతుర్దశాధ్యాయము సమాప్తము.

బాలప్రియ

భావనాబలముయొక్క సామర్థ్య మెట్టిదో నిరూపించుటయే ఇందలి మహాసేనుని వృత్తాంతమునకు ప్రధానతాత్పర్యము. అయినను ఇందు విశేషము లనేకములు కలవు. తంగణునికుమారుఁడు యజ్ఞాశ్వమును బంధించుట మొదటి విశేషము. సమాధియందున్న తమ తండ్రికి ఆమార్గమున పోవుచున్న వారు వచ్చి నమస్కరించుచున్నారా లేదా అను విషయము సాధారణ మునిబాలకులకు పట్టదు. ఒకవేళ వా రావిషయమును గమనించినను"ఈరాజపుత్రులు గర్వితులు. పెద్దలను గౌరవింపరు" అన యనుకొందురే కాని వారితో ఆవిషయముపై కలహింపరు. ఒకవేళ కలహించినను యజ్ఞాశ్వమును బంధింపవలయునను తలంపు కలుగనే కలుగదు. మఱి తంగణుని పుత్రుడు అట్లేల చేసెను? అతఁడు క్షత్రియుఁడగుటయే యిందులకు కారణము. ఆతని తల్లిదండ్రులు క్షత్రియులు. తంగణుఁడు ఆత్మజ్ఞానము నొంది విరక్తుఁడై పదికోట్లయేండ్లు తపస్సు చేసెను. ఆతని భార్యయు ఆతనిని సేవించుచు ఆత్మజ్ఞానము నొంది అట్లే తపస్సు చేయుచుండెను. ఆత్మజ్ఞానము కలిగి కోట్లయేండ్లు తపస్సు చేసినను ఆమెయందున్న క్షత్రియరక్తగుణము మాఱలేదు. ఆక్షత్రియత్వమే కుమారునకు సంక్రమించినది. అతఁడు కూడ తండ్రివలన ఉపదేశము పొంది యోగవిద్యనే కాక ఆత్మజ్ఞానమును కూడ పొంది గొప్ప తపస్సు చేసెను. గండశైలమునందు అతఁడు లోకమునే సృష్టింపఁగలిగెను. ఇంతేకాదు. అతనిబోధచేత మహాసేనుఁడు ఆత్మజ్ఞానము నొందిజీవన్ముక్తుఁడయ్యెను. ఇంతవాఁడైనను ఆతనియందు క్షత్రియత్వము పోలేదు; బ్రహ్మణత్వము కలుగలేదు. అందువలననే అతఁఁడు ప్రతి దినము గండశైలలోకమునకు పోయి దానిని పాలించుచు క్షత్రియ సహజమైన యధికారవాంఛను తీర్చుకొనుచుండెను. క్షత్రియవృత్తి ఇట్లు కొనసాగుచుండుటవలననే యజ్ఞాశ్వమును రాజపుత్రులను చూచి నంతనే ఆతనియందు రాజసము పొంగి అశ్వమును బంధించి తన మహావీరత్వమును ప్రకటింపవలయును నను నావేశము కలిగెను. ఆ యావేశముచేత "నేను మునికుమారఁడును; తాపసవృత్తి లోనున్నాను" అను నాఆలోచనయే కలుగులేదు. అందువలన అతఁఁడు తాపసస్వభావమునకు విరుద్ధముగా పెద్దయుద్ధము చేసి అశ్వమును రాజపుత్రులను బంధించెను. దీనివలన ఎంతో తపస్సు వ్యయ మయ్యెను. తాను చేసినతప్పు ఎట్టిదో తండ్రి "ఇది దైత్యుల లక్షణము; మునులకు తగదు" అని మందలించువఱకు అతనికి తోఁచలేదు. కుమారుని స్వభావమునకు కారణమును నిరూపించుటకే తంగణుఁడు వాని జన్మవృత్తాంతమును వివరించెను. దీనినిబట్టి ఎంత తప్పసుచేసినను జన్మ వలన సిద్ధమగునట్టి వర్ణములయొక్క లక్షణములు మార్పు నొందుట ఎంత అసాధ్యమో స్పష్ట మగుచున్నది.

సమాధిస్థితికి వచ్చినసాధకురాలికి పుత్రుఁడుదయించుట రెండవవిశేషము. తంగణుఁడు విరక్తుఁడై తపోవనమునకు రాఁగా భార్యయు వెంటవచ్చినది. కాని ఆమెకు కామవాసనలు పూర్తిగా నశింపలేదు. అయినను పతివ్రత కావున కామభోగములను అపేక్షింపక భర్తను సేవించుచు ఆత్మజ్ఞానము నొంది భర్తతోపాటు కోట్ల కొలఁది సంవత్సరములు సమాధియందుఁడెను. కాని అతృప్తమైన కామవాసన (Unstiated sexual desire) అమెకు కూడవ తెలియకుండ నిగూఢమై ఆమెమనస్సునందు దాగియుండెను. పుత్రుని పొందవలసిన ప్రారబ్ధకర్మము కాలవశమున అప్పటికి పక్వమై పైకివచ్చి నిగూఢమైయున్న కామవాసనను వెలికి తెచ్చి విజృంభింపఁజేసెను. ప్రారబ్ధవేగమువలననే ఆమె అంత తపశ్శక్తిని కలిగియుండియు ఆకామ విజృంభణము సహింపలేకపోయినది. విశ్వామిత్రుని తపోభంగమునకు మేనక కారణమైనట్లు, ఆమెతపోభంగమునకు కారణ మేదియు కన్పింపదు. అందువలన ప్రారబ్ధమే కారణ మని చెప్పవలసియున్నది. విధివశముననే అట్లు జరిగినదని తంగణుండు కూడ చెప్పియున్నాడు. కావున కామాదివాసనలు వివేకముతో కూడిన అనుభవముచేత నశింపవలె; లేదా ఆత్మవిచారముచేత నశింపవలె. కామము క్రోధము మొదలగుభావములు మనస్సులో పైకివచ్చునప్పుడు "ఇదిగో కామము వచ్చుచున్నది. ఇదిగో క్రోధము వచ్చి ఆక్రమించుచున్నది. దీనికి లోఁబడరాదు. ఇది నాస్వరూపము కాదు" అని తొలఁగించుకొను చున్నచో వాసన లన్నియు క్రమముగా క్షీణించి నశించును. నిద్రయందువలె సమాధిస్థితియందు ఎన్నిలక్షలయెడ్లు సుఖముగానున్న మనస్సునకు క్షాళనము జరుగదు. అది విచారమువలననే సంభవించును. అందువలననే కుమారుఁడు రాజ్యమును

పాలింపవలయునని కోరినప్పుడు తంగణుఁడు, "స్వభావము అతిక్రమింపరానిది (స్వభావోదురతిక్రమః)" అను తలంపుతో అట్లే కానిమ్మని అనుమతించెను. అతఁడు కొంతకాలము ఆరాజ్యపాలనమును అనుభవించి విరక్తుఁడై విచారముచేత కామక్రోధాదివాసనలను నిర్మూలించుకొనవలయును నని ఆయన అభిప్రాయము. కుమారుఁడును అట్లే చేసియుండును.

పురుషసంబంధము లేకయే స్త్రీకి పుత్రుఁడుదయించుట మూఁడవ విశేషము స్వప్నమునందు భోగము సంభవించినచో అది కేవలము భావనయే. కాని దానివలన జచరుగు దాతుస్థలనము మాత్రము శరీరము నందు భౌతికముగానే (Physical) జరుగును. తంగణునిభార్య కేవలము భర్తనుగూర్చిన భావనచేతనే రతిపారవశ్యమును పొందినను ఆమెకు ధాతుస్థలనము మాత్రము శరీరమునందు భౌతికముగానే జరిగినది. వ్యాసుఁడు మొదలుగా మహతపస్వులకు స్త్రీసంబంధము లేకయే పుత్రు లుదయించినట్లు, తంగణుని భార్యకూడ తపస్సంపన్ను రాలగుటచే పురుషసంబంధము లేకున్న పుత్రుఁడుదయించెను.

తంగణుఁడు కోరుకున్నను పుత్రుఁడు కలుగుట నాల్గవవిశేషము. ఇది ఆయనకు కేవలము ప్రారబ్ధవశముననే సంభవించినది. వ్యాఘ్రపాదుఁడు హేమలేఖను పెంచుటయు ఇట్టిదే. జడభరతుండు కూడ లేడిపిల్లను ఇట్లే పెంచెను. మఱి జడభరతునకు వలె వీరికిన ఈ శిశుపోషణము సంసారబంధమై మఱియొక జన్మను కలిగించునా? ముప్పురును కేవలము దయతోనే శిశువులను పోషింపఁబూనుకొనిరి. కాని జడభరతుఁడు లేడిపిల్లయందు లౌల్యమును కూడ వహించెను, అందువలన ఆయనకు లేడిజన్మ కలిగినది. దయవేఱు లౌల్యము వేఱు. ఇతరుల దుఃఖమును తొలఁగింపవలయునను తలంపు దయవారి సుఖదుఃఖములను గూర్చి మాటిమాటికి ఆలోచించుచు వారి సుఖమువలన తాను సుఖమును వారి దుఃఖమువలన దుఃఖమును పొందుచుండుట లౌల్యము. లౌల్యమువలన సంసారబంధము తప్పదు. కావుననే భగవంతుఁడు దైవీసంపదనుగూర్చి చెప్పునప్పుడు "దయా భూతే ష్వలోలుప్త్వమ్" అని భూతములయందు దయ ఉండవచ్చును గాని లౌల్యము ఉండరాదని స్పష్ట మొనరించెను. వ్యాఘ్రపాదఁడుతంగణుడు దయామాత్రముగా శిశువులను పోషించి పెద్దవారిని చేసిన తరువాత వారిసంగతిని పట్టించుకొనలేదు. ఆవిషయమువారు కలలో జరిగిన వృత్తాంతమునువలె. విస్మరించియుందురు. అందువలన వారికి ఆవ్యవహారము బంధమును కలిగింపలేదు. ప్రారబ్ధానుభవము అందఱకును సమానమే. అజ్ఞానులు ప్రారబ్ధమువలన కలుగుచున్న సంపదలవలన సుఖమును ఆపదలవలన దుఃఖమును తన్మయత్వముతో అనుభవించుచు ఆవాసనలను పెంపొందిచుకొనుచుందురు. జ్ఞానులు కలుగచున్న సుఖము గాని దుఃఖమును గాని మనసులో పుట్టు చున్నంతనే చూచుచు, "ఇది నాస్వరూపము కాదు. దృక్స్వరూపుఁడనైన నాయందు ఇది దృశ్యమాత్రమే" అని వానిని విస్మరించుచుందురు. అందువలన వారికి పూర్వవాసనలు నశించునే కాని క్రొత్తవాసనలు పుట్టవు.

మునికుమారుఁడు ప్రసన్నుఁడై, "నీకోర్కె ఏమో చెప్పుము. నేను తీర్చెదను" అని చెప్పినప్పటికి మహాసేనుఁడు తంగణునితోన మాటాడవలయునని కోరుట మరియొక విశేషము. సైనికులు జరిగిన వృత్తాంత మంతయు చెప్పినను మహారాజు, "ఎట్లయినను తంగణమునిని ప్రసన్నుని గావించుకొని అశ్వమును రాజపుత్రులను శీఘ్రముగ తీసికొని రమ్ము" అని మహాసేనుని నియోగించుటఇందులకు ముఖ్యకారణము. ఆయనయును అట్లేల నియోగింపవలె? కుమారుఁడు ప్రసన్నుడైనచో చాలదా? అమునికుమారుఁడు చేసినది అక్రమము. తప్పుచేసినవానిని ప్రార్థించి ప్రసన్నుని చేసికొని పనిజరుపుకొనుట పరిపాలకులకు తగదు. వాని నెట్లయినను మందలించి సరియైనమార్గమునకు తేవలె. లేకున్నచో అతఁడు గర్వితుఁడై ఇంకొకప్పుడు తమవిషయమునఁగాని మఱియొకరి విషయమునఁగాని ఇట్లే ప్రవర్తింపఁగలడు. కావున ధర్మదృష్టితో వానిన శిక్షించుట ఆవశ్యకము కాని ఆశక్తి తమకు లేదు. వానిని అదుపులో పెట్టఁదగినఁవాడు తండ్రియే. కావున కుమారునివర్తనమును తండ్రికి తెలియఁజేయుట తమకు కర్తవ్యము. తండ్రి కూడ పుత్రమోహమున కుమారునిపక్షమునే అవలంబించినచో తాము ఱియొక మహర్షిని శరణు పొందవలసియుండును. ఎట్లయినను తప్పుచేసినవానిని ప్రార్థించుట తమకు తగదు. అందువలననే సుషేణుఁడు మహాసేనుఁడును ఎట్లయినను తంగణమహామునినే ప్రసన్నుని చేసికోవలయును నని తలంచిరి. తగినట్లే తంగుణఁడును కుమారుని మందలించెను.

మునికుమారుఁడు తండ్రిని సమాధినుండి మేల్కొలుపవలసి వచ్చినప్పుడు తాను స్థూలదేహమునుండి సూక్ష్మశరీరముతో బయల్వెడలితండ్రియందు ప్రవేశించి ఆత్మయందు లీనమైయున్న యాయన యొక్క మనస్సున ఆకర్షించి మేల్కొలిపి మరల వచ్చి తనస్థూలశరీరమున ప్రవేశించెను. అంతకు పూర్వము తంగణునిభార్య కూడ అట్లే

చేసెను. కాని మునికుమారుఁడు గండశైలములోనికి పోవునప్పుడు వెలుపలికి వచ్చునప్పుడు స్థూలశరీరమును వదలినట్లు లేదు. అట్లే గుఱ్ఱమును రాజపుత్రులను శైలములోనికి తీసికొని పోయినప్పుడు వారి సూక్ష్మశరీరములను తీసికొని పోయినట్లు లేదు. మహాసేనుని విషయమున మాత్రము వానిని సూక్ష్మశరీరమునే లోనికి తీసికొనిపోయి అక్కడ మఱియొక శరీరమును సృష్టించి దానియందు అతనిని ప్రవేశపెట్టెను. మఱి మహాసేనుండు స్థూలశరీరముతో ప్రవేశింపలేని శైలములోనికి గుఱ్ఱము రాజపుత్రులు ఎట్లు ప్రవేశపెట్టఁబడిరి? మునికుమారుఁడు స్థూలశరీరముతో శైలములోనికి రాకపోకలు ఎట్లు చేయుచున్నాఁడు.

అష్టసిద్ధులలో అణిమ అనుసిద్ధి కలదు. దానివలన స్థూల దేహమును అణువంతదిగా తగ్గించుకొనవచ్చును. ఈశక్తి చేతనే అజంనేయుఁడు లంకలో ప్రవేశించినప్పుడు పిల్లియంత శరీరముతో నుండెను. సీతతో ప్రసంగించుచు ఆయన "నిన్ను రామునియొద్దకు ఇప్పుడే తీసికొనిపోయెదను. నావీపుపై నెక్కుము" అని పలికెను. ఆయనయొక్క చిన్నశరీరమును చూచుచు ఆమె. "ఇంత చిన్నశరీరముపై నన్నెట్లు గొనిపోవుదువు? ఇది గాదా నీ కపిత్వము" అని పరిహసించెను. వెంటనే ఆయన "మహిమ" అను సిద్ధితో ఆశరీరమునే మహోన్నతముగా పెంచెను. అట్లే మునికుమారుఁడు స్థూలశరీరమునే అణువంతగా నొనర్చుకొని శైలములోనికిరాకపోకలు చేయుచు నుండవచ్చును. అట్లే గుఱ్ఱమున రాజపుత్రులను కూడ అణువంతగా నొనర్చిలోనికి తీసికొనిపోయి యుండవలె. అట్లు కాక వారి సూక్ష్మ శరీరములను లోనికి గొనిపోయియున్నచో వారిస్థూలశరీరములు శైలమునకు వెలుపల గోచరములై యుండవలె. మొదట రాజపుత్రులు చూచుచుండగనే మునిపుత్రుఁడు గుఱ్ఱముతో శైలములోనికి పోయెను. అప్పుడు వారికి మునిపుత్రునియొక్క గుఱ్ఱియొక్క స్థూలశరీరములు శైలమువెలుపల కనిపించి యుండవలె. అట్లు కన్పింపలేదు. గుఱ్ఱముతో మునికుమారుఁడు శైలములో ఉన్నాఁడనియే రాజపుత్రులు శైలమును పగులఁగొట్టిరి. అప్పుడతఁడు మహాసేనతో వెలుపలికి వచ్చి రాజపుత్రులను జయించి బంధించి మరల వారిని శైలములోనికి గొనిపోయెను. అప్పుడు వారి నందఱును అణవులంతగా చేసి తీసికొనిపోయె నని చెప్పుట సమంజసము.

మఱి, అతఁడు మహాసేనుని విషయమున అట్లేల చేయలేదు? అతఁడు మహాసేనుని ఆలోకమున బంధించుట లేదు. ఆతనిని ఆ లోకమునందు చంద్రమండలము సూర్యమండలము మొదలుగా అన్ని ప్రదేశములందును త్రిప్పవలసియున్నది. అట్టియెడల స్థూలమైన యతని సాధారణశరీరము ఆమండలములోని శీతలత్వము ఉష్ణోగ్రత మొదలగు మార్పులకు తట్టుకొనఁజాలదు. అందువలన అతని స్థూలశరీరమును శైలమునకు వెలువలనే యుంచి దానిలోనుండి యతనిలింగ శరీరమును శైలములోనికి తీసికొనిపోయి అక్కడ ఆలోకమునకు తగిన మఱియొక శరీరమును సృష్టించి దానిలో ఆతని లింగశరీరమును ప్రవేశపెట్టెను. వెలుపలికి వచ్చినప్పుడు మరల ఆతని లింగశరీరమును శైలము వెలుపలనున్న స్థూల శరీరములో ప్రవేశపెట్టెను.

మహాసేనునకు స్థూలశరీములు మాఱినవి. కాని లింగశరీరము మాఱలేదు. అందువలననే అతఁడు గండశైలమున చూచిన దానిని మరల స్మరింపఁగలిగెను. అనఁగా అతనికి స్వప్నములోనుండి జాగ్రత్తులోనికి వచ్చినట్లే యున్నది. కావున విజ్ఞానము అనుభవము అన్నవి కేవలము లింగశరీరమునకు సంబంధించిన వనుట స్పష్టము. స్థూలము, సూక్ష్మము, కారణము అని శరీరములు మూఁడువిధములు. కాళ్ళు చేతులు తల మొదలగు నవయవములతో కన్పించుచున్న శరీరము స్థూలము. దీనికి లోపలనుండి దీనిని నడుపుచున్న శరీరము సూక్ష్మము. దీనినే లింగశరీర మందురు. ఇది స్వప్నమునందు స్థూలశరీరముకన్న విడిగా స్వతంత్రముగా వ్యవహరించుచున్నది. చెట్టునకు వేరువలె, లింగశరీరమునకు లోపలనుండు 'అవిద్య' కారణ శరీరము. ఈయవిద్యయే అవ్యక్తము మాయ ప్రకృతి అనియు చెప్పఁబడుచున్నది. ఇది సత్త్వము రజస్సు తమస్సు అను మూఁడు గుణములతో రూపొందియుండును. మరణసమయమున కారణశరీరముతో లింగశరీరము స్థూలశరీరమును వదలి పెట్టిపోవును. వివేక చూడామణియందు భగవత్పాదులచే లింగశరీరము ఇట్లు వర్ణింపఁబడినది. "వాక్కు మొదలుగా కర్మేంద్రియములు ఐదు, శ్రోత్రము మొదలుగా జ్ఞానేంద్రియములు ఐదు, పంచప్రాణములు, పంచభూతములు, మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అను నంతఃకరణచతుష్టయము, అవిద్య, కామము, కర్మము - అను నెనిమిదిపురములు (భాగములు) కలదానిని సూక్ష్మశరీర మని చెప్పుదురు. ఇదియే లింగశరీరము. ఇది అపంచీకృతములైన సూక్ష్మభూతములనుండి ఏర్పడుచున్నది. కర్మవాసన లన్నియు దీనియందే యండును. ఇదియే కర్మఫలముల ననుభవించుచుండును. ఆత్మస్వరూపము తెలియకుండుట అను నజ్ఞానము కారణముగా ఇది జీవునకు అనాదిగా నున్నది."

శ్లో||వాగాది పంచ శ్రవణాది పంచ

ప్రాణాది పంచాభ్రముఖాని పంచ||

బుద్ధ్యా ద్యవిద్యాపి చ కామకర్మణీ

పుర్యష్టకం సూక్ష్మశర మారీహుః ||98

శ్లో|| ఇదం శరీరం శృణు సూక్ష్మసంజ్ఞితం

లింగం త్వపంచీకృతభూతసంభవమ్ ||

సవాసనం కర్మఫలానుభావకం

స్వాజ్ఞానతోఽనాది రుపాధి రాత్మనః|| 99

ఇందు కారణశరీరమైన యవిద్యకూడ సూక్ష్మశరీరమున భాగముగా చెప్పఁడియున్నది. పైకథవలన యోగవిద్యయందు సిద్ధి నొందినవారు లింగశరీరమును స్థూలశరీరమునుండి సులభముగా విడఁదీయఁగల రని స్పష్ట మగుచున్నది. శరీరములోపలి భాగములను విడఁదీసి పైకితెచ్చి మరల లోపల నుంచఁగలిగిన వైద్యునియొక్క నైపుణ్యమువంటిదే యిది. ఈవిద్యచేత కూడ అవిద్యాకామకర్మలు నశింపవు. అవి జ్ఞానముచేతనే నశించును.

మహాసేనుఁడు శైలమునుండి వెలుపలికి వచ్చునప్పటికి నూట నిరువదికొట్లయేండ్లు భూలోకమున గడచె నని మునికుమారుఁడు చెప్పెను. అప్పటివరకును ఆగండశైలము సమాధియందున్న తంగణుఁడు గుంటలోనున్న మహాసేనుని స్థూలశరీరము అట్లే యున్నవి. తక్కిన జగత్తు అంతయు మాఱను. ఇవి యేల మార్పునొంది నశింప లేదు? అంతకాలము భౌతికశరీరములు చెదరకుండ నుండునా? తంగణుఁడు కాని ఆతని కుమారుఁడు కాని ఆప్రదేశమునందు కాలవశమున సంభవించు భౌతికములైన మార్పులు కలుగకుండునట్లు తపశ్శక్తిచేతనే రక్షణము (Insulation) కల్పించి యుందురని యూహింప వలసి యున్నది

# పదునైదవయధ్యాయము - జ్ఞానఖండసారము

పరశురాముడు శైలలోకాఖ్యానము విన్నతరువాత తనయాశ్రమమునకు పోయి గురువు చెప్పినట్లుగా విన్నదాని నంతను విమర్శించి మరల గురువునొద్దకు వచ్చి ప్రణమిల్లి తాను గ్రహించినదానిని ఆయనకు నివేదించుచు దానిపైఁ గలిగినసంశయములను ఇట్లు ప్రశ్నించెను. "భగవానుఁడా! నీవు పెక్కుకథలతో చెప్పినవిషయమును నేను అనేక విధముల ఆలోచించితిని. నాకు ఇంతవఱకు తెలిసినది, తెలిసికొనుట లేక జ్ఞానము అన్నది ఒక్కటే సత్యము. తెలిసికొనబడుచున్న దంతయు కల్పితము. అద్దములో కన్పించునగరమువలె తెలియఁబడుచున్న దంతయు అసత్యము. జ్ఞానమే రూపముగాగల యాపరమేశ్వరి స్వాతంత్ర్యముయొక్క మహిమచేత, కుండకు మట్టి కావలసినట్లు, ఏ పదార్థముతో అక్కఱలేకయే తనయందే అవ్యక్తము మొదలగు భేదములతో జగత్తును భాసింపఁజేయుచున్నది. ఆత్మకు వెలుపల ఏదో ఉన్నట్లు తోఁచుటయే అవ్యక్తము. మీరు చెప్పినదానిని సూక్ష్మముగా విచారింపఁగా నాకు ఇంతవఱకు తోఁచినది.

తెలిసికొనుట సంవేదనము, లేక సంవిత్తి%ి. తెలియఁబడునది వేద్యము. వేద్యముతో ఎప్పుడును ఏవిధముగను సంబంధములేక శుద్ధముగా నుండుటయే సంవిత్త యొక్క యదార్థస్వరూపమని చెప్పుచున్నారు. కాని వేద్యము సంవేదనమునందు ఎప్పుడును ఉండనే ఉన్నది. అట్టియెడల వేద్యములేని పరిశుద్ధమైన సంవేదనమును పొందుటకు ఎట్లు వీలగును? దానిని అట్లు పొందకున్నచో పురుషార్థమే లేదు. మోక్షమే పురుషార్థము. ఆమోక్షముయొక్క స్వరూపమేమి? జ్ఞానము కలిగినంతనే మోక్షము కలుగు నన్నచో, ఆమోక్షస్థితియందు వ్యవహారము ఎట్లు కుదురును? మఱి వ్యవహారపరాయణులైన జ్ఞానులు కన్పించుచున్నారు. వారికి వేద్యరహితమై కేవలమైన సంవేదనము (Absolute awareness) ఎట్లునిలుచును? శుద్ధమైన సంవేదనమునందు నిలిచినవానికి వ్యవహారము ఎట్లు జరుగును? జ్ఞానము ఏకరూప మైనప్పుడు దానివలన కలుగు మోక్షము కూడ ఏకరూపముగానే యుండవలె. మఱి లోకమునందు జ్ఞానుల యొక్క స్థితిలో భేదము ఎట్లు కన్పించుచున్నది? కొందఱు జ్ఞానులు శాస్త్రము చెప్పినట్లు ఆయాకాలములందు చేయవలసిన కర్మలను చేయుచున్నారు. కొందఱు భిన్న భిన్నపద్ధతులలో దేవతలను ఆరాధించుచున్నారు. కొందఱు ఇంద్రియములను నియమించి సమాధియందే నిలిచిపోవుచున్నారు. మఱి కొందఱు దేహేంద్రియములను శుష్కింపఁజేయుచు తపస్సు చేయుచున్నారు. కొందఱు ప్రవచనములచేత శిష్యులకు బోధించుచున్నారు. కొందఱు దండనీతిని అవలంబించి రాజ్యమును పాలించుచున్నారు. కొందఱు సభలలో ప్రతివాదులతో వాదించుచున్నారు. మఱికొందఱు ఎల్లప్పుడు శాస్త్రములను రచించుచుందురు. కొందఱు సదా ప్రపంచ జ్ఞానము లేనివారివలె నుందురు, కొందఱు లోకులు ఏవగించుకొను నట్టి వర్తనమునందు ఉందురు. వీరందఱు లోకమున జ్ఞానులుగానే ప్రసిద్ధులై యున్నారు. మోక్షము అందఱకును సమానమైనప్పుడు వీరిస్థితియందు భేదములెట్లు కలుగుచున్నవి? వీరి విజ్ఞానము సమానము కాదా? వీరి జ్ఞానములలో తారతమ్యముప (Degrees of difference) ఉన్నదా? ఇది యంతయు నీవు తప్ప ఎవఁడును చెప్పఁజాలఁడు. నిన్నే శరణుపొందిన శిష్యునియందు నీ మనస్సు సహజముగనే దయార్ద్రమై యుండును. కావున నాసంశయములు నశించునట్లు బోధింపుము."

ఈప్రశ్న లన్నియు సమంజసములే అని సంతోషించుచు దత్తా త్రేయుఁడు ఇట్లు చెప్పెను. "రామా! నీవు బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడవు. ఆచిదాత్మను తెలిసికొనుటకు నీవు సమర్థుఁడవు. నీకు సద్విమర్శనము కలిగినది. అందువలన తత్త్వమును తెలిసికొనఁగలవు. భగవంతునియొక్క అనుగ్రహమువలననే సద్విమర్శనము కలుగును. ఆయనయొక్క అనుగ్రహము లేక ఎవఁడును శ్రేయస్సునకు సాధనమైన సద్విమర్శనమును పొందఁజాలఁడు. మనయందు ప్రతిదినము సద్విమర్శనమును పెంపొందించుచుండుటయే మనచే ఆరాధింపఁబడిన యీశ్వరుఁడు ప్రసన్నుఁడై మనకు చేయఁగలిగిన మహోపకారము. ఆయన చేయఁగలిగినది అంతవఱకే.

దేనిని నీవు తెలిసికొంటివో అది సత్యమే. కాని చిదాత్మను గూర్చి నీకు చక్కఁగా తెలియలేదు. కావుననే అద్దమునందు నగరమువలె చిదాత్మ తనయందు జగత్తును భాసింపఁజేయుచున్నది" అని తాటస్థ్యముతో చెప్పుచున్నావు. "ఆచిదాత్మయే నేను" అని నీకు తోంచలేదు. చిదాత్మను తనకన్న వేరొక వస్తువుగా ఎవఁడు తటస్థుఁడుగా తెలిసికొనుచున్నాఁడో వానికి అది తెలియదు. "ఆచిదాత్మయే నేను" అని తెలిసికొన్నవానికి తాటస్థ్యము ఉండదు. ఆత్మ ఎక్కడనో ఉన్నట్లు తటస్థముగా తెలిసికొనుట స్వప్నములో తెలిసికొనునటువంటిదేయగును. స్వప్నములో దొరకిన నిధివలె తటస్థునియొక్క ఆత్మజ్ఞానము ముఖ్యమైన ఫలము నొసంగదు. ఈవిషయమున వెనుక జరిగిన యొకవృత్తాంతమును చెప్పెదను వినుము.

పూర్వము విదేహరాజ్యమునందు ఒకధార్మికుఁడైన రాజు ఉండెను. ప్రజ్ఞాశాలియైన యాజనకుఁడు ఇహపరములను రెండింటిని తెలిసికొని ఉత్తమములైన యజ్ఞములచేత ఆత్మదేవతను ఆరాధించెను. విద్యావంతులు తపస్సులు కళాకోవిదుల యజ్ఞములుచేసినవారు మొదలుగా బ్రాహ్మణులు అచ్చటికి వచ్చిరి. ఆసమయముననే వరుణుఁడు యజ్ఞమును చేయఁబూనుకొనెను. ఆయన ఆహ్వానింపఁగా బ్రాహ్మణాదులు చాలమంది వరుణలోకమునకు పోలేదు. విద్వాంసు లందఱును జనకునిచే పూజింపఁబడుచు సంతుష్టులై అచ్చటనే యుండిరి. అప్పుడు బుద్ధికుశలుడైన వరుణునిపుత్రుఁడు కపటమార్గమున విద్వాంసులను వరుణలోకమునకు తీసికొనిపోవలయు నని నిశ్చయించుకొని బ్రాహ్మణవేషమున జనకునియజ్ఞశాలకు వచ్చి రాజును ఆశీర్వదించి సభలో నెల్లరు వినుచుండగా అచ్చటనున్న సదస్యులను తిరస్కరించుచు నిట్లనెను. "రాజా! కాకులతో, గ్రద్దలతో నిండియున్న సరస్సు వలె నీయాయజ్ఞశాల శోభించుట లేదు. శరత్కాలమందు వికసించిన కమలములుగల సరస్సు హంసలముదాయములచేత శోభించునట్లుగా

సభ విద్వాంసులసముదాయములచేతనే శోభించును. మఱి యీసభలో విద్యావిశారదుఁడైనవాఁడు ఒకడును నాకు కన్పించుటలేదు. అయ్యా! నీకు శుభ మగును గాక! నేను పోవుచున్నాను. మూర్ఖులతో నిండి యున్న యీసభలోనే నెట్లుండఁగలను?" ఇట్లు అతఁడు పలికినంతనే సదస్సు లందఱు క్రుద్ధులై యిట్లనిరి. "ఏమిరా! బ్రాహ్మణాధమా! ఎల్లరను ఎందులకు ఆక్షేపించుచున్నావు? మమ్ము అందఱను జయించుటకు నీకున్న విద్య ఏమి? ఏమిరా నీదుర్బుద్ధి! మమ్ము అందఱును జయించి పోఁగలవా? ఏల ఇట్లు నిన్ను నీవు పొగడుకొనుచున్నావు? భూలోకములోనున్న విద్వాంసు లందఱును ఇంచుమించుగా ఇక్కడ చేరియున్నారు. నీవు భూలోకమునే జయింపగోరుచున్నావా! ఏ విద్యతో నీవు మమ్ము జయింపగోరుచున్నావో అది ఏదోచెప్పుము." అప్పుడు వరుణునికుమారుఁడు ఇట్లనెను, "మీరు ఒక ప్రతిజ్ఞకు అంగీకరించినచో మిమ్ము అందఱను క్షణములో జయింతును. నేను ఓడిపోయినచో నన్ను మీరు సముద్రములో ముంచుడు, మీరు ఓడినచో మిమ్ము సముద్రములో ముంచివేయుదును. దీనికి అంగీకరించి మీరు నాతో వాదము చేయుఁడు." అంతట వా రందఱను అందులకు అంగీకరించి వానితో వాదము చేయఁజొచ్చిరి, అతడు తర్కకౌశలముతో వారి నందఱను జయించి వందలకొలఁదిగా వేలకొలఁదిగా తీసికొనిపోయి సముద్రములో ముంచఁజొచ్చెను, వరుణునిదూతలు వారి నందఱను వరుణుని యజ్ఞశాలకు తీసికొనిపోవుచుండిరి. అచ్చట వారి నందఱును వరుణుఁడు పూజించి సంతుష్టులను గావించుచుండెను.

ఇట్లు కహోలుఁడు అను ముని కూడ సముద్రములో ముంచఁబడెను. అది ఎఱింగి ఆతనికుమారుఁడు అష్టావక్రుఁడు జనకుని యజ్ఞశాలకు వచ్చి వరుణునికుమారుని వాదమునజయించి వానిని సముద్రములో ముంచవలసిన దని ఆదేశించెను. అప్పుడు వరుణపుత్రుఁడు నిజరూపమును చూపి వరుణలోకమునకు పంపఁబడిన ద్విజుల నందఱను రప్పించెను. అట్లు రప్పింపఁబడిన ద్విజశ్రేష్ఠులను చూచి అష్టావక్రుఁడు గర్వించి తిరస్కరించెను. వారందఱును దుఃఖము నొంది ఆసమయమునకు అచ్చటికి వచ్చిన యొకతాపసిని శరణుఁజొచ్చిరి. ఆమె కాషాయంబరములు జడలు ధరించి ౕవనముతో సౌందర్యముతో విలసిల్లుచుండెను. ఆమె వారిని ఓదార్చి సభలోనికి పోయి జనకునిచే పూజితురాలై అష్టావక్రుని చూచి ఇట్లనెను. "వత్సా! కహోలపుత్రా! నీవు చాల బుద్ధిమంతుఁడవు. వరుణదేవునిపుత్రుని వాదమున జయించి ఈవిద్వాంసుల నందఱను విడిపించితివి. నేను నిన్ను కొంచెము అడిగెదను. వంచనము లేకుండ చెప్పుము. దేనిని దెలిసికొన్నచో సర్వము అమృత మగునో, సకల సందేహములు నశించునో, ఇంక తెలియఁబడనిదికాని కోరఁదగినదికాని ఏదియు నుండదో అట్టిది నీకు తెలిసినచో వెంటనే చెప్పుము." అష్టావక్రుఁడు ఇట్లనెను. "అది నాకు తెలియును. తాపసీ! మరల చెప్పుచున్నాను వినుము, నాకు ఈలోకములో తెలియనిది లేదు. ఇది ఎంత? నేను సకలశాస్త్రములను అనేకపర్యాయములు తిరుగవేసితిని. ఇదిగో నీ వడిగినది. అది సకల జగత్తునకు కారణము. దానికి ఆదిమధ్యాంతరములు లేవు. అది దేశకాలముచేత పరిమితము (limited) కాదు, అది శుద్ధము అఖండము చిదాత్మకము. అద్దమునందు నగరమువలె ఈజగత్తు అంతయు దేనియందు విరాజిల్లుచున్నదో అదియే పరమపదము. దానిని తెలిసికొన్నవాఁడే నిశ్చలము అమృతము అయిన స్థితిని పొందును. అద్దమునుగూర్చి తెలిసికొన్నతరువాత దానియందు అనంతముగా ఎన్ని బింబములు కన్పించుచున్నను అవి అన్నియు అసత్యములు. అద్దమే సత్యము అను విషయమున ఎట్లు సందేహము కలుగదో అట్లే పరతత్త్వము నెఱింగినవానికి జగత్తు అసత్యము అను విషయమున సందేహము కలుగదు. అట్లే వానికి అసత్యమైన జగత్తులో తెలియనిది కోరఁదగినది ఏదియు నుండదు. ఇట్టియాత్మ యొక్కటియే చేతనము తక్కిన జగత్తు అంతయు అచేతనమగుటచే, దానిని తెలిసికొనువాఁడు ఇంకొకఁడు చేతనుఁడు లేకపోవుటచేత అది తెలిసికొనఁబడదు (Unknowable). ఇట్లు శాస్త్రదృష్టితో నీవడిగినతత్త్వము నిరూపింపఁబడుచున్నది."

తాపసి ఇట్లనెను "మునికుమార! శాస్త్రములో ఉన్నట్లుగా నీవు చక్కఁగా చెప్పినావు. ఇది సర్వసమ్మతమే. కాని దానిని తెలిసికొన్న వాఁడే నిశ్చలము అమృతము అయిన స్థితిని పొందును" అని మొదట చెప్పితివి. తరువాత, "దానిని తెలిసికొనువాఁడు ఇంకొకఁడు చేతనుఁడు లేకపోవుటచేత అది తెలిసికొనఁబడదు" అని చెప్పితివి. ఇది మొదటచెప్పినదానికి విరుద్ధము. అది తెలిసి కొనుటకు సాధ్యమే కానిదగుచో నీకు ఎట్లు తెలిసినది? నీకు తెలియనిచో, "అది నాకు తెలియదు; కావున లేదు" అని నిరూపింపుము. "అది ఉన్నది; నాకు తెలియును" అని నీవందువేని, "అది తెలియఁబడదు" అని చెప్పవలదు. అసలు ఇది యంతయు నీవు శాస్త్రదృష్టితోనే అనుకొనుచున్నావు. దానిని నీవు స్వయముగా అపరోక్షముగా (Directly) తెలిసికొనలేదు. జగత్తు ప్రతి బింబముగా నున్నదని నీవు ప్రత్యక్షముగా చూచుచు దానికి అద్దముగా నున్న యాత్మను చూచుట లేదని ఎట్లు చెప్పుచున్నావు? ప్రతిబింబమును చూచినఁవాడు

అద్దమును చూడకుండునా? ఈ విధముగా సభలో, అందును జనకునియెదుట, మాటాడుచు ఓడిపోయి పరిభవింపఁబడితినని ఏల గ్రహింపకున్నావు"

ఆమె ఇట్లు అడుగఁగా అతఁడు సిగ్గుపడి తలవంచుకొని కొంచెముసేపు ఆలోచించి ఆమె అడిగిన ప్రశ్నకు సమాధానము తోఁచక ఇట్లనెను, "అమ్మా! నీవడిగినప్రశ్నకు నాకు సమాధానము తెలియదు. నేను నీకు శిష్యుఁడ నగుచున్నాను. అవేద్యమైన యాత్మను తెలిసి అమృతత్వమును పొందుట" అన్నది ఎట్లు నిరూపింపఁబడినదో చెప్పుము. నేను అసత్యమును చెప్పను. అది తపస్సును హరించును."

అష్టావక్రునియొక్క సత్యవచనమునకు ఆమె ప్రసన్నురాలై ఎల్లరు వినుచుండఁగా వానితో నిట్లనెను. "కుమారా! దీనిని తెలిసి కొనకపోవుటవలననే అనేకులు భ్రాంతి నొందుచున్నారు. ఇది శుష్కతర్కములచేత తెలియునది కాదు. శాస్త్రములయందు ఎల్ల యెడల ఇది చాల రహస్యముగా నుంచఁబడినది. ఇంతమంది సభాసదులలో ఒకఁడును దీని నెఱుంగఁడు. ఇచ్చట ఈరాజు నేను తప్ప ఇంకెవరును దీని నెఱుంగరు. వివాదములలో ఎచ్చటను ప్రశ్నోత్తరములలో ఇది కన్పింపదు. తర్కమును మాత్రమే ఆశ్రయించినవిద్వాంసులు దీనిని తెలిసికొనఁజాలరు. ఎంత సూక్ష్మబుద్ధితో తర్కించినను సద్గురు సేవ దేవతానుగ్రహము లేకుండ ఇది తెలియదు. తనవిషయముగా కాక వెలుపలనున్న యేదో వస్తువును పరిశీలించుచున్నట్లుగా తటస్థమైనబుద్ధితో దీనినికూర్చి ఎంతగా విన్నను ఇది బోధపడదు. తనవిషయముగా మనస్సునకు పట్టనంతవఱకు ఎవనికైనను దీనిని వేయివిధములుగా బోధించినను ఆబోధ వ్యర్థమే యగును. ఏకారణము వలననో ఒకఁడు తనకంఠమునందే యున్న ముత్యాలహారమును విస్మరించి అంతటను వెదకి అది దొంగలచే హరిపఁబడె నని తలంచుచుండె ననుకొనుము. అప్పు డెవఁడైనను ఇంకొకఁడు వచ్చి, "హారము నీకంఠమునందే ఉన్న దయ్యా!" అని చెప్పినప్పుడు వాఁడుతన్ను తాను చూచుకొని కంఠమునందున్న హారమును చేతితో పైకి తీసికొని చూచువఱకు వాని కది లభించినట్లు కాదు. అంతవఱకు వాఁడు ఎంతసూక్ష్మబుద్ధితో ఆలోచించినను దానిని పొందలేఁడు. అట్లే ఆత్మతనస్వరూపమే అని ఎన్ని పర్యాయములు విన్నను ప్రశాంతచిత్తుఁడై, "నాస్వరూపము ఇట్టి దగునా కాదా" అని విచారించుటకు పూనుకొను వఱకు అది తెలియదు. తన స్వరూపము తనయందు కాక ఎచ్చట ఏవిధముగా తెలియును?

దీపము తనచుట్టునున్న పదార్థములను ప్రకాశింపఁజేయును. కాని ఒకదీపము మఱియొక దీపమును ప్రకాశింపఁజేయుట లేదు. సూర్యుఁడుదయించినప్పుడు సకలపదార్థములు ప్రకాశించును, సూర్యుని వెలుఁగు దీపములపై కూడ ప్రసరింపవచ్చును. తక్కిన పదార్థముల వలె అవి సూర్యుని కాంతివలన ప్రకాశమును పొందవు. అంత మాత్రముచేత "ఆదీపములు లేవు; అవి ప్రకాశించుట లేదు" అని చెప్పుట తగునా? సూర్యుని కాంతిలో కూడ దీపములయందు వానికి సహజము స్వతంత్రమును అయిన వెలుఁగు ఎట్లు ఉన్నదో అట్లేచైత న్యముయొక్క ప్రకాశము కూడ ప్రతి పదార్థమునందును ఉండనేయున్నది. అది ఎక్కడ లేదో చెప్పుము. దీపముల వెలుఁగు పరిమితము. కొన్ని యెడల ఒక్కొక్కప్పుడు అది ప్రకాశింపకపోవచ్చును. కాని అపరిమితము సర్వవ్యాపకము స్వయంప్రకాశమును అయిన చైతన్యము ప్రకాశింపకుండుట అన్నది లేదు. "ఆత్మ తెలిసికొనుటకు వీలు లేనిది. అది ప్రకాశించుచున్నది" అన్నమాట ఎట్లు కుదురును అని నీవు సంశయించుచున్నావు. సూర్యుని వెలుఁగులో చిన్నదీపములను మనము గమనింపము. అంతమాత్రమున వానిలో వెలుఁగులేదని చెప్పవచ్చునా? అట్లే మనము గమనించినను గమనింపకున్నను సకల పదార్థములయందును ఆత్మయొక్క చైతన్యము ఉన్నది. ఈవిషయమును నీవు అంతర్ముఖమైన దృష్టితో చక్కఁగా విచారింపుము. సర్వమునకు ఆశ్రయమై సర్వమును ప్రకాశింపఁజేయుచున్న ఈచిచ్ఛక్తి ఎప్పుడు ఎక్కడ ప్రకాశించుట లేదు? అది ప్రకాశింపనప్పుడు ఏది ప్రకాశించునో చెప్పుము, నిద్రయందు ప్రళయమునందు పదార్థమేదియు ప్రకాశింపకున్నను చైతన్యము ప్రకాశించుచునే యుండును. నిద్రనుండి లేచినవాఁడు, "సుఖముగా నిద్రించితిని. నా కేదియు తెలియలేదు" అని చెప్పును. సుఖము ఏదియు లేకుండుట అను రెండింటిని నిద్రలో ఆత్మరూపమైన చైతన్యమే చూచుచున్నది కావున నిద్రలో ఆత్మచైతన్యము ప్రకాశించుచునే యున్నది, "అయ్యా! నిద్రలో ఏదియు ప్రకాశింపకుండుటయే తోఁచుచున్నది. అది చైతన్యము కాదు" అని నీవనవచ్చును. కాని ఏది ప్రకాశింపదో అది ఎట్లు తోఁచును. ప్రకాశింపలేదు అని తోఁచుట చైతన్యమువలననే సంభవించుచున్నది. అట్టి చైతన్యము ఎప్పుడైనను ఎక్కడైనను ఎట్లు భాసింపకుండును? ఔయినచో అది నిరంతరము ఎట్లు భాసించుచున్నదో నీవే సూక్ష్మముగా విమర్శింపుము. కంటికి కన్పించునట్టి చెట్టునో జంతువునో బుద్ధిమంతు లందఱు విమర్శింపఁగలరు. అట్లు గోచరము

కాని యీయాత్మచైతన్యమును నిపుణులైన విద్వాంసులుకూడ గుర్తింప లేకున్నారు. వారు అనంతములైన విషయములపై దృష్టికలవారై సంసారపరాయణు లగుచున్నారు. ఎవనిదృష్టి యైనను ఎంతవఱకు విషయములయందు ప్రవృత్తిని విడిచి పెట్టదో అంతవఱకును అది ఏవిధముగా నైనను అంతర్ముఖము కానేరదు. ఎంతవఱకు అంతర్ముఖమైన దృష్టి కలుగదో అంతవఱకును ఆత్మ గోచరింపదు. సంకల్పము పూర్తిగా పోయినప్పుడే మనస్సునను అంతర్దృష్టి కలుగును. సంకల్పములతో నున్న మనస్సునకు అంతర్దృష్టి అసంభవము. కావున మనస్సునుండి సంకల్పమును పూర్తిగా తొలఁగించి స్వరూపమును పొందుము. కుండలో బియ్య మున్నప్పుడు వానిని తొలఁగించినచో వెంటనే ఆకాశము దానిని నింపివేయును. కుండలో ఆకాశమును నింపుటకు ప్రయత్న మక్కఱ లేదు. అట్లే మనస్సులోనున్న సంకల్పములను తొలఁగించిన చాలును. ఆత్మస్వరూపమును నింపుటకై ప్రయత్నము అక్కఱలేదు. ఆత్మదానియందు సహజముగనే నిండి యుండును. కావున సంకల్పములను తొలఁగించి క్షణకాలము స్వరూపమును ఆశ్రయించి ఆలోచన లేకుండ నుండుము. తరువాత ఆస్వరూపస్థితిని స్మరించి ఆదశయందు కలుగుచుండిన స్ఫురణము స్వతసిద్ధముగానున్నదా లేక మఱిదేనిచేతనైనను కలుగుచున్నదా అని విమర్శింపుము. అట్లు విమర్శించుటవలన "తెలిసికొనుటకు సాధ్యము కానిదిగానున్న యాత్మచైతన్యము ఇట్లు కదా తెలియఁబడుచున్నది" అని ఆప్రకారమంతయు నీవు తెలిసికొనఁగలవు. ఈకారణముచేత ఆత్మతత్త్వము అవేద్యము (Unknowable) సువేద్యము (Easily knowable) అనియు అనియు చెప్పఁబడుచున్నది. కావున ఈ విధముగా అవే ద్యమైన దానిని కూడ తెలిసికొని అమృతస్థితిని పొందవచ్చును. నీ వడిగిన దంతయు చెప్పితిని మునిపుత్ర! నీకు నమస్కారము. నేను పోయివత్తును. ఒక్కసారి మాత్రమే వినుటచేత ఇది నీకు చక్కఁగా తెలియక పోవచ్చును. నీసందేహములను ఈరాజు నడుగుము. ఈయన బుద్ధిమంతులతో శ్రేష్ఠుఁడు. నీసందేహముల నన్నింటిని తీర్పఁగలఁడు.

పిమ్మట రాజు ఆమెను పూజించెను. సభాసదులు ఆమెకు ప్రణమిల్లిరి. గానిచేత చెదరి మాయమైపోవు సన్నని మేఘమువలె ఆమె క్షణములో అంతర్ధానమును పొందెను. కావున భార్గవా! తత్త్వమును తెలికొనుటకు పద్ధతి యిట్టిది."

జ్ఞానఖండమునందు అష్టావక్రునికథ యన్నది పంచదశాధ్యాయము.

# పదునాఱవయధ్యాయము -అష్టావక్రజనకసంవాదము

భార్గవుఁడు విస్మితుఁడై దత్తాత్రేయునితో నిట్లనెను. "భగవాసుఁడా! నీవు చెప్పనయీకథ అద్భుతముగా నున్నది. దీనిని నేను ఎక్కడను వినలేదు. ఆమహాముని జనకుని ఏమి యడిగెనో ఆ రాజేంద్రుఁడు ఏమి సమాధానము చెప్పెనో అది యంతయు నాకు దయతో చెప్పుఁడు."

దత్తాత్రేయుఁడు ఇట్లు చెప్పెను. "ఆతాపసి వెడలిపోయినంతనే అష్టావక్రుఁడు చాలమందివిప్రులతో కూడి జనకుని సమీపించి పలికెను. 'మహారాజా! ఆతాపసి చాల సంక్షేపముగా చెప్పుటవలన ఆత్మతత్త్వము నాకు చక్కఁగా బోధపడలేదు. తెలిసికొనుటకు వీలులేనిదానిని నే నెట్లు తెలిసికొనఁగలనో దయతో చెప్పుము.'

అప్పుడు జనకుఁడిట్లు చెప్పెను. "అది సకల విధముల అవేద్యము కాదు; వేద్యము కూడ కాదు. అది సకల విధముల తెలిసికొనుటకు వీలులేనిదే అయినచో గురువు ఎట్లు చెప్పఁగలఁడు? కొందఱ కది చక్కఁగా తెలియును. అట్టి గురువే దానిని తెలియునట్లు చేయవలె. కాఁబట్టి మొట్టమొదట సద్గురువును ఆశ్రయింపవలె. దీనిని తెలిసికొనుటకు ఒకవిధముగా సులభ మైనను మఱియొక విధముగా దుర్లభము. అంతర్ముఖమైన దృష్టికలవానికి ఇది సులభము; బహిర్ముఖమైన లోకదృష్టి కలవానికి ఇది దుర్లభము. సాధారణముగా చెట్టునో జంతువునో చూపి దానినిగూర్చి బోధించుపద్ధతిలో ఆత్మను నిరూపించుటకు వీలే లేదు; తెలిసికొనుటకు అసలే వీలు లేదు. కాని ఇంకొకవిధముగా దానిని నిరూపింపవచ్చును; అప్పు డది తెలిసికొనుటకును వీలగును,

నీవు దేనిని చూచుచున్నావో దానిని వేద్యము (Knowable) అనుచున్నావు. నీకు ఏది భాసించుచున్నదో దానిని చక్కఁగా విమర్శింపుము. వృక్షమును చూచినప్పుడు నీకు వృక్షజ్ఞానము కలుగుచున్నది. దానియందు వృక్షము జ్ఞానము అను రెండుభాగములు కలవు. వృక్షము భాసించుచున్నపదార్థము. దీనినే భాస్య మందురు. జ్ఞానము దానిని భాసింపఁజేయుచున్నది. దీనిని భానశక్తి యందురు. వృక్షమును జంతువులు మొదలుగా భాస్యములు (Objects of knowledge) ఎన్ని మాఱినను నీభానశక్తి మాఱదు. వృక్షజ్ఞానము జంతు జ్ఞానము మొదలుగా సకలజ్ఞానములకు అదియే ఏకరూపమైన యాధారము. ఆభానశక్తియే ఆత్మ. భాస్యములకు భానశక్తికి మిక్కిలి అంతరము కలదు. భాస్యమైన పదార్థము స్వయముగా ప్రకాశింపలేదు. అది భానశక్తి చేతనే ప్రకాశించును. భిన్నభిన్నములైన భాస్యములన్నియు దానిచేతనే మనకు గోచరించుచున్నవి. భాస్యముల యొక్క భిన్నభిన్నరూపములచేత భానశక్తియందు భేదము కలుగదు. ఆకారభేదము లన్నియు భాస్యములకు సంబంధించినవే కాని భానమునకు సంబంధింపవు. ప్రతిబింబములయొక్క ఆకారబేదములవలన అద్దమునందు భేదము కలుగుట లేదు కదా? నీయనుభవమునందే నీవు దీనిని గ్రహింపవచ్చును. భాస్యములను గ్రహించుచున్న బుద్ధినుండి ఆభాస్యములయొక్క రూపములను వేఱుచేసి కేవలము భానశక్తిగా లేక జ్ఞానరూపముగా నుండు బుద్ధిని చూడుము. దృశ్యములయొక్క ఆకారములచేత జ్ఞానము వివిధరూపములతో కన్పించుచున్నదే కాని దానికి అసలు ఆకారమే లేదు. కావున దృశ్యములయందుండు ఆకారములను ప్రతిదానిని "ఇది జ్ఞానము కాదు" "ఇది జ్ఞానము కాదు" అని తొలగించుచున్నచో ఆకారరహితమైన జ్ఞానము స్ఫురించును. అదియే యథార్థమైన నీస్వరూపము. విశ్వమునకు కూడ అదియే స్వరూపము. తనకు స్వరూపమగుటచేతనే ఎవఁడును ఎదుటనున్న చెట్టునో గుట్టనో గ్రహించినట్లు ఆత్మను గ్రహింపలేకున్నాఁడు. కావున సకల పదార్థములను గ్రహించుచు జ్ఞానమాత్రముగ నీయందే యన్న నీస్వరూపమును ఇట్లు స్పష్టముగా గుర్తింపుము.

శరీరము నీవు కాదు. ప్రాణము నీవు కాదు. మనస్సు కూడ నీవు కాదు. ఎందువల్ల ననఁగా, "నాశరీరము, నాప్రాణము, నా మనస్సు" అని చెప్పుచున్నావు; శరీరము ప్రాణము మనస్సు ఎన్ని విధములుగా మాఱుచున్నను వానిని గ్రహించుచు జ్ఞానరూపముననున్న నీవు మార్పులేక స్థిరముగా నున్నావు. నీవు స్థిరుఁడవు. అవి అస్థిరములు. కావున అవి ఏవియు నీవు కాదు. "నాయిల్లు" అని నీవు చెప్పుచున్నప్పుడు ఇల్లు నీకన్న అన్య మనుట స్పష్టము. ఇల్లు నీవు కాదు, అట్లే నాశరీరము అని చెప్పుచున్నావు కావున శరీరము నీవు కాదు. అట్లే "నాప్రాణము, నామనస్సు" అని నీచేత చెప్పఁబడుచున్న ప్రాణము మనస్సు కూడ నీవు కాదు. చైతన్యము లేక జ్ఞానము ఒక్కటియే నేను అను స్ఫురణమునందు నిత్యముగ నిలిచియున్నది. తక్కినవి ఏవియు నిలుచుట లేదు. కావున సర్వమును తెలిసికొనుచున్న జ్ఞానము మాత్రమే నీవు. ఎప్పుడో ఎక్కడనో కాదు; ఇప్పుడే ఇక్కడనే నీదృష్టిని బహిర్విషయములనుండి మరలించి కేవలజ్ఞాన మాత్రముగనున్న యాత్మను చూడుము. ఉత్తమమైనబుద్ధి కలవారు గురువు ఉపదేశించినవెంటనే స్వరూపమును చూచుచున్నారు.

మఱియొక విషయమును గమనింపుము. చక్షుస్సు అఁనగా శరీరమునందు కన్పించుచున్న కన్ను కాదు. స్వప్నమునందు ఈ కన్ను ఉండదు. కాని అక్కడ మనస్సుతో చూచుచునే యున్నావు. కావున మనస్సే ముఖ్యమైన చక్షుస్సు. ఎందువల్ల ననఁగా నీవు ఏదేని ఒకవస్తువును చూడఁదలచుకొన్నప్పుడు మనస్సును ఆవస్తువునందు నిలిపినప్పుడే అది నీకు గోచరించుచున్నది. అట్లుకాక మనస్సు వేఱొక విషయమునందు లగ్నమై యుండి చక్షురింద్రియములోనికి వచ్చి నిలువకున్నచో ఎదుటనున్న వస్తువు కూడ సరిగా కన్పించదు. శ్రోత్రము మొదలుగా చక్కినయింద్రియములవిషయము కూడ ఇంతే. మనస్సు వానితో కూడియున్నప్పుడే ఆయింద్రియములు విషయములను గ్రహింపఁగలవు; లేకున్నచో గ్రిహింపలేవు. కావుననే ఏదేని ఆలోచనమునందు మనస్సు గాఢముగ లగ్నమై యున్నప్పుడు ఎవరైనను దగ్గరికి వచ్చి మాటాడినను. "అయ్యా! ఏమి అనుకోవద్దు. నా మనస్సు ఎక్కడనో ఉన్నది. అందువలన నీవు వచ్చుటను నేను గమనింప లేదు. నీవు అన్నదియు నాకు వినఁబడలేదు." అని చెప్పుట సంభవించుచున్నది. కావున సకలేంద్రియములకు గ్రహణశక్తి నిచ్చుచున్నది మనస్సే. ఇట్లే మనస్సువలననే సుఖదుఃఖములు భాసించుచున్నవి. మనస్సు సుఖమునందు మగ్నమై యున్నప్పుడు దుఃఖము కాని, దుఃఖమునందు మగ్నమై యున్నప్పుడు సుఖము కాని భాసించుట లేదు. కావున ఏవస్తువుయొక్క స్వరూపము నైనను మనము గ్రహించవలెన నని యనుకొన్నప్పుడు మనస్సును ఇతర విషయముల నుండి మరలించి ఆవస్తువునందు నిలిపినప్పుడే అది గోచరించుచున్నది. అట్లే ఆత్మస్వరూపమును గ్రహించునప్పుడు కూడా మనస్సును

ఇతరములైన సకలవిషయములనుండి మరలింపవలయును. మనస్సు విషయములపై ప్రసరింపకుండ నిలిచిన చాలును. అది తతక్షణమే శుద్ధమైన ఆత్మను భాసింపఁజేయును.

ఇచ్చట ఒకవిషయమును చెప్పెదను శ్రద్ధగా వినుము. చిదాత్మమనస్సునకు ఆగోచర మగును; గోచరము కూడ అగును. ఈవిషయమున శ్రుతులను ఆగమములను విమర్శించువారు చాలమంది భ్రాంతి నొందుచున్నారు. వెలుపలనున్న వస్తువులు మనస్సునకు గోచరించుటలో రెండుదశలున్నవి. దేనిని చూచుచున్నమో దానియందుతప్ప మనస్సు ఇతరవస్తువులందు ప్రసరింపకుండుట మొదటిదశ. తరువాత ఆవస్తువునందే ఆసక్తితో నిలిచియుండుట రెండవదశ. ఇతర వస్తువులయందు దృష్టి ప్రసరింపకుండుట ఎంత ఆవశ్యకమో చూచుచున్న వస్తువునందు దృష్టి ఆసక్తితో నిమగ్నమగుటయు అంతేఆవశ్యకము. ఇతరవస్తువులనుండి దృష్టిమరలినను చూచుచున్న వస్తువునందు ఉదా సీనత తాటస్థ్యము ఏర్పడినచో దృష్టి ప్రసరింపలేక పోయినచో (Becoming blank) ఆవస్తువు సరిగా భాసింపదు. ఆందువలన మనము చూచుచున్న వస్తువునందు దృష్టి ఆసక్తమగుట ఆవశ్యకము. ఇట్లు వెలుపలనున్న వస్తువులను గ్రహించుటలో మనస్సునకు ఈ రెండుదశలలో రెండువ్యాపారములు ఆవశ్యకి మగును. ఆత్మచైతన్యమును భాసింపఁజేయుటకు మాత్రము రెండువ్యాపారము లక్కఱ లేదు. మనస్సు ఇతర వస్తువులనుండి మరలివచ్చుట ఒక్కటియే చాలును. అది ఆవిషయములనుండి వెనుకకు వచ్చినంతనే ఆత్మ భాసించును. అద్దములో కన్పించుచున్న ప్రతిబింబములలో ఒకదానిని చూడవలయు నన్నచో తక్కినవానిని వదలి దృష్టిని దానియందే నిలుపుట ఆవశ్యకము. కాని అద్దమునందు అంతటను ఎల్లప్పుడు వ్యాపించి యుండునట్టి ఆకాశప్రతిబింబమును చూచుటకు ఇతర ప్రతిబింబముల నుండి దృష్టి మరలించిన చాలును. వెంటనే ఆకాశ ప్రతిబింబము గోచరించును. దానిపైచూపు నిలుపుటకు ప్రత్యేక ప్రయత్న మక్కఱ లేదు. దాని నంతవఱకు కప్పుచున్న ప్రతిబింబములనుండి దృష్టి మరలించుట యన్న యొక్కప్రయత్నముచేతనే అద్దమునంతను ఎప్పుడును వ్యాపించియున్న యాకాశము గోచరించును. అట్లే ఆత్మ గోచరించుటకు కూడ రెండు యత్నములు అక్కఱలేదు. సకలపదార్థములయందువలె మనస్సులో కూడ నిండియున్నది ఆత్మయే. ఆవరించియున్న విషయము లన్నియు తొలఁగినంతనే మనస్సునకు స్వరూపమైన ఆత్మ భాసించును. బావి తవ్వునపుడు మట్టిని తొలఁగించుటకు ప్రయత్నము కావలమును కాని నీటికొఱకు ప్రయత్నింపనక్కఱలేదు. అది మట్టిమడుగున సిద్ధముగనే యుండును. కావున చిదాత్మ గోచరించుటయందు మనస్సు సకల విషయములనుండి వెనుకకు మరలుటయే ఆవశ్యకము. ఇతర వస్తువు విషయమున దానిని చేరునట్లు. తన్ను తాను చేరుట అన్నది లేదు. ఏవస్తువును ఇంద్రియముద్వారా మనస్సుచేరి తెలిసికొనుచున్నదో అది మనస్సునకు వేద్య మగును. అట్లు మనస్సు ఆత్మవిషయమున వెలుపలికి పోనక్కఱ లేదు. కావుననే మనస్సునకు ఆత్మ అవేద్య మని చెప్పఁబడుచున్నది. ఈకారణముచేతనే శుద్ధమైన మనస్సే వేద్యమైన యాత్మతత్త్వ మని చెప్పఁబడుచున్నది. సకలవిషయములనుండి తొలఁగి నిలుచుటయే మనస్సునకు శుద్ధి. ఈశుద్ధియే తత్త్వజ్ఞానమునకు పరమసాధనము. ఎంతవఱకు మనస్సు శుద్ధము కాదో అంత వఱకు జ్ఞాన మెట్లు కలుగును? మనస్సు శుద్ధమైనచో జ్ఞానము కలుగకుండ నెట్లుండును? కర్మానుష్ఠానము ఉపాసనము వైరాగ్యము మొదలగు సాధనము లన్నియు మనస్సునకు శుద్ధి కలిగించుటకే ఉపయోగించుచున్నవి. వాని కన్నింటికి అదియే ఫలము. కావున శుద్ధమైన మనస్సుచేతనే ఆత్మ భాసించుచున్నది."

అంతట అష్టావక్రుఁడు ఇట్లు ప్రశ్నించెను. "మహారాజా! సకల విషయములనుండి మనస్సు మరలినంతనే కేవలమైన యామనస్సు చేతనే ఆత్మ భాసించు నని చెప్పితివి. గాఢనిద్రయందు మనస్సు విషయములతో సంబంధము నొందక కేవలముగా నుండును. కావున సుషుప్తి మాత్రముగనే కృతార్థత కలుగుచుండఁగా ఇతసాధనములతో పని యేమున్నది?"

జనకుఁడిట్లు సమాధానము చెప్పెను. "నిజమే. నిద్రలో మనస్సు విషయములతో సంబంధమును పొందదు. కాని అది అప్పుడు నిద్రలో లీన మగును. అప్పుడు వస్తువును భాసింపఁజేయు నట్టి దాని శక్తియు పనిచేయదు. అప్పుడు ఆశక్తియు దానియందే లీనమై యుండును. అట్టిమనస్సు ఆత్మను ఎట్లు భాసింపఁజేయఁగలదు? అద్దముపై కాటుకను పూసినపుడు దానియందు ఇతరవస్తువులు ప్రతి బింబింపకుండ నున్నంతమాత్రమున ఆకాశము దానియందు ప్రతిబింబింపదు. అట్లే నిద్రచేత ఆవరింపఁబడిన మనస్సు విషయములతో సంబంధమునుపొందకుండినంతమాత్రమున ఆత్మను భాసింపఁజేయఁజాలదు. ఆసమయమునం దది విషయములను గ్రహించుటకు ఎట్లు అయోగ్యమై యున్నదో

అట్లే ఆత్మను భాసింపఁజేయుటకును ఆయోగ్యమే యగుచున్నది. నిద్రలో తమస్సుచేత ఆవరింపఁబడిన మనస్సు వలన కూడ ఆత్మ భాసించుట సంభవ మైనచో మట్టిగోడవలన కూడ అది భాసింపవలసియుండును. కావున శుద్ధమైయోగ్యమైన మనస్సునకే ఆది భాసించును. యోగ్యత లేకుండుటవలననే అప్పుడే పుట్టిన శిశువు యొక్క మనస్సునందు ఏదియు భాసించుట లేదు. అద్దమునకు మసిపూసినచో ఆమసియొక్క ప్రతిబింబము అద్దమునందు వ్యాపించియుండును. ఆప్రతిబింబము మనకు కన్పింపదు. వస్తువు అద్దమునకు ఎదురుగా ఎడముగా నున్నప్పుడు మనకు ఆవస్తువుయొక్క ప్రతిబింబమును అద్దములో చూచుటకు అవకాశము ఉండును. అట్లుకాక మసి అద్దమునకు అత్యంతము సన్నిహితముగా ఉండుటచే దానియొక్కప్రతిబింబమును చూచుటకు మనకు అవకాశము కలుగుట లేదు. కాని అంతమాత్రమున ఎదుటనున్న వస్తువును తనయందు ప్రతిబింబింపఁజేసికొనుట అను స్వభావము అద్దమునకు పోయిన దని చెప్పఁజాలము. అప్పుడు మసియొక్క ప్రతిబింబముచేత అద్దము నిండిపోయిన మఱి యొక వస్తువుయక్క ప్రతిబింబమును గ్రహింప లేకున్నది అని మాత్రమే చెప్పవలసియుండును. అట్లే నిద్ర ఆవరించినప్పుడు దాని ప్రతిబింబముచేత మనస్సు నిండిపోయి ఇంకొక వస్తువుయొక్క ప్రతిబింబమును గ్రహింపలేనిస్థితియందు ఉండును. అందువలన అప్పుడది ఆత్మస్వరూపమును కూడ గ్రహింపలేదు. అది నిద్రయొక్క ప్రతిబింబమును గ్రహించుచుండుటవలననే మేల్కొన్నవాఁడు "నేను సుఖముగా నిద్రించితిని" అని స్మరించుచున్నాఁడు. దేనిని పూర్వము అనుభవించితిమో దానిని ఇప్పుడు స్మరింతుము, అనుభవింపని దానిని స్మరించుట అసంభవము. కావున సుషుప్తియందు నిద్రయొక్క ప్రతిబింబమును గ్రహించుచు మనస్సు తన్మయమై అన్యవస్తువును గ్రహింపలేకున్న దనుట స్పష్టము.

ప్రకాశము విమర్శ అని మనస్సునకు రెండుదశలు కలవు. వెలుపనున్న పస్తురూపమును మాత్రమే గ్రహించుట ప్రకాశము. ఆరూపమునుగూర్చి వెంటనే మనస్సులో పుట్టునట్టి యాలోచనము విమర్శ, మొదటిదశలో ఇది యేదో ఒకవస్తువు అను సామాన్య జ్ఞానము మాత్రమే యుండును. రెండవదశలో "ఇది చెట్టు. ఇది పండు" అని భిన్నశబ్దములతో వస్తువులయొక్క విశేషజ్ఞానము కలుగును. ప్రతివస్తువువలన మొదటఁగలుగుచున్న సామాన్యజ్ఞానమును ప్రకాశ మని నిర్వికల్ప మనియు చెప్పుదురు. భిన్నశబ్ధములతో వస్తువులవలన కలుగుచున్న విశేషజ్ఞానమును విమర్శ అని సవికల్పమనియు చెప్పుదురు. విమర్శజ్ఞానము అభినవము స్మృతి అని రెండు విధములు. మొదటిసారి ఒకవస్తువును చూచినప్పుడు "ఇది యిట్టిది. దీనిని మామిడిపండు అందురు" అని మొదటి అనుభవముచేత కలుగు జ్ఞానము అభినవము. రెండవసారి అటువంటిపండునే చూచి గాని తిని గాని "ఓహో ఇది మామిడిపండు" అని మొదటియనుభవమును స్మరించుటవలన కలుగుజ్ఞానము స్మృతి.

మనస్సునకు ప్రకాశము విమర్శ అనునీరెండు శక్తులు ఎప్పుడును ఉండును. సాధారణముగా వస్తువుయొక్క రూపము ప్రకాశించి నంతనే మరుక్షణమున "ఇది యిట్టిది. ఇది పండు" అను విమర్శ జ్ఞానముకలుగును. ఈరెండు దశలకు మధ్యనున్న యంతరము అత్యంతము సూక్ష్మ మగుటచే గోచరముకాదు. అయినను అంతరము మాత్ర ముండును. నిద్ర మనస్సునందు ప్రకాశించుచున్నప్పుడు "ఇది నిద్ర" అను విమర్శజ్ఞానము వెంటనే పుట్టదు. విమర్శజ్ఞానములేని యాప్రకాశదశ నిద్ర కొనసాగినంతవఱ కుండును. విమర్శజ్ఞానములేని యాస్థితిని మూఢదశ యని కూడ చెప్పుదురు. మెలఁకువ వచ్చినంతనే పెక్కు వస్తువులయొక్క విమర్శజ్ఞానము కలుగుచుండును. అందు వలన జాగ్రద్దశను అమూఢదశ అనియు చెప్పుచున్నారు. ఇట్లే దీపముయొక్క ప్రకాశము నిబిడముగా నున్నను దానియందు విమర్శజానము లేకుండుటచే దీపము మొదలగువానియొక్క ప్రకాశమును కూడ మూఢ మనియే చెప్పుచున్నారు.

ఆత్మయందు సంకోచ మేర్పడి వెలుపల ఏదో యున్నట్లు మొదట తోఁచుట ఏది కలదో అదియే మాయ లేక అవ్యక్తము అని చెప్పియుంటిని. ఆయవ్యక్తమే జగత్తు అను చిత్రము భాసించుటకు ఆధారమైన గోడవలె నున్నది. అదియే నిద్ర, దానియందు నామ రూపములతో ఏదియు వ్యక్తము (Manifest) కాదు కావున దానిని అవ్యక్తమనుచున్నాము. అందు ఏదియు భాసింపకుండుటవలననే దానిని మహాశూన్య మనియు చెప్పుచున్నారు. నిద్రనుండి లేచినతరువాత "నాకేమియును తెలియ లేదు" అని స్మరించుచున్నాము కాఁబట్టి సుషుప్తియందు "ఏదియు లేకుండుట" (Absence of every thing) అన్నది మనస్సునందు ప్రకాశించుచునే యున్నది. "అయ్యా! నిద్ర యందు మనస్సు విలీన మగు నని యితరులు చెప్పుచున్నారు. మీరు నిద్రయందు మనస్సు నిద్రాప్రకాశనిబిడమై యుండు ననుచున్నారు. ఈరెండును ఎట్లు కుదురును? అని యందు వేని వినుము. నిద్రయందు మనస్సు ప్రతిక్షణభిన్నములైన

పరిణామములను పొందక నిర్వికల్పముగా నిశ్చలముగా నుండుటచేత అది విలీనమై యుండు నని వారు తలంచుచున్నారు. నిద్రను తనయందు ప్రతిబింబింపఁజేసికొనుచు మనస్సు ప్రకాశస్థితియందు ఉండునవి మేము చెప్పుచున్నాము. కావున ఎట్లు చెప్పినను వస్తుస్థితియందు భేదము లేదు. జాగ్రద్దశలో కూడ వస్తువును చూచిన తొలిక్షణమునందు మనస్సు ప్రకాశమును మాత్రమే పొంది విమర్శను పొందక లీనమైయుండును, కాని మఱుక్షణముననే ఆస్థితి వికల్పజ్ఞానములయొక్క పరంపరచేత మాయమై పోవుచున్నది.

నాయనుభవము ననుసరించి నీకొక రహస్యమును చెప్పెదను వినుము. ఈవిషయమున విద్వాంసులుకూడ భ్రాంతి నొందుచున్నారు. నిర్వికల్పసమాధియందు నిద్రయందు వస్తుదర్శన క్షణమునందును ప్రకాశము దట్టముగా నుండుట సమానమే. చిదాత్మ స్వప్రకాశమాత్రముగా నుండుట నిర్వికల్పసమాధి. మనస్సు అవ్యక్తమాత్రముగా ప్రకాశించుచుండుట నిద్ర, చెట్టు తీగె మొదలగు పదార్థములు నామరూపరహితముగా వస్తువు మాత్రముగా మనస్సునందు ప్రకాశించుట వస్తుదర్శనము. ఈమూఁడింటియందును, "ఇది యిట్టిది" అని శబ్దములతో విమర్శనము ఉండదు; ప్రకాశ##మే నిబిడముగ నుండును. వీని యందు ప్రకాశనిబిడత్వము సమానమే యైనను వీనికి అనంతరము కలుగుచున్న విమర్శనమునందు భేధ మేర్పడుచున్నది. అందువలననే ఇవి భిన్నస్థితులుగా నున్నవి. సమాధి ముగిసినంతనే, "నేను ఇంత కాలము ఊరకయుంటిని" అని విమర్శ ఆరంభ మగును. నిద్ర ముగిసినంతనే "నా కేమియు తెలియలేదు" అని విమర్శ ఆరంభ మగును. వస్తుదర్శనము ముగిసినంతనే "ఇది చెట్టు, ఇది తీగె" అని విమర్శ ఆరంభ మగును. ఈవిమర్శల భేదములవలననే "ఇది సమాధి". "ఇది నిద్ర", "ఇది వస్తుదర్శనము" అని బేదములను గ్రహించుచున్నాము. అట్లే సమాధియందు కేవలచైతన్యము, నిద్రయందు అవ్యక్తము, వస్తుదర్శనమునందు వస్తుమాత్రము అని భిన్నవిషయములు భాసించుచున్నను, ప్రకాశము మాత్రము మూఁడింటియందును నిర్వికల్పముగా నిబిడముగా నుండును, సామాధి సుషుప్తి చాలసేపు ఉండనవి యగుటచే అవి ముగిసిన తరువాత ఎల్లరను వానిని గుర్తించుచున్నారు. వస్తుదర్శనము క్షణకాలము మాత్రమే యుండునది యగుటచే దానిని అందఱును స్పష్టముగా గుర్తింపలేకున్నారు. అట్లే సమాధి నిద్ర కూడ ఒక్కొక్కప్పుడు క్షణకాలములో వచ్చిపోవుచుండును. అప్పుడు సూక్ష్మదృష్టి కలవారు నిద్ర పరిచితమైన దగుటచే "క్షణములో నిద్ర వచ్చినది" అని గుర్తించుచున్నారు. అట్లు క్షణకాలము సమాధి కలిగినప్పుడు దానియొక్క పరిచయము అంతకుపూర్వము లేనివారు "క్షణములో సమాధి కలిగినది" అని గుర్తింపలేకున్నారు. అయ్యో! వ్యవహారదశలయందు సకలప్రాణులకును సూక్ష్మముగా సమాధిస్థితులు కలుగుచుండును, ఆస్థితియొక్క పరిచయము లేకపోవుటచేత అవి సమాధిస్థితు లని వారికి తోఁచవు. జాగ్రద్దశలో మనస్సులో విమర్శ పుట్టకున్నచో అచి సమాధి యగును. విమర్శ లేకుండుటయే సమాధి. కావుననే సుషుప్తియందు వస్తుదర్శనమునందును సమాధి యున్నది. కాని అది ముఖ్యసమాధి కాదు. సుషుప్తి యందు నిద్ర వస్తుదర్శనము నందు నామరూపసంస్కారములు సన్నిహితములై యుండుటయే అందులకు హేతువు. నిద్రనుండి లేచినవాఁడు "నా కేమియు తెలియ లేదు" అని స్మరించుచున్నాఁడు. అనఁగా నిద్రయందు సకలదృశ్యముల యొక్క అభావముయొక్క అనుభవమును (Experience of the absence of every thing) పొందుచున్నాఁడన్నమాట. ఆయభావజ్ఞానమే అవ్యక్తము. సృష్టియొక్క ఆరంభమునందు ఆత్మకు వెలుపల ఏదో ఉన్నట్లు మొదట పుట్టినదే ఈయవ్యక్తము. ఇదియే చిదాత్మ యొక్క జడశక్తి. ఈజడశక్తితో కూడిన సుషుప్తి సమాధి ఎట్లు కాగలదు? అనాత్మవిషయములనుండి మరలిన మనస్సు చిదాత్మాకారముతో నుండుట సమాధి. ఇందు జడశక్తికి ఆవకాశము లేదు. సమాధియందు ప్రకాశించునట్టి చైతన్యశక్తి బ్రహ్మరూపిణి. దాని యందు దేశకాలములు భావింపవు. దేశకాలములకు అతీతముగా సకలముయొక్క అస్తిత్వము అప్పుడు భాసించుచుండును. అందువలన అది నిద్రయందువలె అభావజ్ఞానముకాదు; అది భావజానమే. కావున సుషుప్తి మాత్రమున కృతార్థత లేదు."

ఇది వష్టావక్రజనకసంవాదమున షోడశాధ్యాయము.

# పదునేడవయధ్యాయము - సమాదిస్థితివివరణము

జనకుఁడు చెప్పినది విని అష్టావక్రుఁడు మరల ఇట్లు అడిగెను. "మహారాజా! వవ్యహారదశలయందును నిర్వికల్పములు చిదాత్మకములును అయిన సమాధిస్థితులు సూక్ష్మమములుగా నుండు నని చెప్పితివి. అవి ఏదశలయందు సంభవించునో స్పష్టముగా చెప్పుము."

జనకుఁడు ఇట్లు చెప్పెను. "ప్రియురాలిచేత మొదట గాఢముగా కౌఁగిలింపఁబడినప్పుడు పురుషుండు క్షణకాలము వెలుపల లోపల ఏ విషయమును ఎఱుంగక నిద్రను పొందక నిశ్చలత నొందును. అది సమాధియే. అలభ్య మనుకొన్న వస్తువు అనుకొనకుండ లభించినప్పుడు నిద్ర లేకయే క్షణకాలము మనస్సునకు నిశ్చలత కలుగుచున్నది. అదియు సమాధియే. నిర్భయుఁడై సంతోషముతో ఎక్కడికో పోవుచున్నవానికి ఆకస్మికముగా మృత్యువువలె వ్యాఘ్రమో కాలసర్పమో ఎదురైనచో క్షణకాలము మనస్సు నిశ్చలమగును. అది సమాధియే. ఆరోగ్యవంతుఁడు కుటుంబభరణదక్షుఁడు అత్యంత ప్రియుఁడును అయిన కుమారుఁడు మృతి నొందె నని విన్నప్పుడు తండ్రికి వెలుపల లోపల ఏదియు తోఁచక మనస్సు క్షణము నిశ్చల మగును. అదియును సమాధియే. అనఁగా మహాసుఖము మహాభయము మహాదుఃఖము ఆకస్మికముగా సంభవించినక్షణమునందు మనస్సు విమర్శను కోల్పోయి స్వరూపస్థితిని పొందును. ఇవి యన్నియు క్షణికములైన సమాధులు. ఇట్లే జాగ్రద్దశనుండి నిద్రలోనికి జాఱునపుడు, నిద్రలో స్వప్నము ఆరంభ మగునపుడు, స్వప్నము ముగిసి నిద్ర పైకివచ్చునప్పుడు, నిద్ర ముగిసి జాగ్రద్దశలోనికి వచ్చునప్పుడు క్షణకాలము మనస్సు దేనిని గ్రహింపక విమర్శరహితమై సమాధిస్థితి నొందును. దూరమునందున్న ఏదేని ఒకపదార్థమును ఏకాగ్రమగు బుద్ధితో చూచుచున్నప్పుడు మనస్సు దీర్ఘమై దేహమునందు దేహరూపముగా ఆపదార్థమునందు ఆపదార్థరూపముగా ప్రసరించును. దేహమునకు ఆపదార్థమునకు నడుమ పెద్దత్రాడువలె ప్రసరించియున్న మనస్సు ఏరూపమును పొందక నిర్వికల్పముగా నుండును. ఆవిధముగా కేవలమైన మనస్సును (Pure mind) చూచుచుందుము.

ఇంత ఎందుకు? ఒకమాట వినుము. ఈవ్యవహార మంతయు భిన్నములైన ఖండజ్ఞానముల (Pieces of knowledge) సముదాయముగా జరుగుచున్నది. చెట్టునందు ఒకఖండజ్ఞానము, పండునందు మఱియొక ఖండజ్ఞానము కలుగును. ఈఖండజ్ఞానము లన్నియు తరంగముల వంటివి. తరంగములకు లోపలనున్న అఖండమైన జలమువలె వివిధఖండజ్ఞానములకు ఆధారముగానున్న యేకరూపమైన జ్ఞానము వ్యవహారమునందు ఎవరికిని స్ఫురింపదు. ఈకారణముచేతనే క్షణక్షణమునకు మాఱుచున్న జ్ఞానప్రవాహము (Flow of knowledge) ఆత్మ అని కొందఱు, అట్టిజ్ఞానప్రవాహము ఆత్మకు ధర్మమైన బుద్ధి యని మఱికొందరు ఆచార్యులు చెప్పుచున్నారు. ఆక్షణికజ్ఞానముల ప్రవాహములో ఒకక్షణికజ్ఞానమునకు మఱియొకక్షణికజ్ఞానమునకు మధ్యలో మనస్సునకు నిర్వికల్ప దశ ఉన్నది. కావున తెలిసికొనఁగలిగినవానికి వ్యవహారమునందు కూడ ప్రతిక్షణము సమాధి యున్నది. ఇతరులకు అది కుందేటికొమ్మువలె అసంభవముగానే తోఁచును."

అది విని అష్టావక్రుఁడు మరల ఇట్లు అడిగెను. "వ్యవహారము నందు ఉన్నవారికి కూడ సమాధి సంభవమైనచో సంసారము ఎట్లు జరుగచున్నది? సుషుప్తియందు జడమైన అవ్యక్తము భాసించుచుండుటవలన ఆదశయందు కృతార్థత లేదు. కాని యిప్పుడు మీరు చెప్పుచున్న నిర్వికల్పదశ సమాధియే కదా! అందు శుద్ధమైనచైతన్యమే భాసించుచుండును. ఆచైతన్యము సకలమైన యజ్ఞానమును నశింపఁజేయును. అట్టి నిర్వికల్పసమాధి కలిగినవానికి మరల సంసార మెట్లు సంభవించును.?"

జనకుఁడిట్లు చెప్పెను. "ఈసంసారము అనాదిగా సుఖదుఃఖ ప్రవాహరూపమున మహాస్వప్నమువలె ఎల్లరచేతను అనుభవింపఁబడుచున్నది. దీనికి మూలమైన యజ్ఞానము జ్ఞానముచేతనే తొలఁగునని విద్వాంసులచేత నిశ్చయింపఁబడినది. సవికల్పజ్ఞానమే ఆయజ్ఞానమును తొలఁగించును. నిర్వికల్పజ్ఞానమువలన ఆయజ్ఞానము నశింపదు. నిర్వికల్పజ్ఞానము, చీఁకటికి వెలుఁగువలె, దేనికిని విరోధి కాదు. చిత్రవిచిత్రములైన బొమ్మలకు గోడ ఆధారముగా నున్నట్లు వికల్పజ్ఞానములకు అన్నింటికిని నిర్వికల్పజ్ఞానము ఆధారముగా నున్నది. ప్రతిబింబములు లేని యద్దమే కేవలమైన యద్దమైనట్లు, వికల్పములేని జ్ఞానమే కేవలజ్ఞానము. దానియందు ఎన్నివిధములైన వికల్పములు వస్తువుల వివిధత్వమునుబట్టి భాసించుచున్నను అది ఏవికల్పమును అడ్డగింపదు. అద్దము ఏప్రతిబింబమును అడ్డగింపదు కదా! సంసారమునకు మూలమైన యజ్ఞానము కూడ ఒకవికల్పజ్ఞానమే.

ప్రతిబింబమును అద్దము అడ్డగింపలేనట్లు కేవలజ్ఞానము కూడ తనయందు ప్రతిబింబించుచున్న యీవికల్పజ్ఞానమును అనఁగా అజ్ఞానమును అడ్డగింపదు. కావుల కేవలజ్ఞానముచేత అజ్ఞానము తొలఁగదు.

సంసారమూలమైన యజ్ఞానము కార్యకారణరూపమున అనేక విధములుగా నున్నది. ఆత్మయందు పూర్ణత్వము తోఁచకుండుట కారణమైన యజ్ఞానము. విభాగములులేని యాత్మ పూర్ణమే అగును. అయినను కారణమైన యీయజ్ఞానము ఆత్మయందు పూర్ణత్వము తోఁచకుండఁజేసి, ఇక్కడ ఇప్పుడు నేను ఉన్నాను" అను తలంపును లింగిచుచు దేశము కాలము ఆకారము అనువిభాగములను పుట్టించుచున్నది. ఈయజ్ఞానవృక్షమున చిగురుటాకులవలె "దేహము నేను" అను భావము మొదలుగా సంసార మంతయు పెంపొందుచున్నది. మూలమైన యజ్ఞానము తొలఁగిననే తప్ప సంసారము తొలఁగదు. "ఆత్మ పరిపూర్ణము" అను విజ్ఞానముచేత తప్ప అజ్ఞానము తొలఁగదు. ఆపూర్ణాత్మయొక్క విజ్ఞానము పరోక్ష మని అపరోక్షమని రెండువిధములుగా నున్నది. గురుముఖముగా శాస్త్రములవలన కలుగుజ్ఞానము పరోక్షము. ఇది మోక్షమను పురుషార్థమునకు సాక్షాత్తుగా కారణము కాదు. గురువువలన శాస్త్రము ననుసరించి పొందిన జ్ఞానము "ఇది నిజమే" అను విశ్వాసమాత్రముగనే యుండును; అనుభవమునకు రాదు. అందువలన అది మోక్షరూపమైన ఫలమును కలిగింపదు. సమాధియొక్క పరిపాకమువలన కలుగునట్టి విజ్ఞానమును అపరోక్షజ్ఞాన మందురు. అదియే కార్యమైన (effect) ప్రపంచమును కారణమైన యజ్ఞానమును (Cause) నశింపఁజేసి మోక్షఫలమును ఇచ్చును.

గురుముఖముగా శాస్త్రమువలన కలుగు పరోక్షజ్ఞానము ముందుగా ఉండినప్పుడే సమాధివలన విజ్ఞానము కలుగును. అందువలన శాస్త్రజ్ఞానము లేనివారికి సమాధి కలిగినను దానివలన ప్రయోజనము లేదు. మాణిక్య మనఁగా ఎట్లుండునో తెలియనివాఁడు కోశాగారమునందు ఆమణిని చూచుచున్నను "ఇది మాణిక్యము" అని గ్రహింపఁజాలఁడు. మణినిగూర్చి విని తెలిసికొన్న వాఁడు కూడ దానియందు దృష్టి యుంచి పరిశీలించినచో "ఇది మాణిక్యము" అని గ్రహింపఁగలఁడు. మణిజ్ఞానమునందు మఱియొకఁడు ఎంత నిపుణుఁడైనను దాని యందు దృష్టిని నిలుపకున్నచో అది మణి యని గ్రహింపఁజాలఁడు. కావున విజ్ఞానమునకు ఫలముగా లభించునట్టిదానిని మూఢుఁడు అజ్ఞానమువలన పొందఁజాలఁడు. పండితులు విజ్ఞానవంతులైనను దాని యందు దృష్టినుంచని కారణముచేత ఆఫలమును పొందఁజాలరు. శుక్రనక్షత్రమునుగూర్చి తెలియనివాఁడు ఆతారను ఎన్నిదినములుగా చూచుచున్నను "ఇది శుక్రతార" అనిగ్రహింపఁజాలఁడు. మఱియొకఁడు దానినిగూర్చి విని యున్నను దానియందు దృష్ఠి నుంచక పోయినచో దానిని గ్రహింపఁజాలఁడు. ఆశుక్రతార ఏదిక్కులో ఎచ్చట ఏయాకారణముతో నుండునో తెలిసికొన్న తరువాత శ్రద్ధతో "నేను దీనిని తెలిసికోవలె" అని నిశ్చయించి ఏకాగ్రతతో ఎవఁడు పరిశీలించునో అట్టి బుద్ధిశాలియే దానిని "ఇది శుక్రతార" అని గుర్తింపగలఁడు. కావున అజ్ఞానముచేత మూఢులు, శ్రద్ధలేకపోవుటచే పండితులును సమాధిదశలను పొందుచుండియు ఆదశలలో ఆత్మను గుర్తింపలేకున్నారు. పెరటిలో నిధి యున్నను దానిని గుర్తింపలేక భిక్షాటనము చేయుచుండు దౌర్భాగ్యులవలె ఇట్టివారందఱును సమాధిస్థితులను కలిగియుండియు వానివలన ప్రయోజనమును పొందలేకున్నారు. ఈకారణముచేతనే శిశువులకు అజ్ఞానము తొలఁగకపోవుటవలన ఎల్లప్పుడు నిర్వికల్పస్థితి యున్నను వారికి దానివలన కలుగవలసిన ఫలము కలుగుట లేదు.

కాఁబట్టి "ఆత్మ ఇట్టిది" అని దానినిగుర్తింపఁజేయునట్టి శాస్త్రజ్ఞానమే. అనఁగా సవికల్పజ్ఞానమే, సంసారమునకు మూలమైన యజ్ఞానమును తొలఁగింపఁగలదు. ఎన్నో జన్మలయందు నిష్కామముగా చేసిన పుణ్యకర్మలచేత ఆత్మదేవత సంతుష్టురా లగును. ఆదేవత సంతుష్టురా లై నప్పుడే మోక్షమునందు కోరిక కలుగును. లేకున్నచో కోట్లకొలఁది కల్పములు జరుగుచున్నను మోక్షము కావలయు ననుకోరిక కలుగదు. కోట్లకొలఁది జన్మలయందు చేతనత్వముతో జన్మించుట దుర్లభము. అందును మనుష్యజన్మము ఇంకను దుర్లభము. మనుష్యులలో కూడ సూక్ష్మబుద్ధి కలవాఁడై జన్మించుట పరమదుర్లభము. నీవేగమనింపుము. సృష్టియందు స్థావరములలో నూఱవవంతు కూడ జంగమములు లేవు. జంగమములలో నూఱవవంతు కూడ మనుష్యులు లేరు. వారిలో కూడ మంచిని చెడును పుణ్యమును పాపమును గుర్తింపక పశువులతో సమానముగా నుండువారు కోట్లకొలఁదిగా నున్నారు. పాండిత్యగర్వముతో ఈలోకమునందు స్వర్గాదిలోకములందును భోగములను కోరుచు పైకి క్రిందికి రాకపోకలు చేయువారు కూడ కోట్లకొలదిఁగా నున్నారు. పండితులలో కొందఱు వివేకవంతులు తత్త్వమును గ్రహింపఁబూనుకొన్నను మలినసంస్కారములప్రాబల్యముచేత అద్వితీయమైనయాత్మను గ్రహింపఁజాలరు. పరమేశ్వరునియొక్క మాయచేత

అంధులైనవారికి భాగ్యహీనులైనవారికి అద్వైతజ్ఞానము బుద్ధి కెక్కదు. బుద్ధిశక్తిచేత దానిని గ్రహింపఁగలిగినను కొందఱు దౌర్భాగ్యులు "విషయాకారమును. పొందని కేవలచైతన్య మెట్లుండును? ఉన్నచో కుండ చట్టి మొదలగువానివలె ఏల గోచరము కాదు? కావున లేదు?" అని యిట్టి కుతర్కములతో దానిని తిరస్కరించుచుందురు అహో! భగవంతురాలైన మాయయొక్క ప్రభావ మేమని చెప్పుదును; చేతికి దొరికిన చింతామణిని, "ఇది మణి యగునో కాదో" అని సంశయించుచు పారవేయునట్టివానివలె పండితులు కూడ ఆత్మను చూచుచుండియు మాయ చేత మోహితులై కుతర్కములు చేయుచు దానిని వదలి వేయుచున్నారు. పరదేవతయొక్క అనుగ్రహమును పొందినవారు మాత్రము మాయ నుండి తప్పించుకొని శ్రద్ధతో సరియైనతర్కముతో విచారించి అద్వితీయమైన పరమపదమును పొందుచున్నారు. ఆపదమును పొందుటకు క్రమమును చెప్పెదను వినుము.

అనేకజన్మలలో చేసిన పుణ్యములవలన పరదేవతయందు భక్తి కలుగును. భక్తితో పరమేశ్వరిని ఆరాధించి ఆమెయనుగ్రహమును పొందినప్పుడు భోగములయందు విరక్తి ఆత్మతత్త్వమునందు ఆసక్తియు కలుగను. వైరాగ్యముతో శ్రద్ధతో "ఆత్మతత్త్వమునకు మించి పొందవలసినది ఏదియి లేదు, దానినే పొందవలె" అని నిశ్చయించి సద్గురువు నాశ్రయించినచో ఆయన గావించు బోధవలన అద్వైతతత్త్వము తెలియును. "అద్వితీయమైన యాత్మ యున్నది" అని దృఢముగా తెలిసికొనుటయే పరోక్షజ్ఞానము. ఇట్లు తెలిసికొనుట శ్రవణము. తరువాత శాస్త్రసమ్మతమైన తర్కముతో దృష్టాంతములతో విచారించి సంశయములను తొలఁగించుకొనుట మననము. అట్లు మననముచేత నిశ్చయించుకొన్న యాత్మస్వరూపమును మనస్సునందు నిలుపుకొనుట ధ్యానము, మనస్సు చంచలమై ఆత్మస్వరూపము దానియందు నిలువకున్నచో తీవ్రముగ ప్రయత్నించి ప్రాణాయామాదిసాధనములను అవలంభించియైనను అత్యంతమైన పట్టుదలతో అపరోక్షజ్ఞానము కలుగు వఱకు ధ్యానమును కొనసాగింపవలె. ఇదియే నిదిధ్యాసనము. "శుద్ధమైన యాత్మస్వరూపముగా నామనస్సు చాలసేపునిలుచునుగాక" అని సంకల్పించి ఆసంకల్పిమును మఱువకుండ సంస్కారరూపముగా మాటిమాటికి పైకితెచ్చుకొనుచు ఆత్మతత్త్వమును మనస్సునందు నిలు పుకొను ప్రయత్నము ధ్యానము. ధాన్యముయొక్క అభ్యాసమునందలి యతిశయముచేత, అనగా సంకల్పముయొక్క సంస్కారముయొక్క బలముచేత ఇష్టము వచ్చినంతసేపు మనస్సునందు ఆత్మస్వరూపమును నిలుపుకొనఁగలుగట సవికల్పసమాధి అందురు. ఈసమాధిని కొనసాగించుచున్నచో కొంతకాలమునకు సంకల్పసంస్కారములయొక్క ప్రేరణలేకయే మనస్సునందు ఇష్టము వచ్చినంతసేపు ఆత్మస్వరూపము నిలిచియుండును. దీనిని నిర్వికల్పసమాది యందురు. దీనియందు పరమపదమైన యాత్మస్వరూపము అపరోక్షముగా (Directly) గోచరించును. "ధ్యానముయొక్క పరిపక్వతయే నిర్వికల్పసమాధి. అట్లు ఆత్మతత్త్వము గోచరించినతరువాత, సమాధిని వదలినమరుక్షణమున శాస్త్రమునందు చెప్పఁబడినయాత్మతత్త్వము సమాధియందు గోచరించినయాత్మస్వరూపము, రెండును ఒకటియే, "శాస్త్రమునందు నిర్ణయింపఁబడినయాత్మయే నేను (సోఽహమ్)" అని గుర్తింపవలెన. అట్లు గుర్తించుటను ప్రత్యయబిజ్ఞ యందురు. దానిచేత సంసారమునకు మూలమైన యజ్ఞానము సమస్తము నశించును. ఇందు సంశయము లేదు.

మనస్సునందు వికల్పములు పుట్టకుండుటయే నిర్వికల్పస్థితి. ఆత్మస్వరూపము తప్ప మఱిదేనిని మనస్సులోఁ జొరఁబడకుండునట్లు చేసినచో వికల్పములు పుట్టవు. మనస్సు వివిధపదార్థములయొక్క ఆకారములను పొందుచుండుట వికల్పస్థితి. అది దేనిని బాసింపక ఏక రూపమున నిలుచుట నిర్వికల్పస్థితి. గోడమీఁద బొమ్మలను తుడిచి వేసినచో అది శుద్ధమైనట్లే మనస్సులో విక్లపములు లేకుండఁజేసినచో అది స్వయముగా శుద్ధమై నిర్వికల్ప మగును. ఇదియే పరమ పావనమైన పదము. మాయయొక్క ప్రభావముచేత పండితులు కూడ ఈవిషయమునందు భ్రాంతి నొందుచున్నారు. ఈపరమపదమును పొందఁదగినవారు మూఁడువిధములుగా నున్నారు. గురువువలన శ్రవణము చేయుచున్నప్పుడే, ఆయన ఒక్కసారి బోధించినంతనే, మనన నిదిధ్యాసనముతో మఱుక్షణముననే ఆపదమును తెలిసికొనగలవారు ఉత్తములు. సాధనచేసి కొంతకాలమునకు తెలిసికొనఁగలవారు మధ్యములు. చిరకాలము సాధనచేసి తెలిసికొనువారు అధములు. ఉత్తములకు పరమపదమును పొందుటలో క్లేశమే యుండదు.

వెనుక ఒకప్పుడు వేసవిలో వెన్నెలరాత్రియందు మద్యమును సేవించి ఉద్యానవాటికాప్రాంగణమున రత్నములచే అలంకరింపఁబడిన శయనమునందు ప్రియురాలిచే కౌంగిలింపఁబడి యుంటిని. అప్పుడు ఆకాశమునందు పోవుచు సిద్ధపురుషులు అద్వితీయమైన యాత్మతత్త్వమును గూర్చి మధురముగా ప్రసింగిచుకొనుచుండిరి. ఆప్రసంగమును

నేను వింటిని. వెంటనే నేను దానిని మననముచేసికొని ధ్యానించి నిర్వికల్పసమాధిని పొంది అర్ధముహూర్తము (ఒక్కగడియ

= 24 నిముషములు) పరమాపావనమైన యాత్మతత్త్వమును తెలిసికొని ఆసమాధి స్థితియందే పరమానందసాగరమున తేలియాడుచు కొంత సేపు ఉంటివి. పిదప బాహ్యస్మృతిని పొంది ఆలోచించితిని. "అహో! ఇది అద్భుతముగా నున్నది; ఆనందామృతపూర్ణముగా నున్నది. చాల అపూర్వమైన స్థితిని (Most unusual state) పొందితిని. దీనియందు మరల ప్రవేశింతును. ఇంద్రపదవినుండి బ్రహ్మపదవి వఱకును లభించునట్టి సుఖ మేదియును ఈసుఖములోని రవ్వంతభాగమునకు కూడ సమానము కాదు. ఇప్పటివఱకును కాలము వ్యర్థముగా గడచినది. చింతామణులతో నిండిన నిధానము తమయింటిలోనే యుండఁగా దానిని తెలిసికొనలేక బిచ్చ మెత్తుకొనువారివలె లోకులు ఆత్మానందమును గుర్తింపలేక మహాశ్రమతో అల్పమైన బాహ్యసుఖమును పొందుచున్నారు. ఈబాహ్యసుఖముకొఱకు ప్రయత్నము చాలును. ఇంక అనంతముగా ఆనందము నొసంగునాత్మనే ఎల్లప్పుడు పొందుదును. నూఱినదానినే మరల నూఱుటవలె (పిష్టపేషణము) నిరుపయోగమైన యీవ్యవహారముతో నా కేమి పని? అవియే భోజనపదార్థములు అవియే పుష్పమాలలు శయనములు భూషణములు అన్నియు అవియే; వారేయువతులు; అవియే భోగములు. చద్దివంటకమువలె అవియే మరల మరల సేవింపఁబడుచున్నవి. ఒకరిని చూచి మఱియొకరు చేయుయుండుటవలన అందఱకును ఇది అలవాటైనది. అందువలననే నాకు ఏవగింపు కలుగుట లేదు."

ఇట్లు నిశ్చయించుకొని నేను మరల అంతర్ముఖుఁడ నగుటకు పూనుకొనుచుండగా మఱియొక ఆలోచన కలిగెను. "అహో! ఏమి నా భ్రాంతి! సమాధియందు ఆనందపరిపూర్ణుఁడనై యుండిన నేనే ఇప్పుడు కూడ ఉన్నాను. ఆనందమే నాస్వరూపమై యుండఁగా నే నిప్పుడు క్రొత్తగా పొందవలసినది ఏమున్నది? నాయందు లేనిదానిని ఎప్పుడు గాని ఎచ్చట గాని ఏసాధనముచేత నైనను ఎట్లు పొందఁగలను? ఆనందము నాకు స్వరూపమే కాకున్నచో దానిని నేను ఏదో ప్రయత్నముచేసి క్రొత్తగా పొందవలసియే యున్నచో, పుట్టినది పొక తప్పదు అన్నట్లు, ఆయానందము సత్యముగా ఎట్లు నిలుచును? అది యునుగాక అనంతమైన చిదానందమే నారూపమైనప్పుడు దానియందు ఒకపని యెట్లుజరుగును? దేహము మనస్సు ఇంద్రియములు - అన్నియు స్వప్నములోని పదార్థములవలె అసత్యములే. అసత్యములైన సాధనములతో సత్యమైన క్రియ ఎట్లు సంభవించును? "ఈ శరీరము మనస్సు ఇంద్రియములు నావి" అని ప్రతిజీవియు తన శరీరాదికమును అభిమానించుచున్నాఁడు. కాని అఖిలజీవులయందున్న యాత్మను నేనే. కావున ఆశరీరములు మనస్సులు ఇంద్రియములు కూడ నావే. అట్టియెడల ఈశరీరమున ఒకమనస్సును నిరోధించుటవలన ఏమగ్గును? ఇక్కడ దీనిని నేను నిరోధించినను ఇతరజీవులలో ఉన్న మనస్సులు నిరోధింపఁబడుట లేదు కదా! మఱి అవి యన్నియు నామనస్సులే. చైతన్య రూపుఁడనై అఖిలజీవులలో వ్యాపించియున్న నాయందు విరుద్ధములైన మనస్సులు అనిరుద్ధములైన మనస్సులు అన్నియు భాసించుచునే యుండును. ఇంక ఈయొక్క మనస్సు నిరోధింపఁబడుటవలన లాభమేమున్నది? అట్లుగాక అందఱిమనస్సులు ఒక్కసారి నిరోధింపఁబడినను చైతన్య మాత్రుఁడ నైన నాకేమి విశేషము కలుగును? మహాకాశమును కూడ మించి అంతటను వ్యాపించి పూర్ణానందరూపుఁడనైయున్న నాయందు నిరోధము కాని సమాధి గాని ఎట్లు సంభవించును? ఆనందమే నేనై యుండఁగా నాకు శుభాశుభములు ఎక్కడివి? అందువలన కర్తవ్యము అకర్తవ్యము ఏదియును నాకు లేదు? సమాధి యున్నప్పుడు లేనప్పుడు ఎప్పుడైనను నాస్వరూపమునందు భేదమే లేదు. నేనెప్పుడును ఆనందపూర్ణుఁడనే. కాబట్టి ఈశరీరము ఇప్పటి వఱకు ఏపని చేయుచున్నదో ఆపనినే చేయుచుండును గాక! దానితో నాకేమి? అది ఏస్థితియందున్న నే నెప్పుడును నిరంజనుఁడనే పూర్ణుఁడనే ఆనందరూపుఁడనే." ఇట్లు ఏక్షణమునందును స్వరూప విస్మృతి లేక వ్యవహారమునం దుండియు స్వస్థత కలవాఁడనై ఆనంద పూర్ణుఁడనై యున్నాను.

ఇది ఉత్తమాధికారివిషయము, మధ్యమాధికారులు శ్రవణమనన నిదిధ్యాసములయొక్క క్రమములవలన నెమ్మదిగా జ్ఞానమును పొందుదురు. అధమాదికారులు పెక్కుజన్మలలో శ్రవణమననాదులను గావించి జ్ఞానఫలమును పొందుదురు. శాస్త్రజ్ఞానముతో కూడిన సమాధి దుర్లభము. శాస్త్రజ్ఞానములేని సమాధిస్థితి నూఱుపర్యాయములు సంభవించినను ప్రయోజనములేదు, కావుననే జాగ్రద్దశ మొదలగువాని యందు క్షణికముగ సంభవించుచున్న సమాధులవలన ఫలముకలుగుట లేదు. "ఇది సమాది స్థితి. ఇప్పుడు ఆనందఘనమైన నాస్వరూపము నం దున్నాను. ఉపనిషత్తులయందు నిర్దేశింపఁబడిన బ్రహ్మాత్మస్థితి యిదియే" అన్న గుర్తింపు ఉన్నప్పుడే సమాధి -

సఫలము అగును. దారిలో పోవుచున్నప్పుడు నిర్విశేషముగా ఎన్నోవస్తువులను చూచుచుందుము. అట్లే చూచుటవలన ఫల మేదియు కలుగుటలేదు. ఒకవస్తువును నామరూపములతో గుర్తించి "ఇది మామిడిచెట్టు" అని తెలిసి కొన్నప్పుడే తప్ప ఆమామిడిచెట్టును చూచుటవలన ఫలముకలుగుట లేదు. చెట్టుయొక్క పరిజ్ఞానములేనివాఁడు వనములో ప్రవేశించినచో వానికి చెట్లు అన్నియు నిర్విశేషముగా ఒకటిగానే కన్పించును. ఏచెట్టు యొక్క పరిజ్ఞానము ఎవనికి ఉండునో వాఁడు ఆచెట్టును మాత్రమే గుర్తించి దానియొక్క ఫలమును పొందఁగలడు. కావున నిర్విశేషమైన నిర్వికల్పజ్ఞానమాత్రముచేత అజ్ఞానము తొలఁగదు. "ఇదియే ఆత్మస్వరూపము" అను జ్ఞాన మేర్పడదు. అద్దమువలెనే నిర్వికల్పమైనయాత్మ ఎప్పుడును భాసించుచునే యుండును. ప్రతిబింబములచేత ఆవరింపఁబడియున్నప్పుడు కూడ అది భాసించుచునే యున్నను భాసింపనట్లే యుండును. ప్రతిబింబములు తొలగినంతనే అద్దముక్రొత్తగా భాసించుచున్నట్లు ఎట్లు తోఁచునో అట్లే వికల్పజ్ఞానము లన్నియు తొలఁగినప్పుడు సదా భాసించుచున్నయాత్మ క్రొత్తగా భాసించుచున్నట్లుతోఁచును. వికల్పజ్ఞానములను తొలఁగించుటకు, అవి తొలగినతరువాత గోచరించునది ఆత్మయో యని గుర్తింపజేయుటకు శాస్త్రవిజ్ఞానము ఆవశ్యకము, వికల్పజ్ఞానములు తొలఁగుటయే అజ్ఞాననిర్మూలనము. ఇది సవికల్పమైన శాస్త్రవిజ్ఞానముచేతనే సంభవించును గాని నిర్వికల్పజ్ఞానముచేత సంభవింపదు. అద్దము ప్రతిబింబములను ఎట్లు నిరోధింపదో అట్లే నిర్వికల్పమైన యాత్మచైతన్యము కూడ అజ్ఞానము నిరోధింపదు.

ఈకారణముచేతనే ఆత్మ ఒకప్పుడు జ్ఞాత మని మఱియొకప్పుడు అజ్ఞాత మని చెప్పఁబడుచున్నది. వికల్పజ్ఞానములచేత ఆవరింపఁబడినప్పుడు ఆత్మ అజ్ఞాత (Unknown) మని వికల్పములు తొలఁగినప్పుడు అదియే జ్ఞాతమని (Known) చెప్పఁబడుచున్నది. ఇది ఉత్తమమైన యాత్మవిజ్ఞానక్రమము, ఇప్పుడు నీవు విన్నదాని మరల విచారింపుము. పిమ్మట ఆత్మతత్త్వమును తెలిసికొనికృతార్థుఁడవు కాఁగలవు.

ఇట్లు జనకునిచేత ఉపదేశింపఁబడిన యష్టావక్రుఁడు ఆయనచేత పూజితుఁడై సెలవుగైకొని తనయాశ్రమమునకు పోయి మననము నిధి ధ్యాసనము కావించి పరమపదమును తెలిసికొని సకలసందేహములను వీడి కొలఁది కాలముననే జీవన్ముక్తుఁ డయ్యెను.

ఇది జ్ఞానఖండమున సమాధిస్థితివివరణ మన్నది సప్తదశాధ్యాయము.

బాలప్రియ

హేమచూడుఁడు మహాసేనుఁడును జీవన్ముక్తిని పొందినవిధానములను విన్నతరువాత పరశురాముఁడు తనయాశ్రమమునకు పోయి ఆవిషయములను మననము చేసికొనెను. విన్నంతనో కొన్ని విషయములు వెంటనే తెలియను; కొన్ని తెలియవు; కొన్ని కొంచెము తెలిసినట్లుండును. మననము చేయునప్పుడే ఏవిషయముల కొంచెమే తెలిసినవో, ఏవి అసలే తెలియలేదో స్పష్ట మగును. విన్నవెంటనే తెలిసినవి కూడ క్రొత్తగా మనస్సునకు గోచరించునే కాని నిశ్చితముగా మనస్సునకు పట్టవు, "మిరియములు శ్లేష్మమును హరించును" అని గురువు శిష్యునకు చెప్పినప్పుడు అది క్రొత్తగా వానిమనస్సులోనికి వచ్చును. కాని దానినిగూర్చి ఆలోచించునప్పుడు. "వీనిని ఎప్పుడు ఎట్లు ఉపయోగింపవలె? పొడిచేసి దేనితో నైనా కలపవలయునా? కషాయము చేసి త్రాగవలయునా? ఎప్పుడు ఎంత మోతాదులో వాడవలె?" అని పెక్కుసరందేహములు కలుగును. ఈసందేహములకు సమాధానములను గురువువలన పొందినతరువాత శిష్యుఁడు తనవిషయముననో ఇతరులవిషయముననో దాని నుపయోగించి చూచినతరువాత వానికి ఆ వస్తువుయొక్క పరిచయము జ్ఞాన మగును. ఆత్మజ్ఞానము కూడ ఇట్టిదే. ఉత్తమాధికారులైన జనకునివంటివారికి విన్నవెంటనే అది నిస్సందేహముగా గోచరించినను తక్కినవారు విన్నదానినిగూర్చి మననము చేయుచు గురువువలన సందేహములను దీర్చుకొనుచు ఆత్మస్వరూపమును నిస్సంశయముగా తెలిసికొనవలె. అందువలననే తర్కకుశలుఁడై వరుణపుత్రుని కూడ జయించిన యష్టావక్రునకు కూడ తాపసితుదకు "ఒక్కసారి మాత్రమే వినుటచే ఇది నీకు చక్కఁగా తెలియకపోవచ్చును. నీసందేహములను ఈరాజు నడుగుము" అని చెప్పిపోయెను. కావున ఎంత మేధాసంపన్నున కైనను మననము చేయక తప్పదు. అందువలననే భగవంతుఁడైన పరశురాముఁడు కూడ విన్న విషయములను మననము చేసికొని తిరిగివచ్చి, "అయ్యా! నాకు ఇంత వఱకు తెలిసినది" అని తాను తెలిసికొన్నవిషయములను గురువునకు చెప్పెను. తెలిసినవి అని యనుకొన్నవిషయములలో కూడ తాను దేనినైనను పొరపాటుగా

గ్రహించియున్నచో వెంటనే గురువు దానిని సరిదిద్దఁగలఁడు. అనఁగా, "నీవు గ్రహించినది యథార్థమే. ఇది యింతే" అని గురువు ఆమోదించువఱకు ఎవఁడు తనబుద్ధిని గాని అనుభవమును గాని ప్రమాణముగా గ్రహింపరాదు.

తాపసియడిగిన ప్రశ్నకు సమాధానము తెలియలేదని తోఁచినం తనే అష్టావక్రుఁడు గర్వము వీడి వినయముతో, "అమ్మా! నీవడిగిన ప్రశ్నకు నాకు సమాధానము తెలియదు. నేను నీకు శిష్యుఁడ నగుచున్నాను....అది ఎట్లు నిరూపింపఁబడినదో చెప్పుము" అని ప్రార్థించెను. అంత మహాసభలో తాను ఒకస్త్రీకి ఓడిపోయితి నని గాని, ఆమెకు తాను శిష్యుఁడు కావలసివచ్చినది అని గాని అతఁడు అభిమానపడక వెంటనే ఆమెను ఆశ్రయించెను. ఆతనికి అప్పుడు అభిమానమువలన అవమానము కలిగెనను దుఃఖము, స్త్రీని గురువునుగా ఆశ్రయింపవలసివచ్చి నందులకు సంకోచముకలుగలేదని చెప్పఁజాలము. అయినను ఆత్మను గూర్చి నిస్సంశయముగా తెలిసికోవలయు నను తీవ్రమైన కోరికచేత అతఁడు సకలసంకోచములను త్రోసివేసి ఆమెను ప్రార్థింపఁగలిగెను. ఈశ్రద్ధను గమనించియే తాపసి జనకఁడును. ఆతనికి బోధించిరి. అతనికి ఆశ్రద్ధయే లేకున్నచో ఓటమి కలిగినంతనే అవమానదుఃఖముతో సభనుండి నిష్క్రమించియుండును. కాని ఆతనికి విద్యావిషయమునఁ గల శ్రద్ధ అమోఘమైనది. ఆశ్రద్ధవలననే అతఁడు కృతార్థుఁడు కాఁగలిగెను. ఈశ్రద్ధచేతనే పరశురాఁముడుకూడ, ఎవ్వరు ఏమనుకొందురో అను సంకోచము కొంచెము కూడ లేక, ఎన్ని పర్యాయములైనను గరువును ప్రశ్నించి తెలిసికొనుచునే యుండెను. కావున గురువును సేవించుచు శ్రవణము మననము నిదిధ్యాసనము కొనసాగించుచు ఆత్మజ్ఞానమును పొందవలసినదే కాని దీనికి ఇంకొకమార్గము లేదు. కువలునివలె పౌరాణికులవలన కుతూహలమాత్రముతో వినుటవలనఁగాని, అకడవులకు పోయి ప్రామాయమాదులతో నిర్వికల్పసమాధిని సాధించి తపస్సులు చేయుటవలనఁగాని ఆత్మజ్ఞానము కలుగ దనుట స్పష్టము. ఈశ్వరానుగ్రము కూడ మనకు కొంతవఱకే అనగా సద్గురువును చూపి ఆయనయందు శ్రద్ధ కలిగించువఱకే తోడ్పడును. ఆ పైన శ్రవణమనననిదిధ్యాసములు గురుసేవాపూర్వకమైన స్వయం కృషిచేతనే కొనసాగవలె. దత్తగురువు చెప్పిన మాటలలో ఇది స్పష్టమగుచున్నది. "మనయందు ప్రతిదినము సద్విమర్శనమును పెంపొందించుచుండుటయే మనచే ఆరాధింపఁబడిన యీశ్వరుఁడు ప్రసన్నుఁడై మనకు చేయఁగలిగిన మహోపకారము. ఆయన చేయగలిగినది అంత వఱకే." విచారణముతప్ప ఆత్మజ్ఞానమునకు వేఱొకసాధనము లేదని జనకుఁడు స్పష్ట మొనర్చెను. ఆయన "గురుముఖముగా శాస్త్రమువలన కలుగుపరోక్షజ్ఞానము ముందుగా ఉండినప్పుడే సమాధివలన విజ్ఞానము కలుగును. అందువలన శాస్త్రజ్ఞానము లేనివారికి సమాధి కలిగినను దానివలన ప్రయోజనము లేదు....శాస్త్రమునందు చెప్పఁబడిన యాత్మతత్త్వము సమాధియందు గోచరించిన యాత్మస్వరూపము రెండును ఒకటియే. శాస్త్రమునందు నిర్ణయింపఁబడిన యాత్మయే నేను (సోఽహమ్) అని గుర్తింపవలె. అట్లు గుర్తించుటను ప్రత్యభిజ్ఞ యందురు. దానిచేత సంసారమునకు మూలమైన యజ్ఞానము సమస్తమునశించును" అని చెప్పెను. అష్టావక్రుఁడ అడిగిన సందేహముల కన్నింటికి సమాధానములు చెప్పి ఆయన తుదకు, "ఇప్పుడు నీవు విన్నదానిని మరల విచారింపుము. పిమ్మట ఆత్మతత్త్వమును తెలిసికొని కృతార్థుఁడవు కాఁగలవు" అని చెప్పిపంపెను. కావున విచారము తప్ప ఆత్మజ్ఞానమును పొందుటకు వేఱొక మార్గములేదు. సమాధివలన ప్రత్యబిజ్ఞనొందుట కూడ విచారములో భాగమే.

తైత్తరీయోపనిషత్తునందు వరుణునిపుత్రుండైన భృగువు తండ్రి వలన ఉపదేశమును పొంది తపస్సుచేసి బ్రహ్మజ్ఞానమును పొందె నని చెప్పఁభడియున్నది. ఆభృగుమర్షియే ఇందు ప్రస్తావింపఁబడిన వరుణ పుత్రుఁడై యుండవచ్చును. అతఁడు తర్కనైపుణ్యముతో జనకుని సభలోని పండితుల నందఱను జయించి అష్టావక్రునిచేత తర్కమువలననే ఓడింపఁబడెను. అష్టావక్రుఁడు తాపసిచేత ఓడింపఁబడెను. యుద్ధమునందువలె జయాపజయములు తర్కమునందు కూడ ఎంత అస్థిరములో దీనివలన స్పష్ట మగుచున్నది. శాస్త్రవిషయమున కూడ కేవలము తర్కముచేత ప్రతిష్ఠింపఁబడు సిద్ధాంతములగతి యింతే వరుణ పుత్రుఁడు ఖండించువఱకు జనకునిసభలోనున్న పండితులు అనుకొనుచున్నవి సిద్ధాంతములే. వరుణపుత్రుఁడు ఖండించినంతనే అవి పూర్వ పక్షములై వరుణపుత్రుఁడు చెప్పినది సిద్ధాంత మయ్యెను. అది కూడ అష్టావక్రునిచేత ఖండింపఁబడి పూర్వపక్షమయ్యెను. కావున కేవలము తర్కముచేత నిలువఁబెట్టఁబడు సిద్ధాంత మేదియు సుప్రతిష్ఠితము కాదు. కేవలమైనతర్కము ఎప్పుడైనను ఎవనిచేత నైను ఖండింపవచ్చును కావు. ధర్మతత్త్వముల విషయమున కేవలమైన తర్కము ప్రమాణము కాదు; అపౌరుషేయమైన వేదమే ప్రమాణము. అట్లే ఆత్మసాక్షాత్కారముయొక్క అనుభవమునందు కూడ ఏమహనీయుని యొక్క అనుభవమైనను ప్రమాణము కాదు. గురువువలన శాస్త్రము ననుసరించి ఆత్యస్వరూప మిది యని తెలిసికొని మనననిదిధ్యాసనములచేత ఆత్మస్వరూపము స్ఫురించినప్పుడు, "ఇది శాస్త్రమునందు వర్ణింపఁబడిన

యాత్మస్వరూపమే" అని గుర్తించినప్పుడే అది యథార్థమైన సాక్షాత్కారమై హృదయగ్రంథి విచ్చిపోయి సకలసంశయములు తొలఁగి అజ్ఞానము నశించును. కావున తత్త్వజ్ఞానమును పొందుటలో తర్కము మననము చేసికొనుటకు సాధనమే కాని ప్రమాణము కాదు.

ఇందు తాపసియొక్క రాకపోకలు విచిత్రముగా నున్నవి. ఆమె ఎందుకు వచ్చినదో ఎందుకు వెంటనే వెళ్ళిపోయినదో స్పష్టముగా లేదు. ఎందుకు వచ్చితి వని ఆమెను జనకుఁడు కూడ అడగలేదు; ఆమె చెప్పలేదు. ఆమె రాఁగానే సభవెలుపలనే పెద్దబ్రాహ్మణు లందఱును అష్టావక్రుఁడు గర్వముతో తమ్ము తిరస్కరించుటను చెప్పిరి. ఆమె సౌందర్యరాశియైన యువతి. అయినను కాషాయంబరములతో జడలతో దివ్యమైనతేజస్సుతో ప్రకాశించుచుండుటను చూచి వారు ఆమె యోగసిద్ధురా లని యూహించి ఆమెను ప్రార్థించియుందురు. ఆమె కూడ వారికి వెంటనే అభయ మొసంగెను. వరుణపుత్రుని జయింపఁగలిగిన యష్టావక్రుని తాను జయింపఁగల నని ఆమె ఎట్లు నిశ్చయించి వారికి అభయమొసంగెను? ఆబ్రాహ్మణు లందఱును పండితులు. అష్టావక్రునితండ్రియైన కహోలునితో సమానమైన వయస్సు కలవారైయుందురు. అట్టి పెద్దవారి నందఱను అషావక్రుఁడు తిరస్కరించుచున్నాఁడన్నచో అతనిని అమితమైన గర్వము ఆవేశించె నన్నమాట, అతఁడు ఆత్మజ్ఞజ్ఞానము కలవాఁడైనచో సాధారణముగా అట్టి యావేశమునకు లోఁబడఁడు. మఱి తంగణునిపుత్రుఁడు ఆత్మజ్ఞానము కలవాఁడై యుండియు క్రోధావేశమున యజ్ఞాశ్వమును బంధించెను కదా! తంగణుడఁ అది దైత్యకృత్య మనియే చెప్పినాఁడు. తత్త్వజ్ఞు లెవ్వరును ఎప్పుడును తప్పలు చేయ రని చెప్పఁజాలము. కావున బ్రహ్మజ్ఞానము కలవాని వర్తనము కూడ ధర్మమున ప్రమాణము కాదు. ఈకారణముచేతనే భగవంతుఁడు కూడ "ఇది చేయదగినది, ఇది చేయరానిది, అనుసేర్పాటునందు నీకు శాస్త్రమే ప్రమాణము. కావున శాస్త్రవిధానమును తెలిసికొని ఆప్రకారముగా నీవు ఏకార్యము నైనను చేయవలసి యున్నది" అని శాస్త్రమే ప్రమాణ మని యుద్ఘాటించెను. "ఏవి మాయందు సుచరితములో వానినే నీవు అనుసరించవలెను. ఇతరములను అనుసరింపరాదు" అని యాచార్యుని యుపదేశరూపమున వేదము కూడ విధించుచున్నది, ఆచార్యులవర్తనములందు ఏవి శాస్త్రవిహితములో వానినే శిష్యుఁడు అనుసరించవలె; శాస్త్రవిధికి భిన్నములైన యితరవర్తనములను అనుసరింపరాదు. కావున బ్రహ్మజ్ఞానము కలవారు కూడ ప్రారబ్ధవశమున తప్పులు చేయవచ్చును.

అట్లయినచో తప్పుచేయుచున్నంతమాత్రమున అష్టావక్రునకు ఆత్మజ్ఞానము లేదని తాపసి ఎట్లు తలంచియుండును? అతనిని ఆత్మజ్ఞానమున్నను లేకున్నను ఆమె అతనిని తత్త్వమునుగూర్చి ప్రశ్నించుట సమంజసమే. అతనికి ఆత్మజ్ఞాన మున్నచో ఆమె ఆత్మను గూర్చి ప్రశ్నించినంతనే అతఁడు స్వరూపమును స్మరించి తాను చేయుచున్నది తప్పని, తంగణునిపుత్రునివలె, గ్రహించి వెంటనే గర్వమును వీడి సాధుత్వమును పొందును. అతనికి ఆత్మజ్ఞానము లేకున్నచో అతఁడు ఓడింపఁబడి తనయజ్ఞానమును తెలిసికొని పశ్చాత్తాపమునొంది మంచి మార్గమునకు రావచ్చును. అంతేగాక తత్త్వమును తెలిసికోవలయునని ప్రార్థింపవచ్చును.

మఱి వరుణునిపుత్రుఁడే ఇట్లు ఆత్మనుగూర్చి ప్రశ్నించియుండవచ్చును కదా! కాని అతనిసందర్భము వేఱు. అతఁడు సబలో పండితుల నందఱను వాదమునకు పిలిచెను. అందఱు అన్నిశాస్త్రములలో పండితులై యుండరు. ఎవఁడు ఏశాస్త్రములో పండితుఁడ నని ప్రకటించుచున్నాఁడో వానిని ఆశాస్త్రమునందే జయించవలె. మఱియొక శాస్త్రమునందు ప్రశ్నించినచో, "నాకు అది తెలియదు. నేను నేర్చిన శాస్త్రమునందు నన్ను జయింపుము" అని ఎవఁడైనను ఎదుర్కొనును. అందువలన వరుణపుత్రుఁడు ఆపండితులను వారు నేర్చినశాస్తరములయందే తర్కనైపుణ్యముతో జయించెను. అష్టావక్రునితో వాదము కూడ అట్లే జరిగినది. అప్పటికి అతనియందు ఆత్మజ్ఞానము లేదని యూహించుటకు కూడ ఆవకాశ మేర్పడ లేదు. అప్పటికి అతఁడు తండ్రిని తక్కిన పండితులను దుస్థితినుండి తప్పించుటకే పూనుకొని యున్నాఁడు.. అది కేవలము ధార్మికమైన గొప్ప సంకల్పము. అప్పుడతఁడు ధర్మవీరుఁడుగా ఉన్నాఁడు. అట్టి ధర్మవీరునకు ఆత్మజ్ఞానముండదని ఆతఁడు ఊహించియుండఁడు. ఒకవేళ అతఁడు తత్త్వమునుగూర్చి ప్రశ్నించినచో అష్టావక్రుఁడు అప్పటిపరిస్థితిలో, "అది నాకు తెలియదు. నేను నేర్వనిశాస్త్రమునందు నీవు ప్రశ్నింపరాదు, తర్కమునందు నీవు పండితుడనని పండితుల నందఱమ జయించితిని. ఆతర్కమునందే నేను నిన్ను జయించితిని. కావున నీవు ఓటమిని అంగీకరింపవలసినదే" అని చెప్పఁగలడు. అందువలన వరుణ పుత్రుఁడు తర్కములో ఓడినంతనే ఓటమిని అంగీకరించెను.

వరుణపుత్రుఁడు పండితుల నందఱను తెచ్చి అప్పగించినంతనే అష్టావక్రునకు గర్వ మావేశించెను అందువలన అప్పుడు అతఁడు తానే సర్వజ్ఞుఁడ నని తనకన్న మించినవాఁడు లేఁడని భావింపఁజొచ్చెను. ఆసమయములో తాపసి వచ్చి తత్త్వమునుగూర్చి ప్రశ్నించెను అతఁడు అప్పటికి గురుశుశ్రూష చేసి ఆత్మతత్త్వమును తెలిసికొ లేదు. వేదములను అధ్యయనము చేసినప్పుడు ఉపనిషత్తులను కూడ వల్లించియుండెను, ఆవేదాంతవాక్యములను తర్కశాస్త్రబలముతో తనకు తోఁచినట్లుగా అర్థము చేసికొనియుండెను. అందువలన అది తనకు అర్థమైనట్లే అనుకొనుచు, తాపసి ప్రశ్నించినంతనే, "నాకు సర్వము తెలియును. నాకు తెలియనిది ఏదియు లేదు" అని ప్రకటించెను. అందువలన వెంటనే ఆతాపసి ఆతఁడు వల్లించిన శాస్త్రవాక్యములను విమర్శించి అతనికి యథార్థముగా ఆత్మస్వరూపము తెలియ దని నిరూపించెను. అతఁడు గర్వమును వీడి తత్త్వమును బోధింపు మని ప్రార్థింపఁగా ఆమె సంగ్రహముగా ఉపదేశించి వెంటనే అతర్ధానము నొందెను.

ఆమెయొక్క రాకపోకలను పరిశీలించినచో ఆమె కేవలము అష్టావక్రునియొక్క గర్వమును తొలఁగించి అతనికి తత్త్వమును తెలిసికోవలయు నను శ్రద్ధ కలిగించుటకే వచ్చెనని స్పష్టము. ఇంద్రాదులగు గర్వముకలిగినప్పుడు త్రిపురాదేవి సాక్షాత్కరించి వారిగర్వమును హరించి వారు పశ్చాత్తప్తులైనతరువాత అనుగ్రహముతో తత్త్వమును ఉపదేశించినది. అట్లే ఇప్పుడు కూడ అష్టావక్రునియొక్క పూర్వపుణ్యము ఫలించి త్రిపురామహేశ్వరియే ఈతాపసిని పంపి అతనిగర్వమును హరించి తత్త్వజిజ్ఞాసను కలగించి అనుగ్రహించె నని తలంపవచ్చును.

ఈమె కాషాయంబరములు ధరించియున్నట్లు వర్ణింపఁబడినది. అంతమాత్రమున ఈమె సన్యాసిని అని ఆకాలమున స్త్రీలు సన్న్యసించుచుండి రని తలంపరాదు. సీతాదేవియు వాల్మీకియాశ్రమమున కాషాయ వస్త్రములు ధరించియుండె నని రామాయణములో చెప్పఁబడియున్నది. కాని ఆమె సన్న్యాసిని అని చప్పఁబడలేదు. కాషాయవస్త్రములు విరాగమునకు చిహ్నములు. విరాగముకలవారు ఎవరైనను వానిని ధరింపవచ్చును. సన్న్యాసము విశిష్టమైనవ్రతము. అన్నివ్రతములకు అందఱును అధికారులు కారు. వేదధర్మమున సన్న్యాసవ్రతము సర్వోత్కృష్టమైన ధర్మము. దానిని స్వీకరించినతరువాత ఆవ్రతనియమములను పాటింపలేక భ్రష్టత కలిగినచో మహాపాపము సంభవించును. దానిని ఆరూఢపతన మందురు. చెట్టును ఎక్కునప్పుడు చిట్టచివరికొమ్మపైకిపోయి పడినవానికి శరీరమే భగ్నమగును. వాఁడు మరల లేవలేఁడు. క్రిందికొమ్మలనుండి జాఱిపడినచో కొంచెము దెబ్బతగులును. వాఁడు చికిత్సవలన మరల కోలుకొనవచ్చును. శరీరము భగ్నమగుచో చికిత్సకే అవకాశము ఉండదు. అట్లే బ్రహ్మచర్యము మొదలగునాశ్రములలో పతనముసంభవించినచో ప్రాయశ్చితములతో బాగుపడవచ్చును. ధర్మవృక్షమునకు చిట్టచివరికొమ్మ సన్న్యాసవ్రతము. ఆకొమ్మను అందుకొన్నవాఁడు ఆరూఢుఁడు. ఆరోహణ మనఁగా ఎక్కుట. పైకి ఎక్కినవాఁడు ఆరూఢుఁడు. అంత పైకి ఎక్కి పడినవానికి సర్వనాశమే సంభవించును. అందువలన వేదధర్మమున సన్న్యాసవ్రతము బ్రాహ్మణులకు అందును పురుషులకే పరిమితమై యున్నది. క్షత్రియాదులకు స్త్రీకు సన్న్యాసాధికారము లేదు. కావుననే శ్రీరాముఁడు శ్రీకృష్ణుఁడు జనకుఁడు భీష్ముఁడు విదురుఁడు మొదలగువారు ఎవరును సన్న్యసింప లేదు, తంగణుఁడు కూడ కోట్లసంవత్సరములు తపస్సు చేయుచున్నను సన్న్యసింపలేదు. తంగణుని భార్య కుమారుఁడు కామక్రోధములకు వశులై వర్తించినా రన్నచో ఇతరులసంగతి చెప్పవలసినది యేమున్నది? సన్న్యాసుల కది పతనమే యగును. ఈకారణముచేతనే వశిష్ఠ విశ్వామిత్రాది మహర్షులు కూడ సన్న్యాసముజోలికి పోలేదు. మహర్షులందఱు వానప్రస్థులు కూడ కాదు, అనేకులు తపస్సులు చేయుచు గృహస్థులుగనే యుండిరి. వశిష్ఠవిశ్వామిత్రాదులు తపస్సులు చేయుచు సంతానమును పొందుచుండిరి. వానప్రస్థులు బ్రహ్మచర్యము నవలంబింపవలె. అందువలన వానప్రస్థమున సంతానము సంభవింపదు.

గృహస్థులైన మహర్షులకు పుత్రికలు కలిగినప్పుడు సాధారణముగా తగినవరులకిచ్చి వివాహము చేయుచుండిరి. ఆకన్యకల మనస్సు యొక్క శరీరములయొక్క దార్ఢ్యమును అనుసరించి యోగవిద్యను కూడ నేర్పుచుండిరి. అట్టివారు కొందరు తపస్వినులుగానే కొనసాగుచుండిరి. మఱికొందఱు మహర్షులకు భార్యలై తపస్సులు చేయుచుండిరి అత్రిమహర్షి భార్య, దత్తగురువుయొక్క తల్లి, అనసూయాదేవి, మహ తపస్సు చేసె నని అత్రిమహర్షియే శ్రీరామునకు చెప్పెను. అట్టి తాపస స్త్రీలలో కొందఱు యోగసిద్ధులనే కాక ఆత్మజ్ఞానమును కూడ పొందియుందురు. అష్టావక్రుని జయించినయీతాపసి అట్టి సిద్ధురాలే. అమె. వారందఱు చూచుచుండఁగా గాలిచేత ప్రేరేపితమైన సన్ననిమేఘము వలె, క్షణములో అంతర్ధానము నొందెననుట గమనింపఁదగియున్నది. అనఁగా ఆమె సంకల్పమాత్రముననే భౌతికమైన శరీరమును వదలి పెట్టినదన్నమాట. రాజసభకు పోవునపుడు విద్వాంసులు విశేషవస్త్రములను ఆభరణములను

ధరించి ఇంటికి వచ్చినతరువాత వానిని తీసి వేసి తేలికగానుండు వస్త్రములతో నుందురు. ఆవస్త్రములు తీసివేయు వఱకు అవి బరువుగా చికాకుగా నుండును. అట్లే అవధూతస్థితికి వచ్చినవారికి, సంవర్తునివంటివారికి వస్త్రములవలె స్థూలశరీరముకూడ బరువుగానే తోఁచుచుండును. అందువలన వారు ఎప్పుడైనను జనులతో వ్యవహరింపఁదలఁచుకొన్నప్పుడు అప్పటికి తగిన శరీరమును వేషమునువలె ధరించి ఆపని ముగిసినంతనే ఆశరీరమును పంచభూతములయందు లీనము గావించి సూక్ష్మములు దివ్యములు నై నశరీరములతో దేవతలవలె యథేచ్ఛగా విహరించుచుందురు.

ఇట్టియోగసిద్ధులు కలిగియుండుటవలననే ఆతాపసి సౌందర్యము ్ౌవనము కలిగియుండియు ఏకాకినిగా రాకపోకలు సలుపఁగలిగియుండెను. మనుష్యులో రాక్షసులో కాముకులై ఆమెను సమీపించినచో ఆమె తక్షణమే అదృశ్యరాలు కాఁగలదు. అట్టి సామర్థ్యములేని స్త్రీలు శీలరక్షణముకొఱకు శరీరభద్రతకొరుకు భర్తనో పుత్రునో ఆశ్రయించి యుండవలయునేకాని స్వాతంత్ర్యముతో వర్తింపరా దనుట స్పష్టము

# పదునెనిమిదవయధ్యాము-మనస్స్వరూప నిరూపణము

దత్తాత్రేయుఁడు భార్గవునకు ఇట్లు చెప్పుచున్నాఁడు. "అష్టావక్రజనకుల సంవాదమువలన చైతన్యము దృశ్యరహితముగా శుద్ధముగ ఎట్లుండునో నిరూపింపఁబడినది. అది యనేకవిధములుగా స్ఫురించుచునే యున్నను మనుష్యులు దానియొక్క పరిజ్ఞానము లేకపోవుటవలన దానిని గుర్తింపలేకున్నారు. అంతర్ముఖమై సూక్ష్మమైన దృష్టిచే తప్ప మఱియొకవిధముగా అది గోచరింపదు. ఇన్నిమాట లెందులకు! సాధనమును చెప్పెదను వినుము. మనస్సు అనుసాధనముతో సర్వమును తెలిసికొనుచున్నావు, ఆమనస్సునకు తెలిసికొనుటకు సాధనము లేదు. కావున అది ఇతరవస్తువులవలె వేద్యము (Object of knowing) అగుట లేదు. "ఇది ఇల్లు; ఇది పుస్తకము" అని చూపి చెప్పినట్లు "ఇది నా మనస్సు" అని చూపుటకు వీలు లేదు. కావున మనస్సు ఉన్న దనుట నిశ్చితము. ప్రతిబింబములు లేని అద్దమువలె మనస్సు కూడ దృశ్యరహితముగా ఉండును. అట్టి శుద్ధమైన మనస్సును విత్తి అందురు. వస్తువులను ప్రతిబింబింపఁజేసికొనుటయే అద్దమునకు స్వరూపమైనట్లు మనస్సునకు కూడ వస్తువులను తెలిసికొనుచుండుటయే స్వరూపము. అనఁగా జ్ఞానమే, దానిస్వరూపము. ఆమనస్సు నీదే కాఁబట్టి అది నీకు ఎప్పుడును తెలిసియే యున్నది, ఇది నాపుస్తకము" అని చెప్పినప్పుడు పుస్తకమును తెలిసికొనుటకు మనస్సు సాధనమైనట్లే "ఇది నామనస్సు" అనునప్పుడు దానిని తెలిసికొనుటకు మఱియొకసాధనము ఉండనక్కఱలేదా?" అని తలంపకుము. మనస్సును తెలిసికొనుటకు మఱియొక సాధనము కావలసివచ్చినచో, ఆసాధనమును గుర్తించుటకు ఇంకొక సాధనము కావలసివచ్చును. అప్పుడు దానికి అంతముండదు. అందువలన అన్నిటిని ప్రకాశింపఁజేయుచున్న మనస్సు తనకు తానుగా ప్రకాశించుచున్న దనియే చెప్పవలె. శుద్ధమై స్వప్రకాశమైన మనస్సే నీవు.

ఏవస్తువును చూచుచున్నప్పుడైనను నీకు నీవు భాసింపకుండనున్నావా? "నేను చెట్టును చూచుచున్నాను" అని ముందుగా నీవే భాసించుచున్నావు; తరువాతనే చెట్టు భాసించుచున్నది. "ఆచెట్టువలె నాకు నేను భాసించుట లేదు" అని నీవు చెప్పుదువేని నీవు లేవన్నమాట. అప్పుడు, "నాస్వరూపమును నేనెట్లు సాధింతును?" అను నీ ప్రశ్న ఎట్లు సంభవమగును? ఆకాశపుష్పమువలె నీవే లేనివాఁడ వైనచో ఇక నీకు నీవు ఎట్లు హితమును కోరుదువు? "అయ్యా! నన్నుగూర్చి నాకు సామాన్యముగా తెలియును? విశేషముగా తెలియదు" అని నీవు చెప్పుదువేని వినుము. నిజమే. లోకములో ఒకవస్తువు సామాన్యముగా తెలిసినపుడు దాని విశేషములను తెలిసికొనుటకై ప్రశ్నించుట సహజమే. ఇది చెట్టుఅని సామాన్యముగా తెలిసిన తరువాత ఆచెట్టుయొక్క జాతి లక్షణములు మొదలుగా విశేషములను (Particulars) తెలిసికొందురు. కాని నీస్వరూపమైన యాత్మకు చెట్లకు జంతువులకువలె సామాన్యరూపము విశేషాంశము అనునవి లేవు. దేహేంద్రియాదివిశేషములు ఏవియు దానికి సంబంధింపవు. దానికి ఏవిశేషములునులేవు. అది అంతటను నిర్విశేషముగా అఖండముగా పూర్ణముగా వ్యాపించియున్నది. కావున అది నీకు సామాన్యముగా (అనగా నిర్వి శేషముగా) తెలిసినచో పూర్తిగా తెలిసినట్లే. అహో! నీస్వరూపమును నీవు తెలిసి

కొనుచుండియు భ్రాంతి నొందుచున్నావే! "నేను" అని నీవు చెప్పునప్పుడు నీకు ఈశరీరము ఇంద్రియములే తోఁచుచుండుట నిజమే. కాని నీసంకల్పము ననుసరించియే అవి నీస్వరూపముగా తోఁచుచున్నవి. శరీరమునకు బాధ కలిగినపుడు అది బాగుండవలయు నని నీవు భావించుచున్నప్పుడు ఆశరీరమే నీవైనట్లు భావించుచున్నావు. అట్లే "ఈ యిల్లు నాది" అని తలంచుచున్నప్పుడు దానికి భంగము కలిగినచో శరీరమునుగూర్చి బాధపడినట్లే యింటినిగూర్చి కూడ అది నీవే అయినట్లు భావించుచున్నావు. "నాయిల్లు, నాభూమి" అని ఏయే వస్తువునుగూర్చి భావించుచుందువో ఆయావస్తువుల యందును నీవు వ్యాపించియే యున్నావు. నీవు సర్వమయుఁడవు. అందువలన నీవు ఇల్లు మాత్రమే కాదు; భూమిమాత్రమే కాదు. అట్లే నీవు దేహము మాత్రమే కాదు. కావున ఏది ఏది నీకు కన్పించుచున్నదో అది ఏదియు నీస్వరూపము కాదు. నీవు దృక్కువు. నీకు కన్పించుచున్న దంతయు దృశ్యము, దృక్కు ఎప్పుడును దృశ్యము కాదు. చెట్లు జంతువులు మొదలుగా దృశ్యములు ఎన్ని మాఱుచున్నను దృక్కు మాఱదు. ప్రతిబింబములు ఎన్ని మాఱినను అద్దము మాఱదు. ప్రతిబింబములు అద్దము కానట్లే దృశ్యము దృక్కు కాదు. దేహము దేశము కాలము మొదలుగా ఎన్ని భిన్నవిషయములు దృక్కు రూపమైన చైతన్యమునందు ప్రతిబింబించుచున్నను. అవి ఎంత చిత్రవిచిత్రములుగా భాసించుచున్నను ఆవి శేషములు రవ్వంతయు దృక్కునకు సంబంధింపవు. కావున సంకల్పమును వర్జించి సకలదృశ్యములకు అతీతమై (Beyond all perceptions) శుద్ధ చైతన్యరూపముగా భాసించుచున్న దృక్కును నీస్వరూపమునుగా చూడుము. అట్లు ఒక్కసారి నీస్వరూపమును నీవు గుర్తించినతరువాత దానియొక్క లక్షణమునకు భిన్నముగా దానియందు ప్రతిబింబమాత్రములుగా తోఁచుచున్న దేహము మొదలగునవి నీస్వరూపము కాదని తెలియును. అట్లు తెలియుటవలన సర్వసంసారమునకు కారణమైన యజ్ఞానము తొలఁగిపోవును. మోక్ష మన్నది యాకాశముయొక్క అంచులలోఁ గాని పాతాళముయొక్క లోతులలోఁగాని లేదు. సకలసంకల్పములను త్యజించుటవలన నీబుద్ధియందు స్ఫురించుచుండు శుద్ధచైతన్యమును నీస్వరూపమునుగా గుర్తించుటయే మోక్షము.

అది నీకు స్వరూపమే అగుటచేత అది నీకు ఎప్పుడును అప్రాప్తము (Not obtained) కాదు. అది ఎల్లప్పుడు నీకు సంప్రాప్తించియే (Always obtained) యున్నది. "ఆత్మ నాకు లభింపలేదు" అను భ్రాంతిని తొలఁగించుకొన్న చాలును. అదియే కృతార్థత, మోక్షమును స్వర్గమువలె వేఱొకలోక మని భావింపకుము. సృష్టింపఁబడినలోకము లన్నియు నశించును. మోక్షము అట్లు నశింపదు. స్వప్నములో చూచుచున్ననీవు తప్ప చూడఁబడుచున్న వన్నియును కుందేటికొమ్మువలె అసత్యము లైనట్లు నీస్వరూపమునకు భిన్నముగా నీకు తోఁచుచున్నదంతము అసత్యమే నీస్వరూపము అంతటను నిండియున్నది. అట్టి యెడల మోక్షము నీస్వరూపము కాక మఱి ఎక్కడ సంభవించును? ప్రతిబింబములు లేకుండుటయే అద్దమునకు స్వరూపమైనట్లు నీయందు ఏవిశేషములు గోచరింపకుండుటయే నీకు మోక్షము. లోకవ్యవహారములో కూడ కట్టివేసియున్నవానిని కట్లు విప్పి విడిపించినచో వానికి మోక్షము కలిగినదనుచున్నాము. వాని కప్పుడు బంధము తొలఁగుచున్నదే కాని మోక్షము అన్నది క్రొత్తగా ఏదియు కులుగట లేదు. కావున మోక్షము వేఱొక సత్యమైన వస్తువు కాదు. ఆత్మకు అన్యమైనది ఏదియు సత్యము కాదు. ఆత్మ పూర్ణస్వరూపముగా ఒక సారి గోచరించుటయే మోక్షము. ప్రతిబింబము లున్నప్పుడు అద్దము సంకుచితమైనట్లు కన్పించును. అవితొలఁగినంతనే అది పూర్ణస్వరూపముతో భాసించును. అట్లే ఆత్మయందును దృశ్యములు భాసించుచున్నప్పుడు అది అపూర్ణముగా తోఁచును, దృశ్యములు తొలఁగినంతనే ఆత్మ పూర్ణస్వరూపమున గోచరించును.

ఆత్మయందు దేశము కాలము మొదలగువానివలన విభాగములు ఏర్పడుట లేదు. దేశములను నదులు కొండలు హద్దులై విభజించుచున్నవి. నదులు కొండలు ఆదేశములకు భిన్నములై యున్నట్లు దేశము కాలము ఆత్మకు భిన్నములై దానిని విభజించుచున్న వన్నచో అది అసంభవము. ఆత్మ చైతన్యరూపము. దానికి వెలుపలనున్న ఏ పదార్థమును కూడ స్వరూపమే సిద్ధింపదు. అనఁగా అవి ఉండవు. (They do not exist) దీపపుకాంతి గోడమీఁది బొమ్మలమీఁద పడినచో ఆబొమ్మలు ప్రకాశించుచు ఆకాంతియందు మునింగియుండును. అట్లు ఆకాంతివలన స్ఫూర్తినొందుచు దానియందు మునిఁగియున్న బొమ్మలు ఆకాంతికి విభాగముల నెట్లు కల్పింపలేవో అట్లే చైతన్యము నందు ప్రతిబింబించుచు దానియందు మునిగియున్న దేశకాలములు దానికి విభాగములను కలిగింపలేవు.

కావున పదార్థము లన్నియు చైతన్యమునందు ప్రతిబింబించుచు దానియందే గోచరించుచున్నవి. అద్దమునకు భిన్నముగా దానిలోని ప్రతిబింబములకు ఉనికి (Existence) లేనట్లు చైతన్యమునకు భిన్నముగా పదార్థములకు ఉనికియే లేదు. కలలో వలె పదార్థములు జాగ్రత్తులో కూడ వెలుపల నున్నట్లు తోఁచుచుండుట భ్రమవలననే జరుగుచున్నది. భ్రమవలన తోఁచుచున్న పదార్థములు సత్యములు ఎట్లగునో చెప్పుము? కావున చైతన్యరూపమైన మనయాత్మయే మాయారూపమైన స్వాతంత్ర్యశక్తిచేత వివిధపదార్థములుగా భాసించుచున్నది. కలలో మనస్సు ఒక్కటే కదా వివిధపదార్థములుగా సంఘటనములుగా భాసించుచున్నది. జాగ్రద్దశలో కూడ అట్లే జరుగుచున్నది. కావున ఆత్మకన్న భిన్నముగా వెలుపల ఏదియును లేదు."

ఈ మాటలు విని భార్గవుఁడు మరలప్రశ్నించెను. "భగవానుఁడా! నీవు చెప్పినది చాలదుర్ఘటముగా తోఁచుచున్నది. శుద్ధమైన చైతన్యము ఒక్కటియే వివిధముగా భాసించుట అసంభవము. చితి చేత్యము అని వస్తువులను రెండువిధములుగా గ్రహించుచున్నారు, చితి స్వప్రకాశము చితిచేత భాసించునది చేత్యము. దీపముచేత భాసించుచున్న వస్తువు దీపముకన్న వేఱుగానే కన్పించుచున్నది. అట్లే చితచేత భాసించుచున్న చేత్యము కూడ దానికన్న భిన్నమైన పదార్థమే యగును. చేత్యము చిదాత్మకము అనుమాట అనుభవమునకు అందుట లేదు, మఱియును సంకల్పమును వదులుకొనుటవలననే మనస్సు నిర్వికల్ప మగునని మహాత్ముఁడైన జనకుఁడు చెప్పెను. అదియే ఆత్మకు రూపము, అదియే సంసారనాశమును గావించు నిర్వికల్పజ్ఞానము అనియు ఆయన చెప్పెను. మఱి జ్ఞానము పొందుటయందు ఆత్మకు మనస్సు సాధనమని చెప్పఁబడినది, మనస్సు సాధనముగా లేకున్నచో ఆత్మ దేనిని గ్రహింపలేక జడమే యగును. అప్పుడు జడమైన ఆత్మకన్న మనస్సే గొప్పదగును. ఆత్మకు బంధము కాని మోక్షము కాని మనస్సుచేతనే కలుగుచున్న దనుట స్పష్టము, మనస్సు సవికల్ప మైనచో బంధము, నిర్వికల్పమైనచో మోక్షము కలుగుచున్నది, అట్టియెడల సాధనమైన మనస్సే ఆత్మ ఎట్లగును? ఖడ్గము, దానిని ధరించినవాఁడు రెండు భిన్న పదార్థములు అయినట్లు మనస్సు నిర్వికల్పమైనను ఆత్మకన్న భిన్నమే అగును. అప్పుడు ద్వైతము తప్పదు. మఱియును లోకములో ఎవని కైనను భ్రాంతి కలిగినప్పుడు, దేనినిగూర్చి వాఁడు భ్రాంతిపడుచున్నాఁడో ఆవిషయము అసత్యమే అగును. కానివానికి భ్రాంతికలుగుట మాత్రము సత్యమే. వ్యక్తి, వానిభ్రాంతి రెండును సత్యములగుచుండుటచే అద్వైత మెట్లు సిద్ధించును. ఎండమావులలో నీరు కన్పించినప్పుడు ఆనీరు అసత్యమే. దానివలన దప్పిక తీఱదు. ఆనీరు చాలసేపు కూడ నిలువదు. పనికి ఉపయోగపడుట చిరకాల ముండుట అన్నది అసత్యవస్తువునందు సంభవింపదు. మఱి జగత్తులోని వస్తువులు చిరకాలము నిలుచుచు ఎన్నోపనులకు ఉపయోగపడుచున్నవి. కావున జగత్తులోని వస్తువులను అసత్యములని ఎట్లు చెప్పవచ్చును? జగత్తు సత్యమైనచో ద్వైతమే సిద్ధించును. అద్వైతము సిద్ధింపదు. మఱియును దృశ్యమైన జగత్తువలన కలుగుచున్న దంతయు భ్రాంతి జ్ఞానము యని మీరు చెప్పుచున్నారు. అట్లయినచో భ్రాంతిరహితమైన జ్ఞానమే యుండదు. అట్టి యెడల ఇదిభ్రాంతి అది సత్యము అను భేదము ఎట్లు కలుగును? భ్రాంతి యైనను అందఱకు సమానముగ ఎట్లు కలుగుచున్నది? ఈసందేహము నామనస్సును వీడకున్నది దయతో వివరింపుఁడు."

దత్తాత్రేయుఁడు సంతోషించి ఇట్లు చెప్పమొదలిడెను. "భార్గవా! చక్కఁగా అడిగితివి. ఈవిషయమును చాలవఱకు వెనుకనే చెప్పితిని. అయినను మనస్సునకు సంతుష్టి కలుగు వఱకు మరల మరల విషయమును శోధింపవలసినదే. ఒక్కొక్కనికి ఒక్కొక్కవిధమైన బుద్ధియుండును. అందువలన ఆలోచించు విధానముకూడ ప్రతివానికి భిన్న ముగానే యుండును. అట్టి యెడల శిష్యుఁడు తన మనస్సులోని సందేహమును అడుగకున్నచో గురువైనను ఎట్లుచెప్పగలడు? గురువును అడుగక ఎవఁడైనను సందేహమును ఎట్లు తీర్చుకొనఁగలఁడు? ప్రశ్నించుచుండువానియొక్క విద్య దృఢమగును. సత్యనిరూపణకు ప్రశ్నయే బీజము. కావున గురువును ప్రశ్నించుచు తెలిసికొనువానికే విద్య లంభించును.

చితి ఒక్కటే అనేకముగా ఎట్లు అగునని అడుగుచున్నావు. స్వప్నములో ఊహాలోకములో ఒక్కమనస్సు తప్ప మఱదియు ఉండదు. ఒక్కమనస్సే అప్పుడు చూచువాఁడుగా చూచుటగా దృశ్యముగా భాసించుచున్నది కదా! ఇట్లే జాగ్రద్దశయందు కూడ శుద్ధమైన చైతన్యమొక్కకటియే చితిగా చేత్యముగా వివిధరూపములతో భాసించుచున్నది. కావున స్వప్నమునందు ద్వైతము లేనట్లే జాగ్రద్దశలోకూడ ద్వైతము లేదు.

దీపపువెలుఁగులో వస్తువుకన్పించుచున్నది. కాఁబట్టి ఆవెలుఁగు కన్న వస్తువు భిన్నముగా నున్నదని చెప్పుచున్నావు. కాని వస్తువు గోచరించుటకు వెలుఁగు ఉండవలయు ననునియమము లేదు. వెలుఁగును చూడ లేకున్నను అంధుఁడు స్పర్శచేత వస్తువును గ్రహించుచున్నాఁడు. ప్రతివ్యక్తియు వస్తువును స్మరించునప్పుడు దానిరూపమును మనస్సునందు చూచుచునేయున్నాఁడు. మనస్సు చైతన్యముతో కూడియుండక పనిచేయక ఉన్నప్పుడు ఎవ్వఁడును ఏవస్తువును చూచుటలేదు. కావున వస్తువు లన్నియు చైతన్యము అను నద్దమునందు ప్రతిబింబించుటచేతనే మనకు గోచరించుచున్నవి. అద్దముకన్న భిన్నముగా ప్రతిబింబము ఎట్లు ఉండదో అట్లే చైతన్యముకన్న భిన్నముగా జగత్తులోని వస్తువులు లేవు. కావున చితికి అన్యముగా రెండవవస్తువు లేదు. కావుననే మనస్సుకూడ చితికి అన్యముగా లేదు. స్వప్నములో మనస్సునకు భిన్నముగా ఆస్వప్నప్రపంచము ఎట్లు లేదో అట్లే జాగ్రద్దశలో కూడ మనస్సునకు భిన్నముగా ప్రపంచము లేదు. స్వప్నమునందు చెట్టును ఖండించుటకు గొడ్డలి సాధనమగుచున్నది. కాని ఆచెట్టు, దానిని ఖండించుట, దానికి సాధనమైన గొడ్డలి మొదలుగా అంతయు అసత్యమే కదా! అట్లే దృశ్యములు ఎట్లు అసత్యములో అట్లే వానిని గ్రహించుటకు సాధనమైన మనస్సు కూడ అసత్యమే. స్వప్నములో జరుగుసంఘటన లన్నియు అసత్యములు. వానికి కారణమైన మనస్సు కూడ అసత్యమే. అట్లే జాగ్రద్దశలో కూడ దృశ్యములు సంఘటనములు మిథ్య; వానిని గ్రహించుచున్న మనస్సు కూడ మిథ్యయే. కేవలమైన చిదాత్మ స్వచ్ఛమైన తనస్వాతంత్ర్యముచేత మనస్సు మొదలగు వానిని కల్పించి దృశ్యము చూచువాఁడు మొదలగు భేదములతో వ్యవహరించుచున్నది. అది ఒక్కొక్కప్పుడు కేవలము నిర్వికల్పముగా ఉండును.

భర్గవా! చితియొక్క తత్త్వమును చక్కఁగా పరిశీలించి గ్రహింపుము. ఆకాశము ఆత్మవలెనే పూర్ణము సూక్ష్మము నిరంజనము నిరాకారము. అయినను అది ఆత్మతో తుల్యము కాదు. ఆత్మయందున్న చైతన్యము దానియందు లేదు. కాని ఆకాశము ఆత్మకన్న భిన్నముగాలేదు. అజ్ఞానులు ఆత్మనే చూచుచు దానిని ఆకాశ మని భ్రమించుచున్నారు. సూర్యునికాంతి ప్రసరించుచున్నను దానిని గుడ్లగూబలు చీకటి గానే చూచుచున్నవి గదా! జ్ఞానులు ఆకాశమును ఆత్మగానే చూచుచున్నారు. చిదాత్మ స్వచ్ఛమైన తనస్వాంతంత్ర్యవైభవముచేత ఒక్కటిగానున్న తాను అనేకవిధములుగా భాసించుచున్నది ఇంద్రజాలికుఁడు తాను ఒక్కఁడే యయ్యును ఇతరులకు అనేకరూపములతో భాసించుచున్నాఁడు. ఆరూపము లన్నియు వానిమాయచేత మోహితులైనవారికి గోచరించుచున్నను వానిదృష్టిలో అతఁడు కేవలుఁడే; ఆరూపము లన్నియు అసత్యములే. అట్లే మాయామోహితులైనవారికి జగత్తులోని రూపములన్నియు సత్యముగా భాసించుచున్నను, ఆత్మతత్త్వము నెఱింగి చిదాత్మస్వరూపులైనవారికి ఆజగద్రూపము లన్నియు అసత్యములుగా తమస్వరూపమైన చిదాత్మ యొక్కటియే సత్యముగా గోచరించును.

ఒక్కటిగా నున్న చిదాత్మ అనేకపదార్థములుగా ఎట్లు భాసించుచున్న దని నీవు శంకించుచున్నావు. చిదాత్మకు అత్యంతమైన స్వాతంత్ర్యము కలదు. అదియే మాయ. అది ఎంతటి దుర్ఘటమైన కార్యమునైనను సమకూర్పఁగలదు. లోకమునందు యోగులే కాక మామూలుగా నుండు మాంత్రికులు ఇంద్రజాలికులు కూడ మనకు దుర్ఘటముగా తోఁచుకార్యములను చేయుచునేయున్నారు. వారు ఎంతగా స్వాతంత్ర్యశక్తిని పొందుచున్నారో అంతగా వారు ఆకార్యములను నిర్వహింపఁగలుగుచున్నారు. చిదాత్మయొక్క స్వాతంత్ర్యము పరిపూర్ణము. అదియే మాయాశక్తి. ఆమాయయొక్క ఆవరణమును యోగము మొదలగు సాధనములచేత ఎవరు ఎంతగా తొలఁగించుకొనుచున్నారో వారి కంతగా స్వాతంత్ర్యము కలుగుచున్నది. ఆస్వాతంత్ర్యముయొక్క శక్తిననుసరించి వారు దుర్ఘటములైన కార్యములను సాధించుచున్నారు. కావున పరిపూర్ణమైన స్వాతంత్ర్యశక్తి కలిగిన చిదాత్మ ఈజగత్తును బాసింపఁజేయుట విచిత్రముకాదు.

అఖండమై పరిపూర్ణమైయున్న చిదాత్మయందు జగద్రూపము లైన విభాగములు ఎట్లు ఏర్పడుచున్నవోచూడుము. పూర్ణమైన చిదాత్మతనలో ఒకభాగమునందు "ఇది నేను" అని అభిమానించుచుండుటయే విభాగము తోచుటకు మూలము. ఈయపూర్ణత్వస్ఫురణమే అవిద్య అని శాస్త్రములయందు చెప్పఁబడినది. ఇట్లుతనలో కొంతభాగము నందు చిదాత్మ "ఇదినేను" అనునభిమానముతో స్ఫురించుచుండఁగా ఆభాగము జగత్తుగా భాసించుచున్నది. మిగిలినది ఆకాశముగా బాసించిచున్నది. కావున ఆత్మకు భిన్నముగా జగత్తు గాని ఆకాశము గానిలేవు రెండును ఆత్మయందే తోఁచుచున్నవి. ఈవిషయమున తార్కికులే కాదు పండితులు కూడ అనేకులు భ్రమ నొందుచున్నారు. ఆత్మతత్త్వమునుగూర్చి విన్న పండితులు చాలమంది దానిని తమస్వరూపమునుగా గ్రహింపక బహిర్ముఖమైన దృష్టితో

వ్యవహారమున నిమగ్నులై యుందురు. ఆత్మతత్త్వమునుగూర్చి ఎంతగా విన్నను మననము చేసినను. అపరోక్షముగా (Directly) తన స్వరూపముగా ఆత్మసాక్షాత్కరించువఱకు నిదిధ్యాసనము చేసిననేతప్ప అజ్ఞానము నశింపదు. కావునభార్గవా! బాహ్యదృష్టిని వీడి నేను చెప్పినదానిని అంతర్ముఖమైన దృష్టితో చక్కఁగా చూడుము.

చిదాత్మకు జడమునకు భేదము ఎట్లుఏర్పడుచున్నదో చూడుము. చిదాత్మ సకలమునందును వ్యాపించి సర్వమును ప్రకాశింపఁజేయుచు. తాను దేనిచేతను ప్రకాశింపఁబడక, స్వయముగా ప్రకాశించుచున్నది. జడములు స్వయముగా ప్రకాశింపక చిదాత్మవలన ప్రకాశించుచున్నది. అద్దమునందు ప్రతింబింబించుచున్న వస్తువులయొక్క విశేషములు ఏవియు అద్దమునకు ఎట్లు సంబంధించుట లేదో అట్లే చిదాత్మవలన ప్రకాశించుచున్న జడములయొక్క విభాగవిశేషములు ఏవియు చిదాత్మకు సంబంధింపవు. జడములకు అతీతమై అఖండమైన స్వయంజ్యోతియై వెలుఁగుచున్న యాత్మను సాక్షాత్కరించుకొనుటయే స్వాత్మవిశ్రాంతి దానినే పూర్ణాహంత పూర్ణాహంకారము అనియు చెప్పుదురు. విషయమును నిరూపించుటకై ఇన్నివిధములుగా చెప్పుచున్నామే కాని వస్తువు మాత్రము ఒక్కటియే.

తేజస్సునందు కాంతి ఉష్ణము ఎట్లు అభిన్నముగా నున్నవో అట్లే మాయాశక్తియును చిదాత్మంయందు అభిన్నముగా నున్నది. తేజస్సు కాంతి రెండు పదార్థములు కావు. అవి రెండుపదార్థములేయైనచో రెండింటిని విడఁదీసి చూపవలసియుండును. కాని అట్లు విడఁదీయలేము. అట్లే మాయాశక్తియు చిదాత్మయందు అభిన్నముగానున్నది. అది వాస్తవముగా చిదాత్మయే. అది అద్దమువలె ఎన్నో వస్తువలను భాసింపఁజేయుచున్నది. దానియందు ఎన్నివస్తువులు గోచరించుచున్నను దానిస్వరూపమునందు మాత్రము ఎట్టిమార్పు కలుగుట లేదు. చిదాత్మ మాయాశక్తి చేత నామరూపముల విభాగములతో భాసించుచుండుటయే అనాత్మాభాస, అవిద్య, జడశక్తి, శూన్యము, ప్రకృతి, అత్యంతాభావము, ఆకాశము, తమస్సు అని పేర్కొనబడుచున్నది. ఇది యంతయు మొదటి విభాగము. పరిపూర్ణమైన యాత్మస్వరూపమును గుర్తింపలేక భ్రాంతితో దానియందు కొంతభాగమును చూచుచుండుటవలననే ఆకాశము తోఁచుచున్నది. ఆత్మప్రదేశమునందు ఏ భాగమున "ఇది నేను" అనునహంకారము ప్రసరించుటలేదో అది అకాశముగా భాసించుచున్నది. కొంత అకాశముగా కొంత జగత్తుగా గోచరించుచున్న యీభేదమే సంసారమునకు కారణమగు చున్నది. రామా! సూక్ష్మదృష్టితో చూడుము. దేనిని నీవు ఆకాశముగా చూచుచున్నావో అదియే దానియందున్న జీవరాశులకు ఆత్మచైతన్యము. అదియే నీ యందు ఎట్లుఉన్నదో అట్లే ఇతరులయందును ఆనందఘనముగా (Solid mass of bliss) నున్నది.

కల్పితమైన యీయాకాశవిభాగముచేత సంకుచితమైనట్లు తోఁచుచున్నచిదాత్మయే మనస్సు, అది ఆత్మకన్న భిన్నమైన వేఱొకపదార్థముకాదు. అయినను మాయయొక్క ఆవరణశక్తి చేత జగత్తు భాసించుచున్నప్పుడు ఆజగత్తులోని వస్తువులను గ్రహించుటకు మనస్సు ప్రమాణమగుచున్నది. అనఁగా జ్ఞానమును కలిగించుటకు సాధన మగుచున్నది. మనస్సుచేత విషయములను గ్రహించుచున్న చిదాత్మ జీవుఁడని చెప్పఁబడుచున్నాఁడు. మొదట ఆకాశముచేత ఆవరింపఁబడిన చిదాత్మ క్రమముగా దానియందు ఇతరగుణములను ఆరోపించుచు తక్కినభూతముల చేత, ఆభూతములవలన ఏర్పడిన శరీరముచేత ఆవరింపఁబడినది. ఇట్లు కుండలోపలనున్న దీపమువలె చిదాత్మ శరీరములోపల నుండి దానినంతను కాంతిచేత వ్యాపించి ప్రకాశింపఁజేయుచున్నది. కుండలో నున్న దీపము దానిని భాసింపఁజేయుచు దానితో సంబంధము లేకుండ స్వతంత్రముగా ఎట్లుప్రకాశించుచున్నదో, చిదాత్మ కూడ శరీరేంద్రియములను భాసింపఁజేయుచు వానితో సంబంధములేకుండ స్వతంత్రముగా ప్రకాశించుచున్నది. కుండయొక్క చిల్లులనుండి లోపలి దీపకాంతిఎట్లు వెలికి వచ్చునో అట్లే ఇంద్రియద్వారములనుండి చిదాత్మయొక్క చైతన్యము వెలికి ప్రసరించుచుండును. నిజమునకు చైతన్యము వెలికి ప్రసరించుట యన్నది లేదు. పూర్ణమైన చైతన్యమునకు కదలికయే కుదురదు. తనకు ఆవరణముగానున్న జడశక్తి రూపమైన యజ్ఞానమును చిదాత్మయొక్క స్ఫూర్తి రూపమైన జ్ఞానశక్తి ఎంతదూరము నివారించునో అంతదూరము చైతన్యము వెలికి వచ్చుచున్నట్లుగా తోఁచును. చిదాత్మయొక్క స్ఫూర్తిరూపమైనజ్ఞానశక్తి జీవునియందు పరిమితమై యుండును. అది ఇంద్రియద్వారములనుండి వస్తువుల నావరించియున్న జడశక్తిని వారించును. ఆవరణము తొలఁగుటయేకాని జ్ఞానము ప్రసరించుట యున్నది లేదు. స్ఫూర్తిచేత వస్తువులను కప్పియున్న యజ్ఞానమును తొలఁగించుట మనస్సుచేయుచున్నపని. కావున మనస్సే ఆత్మ అని చెప్పఁబడు చున్నది. చలించుచున్న చితియే మనస్సు, మనస్సు నిశ్చలమైనచో ఆత్మయే యగును. స్ఫూర్తి చేత

ఆవరణమును తొలగించుచుండుటయే చితియొక్క చలనము. ఈచలనమే వికల్పజ్ఞానము. వికల్పములను వదలి మనస్సు నిశ్చలమై నిర్వికల్ప మైనచో పూర్ణవిజ్ఞానమై ముక్తికలిగించును.

'మనస్సునందు వికల్పములను వదలిపెట్టినంతమాత్రముననే వెలుపలనున్న వస్తువులను ఆవరించియున్న జడశక్తి తొలఁగిపోవునా' అని సంశయింపకుము. అసలు ఆవరణమేలేదు. నీచేతనే కల్పింపఁబడిన యావరణము సత్య మెట్లగును? త్రాడునుచూచి పామునుగా అనుకొనుచున్నప్పుడు త్రాడును ఆవరించియున్న యజ్ఞానము నీచే కల్పింపఁబడినదే కదా! ఊహాలోకమున నీవు నీశత్రువుచేత బంధింపఁబడి బెదిరింపఁబడుచు కొట్టఁబడుచున్నా వనుకొవుము. ఊహ చెదరిపోయినచో బంధనము కొట్టఁబడుట మిగులునా! వ్యవహారము కూడ ఇట్టిదే అని గ్రహింపుము. వికల్పములు తొలఁగినచో సంసారబంధము కూడ మిగులదు. భార్గవా! అనాదికాలమునుండియు ఎవ్వనికి బంధమేలేదు. భ్రాంతి తప్ప బంధము ఎవ్వని కున్నది? ఎక్కడ ఉన్నది? విచారింపుము. "నేను బంధింపఁబడియున్నాను" అని నిశ్చితముగా అనుకొనుచుండుటయే బంధము. ఎంత బుద్ధిమంతుఁడైనను ఎన్నిప్రయత్నములు చేసినను బంధమనుభ్రాంతిని తొలఁగించుకొనిననే తప్ప సంసారమునుండి ముక్తుఁడు కాఁజాలఁడు. నిర్మలమైన చిదాత్మకు బంధమేమి? ఎట్లు కలుగును? ఆత్మరూపమైన యుద్దమునందు ప్రతిబింబములైన భావములచేతనే బంధము కలుగు నని తలంతు వేని, అద్దములో ప్రతిబింబించుచున్న యగ్ని కూడదహించు నని చెప్పవలసియుండును. "సంసారబంధము, మనస్సు ఉన్నవి" అన్ననిశ్చయముతో రెండువిధములుగా ఏర్పడుచున్న భ్రాంతి తప్ప ఎవనికి ఎక్కడను ఎప్పుడును బంధ మన్నదే లేదు, సరియైనవిచారము అను మహాజలముచేత ఈరెండింటివిషయమునఁగల భ్రాంతి అనుమాలిన్యమును కడిగివేసికొనిననే తప్ప ఎవనికి సంసారభీతి నశింపదు. ఆభ్రాంతి తొలఁగనంతవఱకు నేను గాని బ్రహ్మదేవుఁడు గాని శంకరుఁడుగాని విష్ణువు గాని విద్యారూపిణియైన త్రిపురాదేవి గాని ముక్తినికలిగించుట అసంభవము. కావున రామా! ఈరెండింటిని వీడి సుఖింపుము.

మనస్సు నిర్వికల్పముగా నున్నప్పుడ ఆత్మయే యగును, కావున ద్వైతమునకు ప్రసక్తి లేదు. "ఇది అది" అని వివిధ పదార్థముల రూపముతో భాసించుటకన్న భిన్నముగా మనస్సేమున్నది? "ఇది అది" మొదలుగా పదార్థముల భావనను విసర్జించినచో మిగులునది ఆత్మయే. త్రాడును చూచి పామునుగా భ్రమించునప్పుడు త్రాడే పాముగా భాసించుచున్నది. పామునకు సంబంధించిన భ్రాంతిజ్ఞానము నశించినపుడు త్రాడునకు సంబంధించిన జ్ఞానము నిలిచియుండును. అట్లే త్రాడు కూడ చిత్తునందు తోఁచుచున్న భ్రాంతియే యని నిశ్చయము కలిగినప్పుడు త్రాటియొక్క జ్ఞానము కూడ నశించి కేవలచైతన్యమే మిగులును. ఇట్లు నీకు కన్పించుచున్న ప్రతి దృశ్యమునందును నామరూపవిశేషములను కల్పితములనుగా గ్రహించి ఆభ్రాంతిజ్ఞానమును తొలఁగించినచో కేవలమైన చైతన్యమే మిగులును. అది నీ దృక్కే. దృశ్యములన్నియు నీదృక్కునందే రూపొందుచున్నవి. నీ దృక్కు ప్రసరింపకున్నచో దృశ్యమే లేదు. ఆదృక్కునందు నామరూపములను గ్రహింపకున్నను దృశ్యము లేదు. వెండిచెంబు వెండికంచము మొదలగునవి వెండికన్న భిన్నముగా లేనట్లు దృశ్యములు దృక్కునకు భిన్నముగా లేవు. కావున దృక్కు ఒకటే వస్తువు. అది నీస్వరూపమే. కావున ద్వైతమునకు ప్రసక్తియే లేదు.

"జాగ్రద్దశలో పదార్థములు ఎన్నోపనులకు ఉపయోగపడుచు స్థిరముగా నున్నవి. కావున అవి వస్తువు కావనుట ఎట్లు కుదురును? అవి వస్తువులైనప్పుడు అద్వైత మెట్లుండును? అని నీవనుచున్నావు. పనులకు ఉపయోగపడుచు స్థిరముగా నున్నట్లు తోఁచినంతమాత్రమున పదార్థములు సత్యములు కావు. స్వప్నమునందు పదార్థము లన్నియు ఉపయోగపడుచు ఆసమయమున స్థిరముగా నున్నట్లే తోఁచుచున్నవి. అంతమాత్రమున అవి యథార్థము లగుట లేదు. మేల్కొన్నంతనే అవి యన్నియు మిథ్య యనియే తలంచుచున్నాము. స్వప్న జాగ్రత్తులకు కొంచెమే భేదము. స్వప్నము మిథ్య అను నిశ్చయము జాగ్రత్తులో కలుగుచున్నది. జాగ్రత్తులోని వ్యవహారము మిథ్య అను నిశ్చయము స్వప్నములో కలుగుటలేదు. అంతమాత్రమున జాగ్రత్తులోని వ్యవహారము సత్యము కానేరదు. జాగ్రత్తులో ఈపదార్థములు ఎంత సత్యముగా తోఁచుచున్నవో స్వప్నములో కూడ అంతే సత్యముగా తోఁచుచున్నవి కదా! జాగ్రత్తులో అవి లేక పోవుటచే మిథ్య అనుచున్నావు. అట్లే స్వప్నములో జాగ్రత్తులోని వ్యవహారముండదు. కావున ఈవ్యవహారము కూడ మిథ్యయే. మాఱుచున్నస్వప్నమును జాగ్రత్తులోని వ్యవహారమును చూచుచున్న నీవు మాఱుట లేదు. కావున నీ వొక్కఁడవే సత్యము.

మఱియొక దృష్టాంతమును చూడుము. ఇంద్రజాలమునందు కూడ కల్పింపఁబడిన వస్తువులు పనులకు ఉపయోగపడుచు స్థిరములుగా నున్నట్లే తోఁచుచున్నవి. అంత్రమాత్రముచేత అవి సత్యము లగు చున్నవా? ఇంద్రజాలముచేత భ్రాంతులైనవారు ఆవస్తువులను సత్యములుగా ఎట్లుతలంచుచున్నారో అట్లే లోకవ్యవహారమునందును మాయామోహితులైనవారు దీనిని సత్యమనుచున్నారు. రామా! వినుము. ఎల్లప్పుడును ఏదియున్నదో అదియే సత్యము. ఒకప్పుడైనను లేకుండపోవునది సత్యము కాదు. "అయ్యా! స్వప్నములోఁగాని జాగ్రత్తులోఁగాని దృశ్యములను గ్రహించుచున్నప్పుడే దృక్కు కూడ ఉన్నట్లు మనకు తెలియుచున్నది. గాఢనిద్రయందు దృశ్యమును గ్రహింపనప్పుడు దృక్కు ఉన్నట్లు తెలియుట లేదు. కావున నిద్రలో దృక్కులేదు. కాఁబట్టి దృక్కు కూడ అసత్యమే" అని నీవు అనవచ్చును. కాని ఆనిద్రయొక్క కాలము దృక్కు లేకపోవుట నీకు ఎట్లు తెలిసినవి? అవి నీకు తెలిసినవనఁగా అప్పుడు వానిని గ్రహించుచున్న నీవు ఉన్నావన్నమాట. అప్పుడు వానిని గ్రహించుచున్న నీస్వరూపము దృక్కే. కావున దృశ్యములు లేని నిద్రలో కూడ దృక్కు ఉన్నది. అదిలేని సమయమే లేదు కాఁబట్టి అదియే సత్యము.

ఏది ఇతరముపై ఆధారపడక స్వయముగా ప్రకాశించుచుండునో అదియే సత్యము. తక్కినదియంతయు అసత్యము. అట్లుకాక, అసత్యమని నిరూపింపఁబడువఱకు కన్పించుచున్నదంతయు సత్యమే అని అందువేని, అది కుదురదు. ఎందువల్ల ననఁగా, ఎండమావులలో నీరు వలె, లేనిది ఉన్నట్లుగా కన్పించుచున్నది; అట్లే ముత్యపుచిప్ప వెండి బిళ్ళవలే తోఁచుచున్నప్పుడు; యథార్థముగ ఉన్న ముత్యపుచిప్ప కన్పించుటలేదు. ఇది అందఱకును అనుభవసిద్ధము. అట్టియెడల నీవు చెప్పినట్లుగా అసత్య మని నిరూపింపఁబడువఱకు కన్పించుచున్నదంతయు సత్యమే అని అంగీకరించినచో, ఎండమావులలో నీరు కొంతకాలము సత్యముగా ఉన్నదని, ముత్యపు చిప్ప నిజముగా కొంతకాలము లేదని అంగీకరింపవలసియుండును. ఇది కుదరదు. కావున ఎప్పుడును స్వయముగా ప్రకాశించుచున్న దృక్కు సత్యము. తక్కిన దంతయు అసత్యమే. అట్టియెడల కన్పించుచున్న దృశ్యముతప్ప నిర్విశేషముగా ఎప్పుడును గోచరింపనిదృక్కు లేదని వాదించువాఁడు మూర్ఖుఁడు. అట్టివాఁడు "నేను లేను" అని కూడ చెప్పగలఁడు. శరీరమును ఇంద్రియములను వీడినచో తా నున్నాఁడో లేఁడో తెలియక తన యునికి యందే (Existence) సందేహము కలఁవాడు ఎట్టి తర్కముచేనైనను ఇతరులయొక్క అజ్ఞానమును ఎట్లు పోఁగొట్టఁగలఁడు? అట్లు వాఁడు చెయఁగలిగినచో ఒకపెద్దగుండుఱాయి కూడ మానవులయజ్ఞానమును పోఁగొట్టగలుగును.

కావున లోకమున వస్తువులు ఉపయోగపడుచు స్థిరముగా నున్నట్లు కన్పించుచున్నంతమాత్రమున ఇవి సత్యములు కానేరవు. ఈ పదార్థవిజ్ఞాన మంతయు భ్రాంతియే ఈశాస్త్రముల విజ్ఞాన మంతయు ఎంతో సత్య మైనట్లు తలంచుచుండుట మాహాభ్రాంతి ముత్యపు చిప్పకన్పించువఱకు వెండి సత్యముగానే తోఁచునట్లు ఆత్మసాక్షాత్కరము కలుగువఱకు జగత్తు సత్యముగానే తోఁచుచుండును. ఆత్మజ్ఞానము కలిగినంతనే జగత్తుయొక్క విజ్ఞానమంతయు భ్రాంతియేయగును. భ్రాంతి అందఱకు ఎట్లు సమానముగా నుండునని నీవు శంకించుచున్నావు. శూన్యమైన యాకాశము నీలముగా ఉన్నట్లు అందఱకును సమానముగానే గోచరించుచున్నది కదా! అట్లే అజ్ఞానముయొక్క సామ్యమువలన అందఱకును జగత్తు సత్యమైనట్లు సమానముగా భ్రాంతికలుగుచున్నది. ఆభ్రాంతి తొలఁగినంతనే శుద్ధమైనయాత్మవిజ్ఞానము కూడ అందఱకును సమానముగానే కలుగుచున్నది.

భార్గవా! నీవు అడిగినదానికి యుక్తియుక్తముగ సమాధానము చెప్పితిని. చెప్పినదానిని చక్కఁగా విచారించుకొని సందేహమును వీడినిశ్చయమును పొందుము. ముక్తి నొందినతరువాత వ్యవహారము ఎట్లు జరుగునని ఇంతకు పూర్వము ప్రశ్నించియుంటివి. దానికి సమాధానమును వినుము. లోకమునందు ఉత్తములు మధ్యములు అధములు అని ముక్తులు మూఁడువిధములుగా నున్నారు. ప్రారబ్ధమువలన కలుగుచుండు సుఖదుఃఖములచేత క్షణక్షణము కలఁత నొందుచుంటఁడియు స్వరూపజ్ఞానము కలిగియుండువారు అధములు. మందమారుతమువలన సుఖము నల్లులు దోమలు మొదలుగు వానివలన దుఃఖము కలుగుచున్నను గాఢముగ నిద్రించువారివలె. ప్రారబ్ధమువలన సుఖదుఃఖాభవము కలుగుచున్నను వానిని గుర్తింపక ఎల్లప్పుడు శాంతిచిత్తులై యుండు వారు మధ్యములు. ఆపదలు పరంపరగా వచ్చిపడినను ఉద్వేగమును పొందక, మహాసుఖములు కలుగునప్పుడు హర్షమును పొందక, ఎట్టి యద్భుతసంఘటనములందు విస్మయము నొందక, ఏపరిస్థితియందును స్వరూపమునుండి తొలఁగక, మనస్సునందు కామక్రోధాదులయొక్క క్షోభను రవంతయు పొందక శాంతులైయుండి లోకమున అందఱవలెనే

వ్యవహరించుచుండువారు ఉత్తమజ్ఞానులు. ఉత్తముడు కేవలజ్ఞాని. మధ్యముఁడు అధముఁడు జీవన్ముక్తులు. అధముఁడు సంతతము సమాధి స్థితియందు నిలువఁజాలఁడు ప్రారబ్ధమువలన అప్పుడప్పుడు స్వరూపస్థితినుండి తొలఁగి క్లేశము నొందుచుండును. అభ్యాసబలముచేత మనస్సును నిరోధించి ఎల్లప్పుడు లోపల సమాధిస్థితియందు నిలువఁగలిగినవాఁడు మధ్యముఁడు. మనస్సు వ్యవహారమునందు ప్రసరించుచున్నను వెలుపల కూడదృఢమైన సమాధిస్థితిలో నుండువాఁడు ఉత్తముఁడు. కావున బుద్ధియొక్క భేదముల ననుసరించి, జ్ఞానపరిపాకము యొక్క దశలలోని భేదములనుబట్టి, వారివారి ప్రారబ్ధశేషములను బట్టి జ్ఞానులకు కూడ విచిత్రములైన వ్యవహారములు సంభవించుచుండును.

ఇది జ్ఞానఖండమునందు మనస్స్వరూపనిరూపణ మన్నది.అష్టాదశాధ్యాయము.

# పందొమ్మిదవయధ్యాయము-జ్ఞానులస్థితి భేదములు

భార్గవుఁడు మరల దత్తాత్రేయు నిట్లు ప్రశ్నించెను. "భగవానుఁడా! ఆత్మను గోచరింపఁజేసికొనుటకు ఉపాయమైన జ్ఞానము అందఱకును ఒకటియే కదా. దానివలన కలుగుమోక్షము కూడ ఒకవిధము గానే యుండును. అట్టియెడల బుద్ధియొక్క భేదములనుబట్టి జ్ఞానముయొక్క పరిపక్వతయందు భేదము ఎట్లు కలుగును? జ్ఞానముయొక్కసాధనములందు భేద మున్నదా? వివరింపుము."

దయానిధియైన దత్తాత్రేయుఁడిట్లు చెప్పెను. "రామా! ఇది ఉత్తమమైన రహస్యము. చెప్పెదను. వినుము. జ్ఞానమునందు భేదములు లేవు. సాధనములయొక్క తారతమ్యములవలననే ఫలప్రాప్తియందు భేదము లేర్పడుచున్నవి. సాధన పూర్తియైనంతనే, చక్కఁగా పండినపండు పైనుండి రాలి యొడిలో పడినట్లుగా, జ్ఞానము అనాయాసముగా సిద్ధించును. సాధనయొక్క అపూర్ణతయందలి తారతమ్యము చేత శ్రమయందును (Effort) తారతమ్యము కలుగుచున్నది. జ్ఞానము స్వప్రకాశమై ఎప్పుడును సిద్ధమైన యున్న దగుటచే, నిజమునకు, దానిని పొందుటకు ఏసాధనయు అక్కఱలేదు. ఎల్లప్పుడును భాసించుచున్న స్వరూపమును పొందుటకు సాధనములతో పని యేమున్నది? దానిని ఆవరించియున్న వాసనమాలిన్యమును తొలఁగించుటకే సాధనములన్నియు ఉపయోగపడుచున్నవి. అనంతములైన వాసనలు అనుబురదయందు మునిఁగియుండుటచేత స్వరూపము గోచరించుట లేదు. చిత్తమును నిరోధించుట అను జలముల చేత ఆవాసనాపంకమును చక్కఁగా కడిగివేయవలయును. అనాదికాలముగా "దేహేంద్రియములే నేను" అను గాఢమైన భావనతో చిత్తము రూపొందియున్నది. తత్త్వవిచారము అను తీక్ష్ణమైన యంత్రముచేత, మననముతో కూడిన శ్రవణము అను ఉపాయముచేత పెట్టివలె నున్నచిత్తమును తెఱచినచో తత్క్షణమే మణివలె స్వరూపచైతన్యము గోచరించును. కావున సాధనలన్నియు వాసనలను తొలఁగించుటకే ఏర్పడియున్నవి. పూర్వజన్మపుణ్యమునుబట్టి చిత్తములయందు వాసనలు కొందఱకు అధికముగా మఱికొందఱకు తక్కువగా నుండును. ఈభేదములనుబట్టి బుద్ధియందు భేదములు కలుగుచున్నవి. ఎంతవఱకు వాసనలయొక్క సమూహము బుద్ధిని ఆవరంచియుండునో అంతవరకును సాధన ఆవశ్యకమే.

వాసనలు అనేకవిధములు. వానిలో ముఖ్యమైనవానినిచెప్పెదను వినుము. అపరాధము కర్మ కామము అని వాసన మూఁడువిధములుగా నున్నది. అశ్రద్ధయే అపరాధము. వినాశమును కలిగించుటలో ఇది ముఖ్యమైనది. శాస్త్రము ఆచార్యుఁడు వచెప్పుచున్నవిషయము సర్వథా సత్యము అను దృఢమైన విశ్వాసమే శ్రద్ధ. అట్టి విశ్వాసము లేకుండుట అశ్రద్ధ. దీనివలననే విపరీతగ్రహణము సంభవించుచున్నది ఉన్నదానిని ఉన్నట్లు గ్రహింపలేక విరుద్ధముగా గ్రహించుట విపరీతగ్రహణము. కళలు శాస్త్రములు యోగములు మొదలుగు వానియందు నిపుణులైనవారు కూడ సత్పురుషులతోడి సహవాసమును కలిగియుండియు అశ్రద్ధవలననే విపరీతగ్రహణమునకు లోనై తత్త్వమును తెలిసికొనలేకపోవుచున్నారు. వీరు అనేకవిధములుగా ఉన్నారు. కొందఱు నిర్విశేషమైన పరతత్త్వమే లేదని చెప్పుదురు. అట్టిదొకటి యున్నను దానిని తెలిసికొనుట ఎవనికిని ఎచ్చటను శక్యము కాదు అని మఱికొందరు

చెప్పుదురు. నిదిధ్యాసనముచేత ఆత్మజ్ఞానమును పొందిన వారు కూడ కొందఱు "ఇది పరతత్త్వము కాదు. దీనికి మించినదియు కలదు" అని తలంచుచుందురు. మఱికొందఱు ఈయాత్మజ్ఞానమువలన మోక్ష మెట్లు కలుగునని వాదించుచుందురు. ఇదికాక శాస్త్రాచార్యవాక్యములను సంశయించుట కూడ విపరీతగ్రహణమే. యగును. శాస్త్రములయందు నిపుణులైనవారు వందలకొలఁదిగా వేలకొలఁదిగా ఈ యపరాధవాసనచేతనే సంసారమున పడిపోవుచున్నారు.

పూర్వజన్మలయందును చేసిన దుష్కర్మలయొక్క సంస్కారము బుద్ధియందు మాలిన్యముగా నుండును. ఆమాలిన్యము గురువు ఉపదేశించుచున్న విషయమును గ్రహించుటకు ప్రతిబంధకమగును. అట్టి వారు గురువు ఎంత చక్కఁగా చెప్పుచున్నను గ్రహింపఁజాలరు. దీనిని కర్మవాసన యందురు. ప్రాణాయామాదులచేత కూడ దీనిని జయించుట సాధ్యముకాదు.

"కర్తవ్యము ఇంకను నాకుమిగిలియున్నది." అని అనుకొనుటయే కామవాసన దీనిక అనేకశాఖలు కలవు ఇది అనంతము. సముద్రములో తరంగములను గాని భూమిలో రేణువులను గాని ఎవఁడైనను లెక్క పెట్టవచ్చునేమో గాని, ఒకవ్యక్తి యొక్క కామముల నైనను లెక్కపెట్టుట సాధ్యము కాదు. ఆశాపిశాచముగా చెప్పఁబడుచున్నయీకామవాసన ఆకాశముకన్న విశాలము, పర్వతముకన్నను స్థిరము. దీని చేతనే లోకమున ప్రతివ్యక్తియుఉన్మత్తునివలె అగుచున్నాఁడు. దీని చేతనే దహింపఁబడుచు జనులు ఆక్రందించుచున్నారు. పరమవైరాగ్యమును పొంది ధన్యులైనవారు ఎవరో కొందఱు మాత్రమే ఈయాశఅనుదావానలమునకు దూరులై చల్లఁగా నుందురు.

ఈమూఁడు వాసనలు మనస్సును ఆక్రమించియుండుటచేతనే తత్త్వము భాసించుట లేదు. కావున సర్వసాధనములకు ఈవాసనలను నశింపఁజేయుటయే ఫలము.

"అశ్రద్ధారూపమైన యీయపరాధమువలననే నాకు జ్ఞానము కలుగుటలేదు." అని తెలిసికొని శాస్త్రాచార్యులవాక్యములందు శ్రద్ధను పొందుటవలన మొదటివాసన తొలఁగిపోవును. రెండవదియైన కర్మవాసన ఈశ్వరానుగ్రహముచేతనే తొలఁగవలె. ఇతరములైన కోట్లకొలఁదియుపాయములచేత కూడ అది తొలఁగదు. ఈశ్వరారాధనము చేయుచున్నచో ఆకర్మవాసన అల్పముగా నున్నచో ఈజన్మమునందే ఈశ్వరానుగ్రహము కలిగి అదినశించును. అది ప్రబలముగా నున్నచో అనేక జన్మలలో ఈశ్వరారాధనము చేయుచుండుటవలన నశించును. ప్రబలమైనవ్యాధి తొలఁగిపోవుట బహుకాలము ఔషధమును సేవించుట ఆవశ్యకమే కదా! ఇక మూఁడవదియైన కామవాసన వైరాగ్యాది సాధనమువలనన నశించును. సంసారసుఖములయందలి దోషమును నిరంతరము చూచుచుండుటవలననే వైరాగ్యము కలుగును. మఱియొక్క విధముగా అది కలుగనే కలుగదు.

ఈవాసనలయొక్క అల్పత్వమునుబట్టి ప్రబలత్వమునుబట్టి వైరాగ్యాదిసాధనములను కూడ అల్పముగా ప్రబలముగా అవలంబింపవలనసియుండును. వీనిలో సర్వసాధనములకు మూలము ముక్తికావలయునను గాఢమైనతపన. ఒకనిని నీటిలోముంచినప్పుడు వానిని ఊపిరాడక నీటిలోనుండి బయటపడవలయునని ఎట్లు గిలగిల తన్నుకొనుచుండునో ఆవిధముగా సంసారమునుండి బయటపడవలయు నని మొకానొకనికి కలుగు తపనయే ముముక్షుత్వము. అది లేకున్నచో శ్రవణమననాదులు పాండిత్యసంపదగా పరిణమించునేగాని ముఖ్యఫలము నొసంగవు. ఆ పాండిత్యమంతయు శవమునకు కావించినయలంకారమువలె వ్యర్థము. ముముక్షుత్వము కొద్దికా ఉన్నను ఉపయోగములేదు. వ్రతములయొక్క ఫలశ్రుతిని వినునప్పుడు ఆవ్రతమును చేసి ఆఫలమును పొందవలయుననుకోరిక సామాన్యముగా చాలమందికి కలుగును. అంతమాత్రమైన కోరికతో అందఱు ప్రయత్నమును చేయరు; ఫలమును పొందరు కావున తీవ్రత లేని ముముక్షుత్వమువలన ఉపయోగము లేదు. ఎవనికి ముముక్షుత్వము ఎంత తీవ్రముగా నుండునో వానికి ఫలము కూడ అంతవేగముగనే సిద్ధించును. ముముక్షుత్వము కలవాఁడే అన్నింటిని వదలుకొని ఆత్మజ్ఞానమునందే తత్పరత్వము కలవాఁడగును. దేహమంతయు తాపముతో ఉడికిపోవుచున్నప్పుడు ఎవ్వఁడును చల్లఁదనము తప్ప దేనినికోరఁడు. అట్లే "ముక్తి తప్ప నాకేమియు వలదు" అని తీవ్రమైనకోరిక కలిగినవానికి ఫలముకూడ త్వరగా లభించును. విముక్తి తప్ప తక్కినవన్నియు దుష్టములు అను దృష్టివలననే విముక్తియందు తీవ్రమైనకోరిక కలుగును. దోషదృష్టివలన విషయసుఖములయందు ప్రీతి నశించి వైరాగ్యము కలుగును. వైరాగ్యమువలన విముక్తి కావలయు

ననుకోరిక ప్రబలమై దానికి సాధనములైన శ్రవణమననాదుల యందు తీవ్రమైన ప్రవృత్తి కలుగును. దానివలన త్వరగా ఫలము లభించును."

భార్గవుఁడు ఇదివిని మరల ప్రశ్నించెను. "అయ్యా! సత్సంగము ఈశ్వరానుగ్రము దోషదృష్టి ముక్తిని కలిగించుటకు మూలకారణము లని చెప్పితిరి. వీనిలో ముఖ్యమైన ఆదికారణమేది? అది ఎట్లు ప్రాప్తించును? నిష్కారణముగా ఏదియు సంభవింప దని కదా పెద్దల నిశ్చయము! కావున ఆయాదికారణ మైనను నిర్హేతుకముగ ఎట్లు కలుగుచ్నది? ఇది వివరించి చెప్పుము."

దత్తాత్రేయుఁడు ఇట్లు చెప్పెను "భార్గవా! శ్రేయస్సునకు ఆదికారణమును చెప్పుచున్నాను. వినుము. కేవలచిద్రూపిణియైన యాదేవితనయొక్క స్వాతంత్ర్యవైభవముచేత, అద్దమునందు ప్రతిబింబము వలె, తనయందు జగత్తు అనుచిత్రమును భాసింపఁజేయుచున్నది. అనాదియైన యజ్ఞానముచేత కప్పఁబడియున్న జీవులయొక్క హితమును కోరుచు ఆమెయే హిరణ్యగర్భశరీరముతో కోరికల నన్నింటిని తీర్చునట్టి వేదసముద్రమును ప్రకాశింపఁజేసెను. 'స్వభావముచేత జీవులు విచిత్రములైన కామవాసనలు కలవారు. వీరికి ఎట్లు శుభము కలుగును?' అని యాబ్రహ్మదేవుఁడు ఆలోచించి విచిత్రములైన ఫలములను కలిగించునట్టి వివిధకర్మలను సృష్టించెను. మనుష్యుడు సహజముగా మంచినో చెడునో చేయుచునే యుండును. దానిచేత పశుపక్ష్యాదిజాతులలో పెక్కుపర్యాయములు జన్మించుచు జీవుఁడు ఏదో ఒకకర్మయొక్క పరిపాకముచేత మనుష్యశరీరమును పొందును. అప్పుడు అతఁడు పెక్కుకోరికలు కలవాఁడై "స్వర్గమును కోరువాఁడు యజ్ఞమును చేయవలయును" అని మొదలుగా వేదశాస్త్రములయందు చెప్పఁబడియున్న కర్మలనుగూర్చి విని వానిని చేయుటకు పూనుకొనును. ఆకర్మలలో రవ్వంత లోపము కలిగినను ఫలము కలుగ దని గ్రహించి దుఃఖితుఁడై, 'ఇప్పుడేమి చేయఁదగు' నని యొకానొక సత్పురుషుని ఆశ్రయించును. అప్పుడు ప్రసంగవశమున మహేశ్వరునియొక్క మహాత్మ్యమును అతఁడు వినును. అంతట పూర్వపుణ్యవశమున ఆ సత్పురుషునియొక్క అనుగ్రహముచేత ఈశ్వరుని ఆరాధింపవలయునను తలంపు కలుగును. కావున పూర్వపుణ్య పరిపాకమువలననే శ్రేయస్సు అనుసౌధముయొక్క సోపానపంక్తిలో ఒకమెట్టుగా సత్సంగమును పొందును. శ్రేయస్సు చాలవఱకు సత్సంగమువలననే సంభవించుచున్నది. ఒకానొకచోట చాల గొప్ప పుణ్యముచేతఁగాని తీవ్రమైన తపస్సుచేతఁగాని శ్రేయస్సు కలుగుటయు కలదు. అట్టియెడల ఒకప్పుడు పైనుండి రాలి పండు పడినట్లుగా ఆకస్మికముగా శ్రేయస్సు ప్రాప్తించుటయు కలదు కావున కారణములయొక్క వైచిత్ర్యమును బట్టి శ్రేయస్సుయొక్క ప్రాప్తియందు కూడ చిత్రములైన భేదములు కన్పించుచున్నవి.

అట్లే బుద్ధియందలిభేదములచేత వాసనయొక్క తారతమ్యము వలన సాధనములయందలి విశేషములనుబట్టి జ్ఞానులయొక్క స్థితియందును వైచిత్ర్యము కన్పించుచున్నది. సహజముగా ఎవనియొక్క బుద్ధి యందు వాసనలు తక్కువగా నుండునో వానికి అల్పమైనసాధనచేతనే జ్ఞానము సిద్ధించును. ఎవనియొక్క బుద్ధియందు వాసనలు దట్టముగా నుండునో వానికి జ్ఞానము కలిగినను అది మేఘముచేత కప్పఁబడిన సూర్యబింబమువలెనే యుండును. వాఁడు చిరకాలము నిదిధ్యాసనము కావించుచున్నచో వానికి జ్ఞానము నిర్మలముగా భాసించును. ఈకారణముచేత జ్ఞానులయొక్క స్థితి అనేకవిధములుగా కన్పించుచున్నది. జ్ఞానులకు పరస్పరము స్థితిభేదము ఎట్లుండునోచూడుము. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు స్వభావముచేత జ్ఞానులే! వారియొక్క జ్ఞానమునందు మాలిన్యము ఉండు నని చెప్పుటకు వీలులేదు. కాని స్వభావమువలన కలుగుచున్న గుణములచేత వారిస్థితియందు కలుగుచున్న భేదములను చూడుము. గుణములయొక్క భేదమునుబట్టి తెల్లగానున్న జ్ఞానియొక్క శరీరము నల్లదనమును ఎట్లు పొందుటలేదో అట్లే ఆయనయొక్క చిత్తస్వభావము కూడ మార్పునొందఁదు. జ్ఞానులముగా అత్రికుమారులను మమ్మేచూడుము. దుర్వాసుఁడు చంద్రుఁడు నేనును భిన్నస్థితులయందున్నాము. దుర్వాసుఁడు కోపము కలవాఁడుగా, చంద్రుఁడు కామము కలవాఁడుగా నుండగా నేను వర్ణశ్రమాది చిహ్నములను అన్నింటిని వదలియున్నాను. వసిష్ఠుఁడు కర్మిష్ఠుడై యుండగా సనకాదులు సన్యాసులై యున్నారు. నారదుఁడు భక్తి పరుఁడుకాఁగా శుక్రుఁడు కవిత్వముచెప్పుచు దైత్యుల నాశ్రయించి యుండఁగా బృహస్పతి దేవతలకు గురువై యున్నాడు. వ్యాసుఁడుశాస్త్రనిర్మాణపరాయణుఁడు కాఁగా జనకుఁడు రాజ్యము చేయుచున్నాఁడు. జడభరతుఁడు సర్వసంగ పరి త్యాగి యయ్యెను.

ఈస్థితిభేదములకు కారణము వినుము. అపరాధము కామము అనువాసనలకన్న కర్మవాసన బలిష్ఠము. అది ఎవరియందు పూర్తిగా నశించునో వారు మేధావులని చెప్పఁబడుచున్నారు. వారికి అపరాధవాసన యుండనే యుండదు. ఇంక కామాదివాసన లున్నను అవి జ్ఞానమునకు ప్రతిబంధకములు కావు. అట్టివారికి వైరాగ్యము మననము సమాధి మొదలగువానితో పనిలేదు. వారు ఒక్కసారి తత్త్వమునువిన్నంతనే అప్పుడే కొంచెము మననధ్యానములు చేసికొని నిస్సందేహముగా ఆత్మను తెలిసికొని జనకాదులవలె జీవన్ముక్తు లగుచున్నారు. వారు అంతకు పూర్వము వైరాగ్యాదులను అభ్యసించి కామాదివాసనలను పోఁగొట్టుకొనియుండలేదు. అందువలన ఆవాసనలు వారియందు పూర్వమువలెనే పైకివచ్చుచుండును. వారికి ఆవాసనల వలన ఏసందర్భమునందును బుద్ధికి మాలిన్యము కలుగదు; వారు స్వరూపమునుండి తొలఁగుటయు సంభవింపదు. వీరిని ఉత్తమజ్ఞాను లని విద్వాంసులు చెప్పుదురు. ఇంక కర్మవాసనచేత మూఢమైనచిత్తము కలవారికి సాక్షాత్తుగా ఈశ్వరుఁడు బోధించినను జ్ఞానము కలుగదు. దృఢమైన యపరాధవాసన కలవారికి కూడ జ్ఞానము కలుగదు. ఎవరికి అపరాధకర్మ వాసనలు అల్పముగా నుండి కామవాసనలు అధికముగా నుండునో అట్టివారికి అనేకపర్యాయములు శ్రవణమనననిదిధ్యాసనములు సలుపుటవలన చాలకష్టముతో చిరకాలమునకు జ్ఞానము కలుగును. వీరికి వ్యవహారము స్వల్పముగా నుండును. వీరు ఎక్కువకాలము సమాధియందే గడుపుచుందురు. మనననిదిధ్యాసనాదుల యభ్యాసముయొక్క అతిశయమువలన వీరికి మనస్సు ఇంచుమించుగా నశించినట్లే యగును. ఇట్లు నష్టప్రాయమైన మనస్సుకల జ్ఞానులు మధ్యములని చెప్పఁబడుదురు. వీరిలో కొందఱకు మనననిదిధ్యాసనముల యభ్యాసము దృఢముగా నుండకపోవుటచే వాసనలు క్షీణింపవు; మనస్సు నశింపదు. వీరికి శ్రవణమువలన జ్ఞానము కలిగినను అది కామక్రోధాదివాసనలచేత మాటిమాటికి కప్పఁబడుచుండును. ఇట్టివారిని సమనస్కులని మందజ్ఞానులని అధమజ్ఞానులని చెప్పుదురు. ఉత్తములు మధ్యములు అయిన వారు మాత్రమే జీవన్ముక్తులని చెప్పఁబడుదురు.

అధములైన కేవలజ్ఞానులు ప్రారబ్ధమునకు అధీనులై సుఖదుఃఖముల ననుభవించుచు దేహాంతమునందు ముక్తిని పొందుదురు. మధ్యమజ్ఞానులు ప్రారబ్ధమును జయింతురు. మనస్సు అనుభూమిలో ప్రారబ్ధ మనుబీజము భోగరూపమున అంకురించును. కాని వీరికి మనస్సు నశించిపోవుటచేత ఆప్రారబ్ధబీజములు గాదెలో అడుగున పడియుండు ధాన్యనపుగింజలవలె మొలకెత్తక క్రమముగా నశించిపోవును.

ఉత్తమజ్ఞానులకు బహుమానసు లనియు పేరు కలదు. ఎవరికి యొక్క మనస్సు ఆత్మరూపమై బాహ్యవిషయములందు ప్రసరించుచు ఆయావస్తువులయొక్క రూపమును పొందుచున్నను ఆత్మరూపమును కోల్పోవదో వారు బహుమానసులు. ఒక మనస్సు ఇన్ని రూపములతో ఎట్లుండు నని శంకిపవలదు. మిగుల మేధావి యైనవాఁడు ఒక్కొక్కప్పుడు ఏకకాలమునందే అయిదాఱుకార్యములను, దేనియందును తొట్రుపడక, నిర్వహించుచున్నాఁడు ఒకఁడు నడచుచు మాటాడుచు పని కూడ చేయుచుండును. ఒక్కగురువు శిష్యులనేకులు వేదములు వల్లెవుయుచున్నప్పుడు వారిలో సంభవించు అపశబ్దములను వర్ణస్వరభేదములను గుర్తించుచున్నాఁడు. నీవు సహస్రబాహుఁడగు కార్తవీర్యుని జయించితివి గదా! అతఁడు ఏకకాలముననే అనేకవిధములైన యాయుధములను అనేకబాహువులతో గైకొని ఏయాయుధముయొక్క ప్రయోగమునందును పొరపాటుపడక యుద్ధము చేయుచుండుటను నీవు చూచియే యుంటివి. అట్టివారియొక్క మనస్సు వారు నిర్వహించుచున్న కార్యములపద్ధతి ననుసరించి అనకవిధములుగా రూపొంది ఆయాకార్యములను ఏకకాలమునందే నిర్వహించుచున్నది. అట్లే ఉత్తమజ్ఞానుల యొక్క మనస్సు కూడ బాహ్యమున పెక్కుపదార్థముల రూపములను పొందుచున్నను ఎల్లప్పుడు ఆత్మస్వరూపమునకు విరుద్ధము కాకుండ నుండును, అనఁగా వారికి స్వరూపవిస్మృతి ఎప్పుడును ఉండదన్న మాట, వారినే బహుమానసులందురు. వారియొక్క మనస్సునందు ప్రారబ్ధబీజములు సుఖరూపముననో దుఃఖరూపముననో అంకురించుచుండగనే జ్ఞానము అనునగ్ని వానిని దగ్ధమొనర్చుచుండును. మొలకయే నశించినప్పుడు చెట్టుఉండదు; ఫలమసలే యుండదు. సుఖదుఃఖములు అనునంకురములకు హర్షశోకములు ఫలములు. సుఖమో దుఃఖమో తోఁచుచున్నంతనే "ఇది నాస్వరూపముకాదు" అని త్రోసివేయుచున్నచో సుఖమువలన హర్షము కాని దుఃఖమువలన శోకము కాని కలుగదు. అనఁగా సుఖదుఃఖములు భాసించుచనే కాని అవి ఫల మొసంగవు లక్షరూప్యముల బహుమతి వచ్చిన దని తెలియుట సుఖము, అది కలిగినంతనే బంధుమిత్రులకు చెప్పి విందులతో వినోదములతో ప్రసంగములతో సంతోషించుట హర్షము. లక్షరూప్యములు నష్టము వచ్చిన దని తెలియుట దుఃఖము. అది కలిగనంతనే పదిమందితో చెప్పుకొని విలపించుచు దిగులుపడి యుండుట శోకము. పామరులకు సుఖమువలన హర్షము, దుఃఖమువలన

శోకము కలుగుచుండఁగా జ్ఞానికి సుఖదుఃఖములు పుట్టినవెంటనే నశించును; అందువలన హర్ష శోకములు కలుగవు. మఱి లోకమున జనులు సుఖమును పెంపొందించుకొనుటకు దుఃఖమును తొలఁగించుకొనుటకు వ్యవహార మొనర్చు చున్నారు. సుఖదుఃఖములు పుట్టినవెంటనే నశించుచున్నచో జ్ఞానికి లోకమున వ్యవహారమెట్లు జరుగుచున్నది? వారు ఇతరులతో వ్యవహరించునప్పుడు ఆవ్యవహారమునకు ఆవశ్యకములైన భావములను కల్పించుకొనుచుందురు. పెద్దవాఁడు చిన్నపిల్లవానితో చేరి యాడునప్పుడు గెలిచినపుడు హర్షము ఓడిపోయినపుడు శోకమును ఎట్లు ప్రదర్శించునో అట్లే జ్ఞాని కూడ ఆయావ్యవహారములకు తగిన భావములను ప్రదర్శించుడునే కాని యథార్థముగా హర్షశోకములను పొందఁడు. చదరంగమున ఏనుగులు గుఱ్ఱములు పోయి ఓటమి కలుగుచున్నప్పుడు పిల్లవాఁడు అది అంతయు సత్యమైనట్లే విషాదము నొందును. పిల్లవాని వినోదముకొఱకు ఆడుచున్న పెద్దవానికి ఇదియంతయు అసత్యము వినోదమాత్రము అని రూఢిగ తెలిలియుటచే విషాదము కలుగనేకలుగదు. ప్రపంచము సత్యమను భావము దృఢముగ నుండుటచే ఆవ్యవహారమునందు పామరులు హర్షశోకములు పొందుచున్నారు. 'ప్రపంచము అసత్యము. వ్యవహారము వినోదమాత్రము' అను భావము దృఢముగ నుండుటచే జ్ఞానులకు హర్షశోకములుకలుగవు. అట్లే వారు ఇతరుల కష్టసుఖములయందు సానుభూతిని చూపునప్పుడు విషాదమును సంతోషమును ప్రకటించుచుందురే కాని మనస్సునందు ఏభావమును కలిగియుండరు. ఈవిధముగా వారు వ్యవహారమునందు ఇతరుల విషయములలో వలె తమవిషయములందు ఆసక్తి లేకుండ నుందురు.

మేధావులైన జ్ఞానులు వాసనలను నశింపఁజేసికొనుటకై మనోనిరోధము మొదలగుసాధనలను అవలంభించియుండుకపోవుటచే ఆవాసనలు వినాశము నొందవు. అందువలన వారు పూర్వవాసనలను అను సరించియే వ్యవహరించుచుందురు. ఆకారణముచేతనే కొందఱు కర్మనిష్ఠులుగా, కొందఱు కాముకులుగా, మఱికొందఱు కోపము కలవారుగా కన్పించుచుందురు. పెక్కు విధములైన వర్తనములు వారియందు కన్పించుచుండును.

మనస్సు నశింపక మందజ్ఞానులై యున్నవారు కూడ దృశ్యమంతయు అసత్యమే యని నిశ్చయజ్ఞానమును కలిగియుందురు. సమాధిస్థితియందు వారికి స్వరూపముతప్ప ఇంకఏదియు భాసింపదు. తెంపులేకుండ స్వరూపమును స్మరించుచుండుటయే సమాధి. హఠయోగులు సాధించుస్థితి సమాధికాదు. మఱి హఠయోగులకు కూడ చిత్త నిరోధము వలన జ్ఞానులకువలె నిర్వికల్పమైన యాత్మతత్త్వమే భాసించును. కదా, వారిస్థితిని సమాధి అని ఏల చెప్పరాదు? నిర్వికల్పమైన యాత్మస్వరూపము సర్వమునకు ఆశ్రయమై ఎల్లప్పుడు ఎల్లరకును స్ఫురించుచునే యున్నది. అది స్ఫురింపకపోయినచో ఏదియును భాసింపదు. మఱియును అది వికల్పరహితముగా జాగ్రత్తునుండి నిద్రలోనికి జాఱునపుడు, నిద్రను వదలి జాగ్రద్దశలోనికి ప్రవేశించుటకు ముందుండుస్థితి మొదలుగా వెనుకఁజెప్పఁబడిన దశలయందు భాసించుచునే యున్నది. అంతమాత్రమున ఎల్లరకును సమాధి కలుగుచున్న దని చెప్పుట లేదు కదా! హఠయోగులకు నిరోధసమయమునందు సమాధి యున్నదన్నచో తక్కినవారికిని పైనచెప్పినదశలలో అది యున్నది. కావున నిర్వికల్పమైన యాత్మతత్త్వవిజ్ఞానము కలవారు విమర్శపూర్వకముగా స్వరూపానుసంధానము చేయునపుడు చిత్తమునకు కలుగు విశ్రాంతినే విద్వాంసులు సమాధి అని చెప్పుచున్నారు. ఇక్కడ ఈవిషయమును గమనింపుము. శ్రవణాదులచేత నిర్వకల్పమైన యాత్మతత్త్వమును ఎఱుంగని హఠయోగులు రెండువిధములుగా నుందురు. కొందఱు పాతంజలయోగమున చెప్పఁబడినయష్టాంగములయొక్క సాధనచేత సిద్ధిని పొందుదురు. మఱికొందఱు ప్రాణామాయముయొక్క అతిశయముచేత కుండలిని సుషమ్న మొదలగువానిని భేదించుచు సిద్ధిని పొందుదురు. ఇరువురికిని సమాధిస్థితియందు నిద్రలోవలె సుఖానుభవము ఉండును. ఆస్థితియందు వారికి అజ్ఞానముయొక్క విక్షేపశక్తి తొలఁగి పోవునే గాని ఆవరణశక్తి నశింపదు. జ్ఞానులకు సమాధియందు విక్షేపము ఆవరణము అను రెండును వుండవు. మఱి హఠయోగియొక్క సమాధిస్థితికిని నిద్రకును భేదమేమి? నిద్రయందు మనస్సు తమస్సు యొక్క పరిణామముచేత అమావాశ్యయొక్క చీకటియందువలె మూఢమైయుండును. హఠయోగికి సమాధియందు మనస్సు సత్త్వము యొక్క పరిణామముచేత ప్రకాశించుచున్నను ఆత్మతత్త్వము అవిద్యచే ఆవరింపఁబడుటచే, మేఘములచేత ఆవరింపఁబడిన సూర్యునివలె చక్కఁగా ప్రకాశింపదు. మఱిజ్ఞానులకు అవిద్యయొక్క ఆవరణము ఉండదు. అందువలన సమాధియందు వారిమనస్సు సత్త్వపరిణామమును పొందినప్పుడు ఆత్మత్తత్త్వము, మబ్బులు తొలఁగిపోయిన తరువాత సూర్యునివలె ప్రకాశించును.

ఉత్తమజ్ఞానులు వ్యవహారపరులై యున్నప్పుడు కూడ వారి జ్ఞానము వేద్యములైన విషయములకు సంబంధింపక శుద్ధమై యుండును. సమాధి యనఁగా విషయసంబంధరహితమైన జ్ఞానస్థితియే కదా! కావున వారికి సమాధి సహజముగా నుండును. ఆకాశమునకు నల్లఁదనము అసత్య మని తెలసికొన్నవానియొక్క జ్ఞానము {ఆకాశవిషయమున ఎప్పుడును నల్లఁదనమును పొందదు. అట్లు కానిచో ఆకాశము నకు నల్లఁదనము లేదని తెలసికొన్నవానికి, తెలిసికొననివానికి భేదమే యుండదు. ఎండమావులను తెలిసికొన్నవానికి కూడ అచ్చట నీరున్నట్లే కన్పించుచుండును. అయినను తెలియనివాఁడు ఆనీటికొఱకు పరువెత్తినట్లు తెలిసినవాఁడు పరువెత్తఁడు. అట్లే జ్ఞాని కూడ పదార్థములు అజ్ఞానివలె కన్పించుచున్నను. వానియందు అతనికి సత్యత్వబుద్ధి యుండదు. అందువలన వానిని సంపాదించి సుఖింపవలయు నని అజ్ఞాని తాపత్రయము నొందుచుడఁగా జ్ఞాని వానివిషయమును అసలు పట్టించుకొనఁడు అందువలన ఎండమావులలో నీరువలె వానికిప్రపంచము గోచరించుచున్నను అది అసత్యమని వానికి రూఢిగా తెలియును. కావున వానిజ్ఞానము శుద్ధముగానే యుండును. మనస్సు నష్టమైనజ్ఞానికి వేద్యసంబంధము ఉండనే యుండదు. మనస్సు నిశ్చలమైనప్పుడు ఆస్థితిని ఉన్మనీదశ అని చెప్పుదురు. విషయములు సత్యములు అనుభావముతో వానిపై ప్రసరించుటయే మనస్సునకు చలనము. మధ్యమజ్ఞానులకు మనోవ్యాపారమే యుండదు. ఉత్తమజ్ఞానులకు వ్యవహారము జరుగుచున్నప్పుడు వారిమనస్సు అసత్యముగా నిశ్చితమైయున్న ప్రపంచమునందు చలించుచున్నట్లు కన్పించుచున్నను అది అత్యంతము నిశ్చలముగానే యుండును. అదియే వారి బహుమానసత్వము. మనస్సులోని యొకభాగముచేత వారు వ్యవహారమును నిర్వహించుచున్నను మఱియొకభాగముచేత నిశ్చలముగా నుందురు. ఆ నిశ్చలస్థితిచేత వారికి సమాధి ఎప్పుడును సహజమై యుండును. ఇది నీవడిగిన జ్ఞానుల యొక్క స్థితిభేదములు.

ఇది జ్ఞానఖండమున జ్ఞానులస్థితిభేదములు అన్నది పందొమ్మిదవయధ్యాయము.

# ఇరువదియవయధ్యాయము -విద్యాగీత

దత్తాత్రేయుఁడు పరశురామునితో మరల ఇట్లు చెప్పెను. "ఈవిషయమున ఒకవృత్తాంతమును చెప్పెదను వినుము. పూర్వము సత్యలోకమున బ్రహ్మదేవుని సభయందు ఒకసారి వసిష్ఠవిశ్వామిత్రగౌతమాదిమహర్షులు రాజర్షి శ్రేష్ఠులును చేరి జ్ఞానసిద్ధినిగూర్చి సూక్ష్మాతిసూక్ష్మములైన నిరూపణములతో చర్చించుకొని తుదకు ఆపరమేష్ఠి నిట్లు ప్రశ్నించిరి. "భగవానుఁడా! మే మందఱమును లోకవ్యవహారమును పరతత్త్వమును కూడ తెలసికొని జ్ఞానులమై యున్నాము. స్వభావముల యందలి భేదములచేత మాలో కొందఱు సమాధియందే ఎక్కువగా కాలము గడుపుచుండుఁగా, మఱికొందఱు వాదప్రతివాదములందు ఆసక్తులై యున్నారు. కొందఱు భక్తి నిమగ్నులై యుండఁగా కొందఱు కర్మపరాయణులై యున్నారు. ఇంకను కొందఱు బహిర్ముఖులైన జనులవలె వ్యవహారపరులై యున్నారు. వీరిలో శ్రేష్ఠు లెవరో చెప్పుము. ఒక్కొక్క పక్షమును మాకు తోఁచినయుక్తులతో ప్రమాణములతో అవలంబించి అదియే శ్రేష్ఠ మని నిరూపించుచున్నాము. ఒకరు నిరూపించిన దానిని ఇతరులు అంగీకరించుట లేదు కావున నీవే నిర్ణయింపవలె" అప్పుడు ఆపరమేష్ఠి వారి కెవరికిని మనస్సు, విశ్వాసముతో కుదుటఁబడకుండుటను గమనించియిట్లనెను. "మునీంద్రులారా! మీ కున్నట్లే నాకును ఒకయభిప్రాయ మున్నది. మన మందఱమును ఈ విషయమును సర్వజ్ఞుఁడైన పరమేశ్వరునివలనఁదెలసికొందము."

పిమ్మట బ్రహ్మదేవుఁడు విష్ణువుతో మహర్షులతో పరమేశ్వరుని యొద్దకు పోయి మహర్షులవివాదవిషయమును వివరించెను. పరమేశ్వరుఁడు ఇట్లనుకొనెను. "వీరియందు శ్రద్ధ విశ్వాసము కన్పించుటలేదు. ప్రతివ్యక్తియు తన యభిప్రాయమే సిద్ధాంత మని దృఢముగ అనుకొనుచున్నాఁడు. ఇప్పుడు నేను ఏది చెప్పినను వీరు అది నాయభిప్రాయమునుగా మాత్రమే తలంతురు గాని యథార్థమైన తత్త్వమునుగా గుర్తింపరు. కావున ఇప్పుడు నేనేమి చెప్పినను వ్యర్థమే యగును." ఇట్లు తలంచి ఆయన "అయ్యా! నాకును ఇది స్పష్టముగా తెలియదు. మన

మందఱమును విద్యారూపిణియైన త్రిపురాపరమేశ్వరిని ధ్యానించి ఆమెవలన ఈవిషయమును తెలిసికొందుము" అని పలికెను.

అంతట వారందఱును ఆమహాదేవిని ధ్యానించిరి. అప్పుడామహేశ్వరి ఆకాశమునందు శబ్దమయమైన రూపముతో ఆవిర్భవించి, "ఋషులారా! త్వరగా చెప్పుఁడు. ఏల మీరు నన్ను ధ్యానించితిరి? నా భక్తులకు ఎప్పుడును కోరిక తీరకపోవుట యన్నది. లేదు." అని మేఘగర్జనస్వరముతో పలికెను. అప్పుడు వారందఱును ఆమెకు ప్రణమిల్లి స్తుతించి ఇట్లనిరి. "శ్రీవిద్యారూపిణివైన యోత్రిపురేశ్వరీ! నీకు నమస్కారము, అమ్మా! నీవుసృష్టిస్థితిలయకారిణివి. సర్వజ్ఞురాలవు. సర్వరూపిణివి. ఎల్లరకును నీవే హర్షమును గలిగించుచున్నావు. దేవీ! నీకు మరల మరల నమస్కరించుచున్నాము. నీయొక్క పరరూపము, అపరరూపము, ఈశ్వరత్వము, జ్ఞానము, దానిఫలము, అందులకు ముఖ్యసాధనము, సాధకుఁడు, సిద్ధి, సిద్ధియొక్క పరాకాష్ఠ, జ్ఞానసిద్ధులలో ఉత్తముఁడు-అను నీవిషయములను దయతో చెప్పుము. నీకు మరల నమస్కరించుచున్నాము."

పరరూపము :

విద్యారూపిణియైన యామహాదేవి దయతో నిట్లుస్పష్టముగా చెప్పెను. "ఋషులారా! అందఱును శ్రద్ధతో వినుఁడు. శాస్త్రమను మహాసముద్రమునుండి అమృతమువంటి సారమును మీకు అందించుచున్నాను. దేనియందు ఈజగత్తు సృష్టిస్థితిలయములను పొందుచున్నదో, ఏది అజ్ఞులకు జగద్రూపమున గోచరించుచున్నదో అదియే నా పరరూపము. అదియే యోగులకు అంతరంగమున గంభీరమైన చైతన్య మహాసముద్రవలె నిర్వికల్పముగా నిశ్చలముగా భాసించుచున్నది. కొందఱు నాయీపరరూపమును అద్వితీయమైన తమస్వరూపమునుగా తెలిసికొనుచుండియు స్వభావవశమున మహాభక్తులై బలవంతముగా భేదమును కల్పించుకొని ఆరాధించుచున్నారు. అంతఃకరణము ఇంద్రియములు దేహము మొదలగువానికి అన్నింటికిని ప్రాణసూత్రములె నుండి ఇదియే వానిని నడుపుచున్నది ఇది భాసింపకున్నచో లోకమున ఏదియు భాసింపదు. శాస్త్రములు నాయీపరరూపమును ఇట్లు నిరూపించుచున్నవి.

అపరరూపము:

ఇంక నాయపరరూపమును వినుఁడు అనేక బ్రహ్మాండములకు వెలుపల ఊర్ధ్వముగానున్న యమృతసముద్రమునందు మణిద్వీపములో కడిమిచెట్లవనమునందు మనోహరమైన చింతామణిమందిరమున ఒకయద్భుతమైన మంచము కలదు. దానికి బ్రహ్మ విష్ణువు రుద్రుఁడు ఈశ్వరుఁడు నాలుగు కాళ్ళుగా నుండగా సదాశివుఁడు పాన్పుకొఱకు ఏర్పరచినపలకగా నుండును. కావున దానిని పంచబ్రహ్మమయమైన మంచ మందురు. దానియందు కామేశ్వరుఁడు కామేశ్వరి అను ననాది మిధునముగా ప్రకాశించురూపము నాయొక్క అపరరూపము. జాగ్రత్తు స్వప్నము సుషుప్తి అనుమూఁడుపురములందు సకలజీవులలో ఇది ప్రకాశించుచుండును. గావున దీనిని త్రిపురసుందరరూపమనియు చెప్పుదురు. మఱియును సదాశివుఁడు ఈశానుఁడు బ్రహ్మవిష్ణువు త్రిలోచనుఁడు గణపతి కుమారస్వామి దిక్పాలకులు శక్తులు గణదేవతలు సురులు అసురులు యక్షులు కింపురుషులు నాగులు మొదలుగా పూజ్యులైనవారందఱును నాయొక్క అపరరూపములుగానే కీర్తింపఁబడుచున్నారు. ఇట్లు ఈరూపములలో అన్నియెడలను నేనే యున్నను మాయచేత మూఢులైన జనులు నన్ను తెలిసికొనలేకున్నారు. ఈరూపములద్వారమున నేనే పూజింపఁబడుచు భక్తుల కోరికలను తీర్చుచున్నాను. నేను తప్ప పూజింపఁదగినది కాని ఫలమిచ్చునట్టి దేవత గాని ఇంకెవరును లేరు. ఎవఁడు ఏవిధముగా నున్న భావించునో వాఁడు ఆవిధముగా నావలన ఫలమును పొందును.

ఐశ్వర్యము:

నాయైశ్వర్యమునకు మితి లేదు. కేవలము చైతన్యరూపిణిగా ఏకరూపమున నున్న నేను ఇతరద్రవ్యముతో అక్కఱ లేకయే జగత్తు యొక్క రూపమున భాసించుచున్నాను. అట్లు భాసించుచున్నను నా యందు రెండవవస్తువు లేదు. ఒక్కవస్తువు తనయేకత్వమునకు భంగము లేకుండ పెక్కురూపములతో భాసించుచుండుట నిజముగా దుర్ఘటము. ఆట్లు దుర్ఘటమైనదానిని సుసంఘటితముగా భాసింపఁజేయుచుండుటయే ముఖ్యమైన నాయీశ్వరత్వము.

సూక్ష్మదృష్టితో నాయైశ్వర్యమును చూడుఁడు. నేను సర్వమునకు ఆధారముగా నుండి అన్నింటియందును వ్యాపించియుండియును దేనితోను సంబంధమును పొందక కేవలముగా నున్నాను. నామాయచేతనే నాస్వరూపమును ఆవరించి సంసారము కలదానవై శిష్యత్వమును పొంది గురువు నాశ్రయించి ఆత్మతత్త్వమును తెలసికొని ముక్తురాల నగుచున్నాను. ఇట్లు అనేక పర్యాయములు ముక్తురాలనగుచున్నాను. నటుడు ఎన్నిసార్లు ఎన్నివేషములు ధరించినను అన్నియు అసత్యములే అయినట్లు సంసారమంతయు అసత్యమే యగుటచే నాస్వరూపమునందు ఎట్టిమార్పుకలుగదు. అందువలన నేను ఎల్లప్పుడును, అనఁగా సంసారము కలదానినిగా కన్పించుచున్నప్పుడు కూడ, ముక్తురాలనే. మఱియును అనంతవిచిత్ర మహితమైన యీజగత్తును. కుండ చేయుటకు మట్టివలె, ఏద్రవ్యము లేకయే సృష్టించుచున్నాను. నాయైశ్వర్యపరంపరలు ఇట్టివి అనేకములు కలవు. వానిని లెక్కించుటకు వేయి ముఖములుగ గల యాదిశేషునకు కూడ శక్యము కాదు.

జ్ఞానము :

ద్వైతము అద్వైతము పరము అపరము మొదలగు భేదముల చేత నాజ్ఞానము బహువిధములుగా నున్నది. వానివలన కలుగు ఫలము కూడ బహువిధములుగా నున్నది.

ద్వైతజ్ఞానము :

ద్వైతమునందు ధ్యానించువాఁడు తనస్వరూపముకన్న భిన్నముగా ఒకానొకదేవతారూపమునో మంత్రమునో అవలంబించుచుండును. దేవతామూర్తులలో మంత్రములలో ఎన్నో భేదములు కలవు. అందువలన ద్వైతజ్ఞానము బహువిధములుగా నున్నది. ఆధ్యానము స్వప్న రాజ్యముతో సమానము అయినను అది చిత్తశుద్ధిని కలిగించుచు సఫలమే యగుచున్నది. ఈధ్యానములలో నాయొక్క అపరరూపములలో ముఖ్యమైనదిగా వెనుక చెప్పియున్న త్రిపురసుందరరూపమును అవలంబించి చేయుధ్యానమే ముఖ్యమైనది. ఇదియే చిత్తశుద్ధి మొదలుగా జ్ఞానసిద్ధికి సాధనములను సమకూర్చును. కాని అద్వైతవిజ్ఞానమే శ్రేష్ఠమైనది. విద్యారూపిణినైన నన్ను చిరకాలము ఆరాధింపకుండ ఎవఁడైనను అద్వైతజ్ఞానమును ఎట్లు పొందఁగలడు?

అద్వైతజ్ఞానము :

దృశ్యమైన రెండవపదార్థ మేదియు లేక కేవలముగా స్వయముగా ప్రకాశించు పరమచైతన్యమే అద్వైతజ్ఞానము. అది అపరోక్షముగా అనుభవమునకు వచ్చినప్పుడు (Direct experience) ద్వైతజ్ఞానమును తిరస్కరించును. అద్దమును తెలిసికొన్నతరువాత దానియందు ప్రతిబింబములుగా గోచరించుచున్న సర్పములు వ్యాఘ్రములు ఎట్లు భయము కంపము మొదలగువానిని కలిగింపఁజాలవో అట్లే అద్వైతజ్ఞానము కలిగినతరువాత అజ్ఞానమునందు ప్రతిబింబించుచున్న దృశ్యప్రపంచములోని సర్పములు వ్యాఘ్రములు కూడ అసత్యములై భయము కంపము మొదలగువానిని కలిగింపఁజాలవు. చిత్తము శుద్ధమైనచిదాత్మతో ఏకమై నిర్వికల్పసమాధిని పొందినతరువాత, సమాధి నుండి లేచినవాఁడు. "సమాధియందు ఏశుద్ధచిదాత్మగ నున్నానో ఇప్పుడును ఆశుద్ధచిదాత్మగనే యున్నాను" అని గుర్తించును. అట్లు గుర్తించుటయే ప్రత్యభిజ్ఞానము.

పరజ్ఞానము :

సమాధియందువలెనే తక్కిన సమయములందును స్వరూపమును గుర్తించుచుండుట పరజ్ఞానము. అది కలిగినతరువాత వ్యవహారమున గోచరించు ఏపదార్థమునందు సత్యత్వబుద్ధి కలుగదు. అద్దమునకు భిన్నముగా ప్రతిబింబములకు ఎట్లు అస్తిత్వము (Existence) లేదో ఆత్మయందు ప్రతిబింబించుచున్న సకలపదార్థములకు ఆత్మకు భిన్నముగా అస్తిత్వములేదు. ఈవిజ్ఞానము కలిగినచో, గాలిచేత మేఘములవలె, సంశయము లన్నియు ఎగిరిపోవును. ఈపరాజ్ఞానము కలిగిన తరువాత కామము క్రోధము మొదలుగా సంస్కారములు కొన్ని మిగిలియున్నను అవి కోరలు తీసినపాములవలె పడియుండును. ఇది పరజ్ఞానము.

అపరజ్ఞానము :

ఇంక శ్రవణముచేతఁగాని తర్కముచేతఁగాని దేహము ఇంద్రియములు మొదలగువానికి అతీతమైన కేవలచిదాత్మయొక్క స్వరూపమును బుద్ధిచేత నిశ్చితముగా గ్రహించుట అపరజ్ఞానము, ఇదియే పరోక్షజ్ఞానము. ఇది దేహము ప్రాణము మొదలగువానియందుండు "నేను" అనునభిమానమును నశింపఁజేయును.

పరజ్ఞానఫలము :

ఇంక పరజ్ఞానముయొక్క ఫలమును వినుఁడు. పరజ్ఞానము కలిగినంతనే సకలదుఃఖములు నశించును. ఎచ్చటను దేనివలనను భయము కలుగకుండుటయే మోక్షఫలము. "ఇది తేలు, ఇది పాము, ఇధి పెద్దపులి" అని రెండవవస్తువు తోఁచినప్పుడే లోకమున భయము కలుగుచున్నది. గాఢనిద్రలో రెండవవస్తువే భాసించదు. కావున భయము కలుగుట లేదు. అట్లే ఆత్మకన్న అన్యముగా ఏదియునులేదు అని రూఢిగ తెలిసివానికి వ్యవహారదశయందును. సూర్యోదయమున చీఁకటివలె, తనకన్న భిన్నముగా రెండవవస్తువే తోఁచదు. ద్వైతభావమును వీడినవానికి ఎచ్చటను ఎప్పుడును దేనివలనను భయము లేదు. కావున ఆత్మజ్ఞానముకన్న భిన్నములైన ఫలము లన్నియు భయకారణములే యగును. లోకములో పుత్రుఁడు భార్య గృహము ధనము మొదలుగా ఫలము లన్నియు కొంతకాలమునకు అంతమొందక తప్పదు. అవి యంతమొందు నేమో అనుభయము ఎప్పుడును ఉండనే యుండును. పుత్రభార్యాదులతోడి సంయోగము లన్నియు ఎప్పటి కైనను వియోగముతో ముగియక తప్పదు. కావున నశ్వరములైనవానివలన అభయ మెట్లు కలుగును? అభయరూపమైన మోక్షఫలమే యథార్థముగ ఫలము. స్వరూపమునందుండుటయే మోక్షము. తెలిసికొనుఁవాడు తెలిసికొనుట తెలిసికొనఁబడుచున్నవిషయము దాని వలన కలుగుఫలము అను ఈనాలుగు ఎప్పుడు ఒక్కటిగా తోఁచునో అప్పుడు అభయమైన మోక్షము కలుగును. ఇతరవస్తు భావముల నన్నింటిని తొలఁగించుకొన్నతరువాత, నిద్రలో తమస్సు ఆవరించినట్లు కాక, శుద్ధమైన యాత్మస్ఫురణము ఏది కలదో అదియే జ్ఞానము. తెలిసికొనుచున్న వానిస్వరూపము కూడ ఇదియే. అయినను మొదట వాఁడు తన స్వచ్ఛమైన స్వరూపమును గుర్తింపజాలఁడు. వానిచేత స్వరూపమును గుర్తింపఁజేయుటయే గురువు శాస్త్రము చేయుచున్నపని. వానిచేత తెలిసికొనఁబడుచున్న విషయము కూడ ఇదియే ఇట్లు జ్ఞాత జ్ఞానము జ్ఞేయము అను మూడింటియొక్క భేదము తొలఁగిపోవుటయే ఫలము. ఈభేదములు నిజముగా లేవు; వ్యవహారముకొఱకు కల్పింపఁబడినవే. కావున క్రొత్తగా లభించినఫలము కూడ ఏదియు లేదు. ఎంత వఱకు జ్ఞాత జ్ఞానము జ్ఞాయము ఫలము అనుభేదములు భాసించుచుండునో అంత వఱకు కొండవలె సంసారము నిలిచియుండును. ఎప్పు డీభేదము లన్నియు నశించి వీనికి ఆశ్రయముగానున్న యాత్మ భాసించునో అప్పుడు సంసారము, గాలిచేత మేఘమువలె, విచ్ఛిన్నమై నశించును.

సాధనము :

ఇట్టి మోక్షమును పొందుటకు దానియందు గాఢమైనవాంఛయే సాధనము. దానియందు తత్పరత్వము లేనిచో ఇతరసాధనములు వేయియున్నను ప్రయోజనము లేదు. అది పూర్ణముగ నున్నచో వేఱొక సాధన మక్కఱ లేదు. "ఎట్లయినను దీనిని సాధించును"అని ఎవఁడు తత్పరుఁడై యుండునో వాఁడు అన్నివిధములముక్తుఁడే అట్టిఁవాడు కొన్నిదినములలోఁగాని మాసములలోఁగాని సంవత్సరములలోఁగాని జన్మాంతరమునఁగాని తప్పక ముక్తుఁడగును. బుద్ధియొక్క నిర్మలత్వములోని భేదములనుబట్టి ముక్తి ఇప్పుడుగాని మఱికొంతకాలమునకుఁగాని సంభవించుచున్నది. సకలపురుషార్థములను నశింపఁజేయునట్టి దోషములు బుద్ధియందు అనేకము లుండును. వానిచేతనే జనులు ఎల్లప్పుడు ఘోరమైన సంసారమునందు తాపము నొందుచున్నారు. అనాశ్వాసము కామవాసన జడత్వము అని ఈదోషములు మూఁడువిధములుగా నున్నవి. సంశయము విపర్యయము అని అనాశ్వాసము రెండు విధములుగ నున్నది. మోక్షము ఉన్నదా లేదా అని సందేహించుట సంశయము. మోక్షము లేనేలేదని తలంచుట విపర్యయము. ఈరెండును తత్పరత్వమునకు ముఖ్యప్రతిబంధకములు. "మోక్షము ఉన్నది" అన్న దృఢనిశ్చయముచేతనే ఈరెండు క్రమముగా నశించును. వేదవిరుద్ధమైన తర్కము అనాశ్వాసమునకు మూలము.

అట్టికుత్సితమైన తర్కమును వదలి సరియైన తర్కము నవలంబించినచో మోక్షమున్నదను నిశ్చయ మేర్పడును. పిదప శ్రద్ధ కలుగును. దానిచేత అనాశ్వాసము నశించును. కామాదివాసనలు శ్రవణమునకు ప్రతిబంధకములు. లోకములో ప్రతివ్యక్తియు తానుకోరుచున్నదానినే ధ్యానించుచుండును. అట్టివాఁడు ముందున్న వస్తువును కూడ చూడఁడు; చెవిదగ్గఱ చెప్పుచున్నమాట నైనను వినఁడు. అట్టివాఁడు దేనినైన విన్నను అది విననిదానితో సమానముగానే యుండును. కాఁబట్టి కామాదివాసనలను వైరాగ్యసంపదచేత జయింపవలయును. ఈవాసనలు వేయి విధములుగా నున్నవి. కాని వీని కన్నింటికిని మూలము కామమే. అది నశించినచో అన్నియు నశించును. ఏదియు మిగులదు. "ఇది నాకు కావలయును" అను ఆశయే కామము. సులభములైన కోరికలయందు అది స్థూలముగా దుర్లభములైనవానియందు సూక్ష్మముగా నుండును. దృఢమైనవైరాగ్యముతో దానిని నశింపఁజేయవలయును. కోరఁబడుచున్న విషయములయందు ప్రతిక్షణము దోషమును పరశీలించుచు వాని యందు వైముఖ్యమును పొందినచో ఆవైముఖ్యము వాసనలను నశింపఁజేయును. ఇంక మూఁడవదియైన జడత్వము చాలపెద్దదోషము. జడత్వము కలవాఁడు ఎంత శ్రద్ధతో విన్నను విషయము వానిబుద్ధి కెక్కదు. ఆత్మదేవతారూపిణినైన నాయొక్క సేవచేత తప్ప వేఱొక విధముగా జడత్వము నశింపదు. భక్తియందలి తారతమ్యమునుబట్టి జడత్వము కొంచెముగా నుండుట. అధికముగా నుండుట అనుభేదమును బట్టి నేను నాభక్తునియొక్క జడత్వమును వెంటనే గాని జన్మాంతరము నందుఁగాని నశింపఁజేయుదును. ఎవఁడు నన్ను ఎల్లప్పుడు నిష్కామముగా భక్తితో ధ్యానించుచుండునో వానికి సత్సంగము మొదలగు సాధనము లన్నియు సమకూడును. వాఁడు విఘ్నముల నన్నింటిని తొలఁగఁద్రోసికొని త్వరగా కృతార్థుఁడగును. సర్వబుద్ధిప్రసారమునకు కారణమైన నన్ను పూజింపక ఎవఁడు మూఢుఁడై ఇతరసాధనములను అవలంబించునో వాఁడు అడుగడుగున విఘ్నముల నొందుచు ఫలము నెప్పటికో పొందవచ్చును; పొందకపోవచ్చును. కావున ఋషులారా! తత్పరత్వమే ముఖ్యాసాధనము.

సాధకుఁడు!ఈకారణముచేత సాధకులలో
తత్పరత్వముకలవాఁడే శ్రేష్ఠుఁడు. అట్టివారిలో నాయందు భక్తికలవాఁడు ఎల్లరచేతను పూజింపఁబడును.

సిద్ధి :

దేహము ప్రాణము మొదలగునవి ఆత్మకాదు అనునిశ్చయమే సిద్ధి. శరీరాదులయందు ఎల్లరకును "ఇది నేను" అను భావన రూఢముగ నున్నది. ఆ భావనను నిర్మూలించుటయే సిద్ధి. మఱి నిద్రలో ఈ భావన లేదు కదా! అది సిద్ధి యగునా! కాదు. తమస్సుయొక్క అతిశయముచేత నిద్రయందు మనస్సు మూఢమై ఏభావనను పొందుట లేదు. అందువలన అది సిద్ధికాదు జాగ్రద్దశయందే మనస్సునందు "దేహమే నేను" అనుభావనను నిర్మూలించుట సిద్ధి. దేహాదులకు భిన్నముగా ఎవనికిని కేవలమైన యాత్మస్వరూపమునందు నిశ్చితమైన భావన కలుగుట లేదు. దీనివలననే పెద్ద యనర్థముల పరంపర సంభవించుచున్నది. కావున దేహము ప్రాణము ఇంద్రియములు మొదలగువాని నన్నింటిని భాసింపఁజేయుచున్న కేవల చిదాత్మయే నేను అనునిశ్చయము సకల సంశయములను నశింపఁజేయును. దీనినే విద్వాంసులు సిద్ధి అని చెప్పుచున్నారు. దీనికి మించినసిద్ధి మఱి యేదియును లేదు. ఆకాశగమనము అణిమ మహిమ గరిమ మొదలగునవి యన్నియు ఆత్మజ్ఞానసిద్ధిలో పదునాఱవభాగమునకు కూడ సరిపోలవు. అవి యన్నియు దేశకాలముల ననుసరించి అల్పములైన ఫలముల నొసంగును. ఆత్మజ్ఞానసిద్ధి దేశకాలములచేత పరిమితము కాదు. ఆత్మవిద్యాసాధనములందు అకాశగమనాదిసిద్ధు లన్నియు సంభవించును. కాని ఆత్మజ్ఞానసిద్ధియందు అవి విఘ్నములను కలిగించును. అందువల మోక్షమునందు తీవ్రమైన యిచ్ఛకలవారు ఇంద్రజాలముతో సమానములైన యాసిద్ధులు ప్రాప్తించినను వానివంక చూడరు. సాక్షాత్తుగా సృష్టికర్తయొక్క పదవియే లభించినను వారు తృణప్రాయముగా తిరస్కరింతురు. కాలక్షేపమాత్రములై జ్ఞానసిద్ధికలుగుటలో ఆలస్యమునకు కారణములైన యీ క్షుద్రసిద్ధులతో వారి కేమి పని? కావున ఆత్మజ్ఞానసిద్ధికన్న మఱియొక సిద్ధి లేదు. దేనిచేత శోకము పూర్తిగా నశించి బ్రహ్మానందము కలుగునో అదియే సిద్ధి గాని తక్కినది ఏదియు కాదు.

సిద్ధియొక్క పరాకాష్ఠ :

అభ్యాసమునందలి భేదములవలన బుద్ధియొక్క నిర్మలత్వము నందలి తారతమ్యమువలన, పరిపాకవిశేషమువలన ఆత్మజ్ఞానసిద్ధి ఉత్తమము మధ్యమము అధమము అని మూఁడువిధములుగా నున్నది. గొప్ప యభ్యాసమువలన ఒకానొకఁడు ఎన్నో పనుల చేయుచున్నను వేదమును స్వరము తప్పకుండ చెప్పఁగలుగను. వాని వేదపాఠము ఉత్తమము. మఱియొకఁడు ఏదేని ఒకపనిని చేయుచున్నను దానియందు శ్రద్ధ నుంచక వేదమును మాత్రము చక్కఁగా చెప్పుచుండును. ఆవేదపాఠము మధ్యమము. వర్ణస్వరమాత్రాకాలములను ప్రయత్నపూర్వకముగా స్మరించుచు చేయువేదపాఠము అధమము. ఇట్లే ఆత్మజ్ఞాన సిద్ధియు మూఁడువిధములుగా నున్నది. కొందఱు రాజ్యపరిపాలనాది వ్యవహారములందుండి సమాధికొఱకు ఎట్టి ప్రయత్నము చేయుటకు వీలు లేకున్నను వారిమనస్సు స్వరూపస్థితియందే యుండును. అది ఉత్తమసిద్ధి. కొందఱు వ్యవహారములు చేయుచున్నను మధ్యలో సమాధిని పొందుచుందురు. ఇది మధ్యమసిద్ధి. కొందఱు వ్యవహారమును వదలి సమాధిస్థితియందే నిలిచియుందురు. ఇది అధమసిద్ధి. వీనిలో ఉత్తమమైనదే జ్ఞానసిద్ధికి పరాకాష్ఠ. స్వప్నము మొదలగునవస్థల యందు కూడ ఎవనియొక్క మనస్సు విచారముచేయుచున్న సమయము నందువలె శుద్ధచిన్మాత్రముగ నుండునో వానిజ్ఞానసిద్ధి పరమోత్తమము. వానికి సహజముగా ఏవ్యవహారమునందును వాసనలయొక్క ప్రకోపము కలుగదు; అందువలన సంకల్పమును కలుగదు. వానికి సహజముగ ఏసంకల్పముతో పనిలేకున్నను లోకసంగ్రహదృష్టితో శాస్త్రము ననుసరించి ప్రవర్తించును. ఇది జ్ఞానసిద్ధికి పరాకాష్ఠ. అప్రయత్నముగా ఎప్పుడు మనస్సు చిదాత్మకమైన స్వరూపమునందు తెంపులేకుండ నిలిచియుండునో అప్పుడు జ్ఞానసిద్ధి పరాకాష్ఠను పొందును. ఎవఁడు వ్యవహారపరుఁడై వివిధపదార్థములను చూచుచుండియు ఆత్మకన్న భిన్నముగా దేనిని చూడఁడో, కార్యములు నిర్వహించుచున్నను నిద్రించుచున్నవానివలె ఎవఁడు వానిని పట్టించుకొనఁడో, అట్టివాని జ్ఞానసిద్ధి పూర్ణము.

జ్ఞానసిద్ధులలో ఉత్తముఁడు :

ఇట్టిజ్ఞానసిద్ధిని పొందినవాఁడు సిద్ధులలో ఉత్తముఁడు. ఇతఁడు వ్యవహారమునందు నిమగ్నుఁడై యున్నను సమాధిస్థితిని ఎప్పుడును వందలఁడు. ఈతఁడు తనయొక్క అనుభవమునుబట్టి అనేకవిధములుగా నుండు జ్ఞానులయొక్క స్థితిభేదములను గ్రహించుచుండును. వీనికి కోరిక కాని సంశయము కాని కొంచము కూడ ఉండవు. వ్యవహారములందితఁడు నిర్భయుఁడై సుఖమును దుఃఖమును స్వప్నములో వలె, తనయందే కలుగుచున్నట్లు చూచుచుండును. బంధము అసత్య మగుటచే ఎల్లరును ఎప్పుడును ముక్తులే. కావున ఉత్తమజ్ఞాని "వీఁడు బద్ధుఁఁడు, వీఁడు ముక్తుఁడు" అని భేదముతో చూడఁడు, ఎవనికిని మోక్షము కావలయునని తలంపఁడు. ఆ ఉత్తమజ్ఞానిని నేనే. మా కిరువురకును భేదము లేదు.

ఋషులారా! మీ రడిగిన వన్నియు క్రమముగా స్పష్టముగా చెప్పితిని. వీనిని తెలిసికొన్నవాఁడు ఎప్పుడును భ్రాంతిని పొందఁడు."

ఇట్లు ఆ పరావిద్యారూపిణియైన త్రిపురాదేవి పలికి విరమించెను. ఋషులు సందేహమును వీడి బ్రహ్మవిష్ణుమ హేశ్వరులకు నమస్కరించి వెడలిపోయిరి. భార్గవా! నీకు విద్యాగీతను చెప్పితిను. ఇది పాపనాశని. దీనిని చక్కఁగా విని ఇందలి యర్థమును విచారించినచో ఇది ఆత్మసామ్రాజ్యము నొసంగును. శ్రీపరావిద్యచేతనే సాక్షాత్తుగా ఇది నిరూపింపఁబడియుండుటచే ఇది ఉత్తమమైన గీత. దీనిని ప్రతిదినము పఠించువారియెడల ప్రీతినొంది ఆపరాదేవియే స్వయముగా వారికి జ్ఞానము నొసంగును. సంసారసాగరమునందు మునుఁగుచున్నవారిని ఆమెయే నౌకయై తరింపఁజేయును.

ఇది జ్ఞానఖండమున విద్యాగీత యన్నది ఇరువదియవయధ్యాయము.

బాలప్రియ

విద్యాగీతయందు గ్రంథముయొక్క తాత్పర్యము సంగ్రహముగా నిరూపింపఁబడినది. విద్యాగ్రహణమునందు శ్రద్ధ ముఖ్య మని, అది చెప్పుచున్నవానియొక్క గొప్పతనముపై ఆధారపడియుండు నని ఈకథయందు వ్యక్తమగుచున్నది.

విషయము సమానమే యైనను దానినే సామాన్యుఁడైనయొకయాచార్యుఁడు చెప్పుచున్నప్పుడు కలుగు శ్రద్ధకన్న పరమేశ్వరుఁడే చెప్పుచున్నాఁడన్నప్పుడు కలుగుశ్రద్ధ అత్యధికముగా నుండును. అందువలన దత్తాత్రేయుఁడు. ఎన్నోకథలవలన తత్త్వమునందు నిరూపించి, ఇంచుమించుగా ఉపదేశమును ముగించుచు, దేవలోకమునందు మహర్షులకు త్రిమూర్తులకును సాక్షాత్తుగా చిద్రూపిణియైన త్రిపురసుందరియే బోధించిన తత్త్వసారమును పరశురామునకు అందించెను.

గొప్పతపస్సులు చేసినవారే బ్రహ్మసభకు పోఁగలుగుదురు. అట్లు చేరినమహర్షు లందఱును ఆయన సమక్షముననే జ్ఞానులలో ఉత్తమ లెవరు అనువిషయమున వాదప్రతివాదములు చేసిరి. ఒకరి నిర్ణయమును మరియొకరు అంగీకరింపకుండిరి. అందువలన వా రందఱును బ్రహ్మదేవుని సమీపించి తమసిద్ధాంతములలో ఏది సమంజసమో నిర్ణయింపు మని కోరిరి. అంతే కాని, "మా కీవిషయము తెలియదు, మీరు మాయందు దయయుంచి ఈవిషయమును బోధింపుఁడు" అని వారు అడుగలేదు. వారు తమకు తోఁచినయుక్తులతో సిద్ధాంతములను ఏర్పఱచుకొని అవియే సత్యము లని దృఢముగా అనుకొనుచుండిరి. "మే మందఱమును లోకవ్యవహారమును పరతత్త్వమును కూడ తెలిసికొని జ్ఞానులమై యున్నాము" అని వారు స్పష్టముగా బ్రహ్మదేవునితో చెప్పిరి. అనఁగా వారికి తెలిసికోవలయు ననుకోరిక లేదు. బ్రహ్మదేవుఁడు తమకు అనుకూలముగా చెప్పవలయు నని, అట్లు చెప్పినచో తాము తక్కినవారిని జయించి అందఱికన్న అధికులుగా ప్రకాశింపవలయును, అనునాకాంక్షయే వారియందు ప్రబలముగా నున్నది. వారి దృష్టిలో ఆయనకూడ ఒకతపస్వియే; తమకన్నను అధికముగా తపస్సు చేసి అలోకమునకు ఆధిపత్యమును పొందియున్నాఁడు. అందువలన ఆయన తమయభిప్రాయములకు ఏమాత్రము భిన్నముగా చెప్పినను అంగీకరించుటకు వారు సిద్ధముగాలేరు. ఈశ్వరునివిషయమున విష్ణువు విషయమున కూడ వారియభిప్రాయ మిట్లే యున్నది. ఇది గమనించి ఈశ్వరుఁడు విద్యారూపిణియైన త్రిపురాదేవినే ప్రార్థింత మని చెప్పెను. ఆమె సర్వలోకేశ్వరి సర్వాత్మిక. కావున ఆమె చెప్పినదానిని వారు నిస్సందేహముగా శిరసావహింతు రని ఆయన వారిని అట్లు ప్రోత్సహించెను.

అందఱును అందులను అంగీకరించి ఆమెను విద్యారూపిణినిగా ధ్యానించిరి. వారియందఱియొక్క సంకల్పము ఏకముఖమై సర్వవ్యాప కమైయున్న ఆత్మయను మహాసముద్రమునందు ఒకతరంగమును పుట్టించెను. సృష్టి జరుగునప్పుడు ఆత్మనుండి మొదట పుట్టినది ఆకాశము. ఆకాశముయొక్క గుణము శబ్దము. వేదములు శాస్త్రములు మొదలుగా సకలవిజ్ఞానము ఆశబ్దమునందే యుండును. కావుననే ఆత్మ సర్వజ్ఞ మని, దానినుండి పుట్టిన యాకాశముయొక్క గుణమైన శబ్దము నుండి వెలువడినవేదములు సర్వజ్ఞకల్పము లనియు చెప్పఁబడుచున్నవి. సర్వజ్ఞకల్పము లనఁగా సర్వజ్ఞముతో కొంచెము తక్కువగా సమానము లని యర్థము. సకలమైన యీవిజ్ఞానమే విద్య. ఆమహర్షుల యొక్క ప్రార్థనారూపమైన సంకల్పము ననుసరించి ఆత్మ ఆకాశ శరీరముతోవిద్యారూపిణియై వారికి గోచరించెను. ఆమెయొక్కశబ్దము విని పించినదే కాని వారికి ఆమె కన్పింప లేదు. ఆమె అందులకు ఆవశ్యకమైనరూపమును గైకొన లేదు. ఆకాశమువలన వాయువు పుట్టును. వాయువునకు శబ్దము స్పర్శ అను రెండగుణము లుండును. ఆకాశవాయువులతో ఏర్పడిన శరీరములు కూడ కంటికి కన్పింపవు. వాయువునుండి అగ్ని పుట్టును. అగ్నికి శబ్దము స్పర్శ రూపము అను మూఁడు గుణములు కలవు. కావున ఆకాశము వాయవు అగ్ని అను మూఁడు భూతముల సమ్మేళనము ఉన్నప్పుడే శరీరము కంటికి కన్పించును. త్రిపురాదేవి ఆకాశమునుండి మాత్రమే శరీరమును పొందుటచే శబ్దరూపముననే ఆమె వారి శ్రోత్రేంద్రియములకు గోచరించెను.

అప్పటివఱకును వారు "జ్ఞానులలో శ్రేష్ఠుఁడెవరు?" అను విషయమునుగూర్చియే చర్చించుచుండిరి. కాని దేవి ప్రసన్నురాలై ఆవిర్భవించినంతనే ఒక్కొక్కరు ఒక్కొక్కవిషయమునుగూర్చి ఆమెను అడిగిరి. ఆమె వారు అడిగిన విషయముల నన్నింటిని క్రమముగా వివరించినది. వానిలో కొన్ని చాల ప్రాథమికములైన (Elementary) విషయములు కూడ ఉన్నవి. బ్రహ్మలోకమునకు పోఁగలిగిన మహర్షులకు ఈవిషయములు తెలియవా?

తపశ్శక్తులకు జ్ఞానమునకు సంబంధము లేదు. అంతే కాదు. ఆత్మజ్ఞానము మనుష్యలోకములో పొందుట సులభ మైనట్లు మఱి యే లోకమునందును సులభము కాదు. "ఆత్మ మనుష్యలోకమున, నిర్మలమైన బుద్ధియందు అద్దములో ముఖముయొక్క ప్రతిబింబమువలె స్పష్టముగా గోచరించును; పితృలోకమునందు స్వప్నమునందువలె

గోచరించును; నీటిలో ప్రతిబింబమువలె గంధర్వలోకమున గోచరించును; బ్రహ్మలోకమునందు వెలుఁగునకు నీడకు గల భేదమువలె గోచరించును." అని కఠోపనిషత్తునందు (6-5) వివరింపఁబడియున్నది. పై లోకములలో ఒక్క బ్రహ్మలోకమునందు మాత్రమే హిరణ్యగర్భుని సమక్షమున ఆత్మనుగూర్చి విచార మొనర్చి జ్ఞానమును పొంది ముక్తులగుటకు అవకాశ మున్నది. సత్యలోకమునకు పోఁగల్గుట సులభము కాదు. ఇంద్రియములను జయించి శాంతులై అరణ్యములందు భిక్షావృత్తి నవలంబించి సగుణబ్రహోపాసనారూపమున ఎంతో కాలము తపస్సు చేసినవారు మాత్రమే బ్రహ్మలోకమునకు పోఁగల్గుదు రని ముండకోపనిషత్తునందు (2వ ఖండము. శ్లో. 11) చెప్పఁబడియున్నది. అంత కష్టపడి బ్రహ్మలోకమునకు పోయినను అక్కడ కూడ ఆత్మవిచారమును గావించి వారు జ్ఞానమును పొందవలె. పిదప బ్రహ్మ దేవుని పరిపాలనకాలము ముగిసినప్పుడ, ఆయనతోపాటు వారును ముక్తిని పొందుదురు.

జీవులలో పెక్కుతరగతులు కలవు. శ్రవణమనననిదిధ్యాసనములతో నిర్గుణబ్రహ్మము నుపాసించి జ్ఞానముచేత ఆత్మసాక్షాత్కారమును పొందిన జీవన్ముక్తులు మొదటి తరగతి జ్ఞానము కలుగుటకు పూర్వము వీరిలో కొందఱు పెద్దయజ్ఞములు గొప్పతపస్సులు చేసి యుందురు. ఆపుణ్యముయొక్క అతిశయముచేత వారు విశ్వపరిపాలనలో (Administraion of the Universe) అధికార పదవులయందు ఉందురు. విష్ణువు బ్రహ్మ ఈశ్వరుఁడు లక్ష్మి సరస్వతి పార్వతి ప్రజాపతులు మనువులు సప్తర్షిమండలములోని మహర్షులు వేదవ్యాసుఁడు మొదలగునవి యన్నియు ఇట్టిపదవులే. వీరు ముక్తు లగుటచే ప్రారబ్ధముయొక్క అంతమునందు శరీరము పడిపోవునపుడు, కుండ పగిలి పోయినపుడు కుండలోని యాకాశము చుట్టును సర్వవ్యాపకమైన యాకాశములో కలిసిపోవునట్లు, వీరియాత్మ కూడ పరమాత్మలో లీనమగును. వీరు ఏలోకమునకు పోరు. ఎక్కడివారు అక్కడనే పరమాత్మయందు లీన మగుదురు. వీరు ఉత్తమజ్ఞానులు; అధికారపదవుల యందు ఉండి వ్యవహరించుచున్నప్పుడు కూడ ముక్తులే. కాని పదవులను పొందువా రందఱును జ్ఞానులై యుండవలె నను నియమము లేదు. కొందఱు కేవలము యజ్ఞములచేతనో తపస్సులచేతనో పదవులను పొందుదురు. వీరికి పదవీకాలము ముగిసినంతనే, నహుషునకు సర్పజన్మము వచ్చినట్లు, జన్మాంతరము తప్పదు. అగ్ని వాయువు ఇంద్రుడు మొదలగు పదవులలో ఇట్టివా రనేకులు ఉందురు.

సగుణబ్రహ్మోపాసకులు రెండవతరగతి పంచాగ్నివిద్యను శ్రద్ధను సత్యమును సగుణబ్రహ్మమును ఉపాసించినవారు మరణించినప్పుడు అర్చిరాదిమార్గమున బ్రహ్మలోకమునకు చేరుదురు. అక్కడ వీరు బ్రహ్మదేవునియొద్ద ఆత్మవిచారమును గావించి, ఆయనయొక్క పదవీకాలము ముగిసినప్పుడు, ఆయనతోపాటు వీరు కూడ ముక్తిని పొందుదురు. కావున వీరు బ్రహ్మలోకమునుండి తిరిగిరారు.

సాకారమూర్తులను ఉపాసించినవారు యజ్ఞములను చేసినవారు మూఁడవతరగతి. వీరు ధూమాదిమార్గమున గంధర్వలోకము పితృలోకము ఇంద్రలోకము మొదలైన స్థానములకు పోయి అక్కడ తమ పుణ్యఫలము ననుసరించి భోగములను అనుభవించి పుణ్యము క్షీణించినప్పుడు అక్కడనుండి మర్త్యలోకమునకు తిరిగివచ్చి పూర్వకర్మ శేషము ననుసరించి జన్మలను పొందుచుందురు.

అర్చిరాదిమార్గము శుక్లగతి యని, ధూమాదిమార్గము కృష్ణగతియని భగవద్గీతయందు నిరూపింపఁబడినది.

సామాన్యములైన పుణ్యములను పాపములను చేయుచుండు వారు ఏలోకములకు పోక ఇచ్చటనే పుణ్యాతిశయమునుబట్టి మహారాజులుగా మంత్రులుగా సంపన్నులుగా, పాపము ఎక్కవగా నున్నచో పశుపక్ష్యాదిజన్మలను పొందుచుందురు. వీరు నాల్గవతరగతి.

మహాపాపములను చేసినవారు అయిదవతరగతి. వీరు నరకమునకు పోయి యాతనలు అనుభవించి పూర్వకర్మశేషము ననుసరించి మనుష్యాదిజన్మలను పొందుచుందురు.

ఈదృష్టితో చూచినప్పుడు పైకథలో బ్రహ్మసభయందు రెండు తరగతులవా రున్నారని గ్రహింపవలసియున్నది. విష్ణువు ఈశ్వరుఁడు వశిష్ఠవిశ్వామిత్రాదిమహర్షులు మొదటి తరగతివారు. వీరు ఉత్తమ జానులు జీవన్ముక్తులు. దేవి చెప్పిన విషయము లన్నియు వీరికి తెలిసినవే; క్రొత్తవి కావు. వీరు బ్రహ్మసభకు ఆగంతుకులుగా వచ్చిన వారు; అనఁగా సభలో

పాల్గొనుటకై తాత్కాలికముగా వచ్చినవారు. వీరు బ్రహ్మలోక నివాసులు (Citizens of Brahmapura) కారు. ఆ సభలో కలిగిన వివాదము వీరు ఆరంభించినది కాదు. వారికి జ్ఞానవిషయమున ఎప్పుడును సందేహమే యుండదు. అట్లున్నచో వారు జ్ఞానులు కారు; జీవన్ముక్తులును కాజాలరు. ఇంక వివాదము సగుణ బ్రహ్మోపాసకులై బ్రహ్మలోకమునకు వచ్చిన రెండవతరగతివారిలోనే బయలుదేరిన దని గ్రహింపవలసియున్నది. వీరు ఆగంతుకులు (Visitors) కారు. సభ ముగిసినంతనే విష్ణువు ఈశ్వరుఁడు వశిష్ఠాది బ్రహ్మర్షులు తమ స్థానములకు తిరిగిపోవుదురు. వీరు అట్లు తిరిగి పోరు. వీరు భూలోకమున ఉపాసనలు చేసి మరణించినపిమ్మట అర్చిరాదిమార్గమున బ్రహ్మలోకమున నివసించుటకై వచ్చినవారు. కావున వీరు బ్రహ్మలోకమున నిత్యనివాసులు (Permanent citizens). వీరు భూలోకమున ఉన్నప్పుడు శ్రవణమనననిదిధ్యాసనములతో ఆత్మవిచారమును చేసి జ్ఞానమును పొందినవారు కారు. వీరు బ్రహ్మలోకమున ఆత్మవిచారమును గావించి జ్ఞానులై బ్రహ్మదేవునితో కూడ ముక్తిని పొందవలసినవారు. కావున వీరు బ్రహ్మలోకమున నిత్యము ఆత్మ విచారమునే చేయుచుండవలె. వీరిచేత ఆత్మవిచారము చేయించి వీరిని ముక్తులను గావింపవలసిన కర్తవ్యము బ్రహ్మదేవునకు ఉన్నది. ఆయనయొక్క పదవీబాధ్యతలలో ఇది యొకటి. బ్రహ్మలోకమునకు ఉపాసకులై వచ్చినవారు అక్కడ ముక్తి పొందవలసినదే కాని మరల తిరిగివచ్చుట (పునరావృత్తి) యన్నది లేదు, ఇది విశ్వవిధానమున (Universal Administration) ఒక నియమము.

వీరు బ్రహ్మలోకమునకు మొదట వచ్చినప్పుడు అచ్చటియద్భుతమైన సన్నివేశమునకు ముగ్ధులై బ్రహ్మదేవునియందు భయభక్తులతో శ్రవణమననాదులను ఆరంభించినను కాలము గడచుకొలఁది ఆయనతో అతిపరిచయమువలన శ్రద్ధ సన్నగిల్లుట సహజము. మఱియును ఒకమహాసభ యేర్పాటై ఆగంతుకులు అనేకులు వచ్చియున్నప్పుడు వారియెదుట "నాకు విషయము తెలియలేదు. అనుగ్రహించి వివరింపుఁడు"అని బ్రహ్మదేవుని సైతము ప్రార్థించుటకు వారు సంకోచపడుట సహజము. వారికి కూడ "మేము మహాతపస్వులము" అను అభిమానము ఉండనే యుండును. అది జ్ఞానముచేతఁగాని నశింపదు. జ్ఞానము కావలయు ననుశ్రద్ధ కలుగవలయు నన్నచో అభిమానము తగ్గవలె. ఇది యెట్లు జరుగవలె ననునది చిక్కుసమస్య. బ్రహ్మర్షులైన వసిష్ఠాదులును ఇందు జోక్యము కలిగించుకొనకుండుట గమనింపఁదగియున్నది. ఈవాదమును పరిష్కరింపుఁడని కొందఱు ఋషులు వారిని అడిగియుండవచ్చును. వారు దానిని పరిష్కరింపఁబూనుకొనక "పరమేష్ఠి యుండఁగా ఒకరు దీనిని పరిష్కరింపవలసిన దేమున్నది? వారినే అడుగుదము" అని చెప్పియుందురు. బ్రహ్మదేవుఁడు లోకాధిపతి, ఆసభకు అధ్యక్షుడు. ఆయుపాసకులకు అందఱకు ఆయన గురువు. వారికి బోధింపవలసినయధికారము ఆయనది. పెద్దల సమక్షమున వివాదము వచ్చినప్పుడు చిన్నవారు తమ కావిషయము తెలిసినను వారియనుమతి లేకుండ చెప్పుట మర్యాద కాదు. అందువలన వారు మిన్నకుండిరి. విద్యారూపిణియైన దేవి కన్పింపకుండ ఆకాశమునందు మేఘగంభీరననిస్స్వనముతో అద్భుతముగాఆవిర్భవించినపుడు ఆయుపాసకు లందఱు అభిమానమును వదలి ఒక్కొక్కరు తమకు తెలియనివిషయముల నన్నింటిని ప్రశ్నించిరి. ఆమె "ఋషులారా!" అని యీసాధకుల నుద్దేశించియే ప్రసంగించుట గమనింపఁదగియున్నది. ఆమె త్రిమూర్తులను వశిష్ఠాదిబ్రహ్మర్షులకు ఉద్దేశింప లేదు. వారి కీవిషయము లన్నియు తెలిసినవే.

ఆమె ఉపదేశముయొక్క ఆరంభమున "శాస్త్రము అనుమహా సముద్రమునుండి అమృతమువంటి సారమును మీకు అందించుచున్నాను" అని చెప్పియుండుట గమనింపఁదగియున్నది. ఆ పరమేశ్వరి కూడ "నేను చెప్పుచున్నాను. కావున మీరు వినుఁడు" అని చెప్పకుండ శాస్త్రమే ప్రమాణ మని మొట్టమొదటియుపదేశము కావించినది. ఆమె బోధించి కొన్ని నిముసములలో అదృశ్యురాలు అగును. ఆమె యొక్క యుపదేశమునకు ఆమెయే ప్రమాణ మగుచో, ఆమె అదృశ్యమైన తరువాత సందేహములు కలిగినచో గతి యేమి? ఆమె మాటి మాటికి ఆవిర్భవింపదు. అందువలన తరువాత సందేహములు కలిగినచో శాస్త్రమే ప్రమాణముగా పరమేష్ఠియొద్ద విచారము గావింపుఁడని ఆమె ముందే వారికి స్పష్టముగా సూచించినది. దీనివలన బ్రహ్మలోకమునకు పోయినను ఉపనిషత్తులలోని వాక్యములయొక్క అర్థమును విచారింపవలయు ననుట స్పష్టము. ఎంతో కష్టపడి తపస్సులు చేసి ఆలోకమునకు పోయి ఆత్మవిచార మొనర్చి అక్డ ముక్తు లగుటకన్నను ఈలోకమునందు ఇప్పుడే ఆవేదాంతవిజ్ఞానముతో ఆత్మవిచార మొనర్చి, హేమచూడుఁడు జనకుఁడు అష్టావక్రుఁడు మొదలగు వారివలె, వెంటనే తరించి బ్రహ్మనందనిమగ్ను లగుట ఎంతో మేలు అనుట ఈకథకు సారాంశము.

# ఇరువదియొకటవయధ్యాయము -రాక్షసోపాఖ్యానము

భార్గవరాముఁడు దత్తాత్రేయుని మరల ఇట్లు ప్రశ్నించెను. "భగవానుఁడా! సాక్షాత్తుగా మోక్షఫలము నొసంగునట్టి విజ్ఞానరూపమైన సాధనమును సారభూతముగ సునిశ్చితముగా చెప్పుము. దేహముతో కూడియున్నప్పుడు దేహమును వదిలినప్పుడు జ్ఞానులస్థితి ఎట్లుండును? వ్యవహరించునపు వారిమనస్సు అనాసక్తముగ నెట్లుండును? ఏ లక్షణముచేత జ్ఞానులను త్వరగా గుర్తించుటకు వీలగును? ఇది యంతయు నాకు స్పష్టముగా దయతో చెప్పుము."

దత్తాత్రేయుఁ డిట్లనెను, "దేవతానుగ్రహమే జ్ఞానమునకు ముఖ్యసాధనము. ఎవఁడు వాఙ్మనఃకాయములచేత ఎల్లప్పుడు స్వాత్మదేవతను ఆరాధించుచుండునో వానికి జ్ఞానము సులభ మగును. ఇది జ్ఞానసాధనములలో సర్వోత్తమముగా చెప్పఁబడియున్నది. ఇతర సాధనములతో అపేక్ష లేకుండ ఇదియే ఫలమును సాధించుటకు సమర్థమై యున్నది. దీనిని వదలినచో ఇతరసాధనము లేవియు చక్కఁగా ఫలము నొసంగలేవు. అందులకు కారణమును వినుము. సర్వమును ప్రకాశింపఁజేయుచున్న చిదాత్మకు దానియొక్క స్వాతంత్ర్యమహిమ వలననే ఆవిద్యావరణము కల్పితమై యున్నది. శ్రవణాదిరూపమైన విచారణము వలన అవిద్యను తొలఁగించినచో చిదాత్మయొక్క స్వరూపము సాక్షాత్కారించును. విచారణ చేయుచున్నను స్త్రీలు ధనము మొదలగు వానిపై ఆసక్తి కలిగియుండు బహిర్ముఖులకు అది సాక్షాత్కరించుట మిగుల దుర్ఘటము. భక్తులైనవారు సంసారవిషయములకు విముఖులై దేవతను ఆరాధించుచు అంతర్ముఖులై యుందురు. కావున అట్టివారికి అది సులభముగా సాక్షాత్కరించును. త్రికరణశుద్ధిగా స్వాత్మదేవతను ఆరాధించువాఁడు వై రాగ్యము మొదలగు నితసాధన ములను కొలఁదిగా కలిగియున్నను. ఆత్మతత్త్వమును పరోక్షముగనో అపరోక్షముగనో తెలిసికొని ఇతరులకును బోధించుచుండును. అట్లు దానిని మాటిమాటికి అతఁడు బోధించుచు నున్నప్పుడు క్రమముగా వానిమనస్సు ఆత్మస్వరూపమును పొందఁజొచ్చును. అట్లు వాని మనస్సు తఱచుగా స్వరూపమును పొందుచు దానియందే దృఢముగా నిలిచిపోవును. అట్లు చిదాత్మకమైన యాతనిమనస్సు వ్యవహారదశలలో హర్షమును ఉద్వేగమును పొందక స్థిరముగా నుండును. అట్టి ఉత్త మజ్ఞాని జీవన్ముక్తుఁడగును. వానిమనస్సు వ్యవహారమునందు ఏదృశ్యముతో సంబంధించియున్నను చిదాత్మస్వరూపమును వదలి యుండదు; అది ప్రతిదృశ్యమును చిదాత్మరూపముగనే గ్రహించును. కావున భక్తియోగపూర్వకముగ ఆత్మతత్త్వమునుగూర్చి విచారణ చేయుట అనుసాధనముతో సమానమైనది మఱియేదియును లేదు.

ఇంక జ్ఞానులయొక్క లక్షణమును తెలిసికొనుట సులభము కాదు. వారిమనస్సు శుద్ధచిన్మాత్రమై యుండును. అది వారియొక్క దృష్టి వాక్కు మొదలగు బహిరంగవిషయములందు గోచరింపదు. వ్యాకరణాదిశాస్త్రములయందు పండితులైనవారివిషయమున కూడ క్రొత్తవారికి వారిని చూచునపుడు వారియొక్క దేహము వస్త్రము భూషణములు మొదలగు వానివలన లోపలనున్న పాండిత్యము గోచరింపదు కదా! ఒకఁడు మంచిపండును తిని ఆరసమును ఆస్వాదించినచో "ఈరసము ఇట్టిది" అను జ్ఞానము వానికి కలుగును. వానికి ఆ రసమునుగూర్చి ఏజ్ఞానము కలిగెనో అది ఇతరులకు తెలియదు. అట్లే ఆత్మతత్త్వానుభవమున కూడ జ్ఞానియొక్క అనుభూతి ఇతరులకు గోచరము కాదు. అయినను చీమలు మొదలగునవి నేలయందు గోడలలో సూక్ష్మముగా గోచరించుచుండు తమమార్గములను ఎట్లు గుర్తించుచున్నవో, అట్లే విద్వాంసులు కూడ మహాపురుషులతో వ్యవహరించునప్పుడు వారియందుండు ప్రసన్నత భాషణవైఖరి మొదలగువానిని బట్టి "వీరు జ్ఞానులు" అని గుర్తింపఁగలుగుదురు. ఇంక శాంతి దాంతి మొదలగు లక్షణములనుబట్టి జ్ఞానులను గుర్తించుటకు వీలు గాదు. ఎందువల్ల ననఁగా ఆలక్షణములు సాధకులయందు వంచకులయంద కూడ కన్పించుచుండును. నిర్మలమైన యంతఃకరణము లేనివారు జ్ఞానమునకు సాధనములుగా దమము శమము మొదలగువానిని అవలంబించుచున్నను అవి వారికి సహజములు కావు. వానిని నిరంతరము అభ్యసించిన తరువాత చాలకాలమునకు అవి అప్రయత్నముగా వారికి అలవడును. అప్పుడే అవి వారికి సహజములై లక్షణము లగును. కావున తాత్కాలికముగా ఆభ్యాసింపఁబడుచున్న శమదమాదులనుబట్టి "వీరు జ్ఞానులు" అని చెప్పుటకు వీలు లేదు. కాని లాభనష్టములు మానావమానములు జయాపజయములు కలుగుచున్నప్పుడు ఎవని యందు కొంచెము కూడ మార్పు కలుగదో అట్టివానిని ఉత్తమజ్ఞానినిగ నెఱుంగుము. ఉత్తమజ్ఞాని

ఆత్మసాక్షాత్కారముయొక్క అనుభూతి యందలి రహస్యములను వెంటనే చెప్పఁగలిగియుండును. జ్ఞాన ప్రసంగములయందు ఉత్సాహము, స్వయముగ ఏకార్యమును ఆరంభింపకుండుట, సంతోషము, కామక్రోధాదిభావములులేకుండ పవిత్రమైన చిత్తమును కలిగియుండుట, పెద్దయాపదలు వచ్చిపడుచున్నప్పుడు కూడ ఉద్వేగమును పొందకుండుట - ఇవి ఉత్తమజ్ఞానియొక్క లక్షణములు. సాధకుఁడు తన జ్ఞానముయొక్క పరిపాకమును పరీక్షించుకొనుటకు ఇవి సుస్థిరములైన లక్షణము లనుటలో సంశయము లేదు. సాధకుఁడు తన్నుగూర్చి తాను ఎప్పుడును పరీక్షించుకొనుచుండవలయును. ఆవిధముగ అతఁడు ఇతరులను పరీక్షించుటయందు కూడ నిపుణుఁడగును. తన్ను తాను ఎల్లప్పుడు పరీక్షించుకొనుచుండువాఁడు సిద్ధి నెట్లు పొందకుండును? సాధకుఁడు అన్యులయొక్క గుణదోషములను పరీక్షించుట మానుకోవలెను. అప్పుడే అతఁడు తన గుణదోషములను చక్కఁగా విచారించుకొనఁగలుగును. అప్పుడు దోషములను వదలి గుణములను పెంపొందించుకొనుట సంభవించును. దానివలన సాధనసంపత్తి సమకూడి అతఁడు జ్ఞానసిద్ధిని పొందును.

భార్గవా! ఈలక్షణము లన్నియు సాధకుఁడు తన్ను తాను పరీక్షించుకొనుటకు తప్పక ఉపయోగించును. కాని ఇతరులను పరీక్షించుటలో ఇవి అట్లు తప్పక ఉపయోగపడు నని చెప్పఁజాలము. మిగుల పరిశుద్ధమైన చిత్తముకలవారు మేధావులైనవారు, జనకాదులవలె, శ్రవణాదిసాధనములతో అల్పకాలముననే జ్ఞానసిద్ధిని పొందుదురు. అట్టివారికి కామాదివాసనలు నశింపు. అందువలన వారు పూర్వవాసనలను అనుసరించి సామాన్యులవలెనే వర్తించుచుందురు, అట్టివారిని సాధకుఁడు ఎట్లు పరీక్షించి గుర్తింపగలఁడు? కాని అభ్యాసముయొక్క అతిశయమువలన రత్నపరీక్షకులు రత్నమును చూచినంతనే అది రత్నమగునో కాదో ఎట్లు గుర్తింపఁగలరో అట్లే జ్ఞానులు కూడ ఇతరులను చూడఁగానే వారు జ్ఞాను లగునో కాదో ఏస్థితియం దున్నారో వెంటనే గుర్తింపఁగలరు.

మందజ్ఞానులకు దేహాభిమానము లోకవ్యవహారము సామాన్యులకువలెనే యుండును. వారికి సమాధి సహజమై యుండదు. వారు విచారపరాయణులై యున్నంతవఱకు పూర్ణచిదాత్ములై యుందురు. విచారమును విరమించినంతనే మరల వారు దేహాభిమానముతో సుఖ దుఃఖముల ననుభవించుచు పశువులతో సమానముగ ఉందురు. మధ్యలో అప్పుడప్పుడు వారు విచారపరులై సమాధిని పొందుచు సంసారతాపమును వీడి ఆనందము నొందుచుందురు. స్వరూపానుసంధానములేని సమయములలో వారియందు సంభవించుపశుదశ, కాలిపోయిన త్రాడువలె, వారికి బంధనము కలిగింపదు. వస్త్రముయొక్క రెండు అంచులను రంగులో ముంచినచో మధ్యభాగమును ముంచకపోయినను దానికి కూడ ఆరంగు తప్పక వ్యాపించును. అట్లే వారివ్యవహారము కూడ చిద్రూపానుసంధానమధ్యమున పడి చిద్రూపముతో ఐక్యమును పొందును. అందువలన ఆవ్యవహారము వారికి బంధనము కలిగింపదు.

మధ్యజ్ఞానులకు దేహసంయోగమే ఉండదు. దేహమే ఆత్మ అనుభావమే దేహసంయోగము. అది మధ్యజ్ఞానులకు ఉండదు. అభ్యాసముయొక్క అతిశయమువలన వారికి మనస్సు ఎప్పుడును స్వరూపమునందే లీనమై యుండును. వారికి దేహపోషణము కూడ నిద్రయందువలెనే జరుగుచుండును. నిద్రించుచున్నపిల్లవానిని పిలిచి మాటాడించుచు అన్నము పెట్టినచో వాఁడు ఆనిద్రలోనే ఏదో మాటాడుచు అన్నము తిని వెంటనే నిద్రించును. వానికి మధ్యలో జరిగిన దేదియు గుర్తుండదు. మద్యపానమత్తుఁడైన వానికి కూడ మత్తులో నున్నప్పుడు చెప్పినమాటలు చేసినపనులు గుర్తుండవు. ఇట్లే మహాయోగియు లోకమున ఎప్పుడో ఏదో కొంచెము చేయుచున్నను అది యేదియు ఆయనకు గుర్తుండదు. ప్రారబ్ధముచేత వాసనలవలన వానికి దేహయాత్ర జరుగుచుండును.

ఉత్తమజ్ఞానికి కూడ దేహసంయోగము ఉండదు. బండిని తోలుచున్నవాఁడు ఆ బండియే తాను అని ఎట్లు తలంపఁడో అట్లే ఉత్తమ జ్ఞానియు శరీరమును నడపు చున్నను అదియే తాను అని తలంపఁడు. తనకు దేహ మున్నట్లు గాని, దానితో వ్యవహారము జరుపుచున్నట్లు గాని అతఁడు తలంపక ఎల్లప్పు చిన్మాత్రుఁడై యుండును. అంతరంగమున అత్యంతస్వచ్ఛత కలిగి అతఁడు బహిరంగముగ ఎన్నో వ్యవహారములను చేయుచుండును. స్త్రీ వేషమును ధరించి నటించు పురుషునివలె, చిన్నపిల్లవానితో ఆటలాడు పెద్దవానివలె, మహాయోగియు జగత్తులోని వ్యవహారమును వినోదమాత్రముగ నటించుచుండును. నాటకములోని సుఖసన్ని వేశములు దుఃఖసన్ని వేశములు అన్నియు ప్రేక్షకులకు ఆనందమునే ఎట్లు కలిగించుచుండునో అట్లే మహాయోగికి లోకవ్యవహార మంతయు వినోదమాత్రముగనే యుండును.

మధ్యమజ్ఞాని చిత్తనిరోధముయొక్క నిరంతరాభ్యాసమువలన అచలస్థితిని పొందును. ఉత్తమజ్ఞాని నిరంతరముగ విచారించుచుండు అధ్యసమువలన అచలస్థితిని పొందును. బుద్ధియొక్క పరిపాకము నందలి భేదమువలననే యిరువురకును భేద మేర్పడుచున్నది. బుద్ధి యందు అపరాధము మొదలగుదోషములు అల్పముగా నున్నచో చిత్తనిరోధము కొద్దిగానే యున్నను విచారణచేతనే ఉత్తమజ్ఞానులు స్వరూపమున నిశ్చలత్వమును పొందుదురు. అట్లు గాక బుద్ధియందు అపరాధము మొదలగు దోషములు అధికముగా నున్నచో చిత్తనిరోధము యొక్క అభ్యాసము అధికముగా చేసి మధ్యమజ్ఞాని నిశ్చలస్థితిని పొందును. ఈవిషయమున ఇద్దఱు జ్ఞానులకు జరిగిన సంవాదమును చెప్పెదను వినుము.

పూర్వము విపాశానదీతీరమున అమృతనగరమునందు రత్నాంగదుఁడను రాజు ఉండెను. అతనికి రుక్మాంగదుఁడు హేమాంగదుఁడు అను కుమారు లుండిరి. రుక్మాంగదుఁడు శాస్త్రపారంగతుఁడయ్యెను. హేమాంగదుఁడు ఉత్త మజ్ఞానియయ్యెను. వా రొకనాఁడు సైన్యములతో వసంతఋతువునందు వేటకై అడవిలోనికి పోయిరి. అచ్చట అనేకమృగములను వేటాడి అలసిపోయి ఒకమడుగునొద్దకు చేరిరి. ఆ మడుగున అవతలియొడ్డున ఒకమఱ్ఱిచెట్టుమీఁద బ్రహ్మరాక్షసుఁడుండెను. అతఁడు సకలశాస్త్రములయొక్క సారములను ఎఱింగినవాఁడు. అందువలన అతఁడు విద్వాంసులతో వాదములు చేయుచు వారిని ఓడించి భక్షించుచుండెను. ఇట్లు చాలకాలముగా జరుగుచుండెను. రుక్మాంగదుఁడు చారులవలన ఈవృత్తాంతమును వినియుండెను. అందువలన అతఁడు కుతూహలము కలవాఁడై తమ్మునితో కూడ ఆ చెట్టుదగ్గరకు పోయి ఆబ్రహ్మరాక్షసునితో వాదము నారంభించెను. బ్రహ్మరాక్షసుఁడు రుక్మాంగదుని ఓడించి పట్టుకొనెను. అప్పుడు హేమాంగదుఁడు ఆరాక్షసునితో ఇట్లనెను. "ఇతనిని నీవు భక్షించుటతగదు. నన్ను జయింపక నీవు మాయన్నను జయించినట్లు కాదు. కావున నన్ను జయించి మమ్మిరువురను భక్షింపుము,"

బ్రహ్మరాక్షసుఁడు ఇట్లనెను. "నాకు చిరకాలమునకు ఆహారము లభించినది. ఆకలి నన్ను మిగుల బాధించుచున్నది. వీనిని ముందు పారణగా భక్షించి పిదప నీతో వాదించి జయించి నిన్ను కూడ భక్షించిసంతృప్తి నొందెదను. ఒకప్పుడిచ్చటికి వసిష్ఠునియొక్క శిష్యుఁడు దేవరాతుఁడు రాఁగా వానిని భక్షించితిని. వసిష్ఠుఁడు కోపించి, "ఇంక నీవు మనుష్యుని భక్షించినచో నీముఖము దగ్ధ మగును" అని శపించెను. నేను మిగుల ప్రార్థింపఁగా ఆయన కరుణించి, "వాదమునందు జయిపఁబడినవారిని భక్షింపుము" అని వరము నిచ్చెను. అప్పటి నుండియు ఇట్లు ఓడినవారిని భక్షించుచున్నాను. చాలకాలమునకు ఇప్పటికి శ్రేష్ఠమైనయాహారము లభించినది. కావున వీనిని భుజించిపిదప నీతో వాదింతును."

ఇట్లు చెప్పి బ్రహ్మరాక్షసుఁడు రుక్మాంగదుని భక్షింపఁబూను కొనఁగా హేమాంగదుఁడు "నీకుకావలసినది ఏపదార్థమైన అడుగుము. అది తెచ్చియిచ్చి మాయన్నను విడిపించుకొందును" అని మిగుల ప్రార్థించెను. బ్రహ్మరాక్షసుఁడు, "వీనికి ప్రత్యామ్నాయముగ నాకు కావలసినవస్తు వేదియును లేదు. సరియైన సమయమున లభించి ప్రాణములవలె ప్రియమైనయాహారమును ఎవఁడైన వదలుకొనునా? అయినను ఒకయొప్పందము చేయుచున్నాను. నామనస్సునందు కొన్ని ప్రశలు కలవు. వానికి నీవు సమాధానములు చెప్పినచో మీయన్నను వదలిపెట్టుదును" అని పలికెను. "అట్లయినచో అడుగుము." అని హేమాంగదుఁడు పలికెను.

అంతట బ్రహ్మరాక్షసుఁడు గూఢములైన ప్రశ్నలను అడుగుచుండఁగా హేమాంగదుఁడు ఇట్లు సమాధానములను చెప్పెను.

ప్రశ్న:- ఆకాశముకన్న విశాలమైనది, పరమాణువుకన్న సూక్ష్మమైనది ఏది? అది ఏరూపముతో ఎచ్చట నుండును?

సమా:- చైతన్యము ఆకాశముకన్న విశాలము, పరమాణువుకన్న సూక్ష్మము. అది స్ఫురణమే రూపముగా ఆత్మయం దున్నది.

ప్రశ్న:- అది యొక్కటియే విశాలముగా ఉండి మిగుల సూక్ష్మము ఎట్లగును? స్ఫురణ మనఁగా ఏమి? ఆత్మ అనఁగా ఏది?

సమా:- చైతన్యము సకలమునకు కారణ మగుచటే విశాలముగ నున్నది. అది యింద్రియములచేత మనస్సుచేత గ్రహించుటకు శక్యముకాని దగుటచే సూక్ష్మమై యున్నది. స్ఫురణము ఆత్మ అనునవి రెండును చైతన్యమే.

ప్రశ్న:- అది ఏస్థానమునందు పొందఁదగియున్నది? దానిని పొందుటకు సాధన మేమి? దానిని పొందుటవలన ఏమి గలుగును?

సమా:- దానిని పొందఁదగినస్థానము బుద్ధి. ఏకాగ్రతవలన అది లభించును. అది లభించినచో పునర్జన్మ యుండదు.

ప్రశ్న:- నీవు చెప్పుచున్న బుద్ధి ఏది? దానియొక్క ఏకాగ్రత అనఁగా ఎట్లుండును? జన్మ అనఁగా ఏమి?

సమా:- జడత్వముచే ఆవరింపఁబడిన చైతన్యమే బుద్ధి. దృశ్యములయందు ప్రసరింపక స్వరూపమునందే బుద్ధి నిలిచియుండుట ఏకాగ్రత. దేహమే నేను అనుతలంపు కలుగుటయే జన్మము.

ప్రశ్న:- దేనివలన చైతన్యము లభించుట లేదు? దేని వలన అది లభించును? జన్మము ఎట్లు కలుగుచున్నది?

సమా:- అవి వేకమువలన చైతన్యము లభించుట లేదు. ఆత్మ చేతనే అది లభించుచున్నది. కర్తృత్వాభిమానమువలన జన్మ కలుగుచున్నది.

ప్రశ్న:- నీవు చెప్పిన అవివేకము ఎట్టిది? ఆత్మ అనఁగా నేమి? కర్తృత్వాభిమానము అనఁగా నేమి?

సమా:- దేహమునకు ఆత్మకు భేదము తెలియకుండుటయే అవి వేకము. ఆత్మ అనఁగా నేమో నీస్వరూపమునే ప్రశ్నించుచు తెలిసికొనుము. "నేను కర్తను" అను జ్ఞానముయొక్క వాసనయే కర్తృత్వాభిమానము.

ప్రశ్న:- అవి వేకము దేనిచేత నశించును? అది దేనివలన లభించును? అదియును దేనివలన కలుగును?

సమా:- విచారముచేత అవివేకము నశించును. వైరాగ్యము వలన విచారము లభించును. వైరాగ్యము కలుగుటకు దోషదృష్టి కారణము.

ప్రశ్న:- విచార మనఁగా నేమి? దేనిని వైరాగ్య మందురు? దోషదృష్టి ఏది?

సమా!- దృక్కును దృశ్యమును పరీక్షించుచుండుట విచారము. దృశ్యమునందు రాగము లేకుండుట వైరాగ్యము. దృశ్యమునందు "ఇది దుఃఖమును కలిగించును" అనుభావమును కలిగియుండుట దోషదృష్టి.

ప్రశ్న:- ఇది యంతయు దేనివలన కలుగును? అది దేనివలన పొందఁబడును? దానికి మూలకారణము ఏమి?

సమా:- దేవతానుగ్రహముచేత ఇది యంతయు కలుగును. అది భక్తి చేత లభించును. భక్తికి మూలకారణము సత్సంగము.

ప్రశ్న:- దేవత ఎవరు? భక్తి అనఁగా నేమి? ఎట్టివారు సత్పురుషులు.

సమా:- జగదీశ్వరి దేవత. ఆమెయందే చిత్త మాసక్తమైయుండుటభక్తి. శాంతులు దయాశాలులును అయినవారు సత్పురుషులు.

ప్రశ్న:- లోకమున భీతికలవాఁడెవడు? ఎల్లప్పుడు దుఃఖమును పొందువాఁడెవఁడు? ఎవఁడు ఎప్పుడును దైన్యము నొందుచుండును?

సమా:- మహాధనము కలవాఁడు భీతుఁడు. పెద్దకుటుంబము కలవాఁడు దుఃఖమునుపొందును. ఆశాగ్రస్తుఁడు ఎల్లప్పుడు దీనుఁడు.

ప్రశ్న:- భయములేనివాఁడెవఁడు? దుఃఖములేనివాఁఁడెవఁడు? దైన్యములేనివాఁ డెవఁడు?

సమా:- సంగరహితునకు భయ ముండదు. మనస్సునుజయించినవానికి దుఃఖము కలుగదు. తెలిసికొనవలసినదానిని ఎవఁడు తెలిసికొనియుండునో వానికి దైన్యము ఉండదు.

ప్రశ్న:- గుర్తించుటకు వీలుకానివాఁడెవఁడు? దేహము కలవాఁడయ్యును ఎవఁడు విదేహుఁడు? నిష్క్రియుఁడైనవానికి ఎట్టి క్రియ ఉండును?

సమా:- జీవన్ముక్తుఁడు గుర్తించుటకు వీలుకానివాఁడు. అతఁడే దేహము కలవాఁడుగా కన్పించుచున్నను విదేహుఁడే అగును. ఊరకుండుటయే వాని పని.

ప్రశ్న:- ఏది ఉన్నది? ఏది లేదు? లోకమున అత్యంతము అసంభవమైన దేది?

ఈప్రశ్నలకు సమాధానము చెప్పి మీయన్నను త్వరగా విడిపించుకొనుము.

సమా:- దృక్కు ఉన్నది. దృశ్యము లేదు. వ్యవహారము అసంభవము.

నీప్రశ్నలకు సమాధానము చెప్పితిని. మాయన్నను వెంటనే విడిచిపెట్టుము.

బ్రహ్మరక్షసుఁడు రుక్మాంగదుని విడిచిన వెంటనే బ్రాహ్మణుఁడయ్యెను. తపోమూర్తియై తేజస్సుతో ప్రకాశించుచున్నయతనిని చూచి సందేహముతో రాజకుమారు లిరువురు "ఎవరు నీవు" అని ప్రశ్నించిరి. ఆ బ్రాహ్మణుఁడు తనవృత్తాంతము నిట్లు చెప్పెను. "నేను మగధదేశ మునందు వసుమంతుఁడను పేరుగల బ్రాహ్మణుఁడను. నేను సకల శాస్త్రవిశారదుఁడనై వందలకొలఁది విద్వాంసులను సభలలో జయించుచు గర్వించి యుంటిని. ఒకనాఁడు మగధరాజుయొక్క సభయందు వాదమును కోరుచు అష్టకుఁడు అనుమునిని ఎదుర్కొంటిని. ఆయన పరము అపరము తెలిసినవాఁడు, శాంతుఁడు. శుష్కతర్కమునందు నిపుణుఁడనైన నేను ఆయనను ఆత్మవిద్యావిచారమునందు ఆక్షేపించితిని. ఆయన శాస్త్రసమ్మతముగా సమాధానము చెప్పెను. అయినను నేను తర్కయుక్తులతో ఆయన చెప్పినదానిని ఖండించుచు ఆక్షేపింపఁజొచ్చితిని. నేను బహువిధములు ఆక్షేపించినను ఆయన శాంతుఁడై మాటాడక ఊరకుండెను. ఆ మహాత్ముని శిష్యుఁడు కాశ్యపుఁడు క్రుద్ధుఁడై "ఓరీ! ద్విజాధమా! మా యాచార్యుని అక్రమముగా ఆక్షేపింతువా? ఇందులకు ఫలముగా చిరకాలము బ్రహ్మరాక్షసుఁడవై యుండుము" అని శపించెను. వెంటనే నేను భయముతో వణఁకుచు అష్టకునకు ప్రణమిల్లి శరణు వేడితిని. విరోధినైన నాయందు కూడ ఆయన దయకలవాఁడై, "ఇప్పుడు కొన్ని ప్రశ్నలను నీవు నన్నడిగితివి. వానికి నేను సమాధానములను చెప్పితిని. అయినను నీవు కేవలమైన తర్కముచేత ఆ సమాధానములను ఖండించి ప్రశ్నలను నిలిపితివి. ఈప్రశ్నలనే నీవు అడుగుచుండుము. వీనికి ఒకానొక విద్వాంసుఁడు సరియైన సమాధానములను చెప్పును. అప్పుడు నీకు శాపవిముక్తి అగును" అని చెప్పెను. ఇప్పటికి నీవలన నాకు శాపము నుండి విముక్తి కలిగినది. కావున నిన్ను మహాత్మునిగా తలంచుచున్నాను.

హేమాంగదుఁడు ఆశ్చర్యము నొందుచు, వసుమంతుఁడు ఇంకను అడిగిన ప్రశ్నలకు సమాధానములు చెప్పి ఆయనకు ప్రణమిల్లి ఆశీస్సులను పొంది సోదరునితో సైన్యములతో నగరమునకు తిరిగి వచ్చెను. భార్గవా! నీవు అడిగినదాని కంతకును సమాధానము చెప్పితిని."

ఇది జ్ఞానఖండమున రాక్షసోపాఖ్యాన మన్నది ఇరువదియొకటవయధ్యాయము.

# ఇరువదిరెండవయధ్యాయము -శాస్త్రార్థసఙ్గ్రహము

భార్గవరాముఁడు దత్తాత్రేయుని మరల వినయముతో నిట్లు ప్రశ్నించెను. "శాపముక్తి నొందిన యాబ్రాహ్మణుఁడు హేమాంగదుని మరల దేనినిగూర్చి ప్రశ్నించెను? ఆతఁడు ఏమి సమాధానము చెప్పెను. ఆబ్రాహ్మణుఁడు మహాపండితుఁడు కదా! ఆతఁడు అడిగినది అల్పవిషయమై యుండదు. అందువలన దానిని తెలిసికోవలయునని మిగుల కుతూహలముతో నున్నాను. అది యేమో దయతో చెప్పుము."

దత్తాత్రేయుఁడిట్లు చెప్పెను - "వసుమంతుఁడు హేమాంగదునితో ఇట్లనెను. 'నేను అష్టకునివలన నీవలన కూడ పరమపదమును చక్కఁగా తెలిసికొంటిని. కాని సందేహ మొకటి కలుగుచున్నది. తత్త్వము నెఱింగిన నీవు ఈస్థితియందు ఎట్లున్నావు? తత్త్వము నెఱింగినవాఁడు వ్యవహారపరాయణుఁడు ఎట్లగును? వెలుఁగున్నచోట చీఁకటియుండదు కదా! మఱి జ్ఞాన మున్నచోట వ్యవహారము ఎట్లుండును? రాజపుత్రా! దీనికి సమాధానము ఉన్నది యున్నట్లుగా చెప్పుము.'

ఆబ్రాహ్మణునకు హేమాంగదుఁడు ఇట్లు చెప్పెను. 'అయ్యా! నీకు భ్రాంతి ఇంకను పూర్తిగా పోలేదు. ఆత్మస్వరూపమైన జ్ఞానము వ్యవహారముచేత ఎట్లు భంగపడును? వ్యవహారముచేత జ్ఞానము భంగపడినచో అది స్వప్నములో కలిగిన జ్ఞనమువంటిదే అగును. అట్టి జ్ఞానమువలన ప్రయోజన మేమున్నది? ఎవఁడు ముక్తిని కోరుచున్నాఁడో వానికి స్వరూపము జ్ఞానమే. అది వ్యవహారముచేత నశించినచో మోక్షమును కోరువాఁడే యుండఁడు. ఇంక మోక్ష మను ఫలమును ఎవఁడు పొందును? కావున వ్యవహారముచేత జ్ఞానమునకు బాధలేదు. ప్రతిబింబములకు అద్దమువలె సకలవ్యహారమునకు జ్ఞానము ఆధారము. ప్రతిబింబములవలన అద్దమునకు ఎట్లు భంగము సంభవము కాదో అట్లే వ్యవహారమువలన జ్ఞానమునకు భంగము సంభవము కాదు. దేనియందు ఈజగత్తు అంతయు భాసించుచున్నదో అదియే జ్ఞానము. సంకల్పమువలననే జ్ఞానమునందు సర్వవ్యవహారము ప్రకాశించుచున్నది. వ్యవహారమునుగూర్చి సంకల్ప మేదియు చేయకుండ నిర్మలమైనబుద్ధితో శాస్త్రమునందు చెప్పఁబడిన లక్షణముల ననుసరించి స్వరూపమైన జ్ఞానమును గుర్తించినవాఁడు బంధనిర్ముక్తుఁడై కృతార్థుఁడగును. ఇది నిశ్చయము.'

వసుమంతుఁడు మరల ఇట్లనెను. 'రాజకుమార! ఇది నిజమే. నేను కూడ ఇట్లే నిశ్చయించుకొంటిని. వికల్పములేని జ్ఞానమే స్వరూపమని చెప్పఁబడుచున్నది. కాని ఆ జ్ఞానమునందు వికల్పము కలిగినంతనే భ్రాంతి ఏల కలుగదు? త్రాడునందు పాము తోఁచుట వికల్పమే కదా! అది భ్రాంతియే కదా! కావున జ్ఞానియైనను భ్రాంతి లేకుండ ఎట్లు వ్యవహరించును?'

హేమాంగదుఁ డిట్లు చెప్పెను. 'అయ్యా! భ్రమ యథార్థము అను రెండింటియొక్క స్వరూపము నీకు తెలియలేదు. ఆకాశము యొక్క స్వరూపము తెలిసినవారికి కూడ ఆకాశము నీలముగనే భాసించును. "నల్లనియాకాశము" అని వారు అప్పుడప్పుడు చెప్పుటయు కలదు. అంతమాత్రముచేత వారిజ్ఞానము భ్రాంతి అని చెప్పఁబడుట లేదు ఆకాశముయొక్క స్వరూపము నెఱుంగనివాఁడు "ఆకాశము నల్లనిది" అని చెప్పినచో వానిజ్ఞానమును భ్రాంతి యని చెప్పుదురు. ఆకాశముయొక్క స్వరూపము తెలిసినవానికి ఆకాశము నల్లగా కన్పించుచున్నను అది యథార్థము కాదని రూఢిగ తెలియును. అందువల వానిదృష్టిలో ఆకాశముయొక్క నల్లఁదనము మరణించినమహాసర్పము వలె

నిష్క్రియము. జ్ఞానమునకు "ఇది యథార్థము" అను ప్రమాణ బుద్ధియే జీవము. అది లేనప్పుడు ఆ జ్ఞానము నిర్జీవ మగును. పండితులకు "ఆకాశము నల్లగా నున్నది" అను జ్ఞానమునందు ప్రామాణ్య బుద్ధి యుండదు. అందువలన ఆ జ్ఞానము నిర్జీవమై నిష్ప్రయోజకమగును. అది భ్రాంతి కాదు. కాని ఆకాశముయొక్క స్వరూపము తెలియనివాని కది భ్రాంతియే యగును. ఎండమావులలో నీరున్నట్లు తోఁచుట తెలిసినవానికి తెలియనివానికి సమానముగానే యుండును. అది నీరు కాదని తెలిసివాఁడు భ్రాంతి నొందఁడు; దానికై పరువెత్తఁడు. తెలియనివానికి అది భ్రాంతియే యగుటచే ఆనీటికై పరువెత్తును. ఎండమావులలో నీరువలె జగత్తు ఉన్నట్లు కన్పించుచున్నదే కాని నిజముగా లేదు; యథార్థముగ ఉన్నది జ్ఞానమే అని రూఢిగ తెలిసికొన్నజ్ఞానికి వ్యవహారమంతయు జ్ఞానరూపమే అగును. ఆజగత్తు వలన తనకు సుఖదుఃఖములు కలుగుచున్నట్లు జ్ఞాని ఎప్పుడును తలంపఁడు. అజ్ఞాని దృష్టిలో జగత్తు యథార్థమే కావున అతఁడు జగత్తు వలన తనకు సుఖదుఃఖములు కలుగుచున్నట్లు తలంచుచు భ్రాంతితో వ్యవహరించుచుండను. ఇరువురకును వ్యవహారము సమానముగనే కన్పించుచున్నను జ్ఞానికి అది జ్ఞానమే అగుచుండఁగా అజ్ఞానికి భ్రాంతి యగుచున్నది.

త్రాడును చూచి పామని యనుకొని భయపడుచున్నవానికి "ఇది పాము కాదు; త్రాడే" అని తెలిసినతరువాత పాము కన్పింపదు; త్రాడే కన్పించుచుండును. అట్లే ఆత్మజ్ఞానము కలవానికి ఆత్మయే కన్పింప వలెఁగాని జగత్తు ఎట్లు కన్పించుచున్నది? తిమిరమను కంటిజబ్బు కలవానికి ప్రతివస్తువు రెండుగా కన్పించుచుండును. ఆకాశమునందు వానికి ఇద్దఱు చంద్రులు కన్పించుచుందురు. తెలిసినవాఁడు "ఇద్దఱు చంద్రులు లేరు? ఒక్కఁడే చంద్రుఁడున్నాఁడు" అని చెప్పినప్పుడు వానికి ఆ భ్రాంతి తొలఁగిపోయి చంద్రుఁడొక్కడే అని వాఁడు గ్రహించును. వానికి భ్రాంతి తొలఁగిపోయినను వాఁడు చంద్రునివైపు చూచునపుడు మరల ఇద్దఱు చంద్రులు కన్పించుచునే యుందురు. అజ్ఞానముచేత కలిగిన భ్రాంతి జ్ఞానముచేత పోయినను, కంటిజబ్బు వలన కలుగుచున్న దోషము "ఒకవస్తువు రెండుగా కన్పించుట"యను నది తొలఁగదు. దానికి కారణమైన జబ్బు పోయినప్పుడే అది పోవును. అట్లే జ్ఞానులకు కూడ ఆత్మజ్ఞానమువలన "జగత్తు సత్యము" అను భ్రాంతి తొలఁగిపోయినను ప్రారబ్దకర్మయొక్క దోషమువలన జగత్తు భాసించుచునే యుండును. అందువలన వారికి ప్రారబ్ధకర్మ నశించు వఱకు వ్యవహారము జరుగుచునే యుండును. అది ముగిసినంతనే జ్ఞానికి ఆత్మ తప్ప జగత్తు భాసింపదు. కాఁబట్టి జ్ఞానులకు ఎప్పుడును భ్రాంతి యన్నది యుండనే యుండదు'

వసుమంతుఁడు మరల ఇట్లనెను. 'రాజకుమారా! జ్ఞానులకు కర్మ ఎట్లు మిగిలియుండును? జ్ఞానాగ్నిచేత కర్మ అనుదూతి దగ్ధము కాక ఇంకను మిగిలియుండునా?'

హేమాగందుఁడిట్లు చెప్పెను. 'అయ్యా! వినుము, అందఱకు ఉన్నట్లే జ్ఞానులకు కూడ అపక్వము పక్వము హతోదితము అని కర్మమూఁడువిధములుగా నుండును. వీనినే సంచితము ప్రారబ్ధము ఆగామి అని చెప్పుదురు. వీనిలో ప్రారబ్ధము తప్ప తక్కిన రెండును జ్ఞానము చేత నశించును. "ఈకర్మ ఇంతకాలమునకు పరిపాకము నొందవలె" అను భగవంతునియొక్క నియతి (Law) ననుసరించి కాలము కర్మలకు పరిపాకమును కలిగించుచుండును. కాలముచేత పరిపాకదశకు తీసికొనిరాఁబడిన కర్మ పక్వ మని చెప్పఁబడుచున్నది. పరిపాకస్థితికి రానిది అపక్వ మని చెప్పఁబడుచున్నది. జ్ఞానము కలిగినతరువాత చేయఁబడుచున్న కర్మ హతోదితము. జ్ఞానమువలన ఆకర్మకు ఫలము నొసంగునట్టి శక్తి హత మగును. అట్లు మొలకెత్త లేనిగింజవలె పైకి వచ్చుచున్న యాకర్మను హతోదితము అని చెప్పుచున్నారు. పక్వమైఫలము నిచ్చుటకు ప్రారంభమైన కర్మ, ధనుస్సునుండి వెలువడిన బాణమువలె, దానివేగము ఎంతవఱకు ఉండునో అంతవఱకును అది ఫలమును ఇచ్చుచునే యుండును. అది జ్ఞానముచేత నశింపదు. దాని వలననే జ్ఞానికి జగత్తు భాసించుచుండును. కాని జ్ఞానస్థితియందలి భేదములనుబట్టి ఫలమునందు భేదములు కలుగుచున్నవి. మందజ్ఞానులకు జగత్తు భాసించుచున్నప్పుడు సుఖదుఃఖములు స్ఫుటముగనే కలుగుచుండును. మధ్యజ్ఞానులకు అవి స్ఫుటముగా నుండవు. ఉత్తమజ్ఞానులకు సుఖములు దుఃఖములు స్ఫుటముగా కలుగుచున్నట్లు లోకులకు తోఁచుచున్నను, వారికి స్వదృష్టిలో అవి కుందేటికొమ్ములవలె మిథ్యగానే తోఁచుచుండును. అందువలన అది ఫలముగా చెప్పఁబడుటలేదు.

అజ్ఞానులయందు కర్మఫలము పుష్టి నొందచుండును. సుఖము కలుగుటకు పూర్వము "నాకు ఇట్టిసుఖము రాఁగలదు" అని. దానిని అనుభవించినతరువాత "ఇట్టి సుఖము కలిగినది" అని అజ్ఞానులు చాల కాలము గాఢముగ భావించుచుందురు. ఆ భావన సంస్కారరూపముగ మనస్సునందు నిలచి కర్మఫలమునకు పుష్టిని కలిగించుచు

రాగద్వేషదులను పుట్టించుచుండును. మందజ్ఞానులకు సుఖదుఃఖములు కలుగుచున్నను ఆఫలములకు సంబంధించిన భావన ఆత్మానుసంధానమువలన కొనసాగదు. అందువల అజ్ఞానులకువలె మందజ్ఞానులకు ప్రారబ్ధకర్మఫలము పుష్టి నొందదు.

కలఁతనిద్రలో దోమలు మొదలగువానివలన కలుగుబాధ ఎట్లు సూక్ష్మముగా నుండునో అట్లే మధ్యాజ్ఞానులయొక్క కర్మఫలానుభవము కూడ సూక్ష్మముగానే యుండును.

ఉత్తమజ్ఞానులకు ఆత్మానునంధానము ఎల్లప్పుడును ఉండును. ఆ యనుసంధానముయొక్క బలమువలన వారికి కర్మఫలము ఎప్పుడో జరిగిపోయినదానివలె తోఁచుచుండునే కాని అప్పుడు జరుగుచున్నదాని వలె సుఖదుఃఖములను కలిగింపదు. కాలిపోయినత్రాడు ఎట్లు బంధింపఁజాలదో అట్లే కర్మఫలము ఉత్తమజ్ఞానికి బంధమును కలిగింపఁజాలదు. స్త్రీవేషమును ధరించి నటించుచున్న పురుషుఁడు నాటకము నందు భర్తృవియోగము సంభవించినప్పుడు దుఃఖమును, పుత్రప్రాప్తి యందు సంతోషమును, ఎంతగా ప్రదర్శించినను, వానికి యథార్థముగా ఎట్లు దుఃఖము గాని సుఖము గాని కలుగదో, అట్లే ఉత్తమజ్ఞానియు రాజ్యప్రాప్తి, పుత్రవియోగము మొదలగు సంఘటనములలో సంతోషమును దుఃఖమును ప్రకటించుచున్నను వానికి యథార్థముగా సంతోషము గాని దుఃఖము గాని కలుగదు. అతఁడు సకలసంఘటనములను అద్దమునందువలె ఆత్మయందు తోఁచుచున్న ప్రతిబింబములనుగా చూచుచుండును. అందువలన అతఁడు సంతోషించుచున్నట్లు దుఃఖపడుచున్నట్లు ఇతరులకు కన్పించుచున్నను అంతరంగమున ఎట్టి వికారమును పొందఁడు. అందువలన అతనికి ప్రారబ్ధకర్మఫలము కుందేటి కొమ్ముతో సమానము.

అజ్ఞానులకు ఆత్మస్వరూపమే తెలియదు. కావున వారు దేహాభిమానముతో జగత్తును సత్యముగా తలంచుచు సుఖదుఃఖములను పూర్ణముగా అనుభవింతురు. మందజ్ఞానులకు ఆత్మ శుద్ధచిన్మయ మని జగత్తు అసత్య మని దృఢముగా తెలియును. అయినన ఆత్మానుసంధానముయొక్క అభ్యాసము అల్పమగుటవలన పూర్వవాసలయొక్క ప్రాబల్యముచేత అప్పుడప్పుడు దేహాభిమానము జగత్తు సత్య మను భ్రాంతియు కలుగుచుండును. మరల వెంటనే వారు జ్ఞానాభ్యాసము యొక్క సంస్కారమువలన దేహాభిమానమును జగత్తు సత్య మను భ్రాంతిని తొలఁగించుకొందరు. ఇవి ఒకదానితరువాత ఒకటిగా సంభవించుచున్నను రెండును సమానములు కావు. ఆత్మజ్ఞానవాసన భ్రాంతి వాసనను బాధించును. భ్రాంతి జ్ఞానమును భాదింపఁజాలదు. అందువలన అప్పడప్పుడు భ్రాంతి కలుగుచున్నను మందజ్ఞాని మరల యథాపూర్వముగ సంసారమునఁబడఁడు. అతఁడు క్రమముగా భ్రాంతి వాసనను తొలఁగించుకొనుచు ఆత్మజ్ఞానమునందే నిలుచును.

మధ్యమజ్ఞానికి ఆత్మజ్ఞానము ఎప్పుడును విస్మృతము కాదు. అతఁడు బుద్ధిపూర్వముగా కోరితెచ్చుకొనినట్లుగా అప్పుడప్పుడు అతనికి మిధ్యాజ్ఞానము కలిగి వ్యవహారము జరుగుచుండును. ఇది జ్ఞానయోగ సిద్ధుని లక్షణము. ఇంక సాధకునిలక్షణము వినుము. సాధకుఁడు ఎంతగా సమాధిని అభ్యసించుచుండునో అంతగా వానికి ఆత్మజ్ఞానము దృఢముగ భాసించుచుండును. సమాధియొక్క అభ్యాసము పూర్ణమైనంతనే ఇంతఁడును సిద్ధుఁడై మిధ్యాజ్ఞానమును వ్యవహారముకొఱకు ఇష్టమైనప్పుడు తెచ్చుకొనుచుండును.

ఇంక ఉత్తమజ్ఞానియందు సమాధికి వ్యవహారమునకును కొంచెము కూడ భేదము లేదు. ఎందువల్ల ననఁగా వానికి ఎప్పుడును ఆత్మ విస్మృతి యుండదు. అట్లయినచో మధ్యమునకు ఉత్తమునకు భేద మేమి? మధ్యమజ్ఞానులలో సిద్ధుఁడు మిత్యాజ్ఞానముతో వ్యవహరించునపుడు వాని యాత్మజ్ఞానము ఎండకు వాడిపోయిన పుష్పమువలె నుండును. ఉత్తమునకు వ్యవహారదశయందు కూడ ఆత్మజ్ఞానము కసుగందని పుష్పమువలెనే యుండును. అయ్యా! వాస్తవముగా వీరి కిరువురకును స్వదృష్టియందు ప్రారబ్ధమే లేదు. ఎందువల్ల ననఁగా వీరు ఇద్దఱును పూర్ణత్వమును పొందివారగుటచే వీరికి ఆత్మకు అన్యముగా ఏదియు భాసింపదు. ఐంద్రజాలికుఁడు చేయునింద్రజాలమువలె వీరిరువురియొక్క వ్యవహారము ఇతరులకు మాత్రము యుధార్థముగా తోఁచుచుండును. వారిదృష్టిలో అది అంతయు మిధ్యయే. నీకు సారభూతమైన రహస్యమును చెప్పెదను. వినుము. పరమశివునకు ఏజ్ఞానదృష్టికలదో అదియే జ్ఞానులకును దృష్టి. శివుని దృష్టికి జ్ఞానిదృష్టికి భేదము లేదు. ఇందు సందేహము లేదు. అందువలన మధ్య మోత్త మజ్ఞాలనుకు ప్రారబ్ధకర్మములేదు.'

ఇట్లు హేమాంగదుఁడు వివరింపఁగా వసుమంతుఁడు సందేహములను వీడి ఆత్మజ్ఞానమును విశదముగా గ్రహించి రాజపుత్రులచే పూజితుఁడై తననివాసమునకు పోయెను. రాజపుత్రులు కూడ తమ నగరమునకు చేరిరి."

దత్తాత్రేయుఁడు ఇట్లు చెప్పఁగా విని పరశురాముఁడు మరల ఆయనను ఇట్లు ప్రార్థించెను. "భగవానుఁడా! నీవలన ఆత్మజ్ఞానమును గూర్చి వింటిని. సందేహము లన్నియు నశించినవి. ఆత్మస్వరూపము తెలిసినది. ఎల్లయెడల సర్వాంతర్యామియై జ్ఞానమాత్రముగ ఆత్మయే భాసించుచున్నది. అయినను నీవు మొదటినుండి చెప్పిన విషయమున కంతకును సారమైనదానిని నేను ఎల్లప్పుడును జ్ఞప్తియందుంచుకొనుటకు వీలుగా సంక్షేపముగా చెప్పుము."

దయాశాలియైన దత్తాత్రేయుఁడు ఇట్లు చెప్పెను. "ఈవిజ్ఞానమున కంతకును పరమసారమును మరలచెప్పుచున్నాను. వినుము. చిదాత్మికయైన పరమేశ్వరియొక్క స్వాతంత్ర్యమునకు మాయ యనిపేరు. దానికి దుర్ఘటములను సుసంఘటితములుగా అసంభవములను సంభవములనుగా చేయుసామర్ధ్యము కలదు. ఆ సామార్ధ్యముచేతనే అది అద్దమునందు బ్రతిబింబమువలె, చిదాత్మయందు జగత్తును భాసింపఁజేయుచున్నది. ఆ క్రమమును వినుము. స్ఫురణము చైతన్యమునకు లక్షణము. 'నేను' అను స్ఫురణము లేక భావము అహంత. 'అంతయు నేనే' అనుస్ఫురణము పూర్ణాహంత. చిదాత్మయొక్క స్వరూపము పూర్ణాహంత. చిదాత్మ సృష్టిచేయవలయు నని తలంచినప్పుడు పూర్ణాహంతయందు రెండుభాగము లేర్పడును. అందు ఒకభాగమునకు పరిమితమై 'నేను' అనుస్ఫురణము ఉండును. రెండవభాగమునందు 'నేను' అనుస్ఫురణము వ్యాపింపదు. అందువలన మొదటిభాగము అపూర్ణమైన యహంతయగును. ఈ అపూర్ణమైన యహంతకు రెండవ భాగము బాహ్యముగా గోచరించును. ఇదియే అవ్యక్తము. అపూర్ణా హంతయే సదాశివుఁడు. తనకన్న భిన్నముగ అవ్యక్తమును చూచుచున్నను, 'నేను ఇది' అని ఎప్పుడును భావించుచునే యుండును. దేహమును మనకన్న భిన్నముగ చూచుచుండియు, 'నేను ఇది' అని ఎట్లు అభిమానించుచున్నామో అట్లే సదాశివుఁడు అవ్యక్తమును 'నేను ఇది' అభిమానించుచుండు నన్నమాట. ఆ అవ్యక్తమునే తనదేహమునుగా 'ఇది నేను' సదాశివుఁడు అభిమానించునప్పుడు ఈశ్వరుఁడగును. 'నేను ఇది' భావించునప్పుడు సదాశివునియందు చైతన్యమునకు ప్రాధాన్యము ఉండఁగా, 'ఇది నేను' అని అవ్యక్తమును అభిమానించునప్పుడు ఈశ్వరునియందు మాయకు ప్రాధాన్యము ఏర్పడుచున్నది. ఈశ్వరుఁడు తనస్వాతంత్ర్యముయొక్క మహిమవలన అవ్యక్తమునందు తమస్సు రజస్సు సత్త్వము అనుగుణములను భాసింపఁజేసి ఆగుణములయందలి యభిమానముతో రుద్రబ్రహ్మవిష్ణువులుగా భాసించెను. వారితోపాటు దృశ్యములైన అనేకబ్రహ్మాండములు, వానిని చూచుచున్న జీవులును భాసించిరి. ఈబ్రహ్మాండములయం దుత్పత్తికి స్థితికి సంహారమునకు కారణభూతులైన బ్రహ్మలు విష్ణువులు రుద్రులు ఎందఱో ఏర్పడిరి.

భార్గవా! జగత్తుయొక్క విధానము ఇది. ఇది అంతయు అద్దమునందు ప్రతిబింబమువలెనే భాసించుచున్నది. ఇది ఇట్లు కేవలము భాసించుచున్నదే కాని ఇందు ఏదియు పుట్టుట లేదు. ఈ జగత్తు అంతయు ఎంతగా భాసించుచున్నను దీనికి అద్దమువలె ఆధారముగానున్న చిదాత్మ ఎప్పుడును మార్పునొందక పూర్ణాహంతాస్వరూపముతోనే యున్నది. చిదాత్మయందు ఎంతగా అనేకత్వము భాసించుచున్నను అది ఎప్పుడు పూర్ణముగా ఆఖండముగానే యుండును. నీవు నీ దేహమునందు అంతటను 'నేను' అను భావముతో వ్యాపించియుండియు ప్రత్యేకముగా కన్ను చెవి మొదలగువానిని అవలంభించి చూచుట వినుట మొదలగుపనులను ఎట్లు నిర్వహించుచున్నావో అట్లే చిదాత్మికయగు పరమేశ్వరియు పూర్ణాహంతారూపమున నుండియు సదాశివుఁడు మొదలుగా క్రిమికీటకాదులవఱకును సకలజీవులయందును అపూర్ణాహంతారూపమైన జీవభావముతో వ్యవహరించుచున్నది. వాస్తవముగా అన్నింటియందును భాసించుచున్నచైతన్యము ఆమెయే. 'దేహము నేను' అను భావముతో ఉన్ననీవు స్వయముగా వస్తువులరూపమును రుచిని గ్రహింపలేవు. నీవు చక్షుస్సు మొదలగు నింద్రియములతో తాదాత్మ్యమును పొందినప్పుడే ఆ యింద్రియములద్వారమున రూపము రుచి మొదలుగా సకలవిషయములను గ్రహించుచున్నావు. అట్లే సదా శివుఁడు కూడ సర్వాంతర్యామియై యుండి బ్రహ్మనుండి క్రిమికీటకాదులవఱకును సకలజీవులతో తాదాత్మ్యమును పొంది ఆయాజీవులద్వారమున జగద్వ్యవహారమును నిర్వహించుచున్నాఁడు. అద్దము తనయందు ప్రతిఫలించుచున్న యేప్రతిబింబముయొక్క విశేషమును గ్రహింపదు. అది ఎప్పుడును శుద్ధముగ నిర్వికల్పముగానే యుండును. అట్లే శుద్ధము నిర్వికల్పము అయిన నీస్వరూపము కూడ దేనిని చూచుట లేదు, దేనిని వినుట లేదు, దేనిని గ్రహించుట

లేదు, నిద్రయందు ఇది అనుభవసిద్ధమే. అట్లే ఆ పరమచైతన్యము సకల జగత్తునకు ఆధారముగా నుండినప్పటికిని పదార్థముల భేదములను కొంచెము కూడ గ్రహింపదు; ఏకార్యమును చేయదు. పరమచైతన్యరూపిణియైన పరమేశ్వరియొక్క స్వాతంత్ర్యవైభవమువలననే ఈజగత్తు అంతయు, అద్దమునందువలె, ఆమెయందు ప్రతిబింబించుచున్నది. అద్దము యొక్క ప్రకాశమే ప్రతిబింబములకు ప్రకాశమైనట్లు, జగత్తు యొక్క ప్రకాశ మంతయు ఆమె ప్రకాశమే.

ఈజగత్తునందు నీవు నేను ఇతరులు దృశ్యములను చూచుచు ద్రష్టలముగా (Seers) ఉన్నాము. ద్రష్టలుగా ఉన్నవీరందఱును దృశ్యములతో సంబంధములేక వానిని గ్రహింపకుండ దృక్కు మాత్రముగా ఉన్నప్పుడు అంతఱయొక్క స్వరూపము శుద్ధచైతన్యమే యుగుచున్నది. నిద్రయొక్క దృష్టాంతము ననుసరించి దీనిని గ్రహింపవచ్చును. నిద్ర యందు ఏద్రష్టయు ఏదృశ్యమును గ్రహించుట లేదు. అందువలన అప్పు డీ ద్రష్ట లందఱును సమానమైనస్థితినే పొందుచున్నారు. నిద్రలో రాజ్యము కన్పింపదు కనుక రాజు, 'నేను రాజును' అని అనుకొనుట లేదు. అట్లే పేదఱికము తోఁచదు కనుక పేదవాఁడు 'నేను పేదవాఁడను' అని అనుకొనుట లేదు. శరీరములు కన్పింపవు కనుక ఎవరును 'నేను పురుషుఁడను, నేను స్త్రీని, నేను కుంటివాఁడను, నేను గ్రుడ్డివాఁడను' అని అనుకొనుట లేదు. ఇట్లే జాగ్రద్దశలో కూడ స్వరూపానుసంధానముయొక్క బలముచేత దృశ్యములతో సంబంధము లేకుండ ఉన్నప్పుడు ద్రష్టల కందఱకును శుద్ధచైతన్యమే స్వరూపమగును. ప్రతిబింబములు లేకున్నచో అద్దము ఎట్లు శుద్ధముగ ప్రకాశించునో అట్లే దృశ్యములతో సంబంధములేని చైతన్యము కూడ శుద్ధముగ ప్రకాశించుచుండును. ఆ శుద్ధ చైతన్యము మహానందఘనము. (Solid mass of absolute bliss) సకలజీవులు విషయభోగములచే ఏయే ఆనందములను పొందుచున్నారో ఆయా యానందముల కన్నింటికిని అది నిలయము. అందువలననే దానిని అందఱు కోరుచున్నారు.

ఆత్మస్వరూపమే సుఖము. కావుననే ప్రతివ్యక్తియు దేహమును కూడ స్వరూపసుఖమును కోరియే సాధనముగా వినియోగించుచున్నాఁడు. దేహమును కష్టపెట్టి స్వర్గాదులను కోరుచున్నా రన్నచో దేహము కూడ స్వరూపమైన సుఖమునకు లేక ఆనందమునకు సాధనమగుచున్న దనుట స్పష్టము. విషయసుఖములవలన కలుగునానాందము లన్నియు స్వరూపానందమునందు అల్పములైన యంశములు. నిద్రావిషయముననే ఇది స్పష్టముగ తెలియుచున్నది. ఎవఁడు ఏవిషయమువలన ఎంత సుఖపడుచున్నను కొంత సేపైన తరువాత దానిని వదలి నిద్రను పొందుచునేయున్నాఁడు. అన్నము పానము స్త్రీభోగము మొదలుగా ఏవిషయము నిద్రలోలేదు. అయినను అప్పుడు నిర్విషయముగానే సుఖము కలుగుచున్నది. అది యథార్థముగా స్వరూపమువలనిసుఖమే. కాని అప్పుడు స్వరూపము తమస్సుచేత ఆవరింపఁబడుచున్నది. అట్టి నిద్రచేతనే అంత సుఖము కలుగుచుండఁగా ఆవరణరహితమై శుద్ధ చైతన్యరూపమున ప్రకాశించు స్వరూపమువలన ఎంతయానందము కలుగునో యూహింపుము. ఆ స్వరూపానందమే లోకమున పెద్ద బరువును తలమీఁదనుండి దించినప్పుడు, అన్నపానాదిభోగ్యవిషయములవలన, నిద్రవలన, కొంచెము కొంచెముగా లభించుచున్నది, మూఢులు ఆత్మసుఖమునే వివిధములైన విషయములవలన కలుగుచున్నట్లుగా తలంచుచున్నారు. హృదయములందు మానవులకు అనంతములైనవాసన లున్నవి. వానిలో ఒకటి పైకి వచ్చి దానికి సంబంధించిన కోరిక తీవ్రముగా ఉన్నప్పుడు తక్కినవాసన లన్నియు వెనుకఁబడియుండును, కోరిక తీవ్రమగు కొలఁది దుఃఖము ప్రబలుచుండును. కోరినవిషయము లభించినంతనే తలమీఁదనుండి పెద్దబరువు దింపినట్లుగా స్వరూపసుఖమే కొద్దిగా భాసించుచున్నది. మఱియొకవాసన పైకివచ్చి దానివలన కోరిక ప్రబలమైనంతనే ఈసుఖము మరల మఱుఁగునఁబడుచున్నది. కోరిన విషయము లభించినతనే, కోరిక వలన కలుగుచున్న తాపము పోయి, మరల స్వరూపసుఖమే లేశమా త్రముగ భాసించుచున్నది. కావున ఎల్లరకును సకల విషయములవలనను స్వరూపమే సుఖముగా తోఁచుచున్నది.

అద్దమునుగూర్చి తెలియుంతవఱకు పామరులకు ప్రతిబింబములు ప్రత్యేకవస్తువులుగా ప్రకాశించుచున్నట్లు తోఁచుచుండును. కాని అద్దమునుగూర్చి తెలిసికొన్నతరువాత వారుకూడ ఆ ప్రతిబింబముల యొక్క ప్రకాశమంతయు అద్దమునకు సంబంధించినదే అని గ్రహింతురు. అట్లే తత్త్వము నెఱింగినవాఁడు జగత్తునందు తోఁచుచున్న చైతన్యము ఆనందము అంతయు తనస్వరూపము మాత్రమే అని గ్రహించును. మట్టియందు కుండలు మొదలగునవి, బంగారమునందు ఆభరణములు, ఱాతియందు ప్రతిమలు ఎట్లున్నవో అట్లే చిదాత్మయందు జగత్తు ఉన్నది. జగత్తు అసలే లేదనుట అపూర్ణమైనజ్ఞానమే. అద్దముయొక్క ప్రకాశముతప్ప ప్రతిబింబములకు వేఱుగా ప్రకాశము లేదు అని

తెలిసినతరువాత కూడ ప్రతిబింబములు కన్పించుచునేయున్నవి. అవి మాయమగుట లేదు. అట్లే చిదాత్మకన్న భిన్నముగా జగత్తు లేదు అని స్పష్టముగా తెలిసినతరువాత కూడ జగత్తు భాసించుచునేయున్నది. అది మాయమగుట లేదు. వ్యవహారమున గోచరమగుచున్న జగత్తును. 'ఇది లేదు' అని శపించినంత మాత్రమున అది నశింపదు. కావున జగత్తు చిదాత్మయందు ప్రతిబింబమువలె ఉన్నదనుట సత్యము. దృశ్యము దృక్కు అను రెండింటియందు, 'దృక్కే ఉన్నది. దృశ్యము లేదు' అని తలంచునప్పుడు దృశ్యము లేకుండుట అను సంకోచము ఏర్పడుచున్నది. అట్లు కాక 'దృశ్యము దృక్స్వరూపముగా ఉన్నది' అని తలంచునప్పుడు సంకోచమునకు అవకాశము లేదు. కావున ఇట్లు గ్రహించుట పూర్ణవిజ్ఞానము.

దృక్కే తనమహిమయొక్క అతిశయమువలన దృశ్యత్వమును పొందియున్నది. ఇదియే సకలశాస్త్రార్థమునకు సారము. కావున బంధము లేదు. మోక్షము లేదు. సాధకుఁడు లేఁడు. సాధనము లేదు. అఖండము అద్వయము చిచ్ఛక్తియునైన త్రిపురాదేవి ఒక్కతయే భాసించుచున్నది. ఆమెయో అవిద్య, విద్య, బంధము, మోక్షసాధనము కూడ ఆమెయే. తెలిసికోవలసిన దిదియే. ఇంతకు మించి ఏదియును లేదు. భార్గవా! నీకు ఈ విజ్ఞానక్రమ మంతయు మొదటినుండియు చెప్పితిని. దీనిని చక్కఁగా తెలిసికొన్నవాఁడు ఎచ్చటను దుఃఖమును పొందఁడు."

ఇట్లు భార్గవరామదత్తాత్రేయులసంవాదమును చెప్పి హారితాయనుఁడు నారదునితో ఇట్లనెను. "మహర్షివర్యా! హేతువులతో అను భవముతో వివరింపఁబడిన యీజ్ఞానఖండమును విన్నచో ఎవనికైనను అజ్ఞానమువల కలుగుచున్నభ్రాంతి ఎట్లు నశింపకుండును? దీనిని విన్నతరువాత కూడ ఎవనికైనను భ్రాంతి తొలఁగకున్నచో వాఁడు బండ వంటివాఁడనియే చెప్పవలె, అట్టివానికి ఇంక ఏవిధముగ జ్ఞానము కలుగును? ఒక్కసారి విన్నంతమాత్రముననే ఈజ్ఞానఖండము వలన జ్ఞానము దృఢముగా ఏర్పడును. మందబుద్ధి కలవానికి రెండవ సారికి కాని మూఁడవసారికి కాని పాపము నశించి విజ్ఞానము తప్పక కలుగును.

ఈగ్రంథమును లఖించినచో రాగద్వేషాదిరూపమైన దృష్టిదోషము నశించును. దీనిని పూజించినచో చిత్తశుద్ధి కలుగును. దీనిని ఎల్లప్పుడు పరిశీలించుచున్నచో కర్మవాసన లన్నియు నశించును. స్థావరజంగమాత్మకమైన సర్వమునకు ఏది స్వరూపమై యున్నదో దేనిని చక్కఁగా విచారించి స్పష్టముగా గ్రహించినచో ముక్తి గలుగునో లేకున్నచో బంధమే కలుగునో, ఆ చిచ్ఛక్తియే త్రిపురాదేవి. ఆమెయే "హ్రీమ్."

ఇది ఇతిహాసములలో ఉత్తమమైన త్రిపురారహస్యమునందు పండ్రెండుపేల శ్లోకములుగల గ్రంథమునందు జ్ఞానఖండమున శాస్త్రా సంగ్రహము అన్నది ఇరువది రెండవయధ్యాయము.

జ్ఞానఖండసారము సంపూర్ణము.

బాలప్రియ

శుష్కతర్కమునందలియభిమానమువలన ఎంత అనర్థము సంభవించునో వసుమంతునివృత్తాంతమున స్పష్ట మగుచున్నది. వసుమంతుఁడు అష్టకుని ఆక్షేపించినప్పుడు ఆయన జ్ఞాని యగుటచే శుష్కతార్కికునితో ప్రసంగించుట వ్యర్థ మని సాంతుఁడై యూరకుండెను. కాని శిష్యుఁడగు కాశ్యపుఁడు క్రుద్ధుఁడై వసుమంతుని శపించెను. అతఁడు శపింపఁగలిగె నన్నచో తపశ్శక్తిసంపన్నుఁడే అని గ్రహింపవలసియున్నది. అట్టితపస్వి ఏల కోపించెను? అట్లు కోపించుట అయుక్త మని ఎవరును అనలేదు. తంగణుఁడు కుమారుని మందలించినట్లు అష్టకుఁడు శిష్యుని మందలింప లేదు. ఎందువలన? గురువునకు అవమాసము జరుగుచుండఁగా చూచి సహించియుండుట సమర్థుఁడైన శిష్యునకు తగదు. వసుమంతుని తర్కమున జయించుట అసాధ్యమని నిశ్చితమైనది. అట్టియెడల వాదమును విరమించి మౌనమును వహించియున్న జ్ఞానిని, తమయాచార్యుని, ఆక్రమముగా ఆక్షేపించుచున్న వసుమంతుని నిలుపుటకు శపించుట తప్ప వేఱుమార్గము లేదు. సమర్థుఁడై యుండియు గురువు అవమానింపఁబడుచుండఁగా చూచుచు సూరకుండుట శిష్యునకు అధర్మము. అధర్మము పాపమును కలిగించును. అందువలన అధర్మమునకు వెఱచి కాశ్యపుఁడు గురునిందను నిరోదించుటకై వసుమంతుని శపించెను. ఆకారణముచేత ఎవరును కాశ్యపుని ఆక్షేపింపలేదు.

వసుమంతుఁడు తన్ను శపించిన కాశ్యపుని ప్రార్థింపక అష్టకుని ప్రార్థించుట గమనింపఁదగియున్నది. గురువుయొక్క సమక్షమున శిష్యుని ప్రార్థించుట అసంగతము. తప్పైనను ఒప్పైనను శిష్యుని చర్యను చక్కఁపెట్టవలసినవాఁడు గురువు. అందువలన ఆయననే ప్రార్థించుట మర్యాద. అట్లు కాక కాశ్యపునే ప్రార్థించినను అతఁడు, "అయ్యా! నేను నాకొఱకు నిన్ను శపింపలేదు. మాగురువులకు నీవు కష్టము ఁలిగించుటచే నిన్ను శపించితిని, వారే అనుగ్రహింపవలె. నాదేమియును లేదు" అనియే చెప్పును. మఱియును కొందఱకు, పరీక్షిత్తువిషయమున శృంగికివలె, శపించుశక్తి యుండునే కాని దానిని మరలింపఁగలశక్తి యుండదు. అందువలన వసుమంతుఁడు అష్టకునే ప్రార్థించెను.

చెట్టుపై బ్రహ్మరాక్షసుఁడున్నాఁడని. అతఁడు పండితులను శాస్త్రమున ఓడించి భక్షించుచున్నాఁడని విన్నప్పుడు శాస్త్రవాదము చేయవలయు నని రుక్మాంగదుఁదు కుతూహలము నొందెను. హేమాంగదుఁడు కుతూహలపడక ఊరకయే యుండెను. అన్నగారు బయలు దేరినప్పుడు హేమాంగదుఁడు అతనిని అనుసరించెనే కాని వారింపలేదు. మఱి అది చాల సాహసకృత్యము. ఓడినచో అన్నగారు రాక్షసునిచే భక్షింపఁబడును, అయినను హేమాంగదుఁడు అన్నను వారించుటకు ప్రయత్నము కూడ చేయలేదు. ఎందువలన? బ్రహ్మరాక్షసునిచేత పండితులు భక్షింపఁడుచున్నా రని విన్నతరువాత క్షత్రియులుగా ఆ బ్రహహ్మరాక్షసుని ఎదుర్కొనవలసిన ధర్మము రాజకుమారులయందున్నది. అయినను ఆ బ్రహ్మరాక్షసునితో యుద్ధముచేయుటకు వీలు లేదు. ఆతఁడు శాస్త్రవాదమును నిమిత్తముగా చేసికొని పండితులను భక్షించుచున్నాఁడు. కావున వానిని శాస్త్రవాదముననే జయింపవలె. ఈ కారణముచేత హేమాంగదుఁడు అన్నను వారింపలేదు.

వసుమంతుఁడు హేమాంగదునితో శాస్త్రవాదమునకు పూనుకొనక గూఢములైన తత్త్వప్రశ్నలను అడిగెను. శాస్త్రవాదమున అతఁడు అమితకౌశలము కలవాఁడు; అష్టకుని జయించినవాఁడు. ఇప్పుడు రుక్మాంగదుని కూడ జయించెను. అట్టివానికి హేమాంగదుని జయించుట కష్టము కాదు. అయినను అతఁడట్లేల చేయలేదు? అతఁడు రుక్మాంగదునితో వాదము చేయుచుండియు హేమాంగదునిచర్యను కనిపెట్టుచునే యున్నాఁడు. అన్నగారు ఓడిపోయి పట్టుబడినపుడు హేమాంగదుఁడు పామరులవలె దుఃఖింప లేదు; ఆవేశపడ లేదు. పైఁగా అతఁడు క్షత్రియోచితముగా, "నన్ను కూడ వాదమున జయించి మాయన్నతో కలిపి భక్షింపుము" అని పలికెను. అన్నను విడిపించుటకు ఉపాయ మేమైన నున్నదేమో యని అతఁడు ప్రయత్నింపఁజొచ్చెను. ఆతని మాటలలో చర్యలలో కొంచెము కూడ ఉద్వేగము కన్పింపలేదు. అందువలన వసుమంతుఁడు, "ఇతఁడు తత్త్వజ్ఞుఁడై యుండును. లేకున్నచో ఇంత స్థైర్యము ధైర్యము ఉండవు. ఇది స్థితప్రజ్ఞుని లక్షణము. కావున ఇతఁడు నాగూఢప్రశ్నలకు సమాధానము చెప్పఁగలిగి యుండును. అట్లయినచో నాకు శాపవిముక్తి కలుగును. ఇతఁడు చెప్పలేకున్నచో ఎట్లయినను భక్షింతును గదా" అని యనుకొని గూఢప్రశ్నలను అడిగెను. అతఁడు ఆశించినట్లే హేమాంగదుఁడు ఆ ప్రశ్నలకు సమాధానములను చెప్పెను. శాస్త్రవాదమే యైనచో హేమాంగదుఁడు ఓడిపోయియుండును. హేమాంగదుఁడు జ్ఞానియే. జ్ఞానికి సకల శాస్త్రములు వచ్చియుండవలయు నను నియమము లేదు. జ్ఞాని సర్వజ్ఞుఁడు కదా! అతనికి అన్ని విషయములు తెలిసియుండవా? తెలిసియుండవు. "ఆత్మకన్న అన్యముగా ఏదియును లేదు. ఆత్మవలననే సర్వమునకు అస్తిత్వము (Existence) జ్ఞానము (Knowledge), ఆనందము (Bliss) కలుగుచున్నవి" అని రూఢిగా తెలిసికొనుటయే జ్ఞానియొక్క సర్వజ్ఞత్వము. వస్తువిశేషములు భూతభవిష్యద్వర్తమానములు తపస్సిద్ధులైన జ్ఞానులకు, వసిష్టాదిమహర్షులకు కొందఱకు తెలిసియుండ వచ్చును. బ్రహ్మజ్ఞానముకలవా రందఱికి అట్టి శక్తిలు ఉండవలయు నననియమము లేదు

హేమాంగదునివలన తత్త్వోపదేశమును పొందినను వసుమంతుఁడు అతనికి నమస్కరింప లేదు. హేమాంగదుఁడే వసుమంతునకు నమస్కరించెను. వ్యవహారమునందు ధర్మమే ప్రమాణముకానిజ్ఞానము కాదు. అందువలన జ్ఞానియైనను హేమాంగదుఁడు బ్రాహ్మణుఁడైన వసుమంతునకు నమస్కరించెను. అతఁడు రాజకుమారులనుదీవించెను.

గ్రంథము సమాప్తమైనది. మహాత్మ్యఖండమునందు దత్తగురువు సృష్టిక్రమమును చెప్పునప్పుడు వరశురాముఁడు కొన్నిసందేహములను అడిగెను. ఆయన వానికి అప్పుడు సమాధానము చెప్పక "తరువాత చెప్పెదను. ఇప్పుడు చెప్పరాదు" అని కువలునికథను ఉదాహరించెను. జ్ఞానఖండమునందు ఆప్రశ్నలకు ఇవి సమాధానములని ఎక్కడను చెప్పఁబడ లేదు. అయినను పరశురాముఁడు వానిని మరల అడుగలేదు.అనఁగా ఆయనకు అసందేహములు తీరె

నన్నమాట. ఆసందర్భ మిది. దేవి త్రిమూర్తులను సృష్టించి బ్రహ్మదేవుని జగత్సృష్టి గావింపు మని ఆదేశించెను. ఆయన చుట్టును చూచెను. మొదట అనంతమైనయాకాశమే కన్పించెను. తరువాత ఆయన చూచుచుండఁగా పంచభూతములు పైకి వచ్చెను. ఈ భూతములు అప్పటికే సిద్ధమై యున్నచో వీనిని సృష్టించినది ఎవరు? సిద్ధములైయున్న యా భూతములు మొదట బ్రహ్మదేవునకు ఏల కన్పింపలేదు? భూతసృష్టికి పూర్వమే త్రిమూర్తులకు దేహములు ఎట్లు కలిగినవి? బ్రహ్మ దేవితో మాటాడుటకు శబ్ద మెక్కడిది? ఇవి ఆయన అడిగిన సందేహములు.

వానికి సమాధానములు మనమిట్లు గ్రహింపవచ్చును. దేవి తిమూర్తులను అపంచీకృతములైన సూక్ష్మభూతములతో సృష్టించి యుండును. ఆ మూఁడు శరీరములు కాక తక్కినది అంతయు ఆకాశ మాత్రముగా సర్వవ్యాపకమై యుండెను. సూక్ష్మభూతముల సృష్టితో త్రిమూర్తులయందు శబ్దమే కాక ఇంద్రియవ్యాపారము కూడ ఆరంభమయ్యెను. అందువలననే వారు ఇంద్రియములను నిగ్రహించి తపస్సుచేయుట సంభవమయ్యెను. పిదప బ్రహ్మ సృష్టిచేయఁదలంచుకొని చుట్టును చూచినంతనే సూక్ష్మభూతములయందు చలన మారంభమై అవి పరస్పరసమ్మేళనమున స్థూలభూతములుగా రూపొందెను. ఆస్థూలభూతములతో ఆయన జగత్తును సృష్టించెను. కావున స్థూలభూతములు బ్రహ్మయొక్క వీక్షణముచేతనే సిద్ధము లయ్యెను. అంతకు పూర్వము లేవు. అందువలననే ఆయనకు అవి మొదట కన్పింపలేదు. ఆయనయే వానికి కర్త.

"సృష్టియొక్క ఆరంభమునందు ఆదేవి చైతన్యరూపిణియై ప్రకాశించుచుండెను. అప్పుడు ఆమె ఒక్కతయే యుండెను. ఇతర మేదియు లేదు. అట్లున్న ఈశక్తి తనస్వాతంత్ర్యముచేత సృష్టిచేయుటకు ఉన్ముఖురాలు కాఁగానే ఇచ్ఛ కలిగెను" అని దత్తగురువు చెప్పెను. దేవి చైతన్యరూపిణిగా ఉండె ననఁగా చైతన్య మొక్కటియే యుండె నన్నమాట. చైతన్యమే బ్రహ్మము లేక ఆత్మ. "రెండవవస్తువు లేకుండ బ్రహ్మ మొక్కటియే మెదట ఉన్నది" అని వేదము కూడ చెప్పుచున్నది. ఒక్కటిగానున్న వస్తువునుండి రెండవది ఎట్లు పుట్టును? ఆత్మనుండి ఆకాశము పుట్టె నన్నప్పుడు, అకాశము అంతకు పూర్వము అవ్యక్తముగా (Unmanifest) ఉండి అప్పుడు ప్రకాశించినదా (Manifest) లేక క్రొత్తగా పుట్టినదా? అది అంతకు పూర్వము లేక అప్పుడు పుట్టిన దనుట శాస్త్రవిరుద్ధము. అభావమునుండి లేక శూన్యమునందు వస్తువుపుట్టదు. (A thing can not come out of nothing) ఉన్నది నశింపదు. లేనిది పుట్టుదు (నాసతో విద్యతే భావో నాభావో విద్యతే పతః) అట్లయినచో ఆకాశము అంతకు ముందే ఉండి సృష్టియారంభమున ప్రకాశించిన దని చెప్పవలె. అట్లయినచో ఆత్మ అద్వితీయముగ ఒక్కటిగా నున్న దని చెప్పుట కుదురదు. కావున ఆత్మ ఒక్కటే యున్నది. ఆకాశము దానితో సమానమైన రెండవవస్తువు కాదు. అది అద్దములో ప్రతిబింబమువలె ఆత్మయందు తోఁచుచున్నది. ప్రతిబింబము అద్దముకన్న భిన్నముగా ఒకవస్తువు ఎట్లు కాదో అట్లే ఆకాశము కూడ ఆత్మకన్న భిన్నముగా వేఱొక వస్తువుకాదు. ఆకాశమునకేవస్తుత్వము లేనప్పుడు దానినుండి పుట్టినట్లుగా తోఁచుచున్న తక్కిన భూతములకు వాని గుణములకు కార్యములకు వస్తుత్వము (Reality) సంభవమే కాదు. ఇంద్రజాలములో చెట్టు యథార్థమైన వస్తువు కానప్పుడు దానియందు కన్పించు ఆకులు కొమ్మలు పూలు పండ్లు అన్నియు మిథ్యయే కదా! కావున ఆత్మ యొక్కటే యున్నది. అదియే దృక్కుదానియందే జగద్రూపమైన దృశ్య మంతయు తోఁచుచున్నది. ఎన్ని ప్రతిబింబములు ఎట్లు మాఱుచున్నను అద్దమునకు మార్పులేనట్లు. దృశ్యమైన జగత్తు ఎట్లు మాఱుచున్నను దృక్కు మాఱదు. ఆదృక్కు లేక ఆత్మయే మనయందు "నేను" అని స్ఫురించుచున్న చైతన్యము. ఆ చైతన్యమునకు తనయందు ప్రతిబింబించుచున్న జగత్తుతో సంసారముతో ఎప్పుడును ఎట్టి సంబంధమును లేదు. అందువలన మనయాత్మ నిత్యశుద్ధము, నిత్యముక్తము. అది ఎప్పుడును సంసారముచేత బద్ధము కాలేదు. "నేను సంసారముచేత బద్ధుఁడనై యున్నాను. ఇంకను ముక్తుఁడను కాలేదు" అని యనుకొనుటయే అజ్ఞానము. "నేను ఎప్పుడును బద్ధుఁడను కాను. ఎల్లప్పుడును ముక్తుఁడనే. ఆనందమే నాస్వరూపము" అని రూఢముగా తెలిసికొని ఆస్థితియం దుండుటయే జీవన్ముక్తి. ఇదియే సకలశాస్త్రమునకు సారము. తాను మార్పునొందక తనయందు జగత్తును భాసింపఁజేయుచున్న ఆత్మయొక్క శక్తియే దాని స్వాతంత్ర్యము. జగత్తుచేత ఎప్పుడును కొంచెము కూడ ప్రభావితము కాకుండుటయే అత్మకు స్వాతంత్ర్యము. ఆత్మయే త్రిపుర. త్రిపురయే హ్రీమ్.

గద్య: కౌండిన్యసగోత్రుఁడు ఆపస్తంబసూత్రుఁడు పోలూరి నరసాంబా నారాయణామాత్య పుత్రుఁడు అయిన హనుమజ్జ్ఞానకీరామ శర్మచే రచింపఁబడిన బాలప్రియవ్యాఖ్యాసమేతమైన త్రిపురారహస్య జ్ఞానఖండసారము సమాప్తము.